శ్రీరస్తు.

# శుకసప్తతి.

## ప్రథమభాగము.

ఇది

కదిరిరాజ్యపరిభువగు
పాలవేకరి కదిరీపతినాయక ప్రణీతము.

మొదటికూర్పు.



కాకినాడ:
శ్రీసరస్వతీముద్రాక్షరశాలలో
బ్రొత్తపల్లి సూర్యారావుచే సరస్వత్యధిపతులకొఱకు
ముద్రింపబడి ప్రకటింపబడియె.

 [వెల రు 0-14-0.

1909.

ఈగ్రంథకర్త పాలవేకరి కదిరీపతినాయకుఁడు. కృత్యాదిపద్యములు దొరకనందున నితని కాలనిర్ణయాదులకిచట ననువుపడలేదు. కదిరిరాజ్యమును బాలించినప్రభువు. ఈకదిరియనునది నెల్లూరుమండలములోనిదని చారిత్రకులగు రావుబహద్దరు కందుకూరి వీరేశలింగము పంతులుగారు తమయాంధ్రకవుల చరిత్రములో వ్రాసియున్నారు. మనకుఁ గడపజిల్లాలో నగపడుచున్నది. ఇతనికవిత్వము స్వభావసిద్ధములు సమయోచితములునగువర్ణనలతోఁ గ్రొత్తరుచులఁబుట్టించుచుఁ బ్రౌఢమై హృదయంగమమైయున్నది. సంస్కృతాంధ్రములు రెంటియందును సమానప్రజ్ఞకలవాఁడు. హంసవింశతియందువలె నింపతిగావర్ణించి యుండలేదు. కాని యవసరముకలిగినప్పుడు చమత్కారములనువిడిచిపెట్టలేదు.

ఇప్పొత్తము మాకు మొదట పుదుక్కోటసంస్థానములోని పుస్తకభాండారమునుండి దివానుగారగు మహారాజశ్రీ దివాన్ బహదరు శీలంరామదాసునాయుడు బి.ఏ. బి. యల్. గారిచే దయాపూర్వకముగా నంపఁబడినది. ఆతాళపత్రగ్రంథము శిథిలమై యుండినందున శుద్ధప్రతి తేలక మద్రాసుగవర్నమెంటు ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్సులైబ్రరీలోనున్నదానికొకప్రతి వ్రాసితెచ్చితిమి. అదియు నసంపూర్ణముగానేయున్నది. ఆప్రతి విద్వచ్ఛిరోమణియు భాషాభిమానియునగు సి. పి. బ్రౌనుదొరవారివలన వ్రాయింపఁబడినది. అందు వారచ్చటచ్చట వ్రాసినతమ యభిప్రాయముల నీక్రింద సాంధ్రతాత్పర్యముతో నుదహరించి ఫలితార్థమును గ్రహింపుఁడని పాఠకులకు విన్నవించుచున్నారము.

"This Sukasaptati or Tales of Parrot in Telugu, being a series of amorous Tales. Twenty in number, the book not having been completed, this is very rare and merit publication, as abounding in common colloquial expressions.

This edition was prepared under my directions in the year 1831."

(తా॥ ఈశుకసప్తతి లేక చిలుకచెప్పినకథలు అనునవి తెనుఁగులోఁగొన్ని చక్కని శృంగారకథలు. పుస్తకము పూర్తిగా లేదు. ఇవి యిరువదికథలు, సాధారణముగావాడుకభాషలో వ్రాయఁబడినందున నిదియరుదైనదియు ముఖ్యముగాఁ బ్రకటింపవలసినది

యును. ఈవ్రాఁతప్రతి నానియోగమువలనఁ 1831 సం॥ న సిద్ధము చేయఁబడినది ) .
మఱియొక తావున (గ్రంథాంతమున) నీక్రిందిరీతిని వ్రాయఁబడియున్నది.

# SUKASAPTATI.

A series of Telugu stories illustrating the various dialects of the Telugu language.

This valuable work is very rare indeed and I never met with a perfect copy. The present one has been collected with five manuscripts procured with difficulty in various parts of this peninsula.

Had it been composed in times when Telugu learning was patronized, it would have been better preserved; but the compositions of a dark age however valuable are seldom preserved with any care.

This book "The Seventy Tales of Parrot" has the same tittle with the well known Sanscrit composition of which, however, it is not a translation but an imitation. The work seems incomplete, the author not having finished the whole, it is perfect as far as it goes. (Thus there are not in fact 'Seventy' Tales.)

The discrepancies in the various manuscripts of the book are very great indeed, whole lines being substituted one for another. It will therefore be very difficult to select a pure text.

The Hamsa Vimsati is a work of the same description and the close resemblance in many passages shews that one must have been borrowed from the other.

Since writing the foregoing remarks I have persuaded Zulluri Appayya a very eminet Telugu scholar to revise and correct the work. He has done this very carefully and successfully. He considers it to be superior in style and good taste to the Hamsa Vimsati which, however, contains a greater variety of words and technical phrases.

He objects however very justly to the tittle of the work and proposed to say the THIRTY tales of the Parrot not the SEVENTY tales, for the book was never completed.

I have since obtained another manuscript (1839) which contains some additional passages.

(తా॥ ఈశుకసప్తతి ఆంధ్రభాషావైలక్షణ్యమును బ్రకటించు కథలుగలయొక తెలుఁగుగ్రంథము. ఈ యమూల్యగ్రంథముయొక్క ప్రతులుచాలనరుదు. నిండుప్రతి యొక్కడను నాకుదొరకలేదు. ఈదేశమునంగల యనేకస్థలములలోని యైదువ్రాఁతప్రతులనుబట్టి యతికష్టముపై నీప్రతినివ్రాయించినాను.

ఇదిబాపకు రాజావలంబనము చక్కఁగఁగలకాలములో వ్రాయఁబడియున్నయెడల భద్రముగాఁ గాపాడఁబడియుండును. అవలంబనలేని యిటీవలిదినములలో వ్రాయఁబడిన గ్రంథములెంతవిలువగలవియైన జాగ్రత్త చేయఁబడియుండలేదు.

"శుకసప్తతి" యనుపేరుగల ప్రసిద్ధగ్రంథమొకటి సంస్కృతమునం గలదుగాని యీపేరు నేయిదియుఁ గలిగియున్నను దానికిభాషాంతరీకరణముమాత్రము గాదు. దానిననుసరించి వ్రాయఁబడినది. ఈగ్రంథమసమగ్రముగాఁ గనఁబడుచున్నది. దీనింబట్టి చూడఁ గవియేదీనిని బూర్తి చేసినట్లుతోఁచదు. ఇందు డెబ్బదికథలులేవు.

వివిధప్రతులలోఁ బరస్పరవిరోధములు చాలఁగలవు. చరణములకుఁ జరణములే మార్పులుండుటచేనేది శుద్ధప్రతియో నిర్ణయించుటకష్టము.

హంసవింశతియును నిట్టిగ్రంథమే. చాలపద్యములందునిందును సరిపోలియుండుటచేత నొకదానిని గాంచియొకటి వ్రాయఁబడినట్లెంచవలసియున్నది.

నేనీగ్రంథమును బరిష్కరించుటలో మిగుల సమర్థతగల తెలుఁగు పండితుఁడగు జూలూరిఅప్పయ్య సహాయమును బొందియున్నాఁడను. అతఁడు మిగులజాగ్రత్తగను జయప్రదముగను నీకార్యమును జరపినాఁడు. హంసవింశతిలో జాతీయపదములు విశేషముగానీయఁబడియుండినను దానికంటె నీగ్రంథమే రచనయందును మాధుర్యమునందును హెచ్చుగానున్నదని యాతఁడు తలంచుచున్నాఁడు.

అయినను నీగ్రంథమునకీపేరు తగియుండలేదని యాతఁడు తలఁచియున్నాఁడు. అదిసత్యము. దీనిని శుకసప్తతియనుటకంటె శుకత్రింశతి యనఁదగునని నుడివినాఁడు. ఎందుచేతననఁగా గ్రంథము పూర్తి చేయఁబడియుండలేదుగనుక.

తెనుఁగులో శుకసప్తతియనునొకవచనకావ్యమంగడులలో దొరకునుగాని యిది వానినిబట్టి వ్రాసినపద్యకావ్యముకూడఁ గాదు.

1839సం॥ లో మఱికొన్ని యెక్కువ పద్యములుగల ప్రతినొకదానిని సంపాదించినాఁడను.) అని దొరగారు వ్రాసియున్నారు.

ఇంకను మఱికొన్ని పద్యములు వేఱొకప్రతిలో దొరకినను నవితప్పులుతప్పులును సంబంధహీనములునుగా నున్నవి. అవియైనను నాలుగవయాశ్వాసము కడవఱకులేవు ఓ

క్క కథ యైనఁ బూర్తి కాలేదు కావున నీ 4 వ యాశ్వాసములో 21 వ కథకడకుఁ బూర్తిచేసి మొదటిభాగమని పేరిడితిమి. ఇందుఁ బెద్దకథలు 21 యును నుపకథలు తొమ్మిదియును గలసి ముప్పదికథలుగలవు. ఎక్కడనైననెక్కుడు కథలుగలపుస్తకము దొరకినచో మాకుఁ బంపి యీకొఱఁతమావలనఁ దీర్పించి యాంధ్రభాషకు మహోపకారముంగావింపఁ బాఠకులం గొనియాడుచున్నాము.

సుజనవిధేయుఁడు,

కొచ్చెర్లకోట రామచంద్ర వేంకటకృష్ణరావు,

సరస్వతీపత్రికాధిపతి, కాకినాడ.



శ్రీరస్తు.

# శుకసప్తతి.

## ప్రథమాశ్వాసము.

### కథాప్రారంభము.

వ. అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా యొనర్పం బూనిన శుకసప్తతి యనుమహాప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టి దనిన. 1

క. వెలయు నలఘు ప్రభావా, జ్జ్వలుఁ డింద్రప్రస్థపురి నసామాన్యమహా
కలితదృఢబాహుబలని, ర్దళితాహితరాజు ధర్మరాజు ధరిత్రిన్. 2

చ. అతఁ డొకనాఁడు నిండుకొలువై బలవైరిమహోన్నతి న్మరు
త్సుతుఁడుఁ గిరీటి మాద్రితనుజుల్ తనచెంతన యుండి కొల్వరా
జతతికిరీటకోటివిలసన్మణిమంజులదీప్తిపుంజరం
జితచరణుండు ధర్మజుఁడు చెంత వసించిన ధౌమ్యు నిట్లనున్. 3

క. తెలివి గలభూసురుండవు, కులగురుఁడవు మాకు మౌనికుంజర వినుమీ
యలఘుమతి నొక్కకార్యము, తెలియ న్వివరింపవే సుధీజనతిలకా. 4

ఉ. భామలచిత్తము ల్దెలియ బ్రహ్మకు నైన వశంబు గాదు త
త్కామితయత్నము ల్తలఁప ధాత్రి విచిత్రము లండ్రు కావున
న్నామది యేతదీయకథనంబు వినం గడఁగె న్మహీసుర
గ్రామణి యాసతి మ్మనుఁడు రాజబిడౌజునితోడ వేడుకన్. 5

వ. అప్పు డాధౌమ్యమహర్షివర్యుండు నిరవధికకుతూహలధుర్యుం డై యిట్లనియె. స్త్రీజనంబుల చిత్తంబులు లోకాతీతదుర్వృత్తంబులు, తదీయకృతసాహసకార్యంబు లనివార్యంబు లగుట నిక్కువం బిందులకు నొక్క యితిహాసంబు గలదు. తొల్లి మహాదేవుండు పార్వతీవరారోహ కతిరహస్యంబున నానతిచ్చినతెఱం గెఱింగించెద సావధానుండ వై యాకర్ణింపు మని యిట్లనియె. 6

సీ. సౌధాగ్రతలకేళిజాగ్రన్మృగేక్షణాస్ఫుటదృశ్యమానేంద్రపురవరంబు
జగతీదిదృక్షుభోజగవర్గనిర్గమద్వారాయితస్వచ్ఛవారిఖేయ
మబ్జినీకాంతశుద్ధాంతీభవత్స్వాంతసంతతోదారకాసారవార

మిందిరాసుతభవ్యమందురాసీకరమ్యామోదకారణారామసీమ
యంద మగు మేరుమందరాహార్యమధ్య, తలమహీమండలమున నుద్దామభీమ
మేదురోద్భటభటసింహనాదచకిత, దిగ్గజవరంబు పద్మావతీపురంబు. 7

క. ఆనగరి న్విభవప్రీతి, భానగరిపుఁ డైన చిత్రభానుం డేలు
న్మానక మృదుకరడమరు న, మానకరవి మరుల గిరులయఱుతంజేర్చన్. 8

మ. కలహోన్నైనను బల్మిఁ బొంకఁడు సమగ్రక్రోధయోధారిరా
డ్బలయుం గన్గొని చీకిం గొనఁడు దుష్పాండిత్యము ల్నేరఁడు
జ్జ్వలదుజ్జృంభశుభాంగవైఖరుల లేవన్నాత్మకందర్పుఁ డై
తలఁపం జొప్పడుఁ జిత్రభానుఁ డతఁ డేతన్మాత్రుఁడే చూడఁగన్. 9

సీ. చంద్రమతీనాథుచందాన నలునివైఖరిఁ బురుకుత్సునిగతిఁ బురూర
వునిమాడ్కి సగరులాగునఁ గార్తవీర్యునియనువున గయునట్టు లంబరీషు
పోలుపున శశిబిందువలె నంగుపోలికఁ బృథునిభాతి మరుత్తురీతి భరతు
కరణి సుహోత్రునిహరువున రఘులీల రామునిక్రియ భగీరథుని రేవ
శిబితెఱంగున మాంధాత చెలువమున య, యాతిరీతి దిలీపుమర్యాద రంతి
సరణిఁ బాలించి యలరు నాచక్రవాళ, వసుమతీచక్రమమ్మహీవల్లభుండు. 10

మ. అకలంకప్రతిభాప్రతాపవిభవుం డారాజకంఠీరవుం
డొకనాఁ డంతిపురి న్సువర్ణవలభిప్రోశ్నల మై కెంపుమా
నికపుంబొమ్మల నొప్పు పెండ్లిచవిక న్నీలంపుఱాగద్దియం
బికవాణీనికరంబు గొల్వ సుముఖాప్తి న్నిండుగొల్వుండఁగన్. 11

క. ఇఱుకువలిగుబ్బచన్నుల, యెఱుకుంజవరా లొకర్తు యెఱుకో యవ్వా
యెఱుకో యని తనచందం, బెఱుకపడంగా హజార మెలమిం గదిసెన్. 12

వ. అప్పు డప్పడంతుక తెఱం గమ్మహీంద్రుండు పరిచారికాజనంబులవలన విని సవధరిం
చి సమ్ముఖమ్మునకు రావించిన. 13

సీ. నవరనిపనివన్నె అవిక పిక్కటిలంగఁ గులుకు పాలుబ్బుగుబ్బలు చెలంగ
ముంజేతులను ముఖాంబుజమున నొకవింతపొలుపు దెల్పెడు పచ్చబొట్టు లెసఁగఁ
గుఱుమాఁపుపయ్యెంటచెఱఁగులో నిడుకొన్న ముద్దుఁబల్కులచిన్నిబుడుతఁ డమరఁ
దరతరంబులనుండి తనయింట వెలయు పుత్తడిపైఁడిబుట్టి మస్తమున వెలుఁగ
బొమలనందున నామంబుభూతిపూఁత, సెన్నొసఁటఁబుక్కిటపిడెఁబుకన్నుఁగొనలఁ
గాటుక రహింప వచ్చి యాహ్మ్మతేంద్రు, చరణముల కొరగ్రాఁమ్రొక్కి చక్కనిల్చి. 14

క. ఇది దారికట్టు మొఱఁక, ట్టిది కాంతావశ్యకరణ మిది నీమది కిం
పొదవించు సోమరేశ్వర, పదిలం బని తెల్పి కొన్ని బహునిక లొసఁగెన్. 15

క. తలఁపున నిది గారడ మని, తలఁపకుమా సింగఁ డల్లతజిగొండ దరిన్
దలమోచి తెచ్చినవి యివి, తలనుంచుము పసిఁడితాయెతల నుంచి నృపా. 16

వ. అని విన్నవించిన యమ్మత్తకాశినీకరాంబురుహదత్తం బగునయ్యుత్తమ దివ్యౌషధ
త్రియంబు రయంబునం గ్రహించి కరుణావలోకనపరుండై ప్రియవినయగంభీరభా
షణంబుల నిట్టు లనియె. 17

శా. ఏయేభూములు చూచినావె కొరవంజీ రూపలావణ్యరే
ఖాయుక్తిం దగు కొమ్మ లెందుఁ గల రీషన్మందలిన్ హావభా
వాయత్తైకవిలాసవైఖరుల మే లం దెవ్వరిం జెందు న
య్యాయావార్తలు తెల్పవే మది కమందానందముం జెందఁగన్. 18

వ అనిన విని యితండు చతుర్విధనాయికానాయకుండును బహువిధశృంగారశేఖరుం
డును సకలకలాధురంధరుండు నగు నని తనమనంబున వితర్కించుకొని యతని కి
ట్లనియె. 19

సీ. కల్కిచిల్కలపోల్కిఁ గనుపట్టు శృంగారనటన గుల్కెడుతూర్పునాటి చెలులఁ
బులుగడిగిన ముత్యములఁ బోలి గరగరికలు వహించిన పాండ్యకమలముఖులఁ
జిత్రరేఖలఁ దారసిలుచక్కఁదనముల రాణించు కన్నడరాజ్యసతులఁ
బగడంపుతీగెసొంపు తగుతనుద్యుతి పెంపు వలరెడు యవనశీతాంశుముఖులఁ
గుంపసంపుసలాకలయంద మొందు, సంధ్రకన్యల నిదిగాక యంగవంగ
కుకురుసౌవీరసౌరాష్ట్రకోకకుచల, వింత లన్నియుఁ గనుఁగొంటి విను నరేంద్ర. 20

గీ. దేవ నవఖండమండలశ్రీవిజృంభ, మాణ మగునివ్వసుధఁ గల్గుమానవతుల
వరుస నందఱఁ గనుఁగొంటి వారిలోన, రేఖ గలయొక్కచెలి నేర్పరింతు వినుము. 21

ఉ. ఈనగరీపతంసమున నే తగువైశ్యుఁ డొకండు శాశ్వత
శ్రీనిధిగేహుఁడై మదనసేనుఁ డనంగలఁ డద్భుతైకశో
భావనమోహనాకృతి ప్రభావతి వానిపురంధ్రి యొప్పు నో
మానవతీమనోజ యనమానవయఃపరిపాకవైఖరిన్. 22

మ. దాని ఘనాఘనద్యుతివితానకనత్సనకేశపాశముం
• దాని లసన్నసప్రసవధాళధళీనకితేక్షణంబులుం

వాని సుగంధగంధిలసుధారసబంధురమందహాసము
న్మానవనాథ మెచ్చుటకు మర్త్యు లమర్త్యులు నైన శక్తులే. ౬౨
క. అమృతములోఁ రువిలాసం, బామోహనముఖవికాస మాదరహాసం
బామెడ యానడ యాజడ, యామేని మెఱుంగురంగు నలవియె పొగడన్. ౬౩
సీ. భుగభుగ వాసింపఁ బొసఁగు పుత్తడిబొమ్మ మాటాడ నేర్చిన మణిశలాక
కళికిచేఁతలనొప్పు కమ్మక్రొవ్విరిబంతి తగుజీవకళల చిత్తరువుప్రతిమ
గమనశృంగారంబు గనుపట్టు లతకూన కలదొలంగని తొలకరిమెఱుంగు
కరచరణాంగసంగతి గన్న శశిరేఖ హావభావములఁ జెన్నలరు సరసి
యగు నని గణింప వినుతింప నలవిగాదు, దానిచరణాబ్జనఖరేఖతోనుబోలఁ
గలరె యీలోకమున నున్న కాంత లెల్ల, విను మహీనాథ యేమని విన్నవింతు. ౬౪
క. ఒకపాటిపేదసంసా, రికిఁ దగ దమ్ముద్దుగుమ్మ రిపురాణ్మణిమ
స్తకమకుటఘటితనవర, త్నకళాచకచకితచరణునకుఁ గాక నృపా. ౬౫
క. అని విన్నవించినంతనె, మనమున నుప్పొంగి వైశ్యమహిళానవమో
హనరూపరేఖవిభవము, విని విస్మయ మంది మోహవిహ్వలమతి యై. ౬౬
గీ. ఎఱుకపగలాఁడి కోరిన వెల్ల నొసఁగి, ప్రియవచోవైభవంబు గానిపింపఁ బనిచి
కొలువు చాలించి పోటిక గ్గొలువ నంతి, పురి నొకానొక మణిసౌధమున వసించె. ౬౭
ఉ. అంతట నవ్వణిక్వధుని యంగనపైఁ దమి హెచ్చి యమ్మహీ
కాంతపురందరుండు రతికాంతధనుర్లతికా విముక్త దు
ర్దాంతశరాళికి న్మదమగాళికిఁ జండతరాళికెంతయుం
జింతిలి వేదనావశవిశీర్ణమతి న్విరహార్తి నొందుచున్. ౬౮
సీ. చెక్కిటఁ జేయిఊఁది చింతాకులాత్ముఁడై వనిత నేక్రియఁ దెత్తు నని తలంచు
నిట్టూర్పు నిగిడించు నేఁడయో శుకపికార్భటి కోర్వలేనంచుఁ బలువరించుఁ
దనలోన తానె మెయి తలయూఁచుకొని మెచ్చుఁ గలవరించుచు బయ ల్గౌఁగిలించుఁ
జిత్తరువునున్న చెలువంపుఁ బ్రతిమన ల్లదె ప్రభావతి యంచు మది దలంచు
నింతు విలుచంచి విరితూపు లేర్వరించి, పచ్చవన్నియచిల్కబాబావజీరుఁ
డుల్ల ముల్లోలముగఁ జేయఁ దల్లడించు, రాజముఖిమీఁదిబాళి నారాజమౌళి. ౬౯
ఉ. ఎప్పుడు చూడఁ గల్గునొకొ యిందుముఖీ వదనారవింద మే
నెప్పుడు విందునో తెలియ దేణవిలోచన కల్కిపల్కు లిం

కెప్పుడు గొంగిలింతు నలయింతిపచామ్రి లురంబుసోఁక నా
కప్పుడుగాదె సౌఖ్యపద మంచుట లంచు మదిం గణించుచున్. ౨౧

క. ఉల్లము బెగడ ధరిత్రీ, వల్లభుఁ డీట్లున్న వేళ వనితామణులం
దెల్లగుణంబుల కిరవగు, పల్లవి యనుపేరుగలుగుభామ సుబుద్ధిన్. ౨౨

సీ. వసుమతీశ్వరుఁ డున్న దెసఁజూచి పావడ చెఱఁగున నెమ్మోము చెమట దుడిచి
సిగ పొందుగ నమర్చి చిక్కారివిడి కెంపు తాయెతుల్చుట్టి కుళ్లాయి వెట్టి
చెవులయొంటులఁ జక్కసవరించి ముక్తావిచిత్రహారంబుల చిక్కుఁదీర్చి
కలపం బల్లంది బంగరుగట్టికమ్ముకల వలిపె దుప్పటి వలివా టొనర్చి
కేలుదమ్మికిఁ గపురబాగాలుఁ బండు, టాకుమడుపులు నొసఁగి లోకాభిరామ
వార్త లాకర్ణింపు నొడివి యప్పార్థివేంద్రుఁ, బలుదెఱంగుల నలరించిపలికెనపుడు. ౨౩

క. స్వామి యవధారు మీమదిఁ, గామించు మనోరథంబుఁ గడతేర్చెద నిం
కేమిటికిఁ జింత యన విని, భామామకరధ్వజుండు పల్లవి కనియెన్. ౨౪

గీ. వైశ్యభామిని లావణ్యవైభవంబు, విని విరహవార్ధి మునుఁగుచు న్మనుప నెట్లు
లంటు చేసెదో యమ్మ చెప్పుకంటి ననుచు, నిచ్చక మొనర్చి యుంగర మిచ్చి పనుప. ౨౫

మ. చని యప్పల్లవి వైశ్యవల్లభుని భాస్వద్దివ్యగేహాంతరం
బున వర్తిల్లు ప్రభావతిం గనఁ దంబభోజాక్షి రాజావలం
బనసౌభాగ్యము గన్న ధన్యవు నను న్పాటించి యేతేర నే
మి నిమిత్తంబో యటంచు నిర్మలసుధాశ్రీమైఖరిం బల్కెనన్. ౨౬

క. నినుఁ జూడఁగోరి వచ్చితి, ననవుడు సంతోషమయ్యె నని మణిపీఠిన్
దను నిలుప రాజమాతిక, యనియెఁ బ్రభావతికి నముచితాయత్తమతిన్. ౨౭

గీ. ఎల్ల సౌభాగ్యములు గలయింట వెలసి, మిగులఁ జక్కనివారిలోఁ దగినదాన
వగుదు నీబంధుజనము నిన్నభినుతింపఁ, గాఁపురము చేసితివి మేలు కమలగంధి. ౨౮

వ. అదియునుం గాక పురాణదంపతు లగునీయత్తమామల సుమతిహరదత్తుల నాదరిం
చు నీవివేకంబునకు మెచ్చితి సాత్త్వికనోజుం డగు నీమనోహరున కనుగుణం బగు
నంతరంగంబునకు సంతోషించితి గురుబుధబాంధవదాసదాసీజనంబులం బోషించు నీ
నీమహత్త్వంబుఁ గొనియాడ శక్యంబగునే యని వెండియు. ౨౯

సీ. గుట్టుతో సంసారి మట్టునఁ జుట్టాలఁ దనియింతు వని హరదత్తుతోడ
ఘనురాల చల్లనికడుపుదానవు నీవు సుకృతశాలిని వంచు సుమతితోడ
మదనసేనుఁ డనంగ మటి నీకె తగు నెంతి చెలువుఁడ వని దానిసెట్టితోడ

వాని సుగంధగంధిలసుధారసబంధురమందహాసము
న్మానవనాథ మెచ్చుటకు మర్త్యులమర్త్యులు నైన శక్తులే. ౬౨

క. అమృదులోపవిలాసం, బామోహనముఖవికాస మాదరహాసం
బా మెడ యానడ యాజడ, యామేని మెఱుంగురంగు నలవియె పొగడన్. ౬౩

సీ. భుగభుగ వాసింపఁ బొసఁగు పుత్తడిబొమ్మ మాటాడ నేర్చిన మణిశలాక
కళికి చేఁతలనొప్పు కమ్మక్రొవ్విరిబంతి తగుజీవకళల చిత్తరువుప్రతిమ
గమనశృంగారంబు గనుపట్టు లతకూన కలదొలంగని తొలకరిమెఱుంగు
కరచరణాంగసంగతి గన్న శశిరేఖ హావభావములఁ జెన్నలరు సరసి
యగు నని గణింప వినుతింప నలవిగాదు, దానిచరణాబ్జనఖరేఖతోను బోలఁ
గలరె యీలోకమున నున్నకాంతలెల్ల, విను మహీనాథ యేమని విన్నవింతు. ౬౪

క. ఒకపాటి సేవసంపా, రికిఁ దగ దమ్ముద్దుగుమ్మ రిపురాణ్మణిమ
స్తకమకుటఘటితనవర, త్నకళాచకచకితచరణునకుఁ గాక నృపా. ౬౫

క. అని విన్నవించినంతనె, మనమున నుప్పొంగి వైశ్యమహిళానవమో
హనరూపరేఖవిభవము, విని విస్మయ మంది మోహవిహ్వలమతి యై. ౬౬

గీ. ఎఱుకవగలాఁడి కోరిన వెల్ల నొసఁగి, ప్రియవచోవైభవంబు గాన్పింపఁ బనిచి
కొలువు చాలించి బోటికల్గొలువ నంతి, పురి నొకానొక మణిసౌధమున వసించె. ౬౭

ఉ. అంతట నవ్వణిగ్వరుని యంగనపైఁ దమి హెచ్చి యమ్మహీ
కాంతపురందరుండు రతికాంతధనుర్లతికావిముక్త దు
ర్దాంతశరాళికి న్మదనమారాళికిఁ జండతరాళికెంతయుం
జింతిలి వేదనావశవిశీర్ణమతి న్విరహార్తి నొందుచున్. ౬౮

సీ. చెక్కిటఁ జెయి నేర్చి చింతాకులాత్ముఁడై వనిత నేక్రియఁ దెత్తు నని తలంచు
నిట్టూర్పు నిగిడించు నేఁ డయో శుకపికార్భటి కోర్వలేనంచుఁ బలువరించుఁ
దనలోన తానేమొ తలయూఁచుకొని మెచ్చుఁ గలవరించుచు బయల్గౌఁగిలించుఁ
జిత్తరువున నున్న చెలువంపుఁ బ్రతిమ నల్లదె ప్రభావతి యంచు మది దలంచు
నింపు విలుచంచి విరితూపు లేర్పరించి, పచ్చవన్నియచిల్కబాబావజీరుఁ
డుల్ల ముల్లోలముగఁ జేయఁ దల్లడించు, రాజముఖిమీఁదిబాళి నారాజమౌళి. ౭౦

ఉ. ఎప్పుడు చూడఁ గల్గునొకో యిందుముఖీ వదనారవింద మే
వెప్పుడు వింటినో తెలియ నేణవిలోచన కల్కిపల్కు లిం

కెప్పుడు గాఁగిలింతు నలయింతినచాయ్రి లురంబునోఁక నా
కప్పుడుగాదె సౌఖ్యపద మందుట లంచు మదిం గణించుచున్. ౩౧

క. ఉల్లము బెగడ ధరిత్రీ, వల్లభుఁ డిట్లున్న వేళ వనితామణులం
దెల్లగుణంబుల కిరవగు, పల్లవి యనుపేరుగలుగుభామసుబుద్ధిన్. ౩౨

సీ. వసుమతీశ్వరుఁ డున్న దెసఁజూచి పావడ చెఱఁగున నెమ్మోము చెమట దుడిచి
సిగ పొందుగ నమర్చి చిన్నారివిడికెంపు తాయెతుల్చుట్టి కల్గాయి వెట్టి
చెవులయొంటులఁ జక్కసవరించి ముక్తావిచిత్రహారంబుల చిక్కుఁదీర్చి
కలపం బలంది బంగరుగట్టికమ్ములు వలిపె దుప్పటి వలివా టొనర్చి
కేలుదమ్మికిఁ గపురబాగాలుఁ బండు, టాకుమడుపులు నొసఁగి లోకాభిరామ
వార్త లొకకొన్ని నొడివి యప్పార్థివేంద్రుఁ, బలుదెఱంగుల నలరించిపలికెనపుడు. ౩౩

క. స్వామి యవధారు మీమదిఁ, గామించు మనోరథంబుఁ గడతేర్చెద నిం
కేమిటికిఁ జింత యన విని, భూమానకరధ్వజుండు పల్లవి కనియెన్. ౩4

గీ. వైశ్యభామిని లావణ్యవైభవంబు, విని విరహవార్ధి మునుఁగుచున్నను నెట్టు
లంటు చేసెదో యమ్మచ్చెకంటి ననుచు, నిచ్చకము నొనర్చి యుంగర మిచ్చి పనుప. ౩5

మ. చని యప్పల్లవి వైశ్యవల్లభుని భాస్వద్దివ్యగేహాంతరం
బున వర్తిల్లు ప్రభావతిం గనఁ దంబభోజాక్షి రాజావలం
బనసౌభాగ్యము గన్న ధన్యవు ననుం బాటించి యేతెంచు నే
మి నిమిత్తంబో యటంచు నిర్మలసుధారోచిర్మయూఖరిం బల్కెనన్. 36

క. నినుఁ జూడఁగోరి వచ్చితి, ననవుడు సంతోషమయ్యె నని మణిపీఠం
బను నిలుప రాజదూతిక, యనియెఁ బ్రభావతికి సముచితాయత్తమతిన్. ౩7

గీ. ఎల్ల సౌభాగ్యములు గలయింట వెలసి, మిగులఁ జక్కనివారిలోఁ దగినదాన
వగుదు నీబంధుజనము నిన్నభినుతింపఁ, గాఁపురము చేసితివి మేలు కమలగంధి. ౩౮

వ. అదియునుం గాక పురాణదంపతు లగునీయత్తమామల సుమతిహారదత్తుల నాదరిం
చు నీవివేకంబునకు మెచ్చితి సాక్షాన్మనోజుం డగు నీమనోహరున కనుగుణం బగు
నంతరంగంబునకు సంతోషించితి గురుబుధబాంధవదాసదాసీజనంబులం బోషించు నీ
నీమహత్త్వంబుఁ గొనియాడ శక్యంబగునే యని వెండియు. 39

సీ. గుట్టుతో సంసారి మట్టునఁ జుట్టాలఁ దనియింతు వని హారదత్తుతోడ
ఘనురాల చల్లనికడుపుదానవు నీవు సుకృతశాలిని వంచు సుమతితోడ
మదనవేనుఁ డనంగ మఱి నీకె తగు నెంత చెలువుఁడ వని దానిసెట్టితోడ

విశ్వాసముఁ గంటి తెలియుమా యెల్లఁ జూపెద రంచుఁ దగిన జాణ సెలతోడ
నిచ్చక మెచ్చి హితవచియై పుచూప, చొరవ గల్పించుకొని పరిశుద్ధురాలి
వలెనె తాఁ బోసనో సారెకుఁ ఏవంపు, మచ్చిక యొనర్చె నమ్మదిమాయలాఁడి.

క. అంత నొక నాఁడు రజనీ, కాంతశిలాఘటిత వేదికామధ్యమునన్
గొంకెడు వుంతి తిగ నే, కాంతం బసవేశ వైశ్యకామిని కనియెన్. 41

క. ఒనుధుని వాసి నీమను, వేసుటనుం గడను గాక యెంతయు నొప్పెం
దామసుఁ డనువాగ్వితతా, కామం బొకకొంత కొదవ గల్పించెఁ గదా!

వ. అని యిట్లనియె.

సీ. బింబోష్ఠి నీచంద్రబింబాననము వాని పెడఁగునోటను ముద్దువెట్టఁదగునె
కాంత నీ సిబ్బెంపు గబ్బిగుబ్బలు వాని పరుసుచేతుల నొత్తి నట్టఁ దగునె
యబల నీకనకోపమాంగవల్లరి వాని కఱకుమే నంటంగ నొఱయఁ దగునె
రామ నీమధురాధరప్రవాళము వాని వికటదంతముల కొప్పించఁ దగునె
కొమ్మరో కుందనపుఁ గీలుబొమ్మకరణి, నొరపుగలదాన నీవు వానరము వంటి
మగనితోఁ గూడి రతికేళిఁ బొగులఁ దగునె, తగదుగా ధాత యీరీతి తగులు సేయ.

గీ. తా ననుభవింప నేరక తెరిన ఘనని, వండ నుండంగనీక నిధానమునకు
బూచి కాచుక యున్నట్లు ప్రవ్వబోఁడి, యెట్లు సంగతమయ్యె నీ కిట్టిమగఁడు

వ. వినుము గొదవ గాఁ దింతుల కొక్క మహోపాయంబు విచారించితి వినుము.

ఉ. వలపుల కొరికె న్నవతుపచ్చ విలాసము గల్గి యెల్ల వి
ద్యలఁ గలమేలిమిం దెలిసె యంగనలం గరఁగింప నేర్చి కో
ర్కులు నమకూర్పఁ జాలి కడుఁ గొండొక ప్రాయము గల్గువాని ని
స్తులతరభోగభాగ్యములు చొప్పడ నీకొనఁగూర్తు మానినీ.

క. అతని వివరింతు వివు నీ, మతికి న్నమ్మతి యొనర్చు మనరాజు జగ
ద్ధితసుప్రతాపభాస్వ, త్ప్రతిభాభానుండు చిత్రభానుండు డబలా!

సీ. భావజ్ఞమౌళి ధాత్రీవరారోహాహస్త కైకైక బాహార్గళుండు
చల్లనిరాజు సాక్షాత్కారనవమోహనాంగసౌందర్యలీలాంగభవుండు
దాక్షిణ్యశాలి యౌదార్యధైర్యావార్యసకలసద్గుణగణార్జవపరుండు
చేపట్టుమంచ మక్షీణరంగదభంగశృంగారశాస్త్రప్రసంగలోలుఁ
డమ్మహారాజదేవేంద్రుఁ డంతరంగ, మెల్ల నీసొమ్ముగ నొనర్ప నేమితపము
చేసితివో నాసఖి కొకింత చిత్తగించి, తలఁపు నెఱవేర్చుకొనవమ్మ కలికి కొమ్మ.

వ. అనిన విని సంభ్రమభయవిస్మయాక్రాంతం బగునిజస్వాంతంబునం గొంత తడవు వి
చారించి దరస్మితప్రీడాధరంబు లీసుజోడాడ పదసారవిందం బొకించుక వాంచి
పంచశరశరప్రాయకటాక్షాంచలంబుల నొక్కించుక చాంచల్యం బంకురింప నచ్చం
లాక్షి రాజమాతి కిట్లనియె. 50

క. ఏనింతనాఁటి నుండియు, మానవతులలోన మిగుల మానవతిని నై
యీనాఁటికిఁ గడచితి నిఁక , నానోఁచిననోము లే మొనర్పం గలవో. 51

వ. అదియునుం గాక. 52

గీ. అత్తయును మామ తలవరులై మెలంగ, మగఁడు పులివంటివాఁడు నెవ్వగ యొనర్ప
నమ్మ ! యేఁ జెల్లి ! యికార్యమమరు టెట్లు, చాలుఁజాలింపుమిఁక నీప్రసంగమనిన 53

వ. విని తదీయవచనంబున స్వప్రయోజనావకాశం బయ్యె నని తలంచి తదనుగుణం బగు
నట్లుగాఁ బల్లవి యిట్లనియె 54

ఉ. ఎక్కడి యత్తమామలు నిజేశ్వరుఁ డెక్కడ వంశవంశవర్తనం
బెక్కడ దొడ్డు కొంచె మను టెక్కడ నోలలితాంగి మోహము
న్నెక్కొనఁ జక్కనయ్యు నొకనిం బిగికౌఁగిటఁ జేర్చి సొంపుసొం
పెక్కని దేటి ప్రాయము మది యెన్నటికిం గలుగంగ నేర్చునే. 55

సీ. మగని ప్రక్కనె యుండి తగఁ జేరి జోకొట్టి మోనవున్నని దేటి ముద్దరాలు
పసులగోడిలనైన వసుధనిచ్చిన లేక యెక్కనేరని దేటి యమ్మలాఁడి
తలవరు ల్గనుఁగొన్నఁ దప్పు నొప్పు ఘటించి జొంకనేరని దేటిపువ్వుబోఁడి
ద్వారలు గద్దింపఁ గల్లరివార్త నిజముగా నిర్వహింపని దేటినీటుకత్తె
యత్తమామల గృహకర్త లగుచు మెలఁగు, నట్టిసూర్తుల నెల్ల నోరదిమి గదిమి
పొంచి యుపనాథులతోడఁ గ్రీడించి మించి, చక్కటికి దిద్దుకొనని దేసరసురాలు. 56

గీ. ఆఁడుపుట్టువుఁ బుట్టి యింతంతయైన, దిట్ట గాకున్న నది కడతేఱు టెట్లు
బేలతనమున నీవింత గోలవేని, మాను మోచాల యిఁక నిన్నిమాట లేల. 57

వ. అనినఁ బులకానుషంగం బగునిజాంగంబు వలన నంగీకృతభావం బెఱింగింప నయ్యం
గనారత్నంబునకు నంగనాచి యగురాజమాతిక మఱియు మఱియు బోధించి చం
ద్రికాసక్తచకోరకంబునుం బోలె వైశ్యభామ కెదురుచూచుచున్న రాజపుంగవున
కుఁ దదీయకథావృత్తాంతం బెఱిఁగింప మరలి చను నెడ నవ్వణిగీశ్వరునకు దైవయోగం
బున నతిదూరప్రయాణంబు సంభవించిన. 58

చ. తనయులువేఁపలై మెలఁగు తల్లికిఁ దండ్రికి భక్తియుక్తి వం
దన మొనరించి ప్రాణసుతుం డగు పెంపుడు ముద్దుచిల్కనె

గీ. కనకమణిపంజరము కాగ్రిగణ్యుఁ జేరి, కోరి యాత్మీయగాఢాపిరికార మెల్ల
మెల్లమెల్లన దరహాస మల్ల సిల్ల, నంతయును జెప్పఁ జిల్క యత్యాగ్రహమున.
క. కటకటఁబడి పక్షగ్వాయు, పుటచలన మొనర్చి మిగులఁ బొగులుచు మదిలో
నిటు నటు దెలియని చింతా, కుటిలస్థితి నింతి కనియెఁ గోప మెలర్పన్.
క. ఓహరిణనయన "స్వామి, దోహిమ మిదంభార" మనుచుఁ దొలుత నె విబుధ
వ్యూహంబు పలుక విన మే, యూహో యీమాట విన్గ నర్హమె మాకున్.
ఉ. * ఓసరవైశ్యవంశకలశోదధికల్పలతా లతాంగి నీ
వోపనివారిముందఱ నయో మగనిం గడకాల్లఁ దోచి నేఁ
డీనసు ధేశునిం గలయ నెంచితి వెల్లు పతివ్రితామణు
ల్వావులు పుత్తురమ్మ తలపంపులు చేతురటమ్మ జాతికిన్.
సీ. దశకంధరుని మోహదశవిచారించె నే సకలజగన్మాత జనకజాత
నహుషభూపాలు మన్నన కొప్పకొనియె నే స్త్రీరత్నమైన శచీపురంధ్రి
యలసింహబలుని మాయలఁ జిక్క చొక్క నే,విపులసద్గుణమాన్య ద్రుపదకన్య
శబరాధిపునిదురాశలకు లోనయ్యె నే రతినిభాకృతి భీమరాజపుత్రి
తొల్లిటి మహాపతివ్రితల్ దుర్మదాంధ, కాపురుషు లంగభవశరాఘాత వికల
చిత్తులై తమ్మఁ జేరి యాసించినపుడు, సిగ్గు వోనాడుకొని రఁటే చిగురుబోఁడి.
గీ. ప్రాణహాని మానభంగంబు నగు నన, కెంతపనికిఁ జొచ్చితే మృగాక్షి
జగతి నీమనంబు "తెగువయే దేవేంద్రి, పదవి" యనెడుసుద్దిఁ బొదలఁబోలు.
క. పతిభక్తి గలుగుసతికిన్, వ్రితములతో గొడవ యేల వఱలుసుకృతముల్
బతిభక్తి లేని చెనఁటికి, వ్రితములు చను వేయి యొక్క వ్యభిచారము[redacted]
వ. కావునఁ గులాంగనాతిలకంబునకుఁ గలకంఠీసముచితకృత్యంబు పాతివ్రత్యంబు
నీవు వైపరీత్యం బగుపప్రయోజనం బాచరించితి వి క్లైన నిహపరంబులకు దూరం బ
గుదు వని సుభాషితంబులు పచరించిన నవ్వచనంబులు కర్ణపుటంబులకు జిలుగుటం
పములుకులపాలుపు దెలుపఁ గలికియులికిపడి రూక్షేక్షణంబుల నాశుశుక్షణికణంబు
లు చిలుకఁ జిలుకం గనుంగొనిన నప్పతంగపుంగవం బక్కటా! యిక్కురంగనయన
కనంగతత్త్వంబు నంభవించె నిదిసామంబునంగాని చక్కంబడ దని తలంచి లంబి
కావలంబనమహాయోగిచందంబునఁ గొండొకతడవు నిశ్చలధ్యానపరాయణం బైయుం
డి వెండియు నయ్యంగన కి ట్లనియె. 75
క. వినవమ్మ భామినీమణి, మనమున నీ కితరసంగమము ప్రియమైన
న్నను గొంతి కమలబాంధవు, నెనసియుఁ బొన మెఱుఁగునట్లనే వర్తిలుమీ. 76

* ఓవర... కలశోదధిచాపహిమాంశురేఖ—శబ్దరత్నాకరము

గీ. కాక తలపెట్టికొని యలగౌతమాంగ, నామణి సురేంద్రు నొకవాఁడు నంటుపడి
యాపదలఁజెంది సకలలోకాపవాద, మొందుటెఱుఁగవె యట్లు గాకుండవలయు.

క. నీపట్టు గలుగువాఁడై, చేపట్టుంగుంచ మైన చెలువుని నొకనిం
జేపట్టి రతులఁ దేలక, యేపట్టున రాజు నిచ్చయించితి వబలా.

సీ. రాజులు కుటిలసర్పమహోగ్రతరమూర్తు లధరబింబము పంట నదుము టెట్లు
సార్వభౌములు చండశార్దూలసమచిత్తు లించువేడుకఁ గౌఁగిలించు టెట్లు
*కువలయాధీశ్వరు లురుహుతాశనకల్పు లండనుష్ణాంగి పరుండు టెట్లు
నరవరేణ్యులు భద్రకరిమదాంధమనీషు లెనసి బంధరతాప్తిఁ బెనఁగు టెట్లు
చక్రవర్తులు మానవిర్వక్రినర్తు, లతులతర గాఢసురతవేళాతివేల
తాడనచపేటములొనర్పఁ దలఁచు టెట్లు, తెలిసి కలయికలొనఁగూడ మెలఁగవమ్మ.

క. వారలగుణానుగుణముగ, వారక కనుగలిగి నడుచువారల కెలమిన్
శ్రీరంజిలు జయ మొదవును, దారతనీపదు నెఱింగి యలవడు మబలా.

వ. ఇత్తెఱంగునఁ దత్తరంబులేక వర్తిల్లుమని విన్నవించిన.

క. అభినవవినీతివార్తా, విభవం బభిరామలీల వినుచున్న తఱిన్
నభము నభమైనఁ గనుఁగొని, యిభగామిని నాఁటి కరిగి యిలు సేరుటయున్.

వ. అంత నర్ధరాకాంతుండు తదనంతరకథాక్రమం జెట్టిది యాన తిమ్మనుడు.

గీ. అవధరింపుము సకలరాజాధిరాజ, నతపదాంభోజుఁ డగు ధర్మనందనునకు
నరసవైదికలౌకికాచారవిహిత, హితకథారమ్యుఁ డగు ధౌమ్యుఁ డిట్టులనియె.

క. ఆగుణవతి మఱునాఁ డను, రాగాప్తిన్ రాత్రివేళ రమణీయకళా
భోగశుభాకృతి రతిను, శ్రీగులుక నాత్రిజసేవ సేయుట కెలమిన్.

చ. కలువలు కొప్పున న్నగుమొగంబునఁ గస్తురి బొట్టు పట్టుకు
చ్చులయును జంద్రకావి బురుసాపని పల్వయు మై రహింపఁగా
నలవడు మేల్మిసుంగుపయి నంగరుచిచ్చటలొప్ప నప్పుడా
కలికి రమాకుమారు తురగంబుకడం దగఁ జేరె నంతటన్.

గీ. చిలుక ముద్దులు చిలుక రాజీవనయన, ననునయించి పచించు నోయబల నృపకు
లేంద్రుఁ గదిసెద ననివచ్చుటే నెఱుఁగుదు, నుబికి చనఁదగ దితిహాస మొకటి వినుము.

మొదటికథ.

క. అనఁగా ననఁగా నొకపుర, మొనరుం జంద్రవతి యనఁగ నుద్యోతవినూ
తనఖద్యోతనికేతన, ఘనకేతనరుచిరకనకకలశం బగుచున్

---

* అవనీతలేశ్వరులాహుతాశనకోపులు—పాఠాంతరము.

గీ అన్నగర మేలు రత్నాకరాహ్వయుండు, వికటమత్తాహితవిఫాలుఁ డొకనృపాలు
డతని నగరున నొట్టకాఁడగుచు నొకఁడు, వెలయు హనుమంతుఁడను గౌరచెలువమీఱ 9
ప పెంపుతియు నద్యుఖండతరసంపత్కూ పేరుం డగునతండు.

శా. ఏయూరం దనయుంగడు లెన్నఱయ నేయేచేరులెంతైన వా
త్మీయత్తైకధనంబు సంచిమొనలై యత్యార్జనం బొందఁగా
శ్రేయఃకీర్తులు సంఘటిల్లఁ దను సుశ్రీమించఁగా నిల్పె న
య్యాయం బేర్పడ, గోటికిం బడగ లెన్నైనం బ్రమోదంబునన్. 9

ఏ. వలసిన బేరము తెలియవచ్చినవారును, వాదుగల్గువా
రలు మఱి గుత్తగొల్లలును రత్నపరీక్షలవారుఁ గార్యము
ల్గలిగిన యింగిలీసుల ముఖ్యాములుఁ జెంగట నుల్లసిల్లఁగాఁ
గొలువుననుండుఁ జూపఱలకుం గనుపండువు సంఘటిల్లఁగాన్. 92

క.* ఈళయు విళింగయును బం, గాళయు మొదలైన పేరుగలదీవులలో
మేలైనసరకు లాతని, కొలునడిగు మాటనిజము గలవాఁ డగుటన్. 93

గీ. అతనివలన మహాదేవుఁ డచటనొక్కఁ, డలఘువిద్యాధురంధరుఁ డగుచునుండు
తగుగఁ శ్రీవంతుఁ డనువాఁడు తలఁప నతని, సరసవాక్ప్రౌఢి దొరలెల్ల సన్నుతింప. 9

సీ. పాళివుట్టించు నుద్యత్సుధారసధార లుప్పతిల్లఁ గవిత్వ ముగ్గడించి
రక్తిఁ గల్పించుఁ గర్ణరసాయనము గాఁగ సమధికస్ఫూర్తి గీతములువాడి
యింపొనర్చు ధరాతలేశ్వరవరసభాస్థలిసత్ప్రసంగవార్తలంఘటించి
యద్భుతం బొసఁగు శబ్దార్థవైచిత్రినిబంధనకావ్యవైభవము నొడివి
యింతమాత్రంబె కాదు శ్రీమంతుఁడును ని, తాంతశుభవంతుఁడగుహనుమంతుడలర
దండ నొకవేళ నీతిసంధానలీల, బుద్ధులన్నియుఁ దెల్పు నప్పుడమివేల్పు. 95

క. ఈరీతి సకలధర్మ+వి, చారుం డగునతనిమాటజవదాఁటక య
గ్గౌర మనుచున్నఁ దన్నగ, రీరత్నం బేలునట్టి నృపవరుఁ డెలమిన్. 96

గీ. మంతు కెక్కినయవ్వనుమంతునను, యించి ప్రియభాషణంబుల హితవొనర్చి
జలధి కవ్వలదీవులఁ గలసమస్త, వస్తువులు బొక్కసముఁ జేర్పవలయు ననుడు. 9

ఉ. రాజొనరించు మన్ననకు రంజిలి యవ్వనుమంతుఁ డప్పుడి
గ్రాజ మనోభయంకరపరాక్రముఁ డానృపుతోడ నేన య

* ఈళయు నిళింగ యును బం, గాళియు, + విశారదుఁడగు—శబ్దరత్నాకరము

వ్యాజత దీవికేగి కలవస్తువులన్నియుఁ దెత్తుఁ బంపుమో
రాజకులేంద్ర! యంచు సుకరంబున మున్ను వచించి పిమ్మటన్. 100

క. తననగరముఁ జేరి సముధిక, ధనధాన్యసుపుత్రమిత్రదారాలయమం
డనమైనకాఁపురంబిది, యను వగునే విడిచి చనుట కని చింతిలుచున్. 101

ఉ. కారుమెఱుంగురాచిలుక కస్తురిపిల్లి పదాఱువన్నె బం
గారము రస్తుకుప్ప తెలిగంబుర వెన్నెలలోని తేట యొ
య్యారపుఁ డెంకి యందముల కన్నిటికిం దగుపట్టుఁగొమ్మ సిం
గారపుపొంతి యైనకులకాంతనరో యెడఁబాయనేర్తునే. 102

గీ. అనుచు మదిలోనఁ దలపోసి యడలునంతఁ, జెంతనాసీనుఁ డగుకలావంతుఁ డనియె
దొరలవెంగట వెనుకముందును దలంప, కాప్యుఁడు వచింపఁ దగునె యేకార్యమైన 103

క. మునుకొని తిత్ప్రకృతంబును, దనశక్తియు దేశకాలధర్మము నృపువ
ర్తనమును రాణువనంచును, గని మాటాడంగవలయుఁ గద సభలోనన్. 104

వ. ఇత్తెఱంగునం బ్రవర్తింపక దైవయోగంబువలనఁ బ్రమాదంబని తలంపక రాజసమ్మానంబునకు నుబ్బి తబ్బిబ్బుగాఁ బచరించిన భవద్వచనం బమోఘంబు గావింపవలయుం గాక నిరర్థకంబొనరించినం గొదవ యగుం గదా సకలజనశ్రేయస్కరంబును స్వకీయజనజీవనాధారంబును బహుప్రసిద్ధియునుం గలుగునట్లు గారాజోచితకార్యంబు నిర్వహింపుమని విన్నవించిన.

సమ్మానంబున వసుమంతుఁ డుమ్మలించి, కూరిమిబంధుల నందఱఁగుస్తరించి
గోలయుఁ బతివ్రతాధర్మశీలయగుచుఁ, బ్రాణపదమైన యిల్లాలి పజ్జఁజేరి. 105

చ. మది వెతఁజెంద బేడిసల మారొ్కనుఁ కన్నులు నీరుబుగ్గలై
పొదలఁగ ఘర్మబిందుపరిపూర్ణతనూలతకంపమొందఁగా
మృదుమధురోక్తి తోట్రుగొన మేలుకనంబడ వెచ్చనూర్చున
మ్మదవతి నాదరించి వసుమంతుఁడు దా నలనాఁటి వేకువన్. 105

క. పరికరముల మంకెనలును, బరిచారకు లరిదిపనులపట్టుగుడారుల్
సరిజేసు లైనగొరిలు, దొరయఁగ జనవిభ్రుఁడతనితో నిట్లనియెన్. 106

క. చనుమునుబహుశ్రేయస్థితిఁ, గనిపునరావృత్తిమహిమ గలిగి శుభాప్తిన్
మను మింకొక్కటి తెల్పెద, వినుము మదీయప్రసంగ వివశాత్ముఁడవై. 107

గీ. అతిరయంబున నొకకార్యమాచరించు, నతనియవివేక మఖిలాపదాస్పదంబు
తెలిసి నత్కార్యభాగవర్తిష్ణుఁ డైన, ప్రాజ్ఞుఁడు కృతార్థుఁడై సంపదలఁ బొదలు. 108

మ. అని పల్కి వ్యాసుఁ డేతదర్థకృతసద్యోజ్ఞప్తు తాళీపత్రం
బున వ్రాయించి మెంటుగుకత్తి యొకటిలోఁ బొందించి తానత్తఱిన్
జని పొంతం గనియె న్మహానటజటాస్ఫాటచ్ఛటాసన్నగ
ద్ఘనధారాపతనప్రకంపితమహాక్ష్మాభాగ భాగీరథిన్.

వ. కని యప్పుడప్పుణ్యతరంగిణీజలంబులం గృతస్నానదానాద్యనుష్ఠానుండై కృతకృత్యుం డగుచు నచ్చోటి వాసి యిలావృత హిరణ్మయ రమ్యక భారతప్రముఖ బహువిధవర్షంబుల వలోకించి తత్తద్విచిత్రంబుల కాశ్చర్యం బంది యవ్వలం గడచి నడచి యనేక దుర్గవర్గకాంతారమార్గంబు లతిక్రమించి చనుచు నప్పు డప్పరోభాగంబున.

సీ. స్వయనిష్ఠురాఘాతసంక్షోభమునకళ్కి మైనాకుఁ డెవ్వాని మఱుఁగుఁ జొచ్చె
మునికోపనిర్ఘాతఘనతరైశ్వర్యంబు నగభేది కెవ్వాఁడు మగుడ నొసఁగె
సకలజంతువ్రాత సంరక్షణఖ్యాతి జలధరం బెవ్వానివలనఁ జెందె
సంపత్కటాక్షలక్షణకన్యనలరించి దనుజారి కెవ్వాఁడు ధారవోసె
నతఁడు ముంగలఁ గననయ్యె నంబునిధికి, శీరముఖసత్వజాతులసంచారజనిత
బహువిధాభ్రంకషోర్మికాభయదఘుమఘుమ, మారవశ్రీకరుండు రత్నాకరుండు.

క. అచ్చోటఁ గడలిరాయని, నచ్చుగ వీక్షించి కౌతుకాయత్తమతి
న్మెచ్చుకొని చేరనరిగె వి, యచ్చరజనవినుతమైన యవ్వలి దీవిన్.

గీ. అందలి విచిత్రవేషభాషాభిరాము, లగుపరంగులతోడి నెయ్యమునఁ జిక్కి
చొక్కి బహువత్సరంబు లచ్చో వసించి, పిదపఁ బ్రభుకార్యభారంబు మదిఁ దలంచి.

సీ. నవవిధదివ్యరత్నంబు లేనుంగులు గోవ తేజీ ల్పచ్చికుంకుమంబు
కస్తూరి పీణెలు కజ్జవ్వాది కప్పురము బన్నీరు చెంబులు పటీర
తిరులఖండంబు లంసలపుఁగొమ్ములు జల్లినవరము ల్పాదరసంబు జాజి
కాయ యింగువ లవంగంబులు నోడపోఁక లుపంచలవణము ల్గంధకంబు
కొచ్చివేఁపుడు మానిసికోరఁతుల్లాది, యైన వన్నియు నోడల కనేపువఱచి
కడలిదాఁటించి చెల్లెలికట్టఁ గడచి, యుంతి సేతుపతితనయారి చెంతఁ జేరి.

గీ. పటకుటీరాంగణములలో బహువిధైక, వస్తువులు కుప్పలొనరించి వసుమతీంద్రు
చెంత కానుక లిడ నెంచు నంతలోన, నంబుజవనీమనోహారుం డస్తమించె.

మ. వసుమంతుం డపు డంతరంగజనితవ్యామోహభారంబున
న్వెసఁ బ్రాణేశ్వరిఁ జూడఁగోరి త్రిజగద్వీరుండు మారుండు తీ
వ్రసుమాస్త్రప్రహతిన్ హాళాహాళి యొనర్పం దద్వియోగవ్యథా
వ్యసనాప్తి న్నిలుపోపలేక విరహవ్యాప్తి న్వగం జెందుచున్.

# ప్రథమాశ్వాసము.

క. ఇది యేమో యనికేలం, గదియించి ప్రదీప్తదీపకళికఁ వెలుఁగునం
జమువ్రముఁ బ్రాక్తనవిద్వ, త్ప్రియనీతిశ్లోకమగుట భావించి వెసన్.
" గీ. అతిరయంబున నొకకార్య మాచరించు, నతని యవివేక మఖిలాపదాస్పదంబు
తెలిసి సత్కార్యభాగవర్తిష్ణుఁడైన, ప్రాజ్ఞుఁడు కృతప్రలబ్ధసంపదలఁ బొదలు '
వ. అని యివ్విధంబునం గవ్వైనఁ దచ్ఛ్లోకం బరసి నిజవధూమణిం దిలకించిన.
ఉ. మాసినదీర్ఘవేణి కుఱుమాసిన చేలచెఱం గలంక్రియా
వాసముగాని మేను వసివాఁడిన ముద్దుమొగంబుఁ గాంచి య
య్యోసరసీరుహాక్షి మదయోగభరంబున నిట్లు ఖిన్నయై
గాసి వహించి యున్నదని కంది వెస న్వసుమంతుఁ డత్తఱిన్.
మ. మది నొక్కించుక శాంతినొంది యొఱలో మాద్యద్విరోధివ్యధా
స్పదశౌర్యంబగు వాలుసేర్చి సతిపజ్జం జేరి నిద్రించు నీ
మదనప్రాయుఁడు నన్నుఁ బోలిన జగన్మాన్యైకరేఖాంగసం
పదఁ జెన్నొందినవాఁ డిదేమొ యనుచుం భావించి తా నాత్మలోన్.
క. ఈవాఁ డయ్యెడు కార్యము, గానేరదె తెలుపటంచుఁ గడు నెమ్మది న
మ్మానధురంధరుఁ డతఁడా, స్థానస్థలమునకుఁ జనియె జలజాతముఖీ.
ఉ. అంతల తాంతచాసలత యంగభవుం డపు డెక్కుడించెఁ ద
త్కాంత ప్రభాతమయ్యెనని కాంతనిశాకరకాంత మంబరా
భ్యంతరవర్తియై తపనుఁ డస్తగిరీంద్రము పొంతఁ జేరుప
ర్యంతము వేఁగి వేగ విహగాగ్రణి మ్రోలవసించి వేడుకన్.
క. కడమకథ నుడువు మనినం, బడఁతికి శుకలోకపట్టభద్రుఁడు తెలిపెన్
వడివాఘునుఁడు నిశీథని, గడతేఱి ప్రభాత మగుటఁ గని యవ్వేళన్.
వ. యథోచిత నిత్యకృత్యం బగు సత్కర్మకలాపంబు నిర్వర్తించి తదనంతరంబ.
గీ. లీలరత్నాకరుండు నిండోలగమున, నుండి తనుఁబిల్వఁబంప నమ్మండలేంద్రుఁ
జేరి నానావిధద్వీపచిత్రదేశ, వివిధవార్తాప్రసంగము ల్విన్నవించి.
క. తెచ్చిన సమస్తవస్తువు, లచ్చపడ న్సమ్ముఖమున నలవడ నిడి త
న్మెచ్చికోలు వెల్లఁ బొగడఁగ, నచ్చోవివరింపఁ దొడఁగె నధిపుం డలరన్.
రగడ. దేవ యవలోకింపుమిది తెలిదీవిఁ బొడమిన పద్మరాగము
పావనం బొనరించుఁ దను వనపాయరుచి నల పుష్యరాగము
తళుకుఁ దుమ్మెద తాళి కగునని తలఁపుమీ యీశాపునీలము

వెలఁదులకుఁ జేర్చుకొన్నట్టి నొదవించు సురువగు నీప్రవాళము
గొప్పలగు చౌకట్లకని చేకొంటి మిమెకట్టాణిపూసలు
చెప్పఁ జూపఁగరావు మక్కాసీమ వీగుజరీతివాసులు
ఎన్నుకెత్తు మెఱుంగుకుందన మిచ్చి తెచ్చితి మీసిరాజులు
హత్తివాయుమనోజవంబుల నలరు నీసామ్రాణి తేజులు
కురుచమైనను నిచ్చమదమునఁ గొఱలు నయోమంగుగన్నెలు
దొరయ నొకపరిపాటి దొరలకు దొరకవీనాడి కెంపుమిన్నెలు
కలువడంబులఁ గలయు నివి చొక్కంబులగు కస్తూరిపిసెలు
తెలిసి చేయువారాల విలువలు దీర్చితిమి యీయువజ్రిహీణలు
నిలువ్రువిలివెఁడు సోగవాగ మెన్నెరులకివి సమకట్టు జల్లులు
పిలుపులను గమఁబోద్రిదిసేయఁగఁ బెరెఁగినవి జవ్వాది పిల్లలు
గమ్మురని పన్నీరుతోలఁకెడుఁ గంటివేయివి గాజుపనఁటులు
చిమ్మఁ రేఁగెడు కప్పురపురవఁ జెందునీ యేడాకు టనఁటులు
మహిఁ దొలంగక నీటిపైఁ జను వరుసనీయందలఁపుఁ గొమ్ములు
బహువిధమ్ములఁ జదువు నివిగోఁ బంచవర్ణము లగుశుకమ్ములు
పంచలోహాపుగట్టిపనులను భద్రమైనవి యివె పిరంగులు
కంచుమించుగ నడవిమెకములఁ గమము నివిగో బలుసివంగులు
అల్ల నేరెడువాగుజలములనైనయవియుపరింజిలప్పలు
మొల్లముగ రజతాద్రికెనయై మొనయు నీతెలివెండి కుప్పలు
పట్టుపిషేకేఁడు నెనయు జీఁకుపట్టురవలివె జవిడికట్టులు
యిట్టులపురతివేళఁ గవకిప లెసఁగునీ బకదారిపిట్టలు
చికిలిపుత్తడి కొత్తహావులఁ జెందు నివిగో నూరెపానులు
ఒకటఁగస్తురిమెకము లుండుట కొన్న నీవంతెంపుబోనులు
ఎనఁగ నస్నములోని విసముల నేర్పఱుచునీ సింగిలీకలు
ఆనమశౌర్యధురీణులకు బిరుదందు రల్లవె హారిచెయీకెలు
సొగసు పటికంబుల నమర్చిరి చూడుమీసొగటాలచందము
పగడముల నీలముల నిరుగడ బలములవె చదరంగమంచము
గాలికన్నను వేగఁజను చులుకనివి యివె కొల్లారుబండులు
మేలిమిగ రాహుత్తులకు నియమించినవి సింగాణివింపులు

ప్రాక్సాను పసేసిమణుఁగులు తొలుత నీకంకుమప్రోనెలు
మిక్కుటపుఁ గస్తూరిపటపుల మించు ఘనుఁ గిడఁదగిన పూనెలు
మలయగిరికూటమునఁ గల పిమంచిసిరిగంధంపుమ్రాకులు
తళుకుఁ దళుకున మించునివె నిద్దంపుమగజాపిడులబాకులు
ఆనవాల్గ్రోలుటకుఁ దగు నీయబ్బురపు సెలతాలగిన్నెలు
పూని యుడిగ మొనర్ప నేస్తురు పొంత నీయుడిగంపుఁగన్నెలు
రివి నలఖర్జూరములఁ బురుడించునల్లపె యోడపోఁకలు
శ్రీవెలయు గేదంగిరేకులచెలువు గల పిపండుటాకులు.

క. అనిగౌర పలుదెఱంగుల, వినిపించి యొసంగు వస్తువితతుల నెల్లం
గొని యెంచుకొని నృపాలుఁడు, మనమున నుప్పొంగి సబహుమానప్రీతిన్.

చ. విడిగల కెంపురాగతుల వింతపసుల్గల తాళి వజ్రపుం
గడియములు న్మపాణులచొకాటపుచొకళికట్టువర్గము
ల్గడుఁ బ్రియ మొప్పనిచ్చి కుతుకస్థితిదవ్వసునంతు నప్పడ
య్యొడయఁడు పంప నింద్రవిభవోన్నతుఁడై యతఁడింటికేగినన్.

గీ. అతనిపాణిగృహీతి మోహానతరాతి, రూపవిఖ్యాతి రతి కీర్తి నేర్పుఁజూపి
వెలయు గుణవతి తనపాణి విభూనిరాక, కుబ్బి సంతోషరసవార్ధి నోలలాడి.

సీ. పసుపు నలుగు పెట్టించి పెరాణిసవరించె జిగిమేని కొకయింత సిరి జనింప
గడల రేఖలమర్చి కాటుక దీర్చె వాల్గన్నుల కొకవింత కాంతి మెఱయ
నిలువుటద్దము చూచి తిలకంబు దిద్దె నెమ్మొగమున కొకవింత ముద్దు గులుక
జవ్వాదిపదనిచ్చి క్రొవ్విరులు ముడిచెఁ జెన్నటివేణి కొకవింత హరువు లెసఁగ
మఱియు నిండువెల్లనొకవింత యొఱపునెఱప, నింటఁగలచొక్కటపుసొమ్ములెల్లఁ దాల్చి
వినయలజ్జాభయంబులు నెనయఁ బ్రాణ, నాథునకు మ్రొక్కి నిలిచె నానలినినయన.

గీ. అంతనతిలోకచారిత్రుఁ డగుసుపుత్రుఁ, డతివినయభక్తితాత్పర్యయుతముగాఁగ
హితబుధాశ్రితగురుపురోహితులతోడ, జనకుకడనిల్చి సాష్టాంగప్రణతి సేయ.

ఉ. ఎత్తి ధృతాంకపాళిఁ గదియించియు నిన్నటి యర్ధరాత్రినీ
చిత్తజరూపుఁ డీయబలచెంతఁ దమిన్నిదురించుచున్నవాఁ
డిత్తఱినన్నుఁ జేరె భయమించుక యేనియు లేక వీని దు
ర్వృత్తి సువృత్తులే నెఱుఁగు రెట్టు లొకో యని సంశయింపఁగన్.

క. కులవృద్ధు లప్పు డాతని, కళ యెఱిఁగి భవత్ప్రియాణ కాలంబున నీ
కులకాంతాతిలకంబీ, యళికచ నెలమసలియుండు టది యెఱుఁగవొకో.

గీ. అంతనీశ్వరు కరుణాబ్ధి ననుదినప్రవర్ధనంబైన తద్గర్భవనధి వలన
నవతరించె నితండు నీయౌరసుండు, కనుఁగొను మటన్న సంతోషకలితుఁ డగుచు. 147

క. సతిపాతివ్రత్యంబును, సుతునిగుణాఢ్యతయుఁ దెలిసి చుట్టపువారల్
మతిసమ్మతించుచునట్లుగఁ, జతురుండై మెలఁగె నతఁడు సరసీజాక్షీ. 148

గీ. ఇట్టెఱుంగని మనసెట్టి యింటిమీఁది, బాఁగైనను నినుఁ జూచు బాళినైన
నింతలో వచ్చెనేని నీవింటలేమి, కేమనుచు బొంకఁగలవు పూర్ణేందువదన. 149

క. ఈకథ వింటివిగద యు, స్తోకమతిని దెలిసికొమ్ము సూత్రప్రాయం
బైకనుఁగొనవయ్యెడుకా, ర్యాకార్యము లనిపచింప నటువేగుటయున్. 150

క. రెక్కలు విదిల్చి లావులు, ముక్కోనం దువ్వి మోదమునఁ గంధరముల్
మిక్కిలి దిక్కగనుంగొనఁ, గొక్కొరొకోయనుచుఁ గోళ్లుకూయం దొడఁగెన్. 151

క. ముడిఁగె దొగ లడఁగె జుక్కలు, విడిగెఁ బయోజమ్ము లుడిగె వెన్నెల లటు గ్రుం
కడిగె నెలవడిగెఁ గత్తిం, గడిగె మరుం డినుఁడు తూర్పుకడఁ బొడమునెడన్. 152

గీ. అంతనయ్యింతి యింత యంతనఁగ రాని, యంతఁ దనఁ యంతిపురిఁ జేరి కంతునిసిత
కుంతహతిఁ గొంతగుందిపాయంతనాప్తి, నెంతయు దురంతవిరహాసంక్రాంతయగుచు. 153

సీ. మెఱుఁగించు కమ్మలు నిరసించు వితిలేశ వెలనొప్పు మణుల కమ్మలు ధరించి
పూలచేకట్టులోకమూలవైచి సిరాజి గనుపుల గళ్లచేకట్టులఁ దాల్చి
యక్కఁజె వాదుల యరతుబొ[illegible]ట వెట్టి పుత్తడి మెడనూలి బొట్టుమర్చి
చిఱుతపొప్పళిరోసి సరిగంచుపసపు పొప్పళికుచ్చెల బెఱుంగు వలువగట్టి
సేస కొప్పునఁ గపురంపు చిత్రకంబు, గళమునఁ గుచాద్రులను దళ్కుగందవొడియు
వలపు గులికెడు సింగార మొలుకముద్దు, చిలుకకడ నిల్చెఁ గోమటి కులుకులాఁడి. 154

గీ. చెంతనిటు నిల్చియున్న యక్కాంతఁ జూచి, చిలుక యొకవార్త వివరింపఁదలఁచినప్పుడె
కలికి నన్ను ప్రదారాజతిలకుఁ గూర్చి, మిగులనుపకారమొనరింపఁ దగుననుఁడు. 155

ఉ. కాంతరొ యెట్లు కాఁదగిన కార్యము లట్లగు మున్నగళావతీ
కాంతకు మోహనాంగు నుపకాంతుని నమ్మణిమండనక్షమా
కాంతుని నేనె కూర్చి యుపకార మొనర్చితి నే తలంపనొ
క్కింతయు నంతరాయ మగునే విధివ్రాసినవ్రాఁత కిమ్మహిన్. 156

——: రెండవకథ. :——

వ. అది యెట్లంటేని విను మీప్రకారంబునకుం దగిన జగదసాధారణంబగునొక్క
గాథకలదు వివరించెద నిది సావధానంబుగా నాకర్ణింపుమని యిట్లనియె. 157

# ప్రథమాశ్వాసము.

క. కమలాకరమను నొకపుర, మమరును సురవరజ నతధ్వజాళీకమరు
ద్భ్రమదభ్ర చయపరిమదా, సుమదామకటాక్ష జనితసూనశరంబై.

ఉ. ఆపురి రాజ్యలక్ష్మి కిరవై మణిమండపమందేలు రూప చే
ఖాపరమన్మథుండు చతురబ్ధిపరీతధరాధురంధరా
గోపభుజార్గళుండు చతురుండు సమస్తమహాధియాతిసం
తాపకరప్రతాపుఁ డొకనాఁ డతఁ డెంతయు సంతసంబునన్.

క. ఒక చక్కిఁ జక్రినమకుచ, లోకవండం దండనాథు లోకచో కకచో
ళకళింగ వంగ గూర్జర, కుకుర నృపుల్గొలువ నిండు కొలువగువేళన్.

ఉ. కొమ్ములు మోఱ్ఱయు మంటితమపల్వాన బోరుకలంగఁ బార్శ్వభా
గమ్ముల వల్లనల్ల పరజ గ్రమ్మకొన న్వెస జాగిలంపు మొ
త్తమ్ములు ముంగలన్నడువ దర్పమెలర్పఁగఁ జెంచుపాళెగాఁ
డమ్మనుజేంద్రు గొల్వనకు నచ్చెరువందఁగ వచ్చెఁ జెచ్చెరన్.

గీ. కుఱుచవగ కేలుగవమోళ్చ కోరసిగయుఁ, గూడ అమ్మను మోకాళ్లుగూడవంచి
కొలువుకొంగించుక హసింపఁగునవయోంద్రు, చరణకంజమ్ములకు మ్రొక్కి పక్కనిలిచి

సీ. నిప్పరిపాండ్రు తేనియ పాలపండులు కారెనుముల పెద్ద చాఅపప్ప
పుపుఁగుఁజట్టంబులు పురుఁగు కట్టజవాజి కమ్మకస్తురి పచ్చకర్పూరంబు
నేకలంబులకోఱ లేనుంగుకొమ్ములు బుసుమజింకలు పెనుపులుల గోళ్లు
హరిచ యీకలు నెమ్మిపురి జొంపములు తెల్ల సవరము ల్లల్లులు జాగిలములు
పిగిలిపిట్టలు డేగలు బెట్టుడుతలు, పట్టుజిట్టలు ఫణిఫణాభద్రసంభి
కుంభవరదంష్ట్రిసంప్రికాకోటిగిళిత, కలితముక్తాఫలంబులు కానుక చేసి.

గీ. సామి నావిన్నపము విని సారి వెడలి, యొక్కనుల చెంత గడెకడ వున్న జాలఁ
జెండు బెండాడి మెకముల బెండు పఱచి, దేవరకువేడ్క పుట్టింతు దేవునావ.

క. అని విన్నవింప వినియు, మ్మనుజేంద్రుఁడు సబహుమానమహిమఁ బుళిందుం
బనిచి నిజాంతఃపురికిం, జని మాఖేటకవిధాన సత్వరమతియై.

సీ. కసుపట్టుహిజారు మిసమిసలుఱుతకాలెమ్ము.గుటంగికి వింత యొఱపునింపఁ
గాశ్మీరపంకసంకలితాంగదీధితు లక్కప్పుదుప్పటికిఁ జెంగావు లీన
జాళువాఱిగి జిరాసరిపెణల మెఱుంగు చిలుకతాళికి నొక్క సిరి యొసంగ
సిగతాయెత్తులవిగ్గు జిలుగు తాపేతి సన్నసరిగ జంటికుజాయి కొఱపు నెఱప
నుదుటఁ గస్తురిరేక వీనులఁ గిరీటి, పచ్చరాపోగులుఁ గృపాణిపాణి నలరఁ
బాదముల జీవవంతపుఁ బావలూఁది, రాజకందర్పుఁ డంతఃపురంబు వెడలె.

గీ. సకివారలు పండనారయ సాష్టాంగమంటు, పడుసనిలుచున్న యంతలోఁ బావరసపు
జోక గలతేజి నిందుసంజోఁజేసి, యెదుటనటు దెచ్చి నిల్పె సాహిణి యొకండు. 167

క. మానమలరఁగ నత్తురగముఁ, గని కనుదమ్ములను మెచ్చి కర్ణపుటరసా
యనసౌవిపల్లసాహో, నిరవం బెనఁగఁగ నెక్కె నృపుఁడు నిపుణుఁడై. 168

సీ. భేరీమృదంగ శంఖారావములు మాగధస్తవార్భటుల దిక్తటము లదరిన
చారుకేతనశతగంధపటలు శిలోత్తాలతాలవృంతములతో మేలమాడఁ
దెల్లపావడల దీప్తులు ముక్తామణి చ్ఛత్రికములపైఁ జౌకళింప
సాంబ్రాణి పొగలు నిచ్చలపు ధూమ్రింపుఁ దిత్తులదుమారములతోఁ గలసి మెలఁగఁ
జామరవ్రాతచలనసంజాతవాత, కంపశోంబులు వనసారవింబఘరీ
కణము లడఁపఁగ వెడలె నగ్రజలఁ గడియు, సేనలోఁ నర్ధాంగసుశాసీయుఁడంత. 169

వ. ఆ ఖేటసమయసముచితసముత్సాహసన్నాహబహుఃసఫలమూసమేతుండై చనునప్పుడు. 170

సీ. వంకులుగుదియలు వలత్రాళ్లు మోకులు బిసలు మాఱుమ్ములు పెద్దవిండ్లు
పచ్చకట్టెలగుము లబ్బలు తుపాకులు నెద్దు లేళ్ళంగులు సివంగు లిఱ్ఱిపోతు
పిసుకకుంపటు లాకుతడి లు పోగుత్రాళ్ళాడిగోడ్డండ్లు మువ్వంపుటురులు
పాఁడిగువ్వలు మోటుపలకలు పోటుగుంజలు చిక్కుమునురుజ్జాగిలములు
జిగురుగండెలు గాలపుఁజివ్వవెదురు, లాదియగు సాధనంబులు వలవరించు
కొనిహూటాహూటి నడలతోఁ బినుఁగులెల్లఁ, గదిసినడిచిరి యమ్మహీకాంతునటుల. 171

వ. అప్పుడప్రతిభాప్రబాప్రుండై. 172

సీ. మంజులమ్రిమలతాకుంజంపుజన్లీ ఘుటఘుటార్భటిల తత్కటికులంబు
బహుమహీధరగుహాగృహావిచ్ఛిన్న ప్రమద్రానిర్యదురుమృగేంద్ర వ్రజంబు
గంకమండలవినిర్గత గళస్థంధానుచరదళిపోల్లసత్కరిఘటంబు
నరభసోద్వతపరన్పరహాతాహతభగ్నఘురవిషాణోగ్రకాసరజాలంబు
చండతర ఘోరశార్దూలసంఘటితుల, చంక్రమక్రమనృగామ్యత్రిజాతహరిణ
ఘావనం బగు నొక్కమహావనంబు, మన మలరఁ గాంచి చొత్తెంచె జనవిభుండు. 173

గీ. హాలము చోపుడు వెట్ట నశ్వెలవులకు, సెలవొసంగిన నృపమాళి చిత్త మెఱిఁగి
చెంచు లాఖేటకక్రియామందు లగుచు, నట్టు లొనరింప నప్పు డత్యద్భుతముగ. 174

మ. చకితేణంబు భయుద్యమత్ప్రగ మావాశ్వాసవ్యధాకీర్ణగం
ఢక పల్వంతహాత్యుత్కగవిను మాఘాకాయమానస్థలా

స్త్రుక మార్గోశకృన్నృగేంద్రము రణద్వీభభల్లూకతోఱుల బను
త్సుకభిన్నాభ తరక్షువై గహన ముచ్చొ ఘూర్ణతం బొందఁగన్.

సీ. ఐడిగాలివడి నిల్వ ఇనపోక బలితంపు సరిపెణ ట్రొవియు వేసరక నిగుడఁ
బట్టెడ సడలించుపర్యంతమును దాళ కతులగర్జోపాప్తి నట్టెట్టఁ బెనఁగుఁ
బదియు నిర్వదియు ముప్పదియు నల్వది చొచ్చి కదుపులు చెదరఁ జీకాకు సేయఁ
గటికి నెత్తురులతోఁ గండ లుర్లి పడంగఁ జేరి కందులపాలచేర్లఁ గఱచు
నేలికలు వెంట వెన నంట నేపువేఁగి, కోపు మీఱి జవోద్వృత్తిఁ గూడఁ బఱచి
యొండుఁజొచ్చినఁ జొరనీయకీడ్చి తెచ్చి, సలుగులను గూల్చె నొకకొన్ని జాగిలములు.

గీ. భటుఁ డొకఁడు వింటఁ జాఱుకంటఁ బంది నెయ్య, మిట్టిపడి మించు మెఱసిన ట్లైన చూచి
యదిభయదఘుర్ఘురారావమడర నతని, రెండుతోడలును వెసఁ గత్తిరిలఁగఁ జంపె.

క. కొంతాన నొకఁడు బెబ్బులి, గొంతానం *గ్రుచ్చి మెచ్చుకొని తన బలుపన్
వంతుకుఁ గడువడి నొకఁడో, క్రొంతయు బెదరక పిడెమున నెలుఁగుం బొడిచెన్.

క. బొఱియవడఁ వేపు లొకకిటిఁ, గఱచి కఱచి కూల్చెనప్రమ కండలు పెరిపల్
మెఱయఁ దమయేలికలకుం, గుఱిమేరయుఁ బోల్చిమచ్చుకొను పొంకము నన్.

సీ. వల చంగునను దాఁటి వడి నేగు నొక లేటికొంకి కొంకక త్రొక్కి కూల్చె నొకఁడు
కలగుండు వడ రొప్పికవినుండి కుప్పించు పులి గుండె లవియంగఁ బొడిచె నొకఁడు
పావహస్తుకొని సమున్నతవృత్తిఁ జనువాత్రికొమ్ములంటఁ బెకల్చి కొట్టె నొకఁడు
పేరెంబ నొకకొంత నోరెండుకొనియుండు గండభేరుండంబుఁ గదిమె నొకఁడు
బెండియు నొకండు నిశితోగ్రమండలాగ్ర, చండతరధార నుద్దండ శరభకాండ
శకలపయఃఖడ్గముల నెల్లఁ జక్కు సేయఁ, గండ లురులఁగఁ గడుదులఁ జెండె నొకఁడు.

క. ఈరీతి వేఁటకాండ్రిని, వారణమృగపఙ్క్తి నెల్ల వడిఁ దఱిమెడిచో
ధీరుఁ డలరాజచంద్రుఁడు, కోరుకు లెనకొలుప సుభటకోటులకంటెన్.

మ. పులులం దుంచి కడుందులం దునిమి దుష్ట ల్లుగ్గనూఁటంబులై
పొలియం జేసి వరాహసంఘముల రూపుల్మాపి సింగంపు గుం
పుల నెల్లం బెగటార్చి యేనుఁగులతోఁ బోరాడి భల్లూక మం
డలి నిట్టట్టొనరించి యుండు నెడ దండన్వీన్మయుం బొప్పఁగన్.

గీ. ఒక్కనక్క వల గతుక్కనఁ గొఱికి తా, నవలఁ జనఁగ వెంటఁ దవిలె బలము
వసుధ నక్కఁ గన్నవాఁ డెల్లవేఁటకాఁ, డనెడువార్త నిక్కమయ్యె ననఁగ.

---

* జిగిమి మెచ్చికొనఁ జేసినచోన్—శబ్దరత్నాకరము.

184
వ. అట్టి యెడ.
ఉ. కోఱలు వప్పరించి కనుగొల్కులనిప్పుకలొల్క నల్కమై
బోరన రొప్పి పైఁబడినపోతరపుంగిటి నొక్కకేలున
న్నోరటు ఓర్గఁ బట్టి దృఢముష్టివాతి న్వడినొంపఁజూచి కే
ల్జాఱుటఁ బాఱె నమ్మెకము జాగిలను ల్వెన వెంట నంటఁగన్. 185
ఉ. హాళి నృపాలమౌళి చతురంగబలంబుల బాఱిపు గోరకం
జాలపరాక్రమించి జవసైంధవము న్వడిఁ బోవ నూకి త
త్కోలము వెంట నంటి చనఘోరవని న్వెస మాయ మయ్యెఁ గాఁ
బోలు ననంగ నమ్మెకము పోవుటకు న్మదిఁ జింత నొందుచున్. 186
క. మును వెనుక తెలియ కత్తఱి, వనమండలిఁ దిరుగువతని వరవీరభటు
ల్మనుఁ జూడుఁడు ననుఁజూడుం, డనువారలు వెంట నంట నర్హులు గామిన్. 187
సీ. దుర్దమసమ్మర్దకర్దమస్థలులఁ జవరాక మదసామజముల డించి
చటులనికుంజపుంజములఁ గాలాడని కతనఁ గంఖాణసంఘముల నునిచి
తండోపతండమై గండోపలము లుండు పథములందుఁ గొలారుబండ్ల నాఁగి
వంకలో నలువంక లంకమలద్దాఁటి సమకూడమికి నంగలములు డిగ్గి
దారి తెలియక ఘోరకాంతారభూమిఁ, జెట్టు కొకఁ డైరి యారాజసింధురంబు
పొలుపుఁగనుఁగొనవలసియుమ్మలికవాడమ, నక్కడక్కడసామంతు లరసి యరసి. 188
క. కలగుండు వడి పొలంబున, నిలువంబడి మాఱికులట్లనే యున్నతఱిన్
జలరుహబాంధవుఁ డస్తా, చలశిఖరముఁ జేరె నంత సంజ జనించెన్. 189
సీ. కకుబబ్జముఖులకుఁ గస్తూరిపూఁతలై భూభృదౌఘముల కంబుదము లయ్యె
భూరి ఘోరారణ్యములకు గజంబులై యారామములకుఁ బికాళు లయ్యె
హర్మ్యపఙ్క్తులకు నిర్యద్ధూమరేఖలై వరనదంబులకు శైవలము లయ్యె
భవనంబులకు నీలిపట్టు మేల్కట్టులై కొలఁకుల కెలదేఁటిగుంపు లయ్యె 190
ననఁగ సకలజగద్భీషణాయమాన, లీల నన్నియలను నొక్క నీలిమిఱింగ
నమట నిజమై యశేషవర్ణాంతగములఁ, గప్పుకొని యొప్పు చిమ్మచీఁకటులు నెఱసె.
వ. అంత. 191
చ. పరువడి భేకము ల్మొఱయఁ బ్రాగ్దిశనుండి కడంగి తెమ్మెర
ల్నెరయఁ దటుక్కటంచు నడునింగిఁ గడుమ్మెఱయన్ ఘనౌఘముల్

తెలుపుగ దక్షిణం బోరయఁ దక్షిణలక్షణము ల్గణించి నేఁ
డరయ మహోగ్రవృష్టి గురియుంగల దంచు నృపాలుఁ డెంచఁగన్.

సీ. గళదనర్గళగళద్గళదుద్ధతధ్వను ల్గిలకొట్టి వంపూకములు చెలంగ
ధగధగత్ప్రజ్వలత్పటుతటిల్లతికాళి మిసమిసన్మెఱసి యాకసము నిండఁ
జిటచిటార్భటిపటూద్భటనిర్ఘాతసంఘటనమై కరక లొక్కటను రాల
ఘుమఘుమారావసంకులకులాచలగుహాకుహరమై పెనుగాలిగుంపు వీవఁ
బెళపెళారని బెడిదంపుఁ బిడుగు లురల, ఘనఘనాఘనసంఘము ల్గ్రమ్ముకొనఁగ
ఝల్లుఝల్లునఁ బెనుజల్లు చల్లుచుండ, భోరుభోరున వర్షంబుధార లురిసె. 193

వ. వెండియు నఖండఖండతర ధారాపరంపర లొండొండ మెండుకొని వసుంధరామండ
లంబు బెండుపడఁ గురియుచుండ మహీధరశిఖరశిఖాభ్యంతరంబులం బాఁదు లురి
లి పడు బృహచ్ఛిలాతండంబుల మహారావంబునకు గహ్వరస్థలసింహకిశోరంబులు గ
ర్జించు కఠోరహారావంబులకు వెఱపక యక్షీణ మహానిక్షేపసంరక్షక బ్రహ్మరక్షో
గణంబుల దురాక్షేపణంబులకు భీతిలక శాకినీడాకినీ ప్రముఖ బహువిధభూతబే
తాళగణంబుల కోలాహలంబులకు శంకింపక యమ్మహారాజమార్తాండుండు కరాగ్రని
శిత కౌక్షేయకంబు నొఱ వెడలి ఝళిపించినం బొడము ధగద్ధగాయమానప్రభాపట
లంబులకుఁ దోడుసూపు విద్యుల్లతానికాయంబులవలనం జెట్టు గుట్టల సందులం ద
రువు కనంబడ నక్కెంగట నొక్క వటమహామహీరుహంబుం జేరం జని. 194

ఉ. ఆనృపపుంగవుం డటు మహాతరుమూలము డాసి తేజి నెం
తే నికటోర్వి డిగ్గి సముదీర్ణపరిస్ఫుట ఖడ్గ పాణియై
తానపు డేపున "న్విపది ధైర్య మథాభ్యుదయే క్షమే" తి వా
ర్తానిపుణస్థితింధృతిధురంధరుఁడై యొకఁడుండె నెమ్మదిన్.

గీ. ఆదిగర్భేశ్వరుండైన యవ్విభునకు, మారుపడి మేను బహుతరగ్లాని నొంది
కన్నుగూర్కెడునంత నగ్గహనభాగ, మేలుబేతాళుఁ డతిదుర్నిరీక్షుఁ డగుచు.

క. అనరపరిచార మమితం, బనుపమగాఢాంధకార మతిఘోరతరం
బనఁదగు మత్కాంతారముఁ, గననోపునె నుదుటఁ గన్ను గలవాఁడైనన్.

వ. అని యనేక రోషానలజ్వాలాభీల వికటీకృత భ్రుకుటీలతాకుటిల వదనుం డగుచు
నచ్చోటికిం గదసినతనిం గనుంగొని తదీయావయవంబులం గననగు సార్వభౌమము
ద్రికాముద్రితంబు లైన సాముద్రికంబుల నిరీక్షించి సకలశుభలక్షణక్షితుం డితం
డెవండో యని తనమనంబున వితర్కించుకొని స్వకీయానుచరులతో నిట్లనియె.

ఉ. ఈసుకుమార దేహుఁ డిపు డీవని నుండ నుపేక్ష చేసినం
గోసము వచ్చు మీకికని వోడ్కొనిపోయి చిత్నరత్నలో
భాసుర మైన యొక్క స్వామిపాదమ్యుగం బవళింపఁ జేసి సం
తోషము చెందవుండఁ గొనిరందు ప్రభాతము వచ్చునంతకున్. 199

వ. అతి నియోగించిన నంగీకరించి యతనిం గ్రహించుకొని తదీయపరిచారకు లాక్షణంబ శాంబరీ విడంబనంబునం గుకురు కరూశ కాశ్మీర మగధ మత్స్య మాళవ మహారాష్ట్రసౌరాష్ట్రాది బహువిధదేశంబు లవలోకించుచు నంతట నక్కళింగమహీమండలంబున. 200

కం. కట్టక మనఁదగు నొకానొక, పుటభేదన మహితమ్యూదయ పుటభేదనమై
కటకకలిత ధానధాన్యా, స్ఫటికరకర టీసవానిముల దనరారున్. 201

కం. అందు వెలుఁగొందు నయనా, నందం బగు రాచనగరు నముచిభిదుపలా
మందమరిద్యుందరుచిం, గ్రిందుకొనినసౌధ మొకటిఁ గని యాలోనన్. 202

చ. చికిలికిటికి పచ్చల రచించిన చిల్కలకోళ్ల నంద మా
నకినెలపట్టెమంచమున శయ్యపయి న్సుఖనిద్రఁ జెంది యిం
చుక తనుఁ దా నెఱుంగకను జొక్కెడు తన్నృపు నల్లుఁ డైన పెం
డ్లికొడుకు నేచి చూచి యవలీల మెయిం గడనుంచి యచ్చటన్. 203

గీ. లీల మణిమండపమున బవళింపఁజేసి, కడకడల నుండనంతఁ దత్కటక మేలు
చారుచంద్రమహారాజచంద్రతనయ, కూర్మి మెఱయఁ గళావతీకోమలాంగి. 204

కం. ఆరాత్రి పెండ్లి యగుట న, పారమహావిభవ మొప్ప బలవైరినిభుం
జేరుటకు నిజవయస్యా, ప్రేరిత యై మితము లేని శృంగారమునన్. 205

సీ. చలువ దువ్వలువకుచ్చెలయంచు ముత్తెము లపదనఖప్రభకు సలాము సేయ
అవికకట్టడపు బోరపుఁ నిగ్గుజంటీలు తనులతాద్యుతికిఁ గైదండ యొసఁగ
సొగసు నిద్దపుఁగమ్మ మగబాలధళధళ ల్ప్రబలాక్షిరుచికిఁ బరాకు చెప్పఁ
గమ్మనెత్తావి చొక్కటపుఁ గస్తురిబొట్టు శికురసందీప్తి కిచ్చుకము పలుక
రవళు మట్టెలసద్దు దుర్వారపావ, కటకనినదంబు మొలనూలు గంటరొదలు
నడచికొనలేని నడలతో నధిపుఁ డున్న, కేళిసౌధంబు గదిసె నక్కీరవాణి. 206

గీ. అపుడు తనవెంట వచ్చు వయస్యలెల్ల, నొక్కొకనెపంబున నె యొక్కరొక్కరరుగ
వమమతీంద్రు నిరీక్షించి మునుఁగుతోడ, నిదురవోవంగఁ జూచి యన్నీలవేణి. 207

కం. ప్రాణేశ్వరుండు కడుని, ద్రాణత నున్నాఁ డిదేమొ తనకన్నులకు
న్రాణింపనో యితనికి మగ, పోణిమియే లేదొ యనుచుఁ బొక్కుచు మదిలోన్. 208

ఉ. అండజయాన కాన్మనిభువండన యొక్క త్రివాళ్ల మీఁదఁ గ
న్పుంజి విపంచి మీటుకొనుచుండెను నంతట నవ్వసుంధరా
మండలనాథమౌళిమణిమండలుఁ డొయ్యన మేలుకాంచి యు
ద్దండత దండనుండెడు లతాలలితాంగి నొకింత చూచినన్.

ఉ. అగ్గజగామినీమణి ముఖాంబుజ మించుక వాంచి తమ్మిపూ
మొగ్గల నేలు పూపచను ముక్కులఁ బయ్యెదఁ జక్కఁ జేర్చుచున్
దిగ్గున లేచి నిల్చి యుపతీమకరాంకశుభావతారు స
మ్యగ్గుణహారు నానృపకుమారుఁ గనుంగొన నాతఁ డాత్మలోన్.

క. ఈరామామణి యెక్కడ, నీరత్నవిచిత్రసౌధ మెక్కడ నిటకేఁ
జేరుట యెక్కడనని యని, వారణను మహాద్భుతపరివర్తన మతియై

ఉ. ఈమదిరాక్షి నేలు విభుఁ డెవ్వఁడొకో నను జేరఁ గారణం
బేమియొ దైవమా యనిన నెంతని మెచ్చెదఁ జెల్లవాటిన
న్నామక భాగ్యమెట్లయిన మంచిది నేఁటికి దీనితో రతి
శ్రీమహనీయవైభవముఁ జెందెదనంచు వినిశ్చితాత్ముఁడై.

గీ. అలజగన్మోహనాంగి నొయారమెసఁగఁ, జూచి కనుదిట్టయగునట్టి రాచపట్టి
చెట్టపట్టి నిజాంకంబుఁ జేర్పఁ జూచు, నంతనయ్యింతి విభుతనుఁ ద్రాంతిఁ జేసి.

క. కుందనపు బిందియల నిర, వందిన పన్నీట జలక మార్చి జిలుఁగుల్
పొందుగ నమర్చి నృపనం, క్రందనునకుఁ గలపమలఁది కమ్మత్తి మెయిన్.

క. సారతరంబుగ మధురా, హారంబుల పానవాల నధికక్షుధార్తిం
దీర్చి వేగమె రాజను, మారున కాతరుణి యాకు మడుపు లొసఁగెన్.

గీ. సరసురాలైన యలచారుచంద్రితనయ, నెలమి కళలంటి యలరించి యలవరించి
ప్రౌఢతరబాహ్యసురతసంబంధములను, బారవశ్యంబు నొందించి పార్థివుండు.

సీ. పూవుగుత్తులవంటి పూపచన్నులు గోళ్ల నదిమినఁ గిచకొట్టు నట్టివేళ
మెఱుఁగనంటులవంటి చిఱుఁదొడ ల్పుడికిన నంగంబు పులకించునట్టివేళ
మృదుపల్లవమువంటి రదవాంశుకము పంటనంట నొక్కిన గెంటునట్టివేళఁ
బొన్నక్రొవ్విరివంటి పొక్కిలిగిలిగింత లలరింపఁ జిట్టాడునట్టివేళ
నధరనీయక యక్కునదిమి చెక్కు, చిదిమి నెమ్మోము మోమునఁ జేర్చి బుజ్జ
గించి యుపలాలనారతిక్రీడవలనఁ, మగువ నలరించె నా రాజమన్మథుండు.

క. అంత నవరసికుఁడగున, క్కాంతుని మన్ననలవలన గతిఁదేలి నెసం
గాంతామణి తనమదిలో, నెంతయుఁ గనవోని వలపు హెచ్చినకతనన్.

ఉ. చెక్కిలి నొక్కిన న్మగుడఁ జెక్కిలి నొక్కు రదచ్ఛదాప్తిఁ బ
ల్నొక్కు చుఱుక్కునన్ సొనఁగనుంగొనుఁ గ్రూరకటాక్షదీప్తిఁ జే
రకున్నఁ జేర్చి గుబ్బచనులంటఁ గవుంగిట నెత్తునప్పుడా
చక్కెరబొమ్మ మార్మలయు చైవ్రులకు న్విభుఁడుల్లసిల్లుచున్. 219

సీ. కొఱికిన మధుపుటాకులు మోవి కందిచ్చి యధరాధరము పంటనంటనొక్కి
కిచకొట్ట బకదారి కిచకిచ ల్పేచిఁ గుల్కి కుదురుగుబ్బ లురంబుఁ గదియఁ జేర్చి
యతులితోత్కంఠఁ గంఠాశ్లేష మొనరించి బహుబంధసురతసంభ్రమముఁ జూపి
పారవశ్యసుఖానుభవసంపదలఁ దేల్చి యుపచారములఁ గొంత యుబుసుపుచ్చి
వలచివలపించి జీవితేశ్వరునికేళి, మెచ్చి మెప్పింపఁ జాలి యమ్మీననయన 220
యండఁ బాయనిచో మనేమండనుండు, వెసఁబువారతరరతిసౌఖ్యవిభవుఁడైన.

చ. పులిపులియయ్యె నంగలత పొక్కె సుధాధరబింబ మింతికి
న్నలినలి యయ్యెఁ గౌను జఘనస్థల మెల్లను నజ్జునజ్జునై
గులగులయయ్యెఁ గబ్బిచనుగుబ్బలు ముద్దుమొగంబు వాడెఁ గెం
దలిరుకటారివాని జెడిదంపు దురంబు విభుం డొనర్పఁగన్. 221

గీ. రసికశేఖరుఁ డారాజు రాజవదన, కందికుందిన నెమ్మోముకళలెఱింగి
కడుఁ బ్రియ మెలర్పఁ గౌఁగిట నిడుముకొని సు, ఖానుభవలీలఁ బవళించె నంబుజాక్షి. 222

ఉ. అత్తఱినత్తలోదరి రతాంతపరిశ్రమ మొందెఁ గావునం
జిత్తజువంటి నాయకుని చెక్కునఁ జెక్కు నురస్థలంబునం
గుత్తములైన గబ్బిచను గుబ్బలుఁ గంఠమునం గరాబ్జముల్
హత్తుకొనంగఁ జేసి చెలువార వెన న్నిదురించె నంతటన్. 223

క. తెలతెలవాఱుటఁ గని ని, స్తులధృతి జేతాళిభటులు తొలుతటి మగనిం
జెలిపక్క నునిచి సాధ్రి, ట్కులమణి మణిమండలేంద్రుఁ గొని చని రబలా. 224

క. అని తెల్పునెడఁ బ్రభాతం, బెనయుట రవిరథతురంగహేషారవమో
యనఁ బక్షిరవము సెలఁగె, న్వనిచింతాక్రాంత యగుచు వెననిలు సేరెన్ 225

క. ఆకాంతామణి కుముద, వ్యాకోచం బెనఁగు వేళ నలనాఁడు ధరి
త్రీకాంతుఁ జేరనరుగుట, కేకమతిం జిలుకఁ జేరి యిట్లనిపలికెన్. 226

ఉ. ఓమకరందబిందునికరోపమరమ్యసుగంధమాధురీ
శ్రీమృదువాణి కీరకులశేఖర యల్లకళింగరాజక
న్యామణివార్త యే తెఱఁగున న్వినవయ్యెను దన్మనోవిభుం
డేమి యొనర్చెనో యొచటి కేగెనొకో మణిమండనుం డొగిన్. 227

క. అనిపల్కఁ జిల్కపోరి యి, ట్లనియెం బళి మేలు జాణవౌదు వటంచున్
వనితారత్నంబునకా, వనితామణిముందనుండు వడి నేఁగుటయున్. 228

గీ. మెల్లనె కళావతీసతి మేలుకాంచి, పక్కి వేఁటొక్క మగఁ డున్న బాగుఁ దెలిసి
యక్క యిది యేమి చోద్యమో యనుచు మిట్టి, పడక కావికయై యొందుకపకుఁ జేరి. 229

క. పువ్వారుబోణి మదిలో, నెవ్వెఱపడి చూచుచుండ నృపుఁ డువవడమై
జవ్వాడులతిక యో యన, నవ్వేలఁది వడంకఁ జూచి యతఁ డిట్లనియెన్. 230

క. మదనాగయాన మగతు, మ్మెదయంటిన కమ్మదమ్మి మెఱుపుగలిగియు
న్నది నీముఖాంబుజంబిది, కొదవగదా క్రొత్తపెంపుఁ గూఁతున కనుచున్ 231

సీ. చికిలి చందురుకావి చిగురాకునను మోవి నంటిన మొనపంటి గంటుఁ జూచి
నెరికురుల్చెదరి క్రొవ్విరిసరుల్వసివాడ నొప్పు దప్పిన గొప్ప కొప్పుఁ జూచి
వలిచన్నుఁగవ యిక్కువల మిక్కుటంబులై గుడిగొన్న నెలవంక గుంపుఁ జూచి
తెలివాలుగల వాలుగలపోఁగకనుదోయి నింపుగుత్కేఁడు నిద్రమంపుఁ జూచి
యిదినదాచారమే రాజసదన మిదియె, యిదికులాంగనయే యంచు మది నొకింతి
సందియముఁ బొంద నారాచచందమాను, యాగ్రహోదగ్రవిగ్రహం బగుచు ననియె. 232

గీ. నీజనని పుణ్యజనవర్ణనీయసాధ్వి, నీజనకుఁ డెన్న నభిమాననీయతిధనుఁడు
నీనగరు ఘోటకీఁగకు నిలువరాని, పయ్యెవెల్లాటకత్తె వీవౌట యరిది. 233

శా. నీజాడల్గని యోర్చుకోఁ దగునటే నీలాహివేణీ మహా
రాజస్త్రీజన మీవగల్పినిన నౌరా యంచు నిన్నెత్తురే
యేజాతిన్ని నువంటి దంట గలదే యిద్ధాత్రిలో నంచు వి
భ్రాజన్మానధురంధరుండు నృపుఁ డుగ్రవ్యగ్రరోషాత్ముఁడై. 234

క. ఉఱుచవగ చిక్కటారిం, బరికింపక గొంతుచిదుము పనిఁ దలఁచి నరే
శ్వరచంద్రుఁ డాతలోదరి, కుర లొయ్యన నొడిసి పట్టుకొనియె లతాంగీ. 235

గీ. అప్పుడాబారి గడతేఱనగు ప్రియత్న, మెట్లు చింతింపవలయు రాకేందువదన
యదుగు దప్పినచోఁ దప్పుఁ బిడుగటంచు, నొద్దువ మును వినదువే కద పుడమిలోన. 236

చ. అన విని మందహాసరుచిరాస్య ప్రభావతిపల్కె నీనగ
ల్లవి విని యున్నవారి నడుగందగు నోశుకసార్వభౌమ యే
మనఁగలదాన నీవ కలయర్థముఁ దెల్పుమ టన్నఁ గీర ని
ట్లను నలభూభుజంగవరు నంగన యప్పు డవార్యధైర్యయై. 237

క. విను మీకుప్రసూనశరుఁ డ్రిమ్మర్తె, విదళింపక బలిమి నొడిసి విభురికదాసిం
గుముసునాళిగుబ్బచన్నుల, నమమున నొంచ నేర్చె తెంపునఁ బ్రాణులతోఁ డిన్. 238
గీ. స్మరకుఠేంద్రుఁడు వెఱఁగంది నెలఁతకేలి, నాలు కడఁ బాఱపైచి యాననలుగంటి
గోల విటుఁడంటిలెకవ నీకేలయనుచు, నెతికురులు చక్కముడిచి కన్నీరుఁదుడిచె. 239
ఉ. లాలనమాచరించి వనజాననఁ గన్నెపుత్రోడఁ బల్కు దే
తాళుచిబోలు నొక్క పెనుదయ్యము నన్ను గ్రసించి పట్టి యా
వీలతనింతచేసి వెలిపించిరనె న్నిఁక నూఁబల్కరింప వా
గ్జాలతి నాలదయ్యెఁ గలగంటినొ నెవ్వెఱఁ జెంది యుంటినో. 240
క. నీవే నెఱుకోలదొంగవ్రతి, సేవగదీ సోఁకుఁబడుచు నేఁడు వొడంబా
స్వ్వీవేగఁ దత్ప్రతిక్రియఁ, గావింపక యున్న నెట్లు కడచెదవనినన్. 241
గీ. అట్టు లగానిఁ జేద్రోష మునిసియుండ, నవయకరి మంత్రతంత్రము లాచరించి
రాజబింబాస్యఁ గూడి యారాజశేఖ, రుండు లవహిండె నోకంబుకంఠి యనిన 242
చ. విని వెఱఁగంది కీర్తికథ వింటిని నేఁడిది చిత్రమంచు నె
మ్మనమున మెచ్చునంత రవిమండల మయ్యెడ యాఁదిఁ జెందినఁ
గని కనుదమ్ములన్ నిదుర గ్రమ్మఁ గరా నిలు నేరి శ్రీనిన
వ్వనరుహగంధ సంజకడవచ్చి శుకాగ్రణి చెంతనిల్చినన్. 243
క. మదిరాక్షి యేతత్కథ, కొదవయగుట తగదు కడమ గూడఁ బలికెద
న్నదమున విని పొమ్మనియు, న్మదవతి సామాగ్రిణి పలికె మధురతరోక్తిన్. 244
క. మణిమండనవిభునెత్తో, మణిచండవిభు న్విభాసమానైకవనాం
గణమున నిడి యవ్వీరా, గ్రణులాశుభవార్త యేలికకుఁ దెలుపుటయున్. 245
గీ. అతఁ డతని స్థైర్యచర్యాపహాయశౌర్య, బహువిధగుణంబు లెంతయుఁ బ్రస్తుతించి
సంధి యొనరించి యమ్మహోనార్వభౌము, ననునయించుట తనకార్యమని తలంచి. 246
సీ. జనభయంకరసరోషజ్వాలికాధగద్ధగదుగ్రనచుల నెమ్మొగము వెలుఁగ
సకలపిశాచశితోరక్షణాక్షీణకౌక్షేయకము భుజాగ్రమునఁ దనర
శాకినీఢాకినీలోకలోకాతీతబలపరంపర కెలంకులను నడువ
మనుజకోటికరోటిమాలికాభసితచర్మాంబరంబులు మేన దంబు సూపఁ
గోరమీసలు మిడిగ్రుడ్లుఁ గుటిలతరక, రాలదంష్ట్రాయుగంబు నుత్తాలబాహుజ
టాలజాలంబు నెరయ బేతాళుఁ డప్పుడు, నిలిచె నాభూవిభునిమ్రోల నలఘులీల. 247
ఉ. అంతకుమున్న యన్నరవరాగ్రణి మేల్కని విస్మయోదయ
స్వాంత మెలర్పఁ గన్నుల వెసం బొడసూపు మహాపత్రాపుఁ డీ

యుంగకె పోవుఁ డతఁ డెవఁ డంచు మనంబున నెంచునంత న
ష్వాంత వసించి యన్మహీవిభు స్వినయోక్తుల నాతఁ డి ట్లనున్ 248

తే. బేతాళనాయకుఁడనో, భూతలవల్లభ మహాప్రభుత్వము గలని
న్నితజేఁ గనుఁగొనుటకుఁ జేరి, మాతిశయతి వచ్చినాఁడ ననిన సుముఖుఁడై. 249

వ. యథోచితప్రత్యుత్థానాభిగమనంబు లాచరించి కుశలం బడిగి సుఖం బున్న యనర్ఘ
తరంబయష్ఠరత్రిపాలునకు బేతాళుం డిట్లనియె. 250

ఉ. ఓచతురాగ్రిగణ్య భువి నున్న నరేంద్రులలో భవన్నిభుం
డీచతురబ్ధివేష్టితమహి న్నహి యంచు జను ల్నుతింప నీ
యాచరణం బెఱుంగక మహాగహనాంగణభూమి నొంటివై
నేది చరింప నీతి యగునే తగునే యిటువంటి కృత్యముల్. 251

సీ. అన్యరాజన్యరాజ్యస్థితుం డగువేళ సరికొర ల్లంఘింప దొరయువేళఁ
చౌరులు కనఁ బయాల్పచరింపఁ జనువేళ నారామములఁ గేళిసలుపువేళ
నధగున దుర్గము ల్సాధింపఁ జనువేళ వైరిభూభుజు లెత్తి వచ్చువేళ
గుఱు తెఱుంగనిజను ల్గొల్వవచ్చినవేళ మృగయావినోదాప్తి మెలఁగువేళ
మండలేశ్వరుఁ డుద్దండదండనాథ, చండభటవీరసామంతమండలంబు
లండనుండక వెన నొంటి నుండెనేని, గొదవ యగునంచు నీతికోవిదులు తలఁప. 25

గీ. మత్తకరిపండ చెరయైన మావటీఁడు, బుద్ధిరెుఱుఁగని కొమరుని పొంతదాది
యతులగర్వాంధుఁ డగురాజునండ నాప్తు, మంత్రి యొకవేళ నైననేమఱఁ దరంబె. 2

క. బల మనఁగ నృపునిదేహము, బలమునకు న్నుపవయుండు ప్రాణం బగుటం
బలమును నృపుఁడును ధాత్రి, తలనాయక ఖేవ మనఁగఁ దగునే జగతిన్. 25

చ. అనుపమ ధైర్యశౌర్యనిధి యానృపుఁ డైనను జైత్రయాత్రగాఁ
జనునెడ దోఃప్రతాపబలసంఘములం ఘను లౌనిజాప్తులం
జనువుఘటిల్ల గొల్లుదున్నగఁ గులాగతనీతిమార్గవ
ర్తను లగుపెద్దల న్నగరిదండఁ బ్రచండత నుంచఁగాఁ దగున్. 255

వ. అదియునుం గాక దినదినప్రవర్థమానుం డగుభూనాథుండు ధారుణీతలంబు నిర్వై
రమండలంబును నిశ్శేషజారచోరంబును నిబిడీకృతగ్రామకూపతటాకకుల్యారామం
బును గావించి సన్మంత్రి మంత్రాలోచనంబునఁ బ్రవీణుండై యేకాతపత్రప్రభా
వంబుఁ గాంచి ద్వివిధవినోదశిక్షాదక్షుండయి కీర్తియాలవాలుం డగుచుఁ జతుర
పాయసామర్థ్యంబునుం గలిగి పంచతంత్రిబుల మర్మంబు లెఱింగి షడ్గుణైశ్వర్యధు

య్యుండన వెలసి సప్తవ్యసనంబుల వర్జించి యష్టభోగంబులకుం దగిన నవనిధానంబుల భాండాగారంబులు నియమించి పదిం బదియుఁగా రాజ్యపరిపాలనంబు సేయునతండు పార్థివరత్నం బగుఁ గావున నీ వేతద్విధంబునం బ్రవర్తిల్లు మని మఱియు ని ట్లనియె. 256

చ. ఇది మొదలింక నెందయిన ని ట్లొకరుండవుఁ బోకు పోయిన
న్మదనమనోహరాంగ మణిమండన నీగురువాని యంచుఁ బ్రే
మ యొరల విన్నవించి నృపుమన్నన గాంచి యతండు వోవ న
య్యువనునఁ బ్రాగ్వియోగబలమున్విభునిం గని చేరి మ్రొక్కినన్.

క. అంతటఁ గృపార్ద్రవీక్ష, మందరుచిం గప్పకొని యమానుషమహిమం
జెంది ముదమంది రాజపు, రందరుఁ డతఁ డూరు సేరె రాజీవముఖీ.

గీ. అని శుకాధ్యక్షుఁ డీరీతి నద్భుతైక, గాథ వివరింప నంతలోఁ గమలబంధుఁ
డుదయపర్వతశిఖరాప్తిఁ బొదల నంతి, పురవరంబున కరిగె నప్పువ్వుబోఁడి.

## మూఁడవకథ.

చ. అలయలినీలవేణి విరహాతురయై మఱునాఁటిరాత్రి రా
చిలుకపటాణి నెక్కొడి వజీరునిఁ బోలిన యానృపాలునిం
గలయఁ దలంచి మేన నయగారము గీల్కొనఁ జేసి చేరె ని
ర్మలగుణశాలి యైన శుకమండలమౌళిసమీపభూమికిన్. 260

గీ. అప్పు డారాజకీర మి ట్లనుచుఁ బలికె, మగువ మగవానిమేలు నమ్మంగఁ దగదు
మది నొకానొక యెడ రోష మొదవె నేని, నేర్పుగలదూతి యొకరీతిఁ దేర్పవలయు 261

క. పతి సేవగించుసతికి, న్నతి నొల్లనిపతికి బద్ధసఖ్యము గలుగ
న్మతి నిర్వహించి కూర్చిన, చతురిక యగు మాతికాప్రసంగము వినవా. 262

వ. అని యిట్లనియె. 263

గీ. అభ్రచుంబితమణిగణాదభ్రవప్ర, మై విజయభవన మనుపే రవనిఁ గలదు
ములికివాఁడను సీమఁ గోమలులచూపు, ములికి నాటిన మరుఁడు దా మూర్ఛనొంద 264

క. ఆరాజధాని వెలయు న, దారుం డనురాజు ప్రోవఁ దన్నృపుచెంతం
/ధీరుఁడు తన ముక్కాకలఁ, దేజిన దళవాయి యొకఁ డతిస్థిరబలుఁడై. 265

మ. పతికిం బ్రాణపదంబు బంధులకు నాకల్పప్రకాండం బన
ల్పితశౌర్యాబ్ధికిఁ గ్రేవ రాహుతులకు న్స్వామ్యానయై శత్రు సం

తతి నెంతేఁ బెగటార్చి తన్మదమహోద్దండైక వేదండచం
డతురంగంబుల నెల్ల వస్తువులు దండన్నిల్పు నాభర్తకున్. 266

గీ. భీమబలశాలి దృఢవర్మనాముఁ డైన, ఘనుఁ డతండు నిజస్వామి కనుపమమ
రాజపరమేశ్వరాష్టదిగ్రాజకులవ, రోభయంకరబిరుదైక వైభవంబు. 267

క. ఇత్తెఱఁగున బహుమహిమో, దాత్తప్రాక్రమము మెఱయఁ దగు నాతనికిన్
మత్తరిపుదమనశౌర్యా, యత్తుం డొకకొమరుఁ డలరు నతినిపుణుండై. 268

చ. చదువులమేలు సాముపని చక్కదనంబు తెఱంగు సంపదం
బొదవెడు మేలిమిన్ బేర్మిగల భూరిభుజాబలశౌర్యధైర్యము
ల్పదయత యున్వివేకనరసస్థితు లాకృతిఁ జెందె నో యన
న్మదనమనోహరుండు సుకుమారవరుం డతఁ డొప్పు నప్పురిన్. 269

గీ. అతని కేలిక యైన యయ్యుజని భర్త, కూర్మికొమరున కొనరించుగో మొసర్పఁ
దల్లిదండ్రులు లోచనోత్సవము నొంద, నవ్విభుం డొప్పు జయకేతనాహ్వయమున. 2

వ. వెండియు నమ్మహాప్రభుకుమారుండు. 27

సీ. ఒకవేళ యవనచోళకళింగశకవంగ గూర్జరు ల్గొలువంగఁ గొలువొసంగు
నొకవేళ విగళన్మదోద్దండవేదండవాహుపరంపర నెక్కి యాడఁ దివురు
నొకవేళ దండనాయకచమూనాయకుల్ ప్రాళిమై నడువ వాహ్యాళి వెడలు
నొకవేళ రిపునృపాలకజాలసాలదుర్గమదుర్గవారణైకశౌర్య మరయు
మఱియు నొకవేళ ధీరసామంతమంత్రి, పుంగవులతోడ విభునిసమ్ముఖము చేరి
తెలుపఁదగువార్తలన్నియుఁ దెలియఁజేయు, ననఘగుణశీలుఁడా బాలుఁడహరహంబు

క. కంతునిభరూపరేఖా, వంతుఁ డతం డిట్లు మెలఁగ వనితాజనతా
స్వాంతమనోహరకరమై, యంతట యౌవనము దోఁచె నవ్విభుమేనన్. 2

ఉ. ఔర విలోచనాంబుజము లద్దిర ముద్దులనెమ్మొగంబు సిం
గారము బాపురే బవరిగడ్డము మేలు నురస్థలోరు వి
స్తారము చాఁగురే యెగుభుజంబులపొంక మటంచుఁ బ్రేమ చే
ర్పారఁగ నార లెల్ల నయంబుఁ గనుంగొని సంతసింపఁగన్. 2

గీ. వానిఁ దనివారఁ జూడనివనజగంధి, చూచి తలయూఁచి మెచ్చని సురుచిరాంగి
మెచ్చి విరహార్తి నొందని మీననయన, గలుగ దొకతైన నవ్వీటిచెలులలోన. 2

క. ఈలీల నతఁడు వర్తిల, బాలిం దన్నృపతిమౌళి పరిణయకార్య
శ్రీలలితుని జేయుట కిది, వేళ యితని కగు నటంచు వెనఁ దలఁచుటయున్. 27

గీ. అతని జననీజనకు లప్డు డంతరంగ, మున మహోత్సాహమునఁ బొంగి యనుపమాన
మానసంపత్కులాభిజాత్యానుకూల, మమరు నరిమన్నెవారిలయిం డ్లరసి యరసి. 275
క. లావణ్య మంగరేఖ యు, శ్రీవిలసల్లక్షణంబు శృంగారకలా
ప్రావీణ్యంబును గలకుల, పావనయగు నొక్కకన్యఁ బరికించుటయున్. 276
చ. అల జయకేతనుండు రుచిరాంగతిరస్కృతమీనకేతనుం
డెలమి మదిం దలిర్ప దయ నేలికయుం దలిదండ్రు లయ్యెడం
దలఁచిన కార్యభాగ ముచితజ్ఞులచే విని నీతికార్యవ
ర్తులగు నియోగిపుంగవులతోడ రహస్య మొనర్చి యిట్లనున్. 277
ఉ. ఎక్కడిజోలి పెండ్లియగు టెట్లు సదుఃఖతరాజవంజవం
బక్కజ మేసహింపఁగలవా లలనం గలనైనఁ జూడఁ దా
దృక్కుఫలాలకించి విను టెన్నఁడు లేదిది మీ రెఱుంగరే
యక్కట భామినీజనవిహారరతి మానధురీణుఁ డొప్పునే. 278
సీ. కాలకూట జ్వాలఁ గబళింప నగుఁగాని యలివలతోడ మాటాడనగునె
పులులమీసముల నుయ్యాలలూఁగ నగుఁగాని వారిజాక్షుల చెంతఁ జేరనగునె
దంభోళిహతిసముద్ధతి కోర్వనగుఁ గాని లేమలపల్కు లాలింప నగునె
బడబాగ్నిఁ బికిలిఁటు నొడియంగ నగుఁ గాని కుసుమగంధులపొందుఁ గోరనగునె
కటకటా మూర్ఖమర్కటకరితలస్థ, కల్పతరుసూనమాలికాకల్పుఁ డగుచు
సరసుఁ డగుమర్త్యుఁ డంగవాజనమహోగ్ర, ఘోరసంసారవిషధిలోఁ గూలనగునె. 279
క. అని విజనాడఁగ వాతనిఁ, గనుఁగొని యోనృపకుమారకంఠీరవ యే
యనువున నొనరింతువు నీ, మన మరల నటంచు మంత్రిమణు లవ్వేళన్. 280
సీ. గార్హస్థ్య మిందిరాకాంతాకటాక్షవీక్షణలబ్ధికిఁ బ్రధానకారణంబు
సంసార మర్థార్థిజనమనస్సంతాపకార్పణ్యము లడంపఁ గల్పశాఖి
దాంపత్య మతిశుభ్రతరజగత్పరిపూర్ణవరకీర్తిజాలతి కాలవాలభూమి
యాజవంజవము దివ్యైకలోకానీకపథము నందించుసోపానరేఖ
ఘనతరకుటుంబ మఖిలోపకారకంబు, గాన సుచరిత్రయగుకన్యకను వరించి 281
మానవిఖ్యాతిలాభసంపన్నుఁ డగుట, యెంతయును నొప్పు నట్లుగా దేని హాని.
గీ. హరిహరహిరణ్యగర్భాదు లగుమహాత్ము, లెల్ల నెప్పుడు సంసార మిచ్ఛగించి
పుత్రపౌత్రపరంపరాభ్యుదయవంతు, లగు టెఱుంగవె యేకవిరాగ్రిగణ్య. 282
వ. అని యనేకప్రకారంబులం బచరించిన నమ్మనీషివరుల విశేషవచనంబు లంగీకరిం
పక దురంతచింతాపరతంత్రస్వాంతంబునం గొంతతడవు విచారించి యంతఃపురం

క. తనతండ్రి యున్నయెడకుం, జనితద్వృత్తాంత మంత చతురతరోక్తిం
గనినట్లు తెలుప విని యా, వనపాలకుఁ డద్భుతైకవశమానసుఁడై. 294

ఉ. ఎచ్చట నుండునో మొదల నెవ్వఁడొ యెవ్వరివాఁడొ యేమ నేఁ
డిచ్చటి కేగుదేరఁగత మెయ్యదియో యనితత్కథాక్రమం
బిచ్చ జనింపఁ బాండ్యజగతీశ్వరు నీశ్వరసన్నిభున్ సము
ద్యచ్చతురాస్యుఁ గాంచి వినయంబునఁ దద్విధ మెల్లఁ జెప్పినన్. 295

గీ. ధన్యుఁ డారాజలోకమూర్ధన్యుఁ డతని, సూనుఁడైనట్టి విభవప్రతాపములకు
నాత్మ మెచ్చి తదాలోకనాభిలాష, నప్పు డుద్యానవనపాట కరుగునంత. 296

చ. మితపరివారుఁడై రణసమిద్ధభుజుండు జయధ్వజుండు ప
త్తితిపతిపాళి సమ్ముఖముఁ జేరి విధేయత మ్రొక్కి నిల్చినన్
న్నతిఁ గుతుకం బెలర్ప వనమాలసత్కుసుమాసనస్పృహా
జతతి యెడ న్వసించి సరసస్థితి నాతని కాతఁ డిట్లనన్. 297

క. ఓయన్న నిను మనంబున, భావింపఁగ సార్వభౌమపర్యాయశుభ
శ్రీవిభవము గనవచ్చెడు, నీ వెవ్వరివాఁడవయ్య నృపకులతిలకా. 298

ఉ. నీపరిణద్ధకంధరయు నీదువిశాలవిలోచనంబులు
న్నీపటుదీర్ఘబాహువులు నీవిపులోరువాటవక్షమున్
బాపురె సర్వభూవలయపాలనముం గణించి మెంచఁగా
నోపుదు మన్న వేల యిటు లొంటిఁ జరించెద వంచుఁ బల్కినన్. 299

గీ. అప్పు డారాజసుకేతనుం డతనితోడఁ, దనకులాచారగోత్రసూత్రములు నొడివి
ప్రేమఁ దనతల్లిదండ్రులు పెంచినేతు, మనఁగ విని యొల్లకేవచ్చె నవనినాథ. 300

చ. అవని పాండ్యమండలమహాప్రభుఁ దల్లన నవ్వి యోసుధీ
జనవర పెంపెసంగుమనజాడ్యమహత్తులఁ గలరే జగంబునన్
విన నిది వింత యింతు లొకవేళ నిమిత్తము గల్గియున్న నె
మ్మనమున నంశయింపక క్రమంబున నాకెఱుఁగంగఁ జెప్పుమా. 301

వ. అని యడిగిన నప్పాండ్యమహీమండలేశ్వరున కప్పుణ్యచరిత్రుం డిట్లనియె. 302

గీ. విను పరాకింతలేక నా విన్నపంబు, ప్రాగ్భవమున నే నొక్క భువనమోహ
నామృతసరోవరంబులో నధివసించి, రాజహంసంబనై యుంటి రాజచంద్ర. 303

క. అప్పుడు మత్కులకామిని, తప్పని ప్రేమం బతివ్రతారత్నమున
న్నెప్పుడెడ సవక కంటికి, ఱెప్పవలెం గాచి తిరుగు రేలుం బవలున్. 304

వ. అదియునుం గాక. ౩౦౫

సీ. ఆఁకలి గొనునప్డు ద్రాక్షారామములలో నూటికొక్కటిగ తెచ్చి నోటి కొసఁగు
గమనింపుమత్తేభకుంభగమనశ్వంగారాప్తి నంబు వాయక వెంటవెంట నెయిదు
నునుసుగోననివేళ సల్లోల కల్లోల డోలికామాలికాకేళిఁ దేల్చు
బడలియుండినవేళ నొడలితాపము దీఱ పలి రెక్కఁసురటిగా ద్వలవరించు
ముచ్చటలు దెల్పు రతికేళి కెచ్చరించు, సన్నదెలిసి విలాసపరిపన్న వదన
యగుచు వర్తించు నేను నావెంట జరింతు, ఎనిట మదికింపు దొలఁక భావజ్ఞతిలక. 306

గీ. ఇట్లు వర్తింపుచున్నచో నెలమి నన్నుఁ, గొలిచి విహరించు రాయంచ బలఁగ మెల్ల
గెలన నొకపైఁడి నెత్తమ్మికొలను జూచి, నొప్పనని తెల్పఁ దద్వీక్షణోత్సుకమున. ౩౦౭

మ. చని యద్దివ్యసరోవరంబున యథేచ్ఛాలీల వర్తించు హం
సనికాయంబులతోడఁ గొంతతడ వంచల్లీల వర్తించి త
త్కనకాంభోరుహవిభ్రమద్భ్రమరఝుంకారధ్వనిం దత్తటీ
వనవాటీవిహారద్విచిత్రవిహగవ్యాహృతి నీక్షించుచున్. ౩౦౮

గీ. మఱియు నచ్చోట విహరించు తఱిని మంద, మందగంధవహాప్తి పై మఱచియుండు
నంతవను నెచ్చరింపక యరిగె బంధు, తతి మనంబున నిల్లాండ్రఁ దలఁచికొనుచు. 309

ఉ. అంతట నాళకుంతలబలమ్మ్వరటాతతిఁ జేరి మోహసం
క్రాంతత నంబుజోత్పలకులాయముల న్విహరింపఁ జూచి వి
భ్రాంతత నొంది మత్ప్రియుఁడు రానిలెఱుం గిది యేమొ యంచు మ
త్కాంతమనం గనుంగొనని తాపమున న్విరహాబ్ధి మగ్నయై. 310

గీ. అమ్మ నేఁ జెల్ల; నెవతెయో యసలనొక్క, కొమ్మ నాప్రాణవిభు నేలుకొనియె నే నెఁ
కాకయుండిన నసుఁజేరరాక యున్నె, యని ప్రలాపించి కనుమూసె నాక్షణంబ. 311

క. ఈవార్తలు సవసవగా, నేవిని చారిణేశ్వరీ యిదే నను నొంటిం
బోవిడిచి చనుట తగదని, భావించి వియోగవహ్ని పరితప్తుఁడనై 312

గీ. నాఁటి యలహంసజన్మంబు పీటిఁబుచ్చి, మగుడ మానుషవేషసంభవుఁడనైన
నేఁటికిని పద్మఘాటిపై నెనరువాయ, నైతి నిఁక నేమనందుఁ బాంధ్యక్షితీంద్ర. 313

ఉ. కావున నాఁడు నేఁ డితరకాంతల నేరిఁ బరిగ్రహింపనో
భూవర యంచుఁ దెల్ప నృపపుంగవుఁ డౌ నని మెచ్చి బంధుసం
భావితలీల నాఘనుని భావ మలర్చి విశేషవస్తుసం
భావన లెల్ల నిచ్చి యలుపాలొనరించి పురంబుఁ జేరినన్. 314

గీ. అవిభుండు ప్రియోపనదార్థవుఁ గనుచు, నెలవులఁగని నియమోర్మిలఁ జెలఁగి వలవ
నప్పరాగోపహారావళికార్థినోపాఁ, జేసి కార్యపరివర్తనోల్లాస మెసఁగ. 325

సీ. నేల బీరకయుండఁ గేలఁ గుచ్చెలఁ బూనుకొని యూడిగపుసతు ల్గొలిచి నడువ
మడిమెత్తు పర్వతోమంత్రిక్షతము ఁయఁ బాల్పడి భూసురభార్య లెదుర
నొక్కొక్కరీలారఁగుపై ననిచి యేకాంతంబుఁ జెలపుమఁ గూరిమి నెచ్చెలులు సనఁగ
జయకేతనునివార్త సాంగవిచారించివచ్చి పట్టుగడకత్తె లెచ్చరింప
సొంపుతోఁ బౌరకామినుల్గుంపు గూడి, యనుమయిదిగాక సౌభాగ్యమనుచు మెచ్చ
నప్పు డుద్యానవనవాటి కప్పఘూటి, నెలమిఁ దోతెచ్చి యాచెంత నిలుచుటంత. 326

చ. పిలపిల వాజయోద్ధ్వజుని పెద్ద లెరుంగ్కొని రాకురాకఁగో
యళికచలార భీతహరిణాయతనేత్రిల మల్పరిభుండు వా
వలనను జూడ నోడునసుగార్తి పచించిన మందహాసకం
దళవనం బెలర్పఁగ మదం బలరె నన్నుముపాణి యిట్లనన్. 327

క. మునుమున్న తదరిహాస్యము, విని యున్నదిగానఁ బాక్షన్మ్రుత్తి నలసుధ
జనములతో నను గాంతా, జనరత్నము మధురరసపచస్స్ఫుటఫణితిన్. 328

ఉ. ఈయెలదోఁట నుండఁదగ దింకొకచక్కి వసింపనేగుఁడో
ధీయుతులార! పాండ్యనరదేవతనూభవకేళికా గృహ
ప్రాయత నిందు నెప్డు విరహాయము నవ్విహరించుచుండు నే
డాయెలనాఁగ గుర్తుమ్రుపట్కై యదె వచ్చెఁ దలంగుఁ డిత్తఱిన్. 329

గీ. ఇంతమాత్రింబెకాదు పూర్ణేందుముఖులు, సమ్ముఖంబునఁ గార్యపరిసంగవశతఁ
బెండ్లియనుమాటఁ బేర్కొన్నఁ బెనిమిటనిన, మిట్టిమీనై యదల్చు నమ్మినయన. 330

క. ఇది యేమినిమిత్తమొ యని, మదిలెంచితి రేనిఁ దత్క్రమంబంతయు నీ
యదన వివరింతు వినుఁడిం, పౌదవం దొల్లింటిజన్మ మొదవినవేళన్. 331

ఉ. తానొక హంసియై సరసతన్నిజవల్లభుఁ డుల్లసిల్లఁ జి
త్తానుగుణోన్నతి నెమ్మలఁగు నంతటిలో నొకనాఁడు చెంత నిం
పైనసరోవరంబుఁ గని యచ్చటికేగి విభుండు నిర్నిరో
ధానుపమానసౌఖ్యవిభవాప్తి మెయి న్విహరాక చిక్కినన్. 332

క. మగఁ డేల రాఁడొ యెండొక, మగువం దగులుకొని నన్ను మఱచెనొకొ మనం
బగలెడునని దిగులొందుచుఁ, బెగడం బ్రాణములు విడిచె దీనాననయై. 333

ఉ. వావిరినప్పతత్త్రికులవార్ధిసుధాకరరేఖ యీధరి
త్రీవరకన్యయై యవతరించి విభుం డొనరించి నయ్యుపే

ఈ విధ మెచ్చుచున్న దని సారె పఠించిన మంత్రులున్నతం
బై వెలయం జయధ్వజున కత్తఱిఁ గెల్ల నెఱుంగఁ జెప్పినన్. 334
క. వినినంతఁ జెన్ని ధావముఁ, గనుఁగొన్న దరిద్రుఁబోలి ఘనుఁడా జయకే
తనుఁ డలతిలోదరీమణి, తనసొమ్మని తలఁచి యతులితత్వరమతియై. 335
గీ. సముదాశ్చర్యమోహముల్ సందడింప, నద్దపిడి లేచివచ్చి యమ్ముద్దుగుమ్మ
యెద్దియెద్ది యటంచు నయ్యిందుబోణి, లలరఁ జని పాండ్యనృపకన్య యండఁ గదిసి. 336
చ. నినునెడఁబాయఁ జాలఁ దరుణీమణి నీయనివార్యవిభ్రమం
బనిమిషులందునైనఁ గలదా యని దాయని మోహి నెంచి న
న్మనసిజబాధఁ గోర్వఁ దరమా యని మాయని మోహదాహమే
యనువున దీర్చువాఁడ నహహా యని హాయని చేరి మ్రొక్కెనన్. 337
క. వనితాలలామ లజ్జా, వినమన్ముఖకమల తంబ్రిపీణత లేవిన్
గని రాజపుత్రి యనియెం, గనికరమున నకుమార కందర్పునకున్. 338
చ. పసిరికపామువంటిదని పల్కెఁ మరీ యలివేణి వేణి న
ప్పసనుసు నిండుఁ గుండలము భాసిలు నీలలితాంగి గుబ్బ లీ
ముసిముసినవ్వులాఁడి కరము న్వెసమూసిన ముత్తియంబు నీ
కుసుమసుగంధి కేవలము గోలసుమీ యనమీఁదలంచుమీ. 339
చ. అనుటయు దండనాథసుతుఁ డానృపకన్యక నాదరించెఁ ద
జ్జనకుఁడు సమ్మతించె సరసస్థితిఁ బెండ్లి యొనర్చె వైభవం
బెనయ ఘటించి యొక్కవిధు లేందుశిలామయసౌధమందుఁ జే
ర్చిన నెనరొప్పఁగా విడిద చేసుక యంత వసించి వేడుకన్. 340
క. మును నేనొనర్చు నేరము, మనమున నెంచంగఁ దగదు మగువా యనుచుం
గనకాంగి నూఱడిలఁగా, నని సెజ్జంగారవించి యధికప్రీతిన్. 341
సీ. కాశ్మీరపంకసంకలితాంక మై పొంక మగుబాహుమూలంబు లంటి యంటి
వరమృగీమదపత్రవల్లరీరుచి నొప్పు నుదుటు సిబ్బెపుగుబ్బ లొత్తి యొత్తి
నానావిధబహుసుమానైకగంధంబు నివ్వటిల్లెడుకొప్పు దువ్వి దువ్వి
తాంబూలరసరక్తిమం బైన సుమృతంపుబింబాధరము ముద్దుపెట్టి పెట్టి
ఘనజఘనకంబుకంధరకదళికాళ్ళ, దూపువుల వాఁడి కొనగోళ్ల నొరసి యొరసి
యెలమి నలయించి మించి యయ్యలరుబోఁడి, నతనుసామ్రాజ్య మేలించె నవ్విభుండు. 342
క. ఈమాడ్కి ననితభోగ, శ్రీ మెఱయఁగ నొక్కనాఁడు చిత్తమున నిజ
స్వామియుఁ దలిదండ్రులుఁ దను, గోమించిననడతఁ దెలిసికొని యతఁ డెలమిన్. 343

క. చిత్తరువు ప్రతిమయో తెలి, యత్తియపో కమ్మపైఁడి బొమ్మయొ యనఁగ
నమ్మత్తచకోరాక్షి శుభా, యత్తమతి నోమహనాంగియై యుండు నెడన్. 353

చ. చెలి నును గబ్బిగుబ్బలకు సిబ్బెపు తళ్కుకివన్నె వాలుగ
న్నులకు మిటారిచూపొకటి నోదము గొందలిరాకు మోవికిన్
గలికి తనంపు నవ్వొక చొకాటము మేని మెఱుంగు తీఁగకున్
దలఁపు వహింపఁ జేయు నెఱతావి యొకానొక వింతయై తగున్. 354

వ. ఆనమయంబున. 355

గీ. అన్నగరమందు నెపుడు పురాగ్రితుండు, పల్లవాగ్రేసరుఁడు గుణవల్లభుఁడను
పేరు గలవాఁడు గలవాఁడు ఘనజవవి, రోహితుం డగు నొక్క పురోహితుండు. 356

వ. వెండియు నతండు. 357

ఉ. శాంతులొనర్చి గండకలుషంబుల నెల్లఁ దుంచు శత్రుకా
లాంతకరూపమైన జపమారణం బొనరించి యమ్మహా
కాంతునకు న్శుభంబు లెసఁగన్ జయమున్ సమకూర్చు సారసి
ఘాంతి యుతం డటంచు విబుధప్రకరంబు మదిన్ గణింపఁగన్. 358

క. అలకాలక్ష్మికులాగ్రిణి, యొలపిం పద్రాజకన్య నేలాగుననో
కలఁగన్నయట్లు లోకనాఁ, డలవోకం జూచి మన్మథాజ్ఞావశుఁడై. 359

క. అంగసిమాత్రిఫలంబిది, యందుకొనుట యెట్టులొక్కొ యనుచు మనమునన్
దుందుడుకు పేధరామర, కంపద్వం పిలేఁదు మేలు గలవాఁ డగుటన్. 360

గీ. అంత నత్యంత కాముకుం డగుచు లేంచు, ఖాండవుఁడు గానఁ దనమనస్తాప మెల్లఁ
దెల్లమి యొనర్పఁ దగినవాఁ డెవఁడు లేమి, కల్ల నగరింట నొకదాది ననుసరించె. 361

ఉ. ఈవర నాథకన్యపిఱుఁ దించుక ముట్టఁగనిచ్చి మేను నా
మేనున నంటఁ జేర్చి రదిచుంబిన మోవి యొసంగెనేని భూ
దాన హిరణ్యదాన ఫలదానము లిచ్చినయట్లు విప్రుఁ డెం
తైనను దానయోగ్యుఁడుగదా యని యర్థికిం పావుడున్. 362

గీ. అది దిగుల్పడి యెట్లు నోరాడ నాడి, పలుక నికతి నో వెఱ్ఱి బాపనయ్య
ముక్కఱయుఁగిమ్మలుదాల్చి మురియుచున్నఁ, జూడఁజాలక యిట్లాడి వాఁడవేమొ 363

క. అనవిని తత్పదయుగళం, బునఁ బడి నీధర్మసత్రిప్రుం బ్రాహ్మణుని
న్ననుమన్నించితి నింక నే, నొనరించిన ధర్మమెల్ల నొసఁగెద నీకున్. 364

గీ. అనుచుఁ గడతేరి పోవుచో నజ్జడాత్ముఁ, డన్యభామారతోత్సాహుఁ డగుటఁ జేసి
లీలలీలావతీకన్యకాలలామ, నెత్తెఱంగునఁ జేకొందు నెట్టులందు. 365

క. ఇవ్విధమునఁ దలఁచుచు నతఁ, డువ్విళ్లూరంగ శుభముహూర్తప్రఁదటి నా
పువ్వుంబోఁడికి బాల్యము, జవ్వాడి తొలంగునంత సమరతపాడమెన్. 366

మ. అపుడాకీర్తిముఖుండుఁ దత్సతియు నత్యానంద సంధానతన్
నృపకాంతాజనముల్మహీసురపురంధ్రీరత్నము ల్గొల్వఁగా
రపణం బుష్పతిలం దదంతవిభవారంభంబుఁ గావించి య
చ్చపలాక్షీమణికి న్వివాహ మొనరించంగార్యమూహించుచున్. 367

గీ. రాజమాళియుఁ దత్సతీరత్న మపుడు, తగుకులస్థుఁడు రూపకందర్పుఁ డైన
వరుఁడెవఁడొకో యటంచు భావమున నెంచు, నంతఁ గపటాత్ముఁడైన సిద్ధాంతియనియె 368

క. ఈబిడసుముహూర్తకళా, ప్రాబల్యమునం జనించు భాగ్యంబున సు
శ్రీబలముఁ జెంది నీగృహ, మాబలజివ్భోగనమధికాన్పద మయ్యెన్. 369

వ. తదనంతరంబ. 370

గీ. బాలయుష్టవేళఁ బ్రథమరజస్వల, యయ్యెఁ గాన దీని యవగుణమున
రాజ్యలక్ష్మిఁ బాసి యింపిల్లు నీయిల్లు, కలిమి పెంపుఁ బాసి పొలియు ననఘ. 371.

క. అనవిని గుండియ యదర, న్మనుజేశ్వరుఁ డాప్తులైన మంత్రులతో ని
ట్లను నే నేర్పునఁ దీర్చెద, రనవుడు నద్దుష్టమంత్రు లవివేకమునన్. 372

గీ. సీతపుట్టి లంక చెఱచినచందానఁ, బుట్టఁదగనిముద్దుపట్టి యైన
బాలికాగ్రగణ్యలీలావతీకన్య, యిల్లు చెఱుపఁ బొడమె నేమొ యనుచు. 373

చ. మును వెనుకేనియుం గనక మోసమునం గడుకార్యభంగమా
నక సుకీర్తిహాని పద మంచుఁ దలంపక కన్యకామణి
న్వనధిపరీతయై పొదలు వాహినిలో నొక మందసంబునం
దునిచి రయంబున న్విడల నొత్తుట నీతి యటంచుఁ దెల్పినన్. 374

క. కీర్తిముఖనృపవరుం డప, కీర్తి జనించునని మిగుల ఖిన్నతనపు డ
వ్వార్త వినలేక బహుళత, రార్తి న్నిజకామినీసహాయత వనటన్. 375

క. కడుపు చుమ్మలు చుట్టఁగాఁ గన్నకన్నె, చిలుక నెడఁబాసి యేరీతి నిలుచువాఁడ
నెక్కుడివివేకమన మంత్రులెల్లఁ గదిసి, కునలయేంద్రునితో గువ్వకోలుగొనుచు. 376

మ. మునుగుంతీసతి కూర్మినందను మహాంభోవాహినిం జేర్పదో
మనువంశాంబుధిచంద్రుఁ డాదశరథక్ష్మాభర్త శ్రీరాముని
వనవాటి న్విహరింపఁ బంపఁడొ కృపాసాంద్రైకవాత్సల్య వ
ర్తనముల్ చూడఁగ రాజనీతియె నరేంద్రాయంచు బోధించుచున్. 377.

గీ. *మానుమీ మోహమని తెల్పి మానవేంద్రు, చిత్త మొగ్గించి యొకమాటఁజేసి రాచ
కొమిరె నిదురించుతఱి మందసమున నుంచి, వీడు వెడలించుకొని తెచ్చువేళ నెదుట. 378

సీ. కలశోద్భవానీత కలితపుణ్యసమేత యఖిల జగత్ఖ్యాత యైనమాత
జడధినాయకు నేలుబడి గన్నయిల్లాలు నిఖిలపుణ్యపుంజాలు నిలుచుప్రోలు
అభ్రఘట్టనఖేలనాభీలకల్లోల యఘతూలికాజ్వాల మడఁచు కీల
ఫణిలోకవిజ్ఞాన పాటవాంతర్లీన వినుతసత్యవితానమునకు సోన
యధిపతి నమూగమార్గప్రయాణసమయ, సమధికోత్తుంగ భంగసంచారజనిత
ఘనగరుధ్వానపటుపటాత్కారసార, భూరిసితపక్షఝరి కావేరి వెలయు. 379

శా. ఆవరవాహినింగని దురన్వయు లచ్చటి మంత్రులెల్ల లీ
లావతియున్న పెట్టియ నలంఘ్యతరం బగు తజ్జలంబునం
బోవిడిపించి భూవిభునిపొంతనె యెప్పటియట్ల యుండి రా
హా విపరం బెఱుంగని దురాత్ములకృత్యము లట్టివే కదా. 380

వ. కావున. 381

క. నృపతి యగువాఁడు విద్యా, నిపుణుం బహుకార్యభారనిర్వాహకు శాం
తపరజన మర్మభేదన, కపటమతిన్మంత్రిఁ జేయఁగానగు నబలా. 382

వ. అది యెంతైనం గల దత్తెఱంగునకు నిమిత్తం బేమి యట్లుండనిమ్ము తదనంతర వృత్తాం
తంబు వినిపింతు నని యిట్లనియె. 383

క. జనకుఁ డగువార్ధిరాజుం, గను ప్రేమం దల్లియైన కావేరికడన్
జనుకమలపాణి యనన, వ్వనజాయత నేత్రి యేటిపడి నేగుటయున్. 384

చ. తను మనుజాచి మోహపరితాపము గన్న పురోహితుండు గ్రి
క్కున నిదివేళ యీకుసుమకోమలితో రతికేళివైభవం
బనువుగఁ గోర్కి దీర్చుకొన నంచు మనంబున నెంచి తత్తటీ
వనతలకుంజమంజులనివాసము నన్వెన నొంటి నుండఁగన్. 385

వ. ఆసమయంబున. 386

గీ. ఒదిఁగి యలమందసములోన నున్నరాజ, కన్యకామణి మేల్కాంచి కలవరించి
బహువిధంబుల విలపించెఁ బంజరమునఁ, జిక్కువడియున్న క్రొత్తరాచిలుకవోలె. 387

సీ. జనకు నెమ్మనము వజ్రప్రాయ మాయెఁగా మాయగావించి యీమాడ్కిఁ జనుపఁ
దల్లికి వీను లెంతయుఁ జల్లనాయెఁగా నాయగాధప్రయాణంబు విన్న

---

*మంత్రులంపఁబుఁగూడియు మానవేంద్రు—అని పాఠాంతరము

జాదియపఖ్యాతిఁ దలఁపలేదా యొఁగా డాయఁగాఁబోలు నింతయు సహింప
నాఁజనశ్రేణి కాత్త కింపాయెఁగాఁ బాయఁగారాని యీబారినొంద
నకట నాయీఁడు రాచకన్నెకలకెల్లఁ, గడఁగి నన్నాడుకొన నోరు గల్గె నేమ
నందు నిఁక నెందుఁజొత్తు నాహా విధాత, వ్రాఁతయు విలంఘ్యమని యెంచు వడిఁ దపించు. ౩౮౮

కం. అన్నలవేణి యివ్వగ, నున్నంత సమీపభూమి నొకరాజు శుభా
భ్యున్నతుఁడు రశికశేఖరుఁ, డెన్నఁగ హిమధామనాముఁ డేపుదలిర్పన్. ౩౮౯

గీ. అతులితోత్సాహమున వేఁటలాడియాడి, కడఁగి యచ్చోటనే వీడువిడిసెఁ గాన
గర్ణయుగమునఁ దత్కన్యకాప్రలాప, కలకలధ్వను లాలించి జలదరించి. ౩౯౦

మ. ఇదియేమో మనసాశ్రమెల్ల వగ నట్టిట్టై వెతం జెంద ని
న్నదిలోన న్వననయ్యె వాఁడుమెఱ కాంతారత్న మింతెవ్వతో
మది నూహింపఁగరాని దుర్దశ నహింపంబోలు నేఁడీవిప
త్పదమేమో వివరింతుఁ డందుఁ గరుణాపారీణచేతస్కుఁడై. ౩౯౧

ఉ. భూరిజలప్రచారులగు బోయలఁ బంపిన వారలాపయః
పూరమున న్మెలంగు కలమం బటె నుండెను మందసంబు న
త్తీరము సేర్చి యందు సుదతీమణి యుండుట తెలింగి యప్పరి
తీరమణుం గనుంగొని విధేయతఁ దత్క్రమమెల్లఁ దెల్పినన్. ౩౯౨

కం. విని యప్పుడా నృపాలుఁడు, కనుకనినమ్మందసమునఁ గలకలవాణిన్
మన మలరఁ దోడి తెండని, తనదాదులఁ బంపె నొసుధాకరవదనా. ౩౯౩

ఉ. అంత నతిత్వరైకమతి నజ్జరతాంగన లేగి యమ్మహీ
కాంతునవాజ్ఞఁ బెట్టెఁ బిగఁగట్టుల నెల్ల సడల్ప రోహిణీ
కాంతుని రేఖఁ గ్రొమ్మెయిలు గప్పుటఁ బాసి రహించినట్లు త
త్కాంతతనూవిలాసరతి కాంత తలుక్కనఁ జెంతనిల్చినన్. ౩౯౪

కం. కని యత్యంతకుతూహల, మునఁ జజ్జరరాంగనాసమూహము వెనన
వ్వనితారత్నము కులగో, త్రనిరూపణమున్వచింపఁ బ్రార్థించుటయున్. ౩౯౫

చ. కరతలసక్తగండఫలకస్థలయై చిగురాకువంటి వా
తెఱవసివాఁడ ముద్దువగఁ దిన్నని మోము వంచి తీనతన్
సురసురసుక్కి యుస్సురనుచుం దనవర్తన మెల్లఁ దెల్పినన్
సరసతఁ గొందలందు నృపు చక్కటి కుద్ధతి నేగి వేడుకన్. ౩౯౬

క. ఓరాజకులశిఖామణి, యీరాజీవాక్షి చెల్వ మతిచిత్రము శృం
గారవతి యువతిరూపక, స్వారత్నము దానిఁబోల నతివలుగలరే. 397
చ. చిఱునొడలందు మాచికిలిచెక్కుల చొక్కటమౌ మెఱుంగు వా
తెఱనాబ గావినీలమణి దీధితు లన్నగుకొప్పునందు మా
గురుతరశాతకుంభమయకుంభకుచంబుల గుల్కు బింక మా
తెఱవకె యొప్పు నత్తెఱవ దేవరకే తగనొప్పు భూవరా. 398
క. అని తెలిపి రాజు చిత్తము, కని క్రమ్మఱి రాజకన్యకం దెచ్చుటకై
వినయోక్తుల నంపెయెల, ర్చినఁజింతాజలధిమగ్నచిత్తాంబుజయై. 399
సీ. ముకురద్యుతికపోల మకరికాలతలతోఁ గమ్మకస్తురి చిత్రికమ్ము చెదర
వక్త్రగంధానుధావన్నిళిందములతోఁ గప్పువెన్నెలకొప్పు కంప మొందఁ
గర్ణికాకుసుమరింఖన్నరందంబుతో నిడువాలుఁగనుదోయి నీరు చిలుక
గళదనర్గళ ఘర్మకణపరంపరలతో నరుతముత్తెపుసరుల్దారసి యాడఁ
బీనవక్షోరుహాముసు లేఁగౌను ఘనని, తంబ మలరఁ బదంబు లందంద వడఁక
నడఁకునవలిర్ప నన్నరేంద్రాగ్రగణ్యు, కెలని కేతెంచె నలరాచకలువకంటి. 400
క. వచ్చుటయు రాజు చూచి వి, యచ్చరవరకన్య యేమొ యని మెచ్చుతఱిన్
మచ్చరమున నమ్మదనుఁడు, పచ్చని విలుఁబూని పంటఁబగవట్టె చెలీ. 401
గీ. పేర్మి నవ్వేళ నేకాంతసీమకరిగి, సరసుఁడైపట్టి యమ్మహీశ్వర వరుండు
లీలదళుకొత్త లీలావతీలతాంగి, నించువిలుకాని రాజ్య మేలించి మఱియు. 402
క. ఆరామయందుఁ బాయక, యారాజవరుండు నిజపురాంతఃపురముం
జేరిసుఖంబున నుండెను, దారతరోత్సాహుఁడై సుధాకరవదనా. 403
మ. అని రాచిల్కలఱేఁడు పల్కునెడ నుద్యద్ఘోరగాఢాంధకా
రనివృత్తిన్ జగ మొప్ప నూరుజవఘోరత్నంబు వీక్షించి యా
య్యానఁ గేళీగృహసీమకేగి రవియస్తాద్రిప్రవేశంబునం
దినవేళం దమిరేఁగి భూవిభుని నర్థింజేరఁ జారుక్రియన్. 404
క. శృంగారరస మొసంగన్, బంగారపుబొమ్మవంటి బాలిక యపు డ
య్యంగజరాజతురంగము, చెంగటి కేతెంచి వాగ్విచిత్రప్రౌఢిన్. 405
క. శుకసార్వభౌమ నేఁడీ, సకలజ్ఞుం డైనరాజు చక్కటికరుగన్
సుకరమయి యున్న దీదిన, మిఁక వేగమ తెల్పు మవలి యితిహాసంబున్. 406
మ. అనుచుం జిల్కలకొల్కి పల్కు విని యత్యానంద మింపొంద ని
ట్లనియెం గీరకులప్రభుండు హిమధామాఖ్యుండు తానాదికిం

జనుచో నెచ్చెలియున్న మందసములోనం గూర్చిర సక్రోధచం
డనిరాతంకము నొక్కభల్లుకము నుంచం జేసి గర్వోన్నతిన్. 407

గీ. అమ్మహావాహినీజవాభ్యంతరమున, విడిచి చనెఁ గాన నది నీటివెంట నరుగఁ
దొలుత నమ్మందగమనపై వలపుఁజెంది, పొంచికొనియున్న యవ్విప్రపుంగవుండు 408

క. కనుఁగొంటి నదె నిధానము, గనుఁగొన నొక మాళ్లబిందె గలిగెఁ గదా యే
మనవచ్చు దైవయత్నం, బనితలఁచుచు మోహవశత సవ్యగ్రమతిన్. 409

మ. తనశిష్యుల్వెనువెంటరా నడిచి యుద్దండస్థితిం దన్నదీ
వనమధ్యస్థలినున్న మందసము శేవం దెచ్చి తత్తీరమం
దునపీనద్రుమలతానికుంజమున మెచ్చుల్గుల్కుచో నుంచి య
త్యనురాగంబునఁ గామినీగమన మోహాకూనచేతస్కుఁడై. 410

సీ. వలుదలై మెఱయు పార్వణపు ముద్దలవంటి వలిచన్ను లెన్నఁడు వ్రచ్చికొందుఁ
బుణ్యాహపల్లవంబులఁబోలు కెమ్మోవిఁ గదువేడ్క నెన్నఁడు గఱచికొందుఁ
గొనలు గల్గిన దర్భకోటి నేలెడు నెఱుల్గట్టిగా నెన్నఁడు పట్టుకొందుఁ
బంచామృతముఁ గ్రిందుపఱచు వాక్సుధ చెవుల్తనివంద నెన్నఁడు ద్రావికొందు
ననుచు నేఁగోరికొని యుండు నట్టితలఁపు, లన్నియు ఫలించెఁగా నేఁటికని తలంప
వీని జన్మంబు కిష్కింధలోన నేమొ, కావలయునంచు శిష్యవర్గము గణింప. 411.

క. వేదము చదివినఫలమున్, వాదించినఫలము సంధ్యవార్చినఫలమున్
పైదలినీకు నొసంగెదఁ, గాదనినం బ్రహ్మహత్యఁ గట్టుదుఁ జుమ్మా. 412

గీ. అని యనన్వయరీతి నెన్నెన్నొపదరి, పదరి యొక్కింతయును నీతి మది గణింప
కతనుఁ డమృత్యు వెసకొల్ప నల్లమంద, సమునఁ గల చీలలన్నియు సడలఁజేసి. 413

*సీ. అవునషేనను వివాహముగమ్ము విద్వాంసురాల వయ్యెడవు శీతాంశువదన
వివరింతునొక చిన్న విన్నపం బాలింపు మభిమతార్థంబు నీకగు మృగాక్షి
యలయింప నేటికే యకట నీశిష్యప్రశిష్యుండ నగుదన్నుఁ జిగురుబోఁడి
పంచాస్త్రుఁ డిదె నేఁడు బాధించుచున్నాఁడు బ్రదికింపవే నన్నుఁ బంకజాక్షి
బ్రాహ్మణోత్తము నిపు డింతభంగపఱచు, టెంతయు నధర్మ మని చెంత కేగునంత
నల్లమగలంగ నయ్యుగ్రభల్లుకంబు, గుటగుటయటంచు రొప్పి యక్కుటిలుఁ గదిసి 414

* రాజాపేటదగ్గఱ మద్దిరాలలోఁ దెచ్చిన ప్రతిప్రకారము.
సీ. అవునషేనను వివాహముగమ్ము విద్వాంసురాలవయ్యెదవు శుభాంశువదన
అవునషేనను మనోభవకేళి నేలవే సామిదమ్మవుదువె కోమలాంగి

క. మొఱఁబెట్టుకొని తమాలత, జడియం గుదియించి నేలఁ జదికిలఁబడి య
మ్మడియపు డెంత పొరలిన, విడువక మృత్యువుకొనర్చె విందులతాంగీ. 415

క. అని కీరకులశిఖామణి, యనుగాఢ కృతావధాన యై విని యయ్యం
గన యిది విచిత్రతరమా, నను చుం దరహసితవదన యై యుండు తఱిన్. 416

మ. ప్రకటాకాశవిభుం డహర్ప్రభుని మత్ప్రాప్తైకపక్షత్రిమా
లిక నీవేటికి దాఁచినా వనుచు హాళిం బల్కుచో నాతఁడ
త్యకలంకస్థితి నగ్నితప్తచటులం జాలోహఖండంబు సా
త్వికరీతిన్ వెసనెత్తినట్లు రవి రేవిన్ బ్రాగ్దిశన్ దోఁచినన్ 417.

క. అంతటఁ దననగరుకుఁ జని, కాంతాతిలకంబు ప్రొద్దుగడుపమి నైఁతో
చింతిలుచు నుండునెడ భా, స్వంతుఁడు పశ్చిమపయోధి వడిఁగ్రుంకుటయున్. 418

క. కలధౌతరత్నరశనా, కలితబహుక్షుద్రఘంటికాతతి మెఱయన్
వలచేరి భద్రగజమనఁ, జెలి యారాచిల్కచెంతఁ జేరినయంతన్. 419

చ. కనుఁగొని యోసఖీజనశిఖామణి నేఁడొక గాథఁ దెల్పెదన్
విని నను మన్యనాయకుని వేడ్క మెయిప్రమియింపఁ బోవుచోఁ
బెనిమిటిఁగన్న యంత నొకబింబఫలాధర ధైర్యవర్తనం
బనువుపడంగఁ దెల్పు టరయ న్వివరింతు నటంచునిట్లనున్. 420·



## అయిదవకథ.

క. కనువిందై యొకపురవర, మనువందున్ భువి మదేభహయభటరథ రం

---

అవుర షేనామాటలాలింపవే పురోహితురాల వౌదువే యిగురుబోణి
అవుర షేననుబొందు మవిరళశ్రాద్ధాల యిహామాశనము తిందువబ్జవదన
యేల నన్నింత యేచఁగ నేల వినుము, వసితనీధర్మ సత్రిపుబ్రాహ్మణుఁడను
మనల నమ్మినవాఁడు బ్రాహ్మణుఁడటంచు, నేఁటికైనను దయఁజూడు నీరజాక్షి.

వ. అని మఱియును.

సీ. గోదానఫలదాన భూదానఫలములు చేరునంతటికైనఁ జేరుఫలము
వివరించి తెల్పెద విన్నపం బాలింపు మభిహితార్థంబు నీ కగుమృగాక్షి
అలయింప నేఁటికే యకట నీశిష్యుండ నగు నన్నుఁగాఁ జూడు మిగురుబోఁడి
పంచాస్త్రుఁ డిదె నేఁడు బాధించుచున్నాఁడు బ్రతికింపవే నన్నుఁ బంకజాక్షి
బ్రాహ్మణోత్తమునిపుడెంత భంగపఱచు, టంతయు నధర్మమని చెంతకరుగునంత
యుల్లమలరంగ నయ్యుగ్రభల్లుకంబు, గుటగుట మటంచు లొప్పియుక్కుటిలు నొరసి

జనమై యఖర్వరిపుభం, జనమై పొలుపారుచు న్విశాలంబనఁగన్. [*] 421.

క. ఆనగరీవరమేలు మ, హానటనిటలస్థలీబృహద్భానుమహా
శ్రీనిర్జితసమదరిపు, క్ష్మానాథుఁడు భీమసేన జనపతికడఁకన్. 422.

క. ఆరాజు రమ్ము ఖొమ్మని, గారామొనరించి మనుపఁగా మోహనుఁడ
స్వైరుగలవాఁడు తగుగుణ, వారిధియగు నొక్కబచ్చువాఁ డప్పెటన్. 423

ఉ. మైనవుటంటు పట్వగలమచ్చులచాళూరగల్లు కల్లెలున్
దూనిక నాలుగేనొ్బరలతోఁ దగుపట్రిములోననున్న వా
నానగరోద్భవంబులగు నాణెము లుండెడుసంచిఁ గొంచు జే
రానకువచ్చు నన్నయధురంధరుఁ డంగడికిం గణింపఁగన్. 424.

(*) గీ. అతని కనకూలవతి రూపవతియునైన, భామినీమణి దనరు సౌభాగ్యసీమ
యాత్మనాయకపాదసేవాభిరామ, నవ్యగుణవతి శుభవతీనామ యొకతె. 425

ఉ. ఆలలితాంగి పుష్పవతియై దివసత్రయముఙ్ గ్రమించినన్
నాలవనాఁడు దాగురుజనంబులు కుంకుమ సంకు పొంకముం
బోలెడు చల్వయుం బసుపుముద్దయుఁ గైకొని తోడరామహా
కేళిరథాంగయైన నదికిం జని మజ్జనమాడి వేడుకన్. 426

ఉ. అత్తయొసంగ నొక్కకబళాన్నముఁ గైకొని హీటికాయుమల్
కొత్తమెఱుంగులీను రదకోరకముల్గబళించి తేనిప
ల్లొత్తులు బట్టబైట నిడనొప్పుచు వాతెఱ సీనె గట్టఁగా
నత్తరలాక్షి చూపులు నిజాంఘ్రుల నిల్పుచు వీథి నేగఁగన్. 427

వ. ఆసమయంబున. 428

చ. చిటిలిన గంధముం పటుకు చెంపను వేర్లు రమాలు జాఱుదు
ప్పటియును నిద్రదేఱుముఖపద్మము చెక్కిటికాటు మూఁపు చెం
గట నులిగొన్న జన్నిదము కన్నులకెంపు లతాంతపీటికా
పటిమ రహింపవచ్చె వరభద్రుఁడు నా విటుఁ డొక్కఁ డత్తఱిన్. 429

గీ. వచ్చి మదికి మెచ్చునచ్చ నచ్చెలిఁ బడా, పగలఁ జూచి వింత పదము వాడి

---

[*] కనకాంగి కనకస్థల, మనఁగా నొకపురము గిరము నలరును హార్మ్యా
గ్రనిహతహరిమణితిమిరో, జ్జనితరహఃకేళిసౌధజాలం బగుచున్.—అనిపాఠాంతరము

(*) అతనికులకాంత నవమోహనాంగి జిత, కాంతరతికాంత రుచిరరేఖానిశాంత
వఱలు వరపాదకములసేవానిధాన, నయగుణవిధేయ శుభవతీనామధేయ.

కేకరించి కొన్నిపోకలఁబోయి య, చ్చేడెచూపుదన్నుఁ జేరకునికి. 430

క. నాగులుచు మరుబరిగోలలఁ, బొగులుచు నయ్యిందువదన పొందునుగూర్పం
దగువారులేరు దీనికి, నగువారేకాక యని ఘనం బగుచింతన్. 431

సీ. తనమాట యేమెఱుంగనియంగనకు జారసమాకార మొనరించు మందు గాఁగఁ
దనప్రౌఢి సందుగానని సుందరికి గోడ చివ్వనదాఁటు నిశ్రేణిగాఁగఁ
దననేర్పు గురుభీతతతనితంబకు సాహసక్రియ కభయహస్తంబుగాఁగఁ
దనబుద్ధి బొంకనేరని పంకజాక్షికి ధవునివాకట్టు మంత్రంబుగాఁగ
నమరు నప్పీట నన్నపూర్ణాభిధాన, మదనమాయామహాస్థాన మంత్రిసాని
దానితో మాటలాడి చూతము విచార, మేలయని వేళగని దాని యింటికడకు. 432

ఉ. చనివరభద్రుఁ డల్లగుణశాలిని జూచుటఁ దెల్పి దానిమో
హనమగు రూపమెంత కొనియాడెద నేఁడు దురంతకంతుకుం
తనిహతిఁ జింతవంతఁబడి తాంతలతాంతము చందమొందె నా
తను విదె చూడు వేఁడుకొనెద న్ననుఁ గూర్పుము దానినేర్పునన్. 433

క. నాకనఁగాఁగనకము భా, మాకనుఁగొనఁ జిల్లపెంకు మాత్రము దానిం
జేకూర్చిన నాతనువిదె, నీకుం గైవస మొనర్తు నీతోడుసుమీ. 434

*మ. అని సూచించిన మంచి దంచు విని యయ్యబ్జాక్షినిం గూర్ప నా
తనికిం బాన మొసంగి వీడ్కొలిపి తత్కార్యార్థమూహించి మో
హనుగేహంబునకుం బ్రియోజనశతవ్యాపారముల్ దెల్పి కొం
చునిరూఢం బగురాకపోక లొనరించుస్సాయ డాయింపుచున్. 435

క. అంతట నాశుభవతి కది, యంతింతనరాని యంత రంగంబున నా
ద్యంతమధురోక్తిచాతురి, సంతతము న్వింతసంతసం జెనఁగించున్. 436

క. ఆలలనామణి కాగ, య్యాళి యొకానొక్కవేళ నక్కఱతో సు
వ్వాలున్శోభనములు ధవ, ళాలు న్మోదలైన పాటలం దగ నేర్పున్. 437

ఉ. వనజదళాయతాక్షి మగవాఁడు పరాంగనపొందుఁగోరువాఁ
డని వినవేమొ యట్టిచవు లంటినచో మఱిచాకసేయఁడే
నిను నటుగానఁ బూని మగనిం దెఱతోవలఁ బోవనీకు నే
ర్పున నని బుద్ధిగాఁ గఱపు ముద్దియ నందియ మందకుండఁగన్. 438

*అని తెల్పన్ విని మంచికార్యమని— పాఠాంతరము.

క. అంతటనొకనాఁడొకవేళ, యింతియు మోహనుఁడు నవ్వులిచ్చినపనికై
మంతనమాడఁగ నమ్ముది, జంతయు వెనఁబోయి వానినతికింజెప్పెన్. 439.

గీ. చూపి యిన్నాళ్ళు నిటువంటి సుద్దిగాదు, కాదటందువుగడ దానికాళ్ళమీఁద
సాగఁబడిమ్రొక్కి యిల్లాలిఁ జక్కఁజూడఁ, గావుమని బాసలీయఁగాఁగఁటికేను. 440

ఉ. బిడ్డయొ పాపయో చిదిమిపెట్టినకైవడినున్న నిన్నుఁదా
సడ్డయొనర్పక వ్వలఁబిశాచమువంటి గరాసుఁగూడె నీ
యెడ్డెఁడు గుట్టుతోడ నిఁకనేనియునాపలఁ గాలకించునే
నొడ్డెదనిదీనికిం దగినదొక్కయుపాయము తోయజాననా. 441

క. తిట్టిన మెట్టినకైవడి, సెట్టింగని పొడిచినట్లు చెకూడమజీన్
నెట్టుకొని నేఁటినుండియు, గట్టిగవేఱొకనిఁ గూడఁగావలె నీవున్. 442

చ. తెలియుముగాక నీకుసుదతీ రతినైపుణిఁ జూపవచ్చునో
కలకల నవ్వవచ్చునొ వికాసపుముచ్చటఁ దెల్పవచ్చునో
బలువగపాఱువాపలుకు పల్కఁగవచ్చునొ కుల్కవచ్చునో
చెలువునిచెంగటం బరునిచెంగటఁ బోలెఁ గురంగలోచనా. 443

క. కొసరువగమాట లలుకలుఁ, గుసిగుంపులు తిట్లు మోరికోట్టులు జారుం
డసమసుఖంబుగఁగైకొను, బసవెద్దగు మగఁడు మండిపడుఁ గుసుమాంగీ. 444

గీ. నోరెఱుంగనియట్టి జంతువులుసైతఁ, మంబుజానన యిచ్చావిహార మందుఁ
బలుకనేర్చిన తనువొక్కపతికొసంగి, బంగరమువంటి మనసుఁ గెంటంగ నేల. 445

క. అని చెలిపుడకలు విఱిచినఁ, గనుఁగొని యదిక్రొత్తగుమ్మ కావున మనసా
గ్గిన నదియును నేనొక్కనిఁ, గొనివచ్చెద నూరిబైటి గుడికడ కనుచున్. 446

క. చింతాకుముడుఁగుతఱిఁ ద, త్కాంతంగొనితెచ్చి మేరుకార్ముకగేహా
పాంతమునునిల్పి మఱితా, నంతన్ వరభద్రుఁ బిలువనరిగె న్వేగన్. 447

గీ. అరిగి యతఁడింట లేకున్న వాత్మఁబొగిలి, కొదవవచ్చె నటంచు నమ్ముదిపిపాతి
తిరిగి చను దెంచుచోఁ గాంచెఁ దెరువులోన, వానిఁబోలిన నెఱనీటుకాని నొకని. 448

క. కనిపాలిపోవనిమగనా, లినిగూర్చెదనీకుఁ జాలలేవడిఁబాల్మ
లినయది యనుచుం బిలిచినఁ, జని యాతఁడు కాంచె నాబిసప్రసవాస్యన్. 449

క. కనుఁగొని తనయిల్లాలని, మనమున నతఁడెఱిఁగె నంత మగువయు నాథుం
డని తెలిసెం దత్సమయం, బున నాశుభవతి మఱెట్లు బొంకఁగజాలయున్. 450

క. తెలిసిన నేరము తెలియని, యలవైనంబోక కొంచెమా పరపురుషుం
గలయుటలు నిలువనాడం, గలదానికిఁ జెల్లుఁగాక కరిపరగమనా. 451

వ. అని యివ్విధంబునం గీరసువాసీరుండు పలికి యూరకుండిన నవ్వైశ్యాదృశ్యమధ్య
యతిధ్యానాధీనయై యలక్ష్యనిక్షిప్తవీక్షణంబున నున్నమితభూప్రిలతంబుగాఁ గొంతత
డవు విచారించి భూతలాధిపానీతయగు రాజదూతిం గనుంగొని యిందేమైనను దెలి
యునె యనియడిగి ముఖవికారంబునం దానియజ్ఞానంబెఱింగి రెండవచంద్రమండ
లంబునుం బోని తనముఖంబెత్తి చిగురాకుమలుఁగునం బొడము మొగ్గయుంబోలె మ
ధురాధరంబుచాలునఁ దలసూపుదరహాసకందళంబుతో నచ్చిలుక కిట్లనియె. 452

గీ. 'అరయని క్షేపముంచిన యట్టివారె, తెలియవలెఁగాక యొకరికిఁ దెలియఁదగునె
యింతయేమిటి కిప్పుడు నీయిడినచిక్కు, నీవె విడిపింపు మనశుకం బిట్లులనియె. 453

ఉ. అప్పుడు తద్వధూటి చలితాధరయై వరుఁ గప్పవెప్పునం
జప్పుడుగా నదల్చి పరసారసగంధులఁ బొందనంచు నా
కొప్పనిబాన నిచ్చితి వహో యిటు లెంతకు నెత్తుకొంటి విం
కెప్పనికైన నమ్మఁదగునే ననుఁ జంపగఁజూతు వింతటన్. 454

ఉ. నీమదిఁ జూడఁగోరి తరుణీజనధర్మము గాకయున్న చో
నేమని దీనిచేత నిటకేఁ బిలిపించిన వచ్చితన్యభా
మామతి నిప్పుడిట్లు పరమాననియైన రమింపవచ్చి నా
తోమదిమోహమగ్నగతిఁ దోపఁగ నుండుట కిచ్చగించితో. 455

క. చుట్టాలకుఁ దెల్పుదు మది, దొట్టినకినుకం దలాగ్లతోఁ జెప్పుదుఁ గా
పెట్టుదు దొరముందఱ నను, బట్టకుమని పఱవ నతఁడు బరువగుభీతిన్. 456

గీ. పాదముల వ్రాలి నేనేమిపాపమెఱుఁగ, నీమహాదేవు నాన పూర్ణేందువదన
రవ్వయొనరింపవలదంచు రమణిఁదోడు, కొనుచు గుట్టునఁ దనగృహంబునకుఁ జనియె. 457

క. అనిచిలుకపలుకఁగుతుకం, బుననారాయెంతబొంకు బొంకెను మృగలో
చన యనిప్రభావతీసతి, యనుపమగతి మెచ్చుకొనియెనవనీనాథా. 458

వ. అనిన నద్ధరాకాంతుండు తదనంతరగాథాప్రకారం బెవ్విధంబని యనుడు. 459

శా. విశ్వామిత్రమనఃప్రియంకరకరావిర్భూతదానక్రియా
శశ్వత్తోషితధారిణీసుర సురేశస్తుత్యశౌర్యాతిల
ధైశ్వర్యోజ్జ్వలవైభవోన్నత నతాయాసాపహృద్వీక్షణా
శౌర్యాస్త్రానవిరామ రామబలగర్వారంభ నిర్వాపణా. 460

క. ధారాధర వర్ణసుధా, ధారాపరిపూర్ణవాక్యధారావిబుధా
ధారానిజకాక్షేయక, ధారావళితాహితవసుధాధరధారా. 461

మానిని. జలధరనిభ దేహా సజ్యకోదండబాహా
ఖలదనుజవిదారీ కంధిదర్పాపహారీ
కులగిరిసమధైర్యా కుంభికీశాథపర్యా
సలలితగుణజాలా జానకీకేళిలోలా. 462

గద్య. ఇది శ్రీమచ్ఛాపరీనృసింహకరుణాకటాక్షవీక్షణ [illegible] తాధర వాలవే
కరికులకలశాంభోనిధిసుధాకర తాడిగోత్రకరియమాణిక్యప్రపహార్యక్షపా
త్రి పవిత్రచరిత్ర కదురధరామండలాఖండలపుత్ర విద్వత్క
విరక్షణానుసంధాయక ఖదిరీపతినాయక ప్రణీతంబైన
శుకసప్తతియను మహాప్రబంధంబున
బ్రథమాశ్వాసము.



శ్రీరస్తు.

శ్రీమద్రమారమణాయనమః

# శుకసప్తతి.

## ద్వితీయాశ్వాసము.

క. శ్రీరామాంకధరాజా, తారామవసంతసంతతామితవిభవో
దారా మాధుర్యవచో, ధారా మార్తాండధామ దశరథరామా.

గీ. అవధరింపుము సకలరాజాధిరాజ, యతిపదాంభోజుఁ డగు ధర్మనందనునకు
సకలవైదికలౌకికాచారవిహిత, హితకథారమ్యుఁ డగుధౌమ్యుఁ డిట్టులనియె. 2

ఉ. అంతటఁ దెల్లవాఱిన దివాంత మొకానొకరీతిఁ గాంచి త
త్కాంత మెఱుంగు గుబ్బకవకస్తురిపూతను రంగుచెంద వె
న్కాంతయు వేణికారుచుల నందగొనంగయి సేసి నీలచే
లాంతర దృశ్యయై హరిశిలావృతహేమశలాకఁ బోలుచున్. 3

క. జనవరసురేంద్రుకడకుం, జనఁజూచినఁ జూచి చిలుకజాబిల్లియనున్
మనమున శోకకథఁ దలఁచితి, వినిపొమ్మా కొమ్మ యింత వేగిర మేలా. 4

### ఆఅవకథ.

గీ. అనుచుఁ దెలుపఁ దొడంగె నోయంబుజాక్షి, మదన మనుపట్టణంబేలు మదవదరిస
మూహములఘాలతలముల మోద్పుఁగేలుఁ, బెనఁచ పేర్చిననందనుం డనెడు రాజు. 5

క. ఆరాజశిఖామణిదే, వేరిశశిప్రభయనంగ వెలయు నిర్మగులం
బౌరందర మణిబృందము, దూఱం దరమైన నెఱుల దొరలెడు సిరులన్. 6

సీ. మగువసోయగపునెమ్మొగ మెంచఁగోలువున్న వెలిదమ్మివానికిఁ దలముగాదు
పడఁతినితంబబింబము నెంచఁ బుడమిమోపరియైనవానికిఁ దగముగాదు
కలికి వెన్నడుమెన్న ఖచరులకొజ్జయై వఱలెడువానికి వశముగాదు
నలినాయతాక్షి లేవడలెంచ నంచవయ్యాళికత్తెకునైన నలవిగాదు
భామినీమణి గబ్బినిబ్బరపుగుబ్బ, కవనుతింపంగ నల్లబంగారుకొండ
వింటివానికిఁగూడ దవ్వేలఁదిమూర్తి, వర్ణన యొనర్ప నింక నెవ్వారుగలరు. 7

క. ఆపడఁతియు నందనధర, ణీపతియున్నిజమనోజనితసంతోష
వ్యాపారాపారసుఖం, బేపారన్మెలఁగుచున్న యెడ నప్పురిలోన్. ౬

క. దేవాలయంబుకలదు త, ద్దేవాలయమున వసించు నంతర్లలిత
శ్రీవత్సునకురథోత్సవ, మావిష్కృతమయ్యెఁ బశ్యదఖిలామరమై. ౭

వ. ఇత్తెఱంగున నభంగనభోమధ్యరథ్యాధ్వనత్సముద్యద్ధ్వజంబును, వదభ్రిమేఘభ్రమావలమానభానుకంబును, నిజాంతరదంతురితమారజికపాణవికదుర్దమమర్దలధ్వానన్నృత్యమానవైమానికమానినీనికరంబును, నగురథోత్తమంబుపై మధువిరోధి యధివసించినం దుత్సవాలోకనాహూతనానాజనపదవ్రాతంబులతో నదృష్టపూర్వం బగుట నొగలందగు దాయకల్పితదారకాకారంబునకు దేవతామనీషంజేసి గోరంటయంటునంగెంపుసొంపుగ్రమ్ముకొను కేలుదమ్ములెత్తి మ్రొక్కునెడ, నందులకుఁ గ్రొత్తగుమ్ములని యాతతాయులొత్తుకొంచుదునుం దారుమ లేని జగడంబుల బహుళంబు లగుతుములంబులు గల్పించి గుంపులు చేసిన నానందునరి దమతమ జనంబులం గానక కాందిశీకులైనవారల మీవారిం జూపెదమని తోడుకొనిపోయి విజనస్థలంబుల నొడంబడకుండినఁ బుడమిం బడవైచి యీలువుగొని విడిచినం గ్రిమ్మరి తమ్మన్వేషించు నత్తమామలం గలసికొని తేలుగుట్టినదొంగలం బోలె మెలంగు ముగ్ధాంగనలును, బూర్వానుభూతలగునుపభర్తలాలం బ్రియత్నంబులంగాంచి కనుసన్నలఁ గొన్నిచిన్నెలు నెఱపిన నదిగని రోషకషాయితాత్ములై యాక్షేపించుచు స్వజనంబులు సోచ్చి సమ్మర్దబాహుళ్యంబునం బోలి వెలమచ్చెకంటుల నంటుగల్గుటంజేసి వారల నవ్వులకుం ద్రోసిచనినఁ జేయునదిలేక యిచ్ఛావిహారవిరోధియగు నిజకులాచారంబుల దలంచుకొని యుస్సురను విదగ్ధముగ్ధేందుముఖులును, బరపురుషభోగాయత్తచిత్తలగుటం గ్రిందుకొను సందడిం బడి కంటికింబ్రియంబైనవానిం గామించియు గోరంజీరియుఁ గొంతయాసతీర్చుకొని యంతట నతండెఱింగినం గలంగి తొలంగిచన వెండియునతండు వెంటంబడిన నదరంట జంకించుకామినులును, దైవనమస్కారంబులు దూరంబుచేసి పదుగురైదుగురు గూమిగూడుకొని కోడెకాండ్రియాపాధిక్యహాస్యంబులుపన్యసించు సామాన్యకన్యకలును మఱియుఁ, గటిప్రకటితార్ద్రివసన ఖండంబులతోఁ బొర్లుదండంబు లిడువారలకు మార్గక్షుద్రశిలాకలాపంబులవ్వలం దోచివైచి యెండమెండునం బెండుపడకుండ గడితంపుపచ్చడంబులెడలవదువునం బట్టువారను నిట్టనిగలు పుట్టిపడలలాటపట్టికలంబెట్టిన పట్టెవర్ధనంబులు వర్ధమానఘర్మజలంబులం గరంగి భక్తిపారవశ్యంబున నాయాసంబెఱుంగక వత్తిఱంచుభాగవతులకు వ్యజనవీజనంబుల దయాభాజనంబులగుచు వీచువారును నాగంతులకు శీతలోదకంబులుం

పానకంబులును నీరుమజ్జిగయుం దెచ్చి కైకొనుం డని ప్రార్థించి యిచ్చువారు సుంకలుగు రాజపుత్రుల వేంచేయు నప్పుడు. 10

క. చెప్పెడిదేమిఁక నొకచో, చెప్పరమగు నుక్కుజీను దిగవైచిన వే
నెప్పొని కనలకుం డెమ, కప్పలి తీరునను దేరుగదలక నిలిచెన్. 11

సీ. ఇఱుకుమార్గములవైచి యేతెల్లయునుమఁ బోషించిన నింతైనఁ బెగల దయ్యెఁ
జూడవచ్చినవారిఁ బీడించి పెనుమోకుఁ బట్టింప నింతైనఁ బాఱదయ్యెఁ
దమతమభక్తి యెంతయుఁ బురికొల్పఁగా జనులుప్రార్థించిన సాగదయ్యె
నిమ్నోన్నతక్షితినిసమంబు గాఁజేసి జన్నెలమీఁదెత్త సడలదయ్యె
భాగవతులెల్ల నుపవాసపరత సుగ్గఁ, బెరిలి చూపఱులెల్లఁ బండిళ్లు సేర
నేగుదెంచిన నృపులెల్ల నింద్లకఱుగఁ, జేరి యధికారులెల్లను జిన్నఁబోవ. 12

క. ఆకార్యము విని నందన, భూకాంతుం డేను మొక్కఁబోకునికిఁ జుమీ
యీకొదవ గలిగె నని తన, రాకాచంద్రాస్య వెంటరా నరుదెంచెన్. 13

ఉ. అత్తఱి బాటదార్లపరపైన భువిం బడువారి నెత్తురు
న్నుత్తగజంబుఁగన్న గరిమన్నొలత్రొడని గట్టినట్టివా
రెత్తిరితాళ్లకొద్ది పరువెక్కడివేడుకలంచు నంతను
ద్యుత్తర మయ్యె వీథి ధవళాత్ముల చే నవగోధమ్ముం బలెన్. 14

గీ. వెంటనరుదెంచుతనమచ్చెకంటిఁ జూచి, పొట్లుకోధించి కిఁగంటఁ జూచికొనుచు
నీటువాటిల్ల నరిగలనీడఁ బెండ్లి, నడల నప్పిరికెరిగె నప్పుడమిఱేఁడు. 15

క. ఆవేళశశిప్రభ రే, ఖావిభవముఁజూచి హారికిమలేక్షణలా
హోవృష్టిపడినయట్లన్, దేవుఁగన ముఱచి యిట్లనిరి తమలోనన్. 16

గీ. ఆఁడుఁదన మెల్లనొక్కచేయట్టిపట్ల, నింతి యొప్పులకుప్పయై యొనఁగకున్న
నిమ్మహారాజు చేపట్టునేల యిట్టి, పడఁతిగల్గుట నీతఁడేభాగ్యశాలి. 17

క. అనిపొగడుచుఁ గనుఁగొన న, వ్వనితలలోఁ గాఁగి యాధవళలోచనఁ గ
న్గొనియె నొకవర్తకుని సం, దనుఁడు ప్రవీణుఁడనువాఁడు తత్సమయమునన్. 18

క. చూచినయంతనె మనసుం, డాచపలుని నడ్డగించె నాతరువాతన్
వాచాగోచరదుర్మద, వైచిత్ర్యంబొగడవండ వైచెం బెలుచన్. 19

క. ఈరీతినతఁడు బహుమో, హారూఢింబొగులునంత నానృపతినమ
స్కార మొనరించి పోవం, దేరొకనిమిషంబులోన నెలవున కరిగెన్. 20

క. ఆతరువాతఁ బ్రవీణుఁడు, జాతరవాతతమిళిందసమితికి సుమశ
ఖాతతవారికి నిజకర, శాతరవారిజమరీచికలకే దలఁగన్. 21

క. ఆందోళన మొందుచు న, య్యిందుముఖిం బొందకున్న నిందవుఁగఁ బయీ
బొందికిఁ బ్రాణము లని య, మ్మందుం డొక నేర్పుతనదు మదికిన్ దోఁపన్. 22

క. ఆరూఢిఁ బుశోదయువం, జేరుపడిన పేదవాని పెద్దమగ్రహముం
జేరం జని యాయవ్వయు, రారమ్మని పిల్చు మెలఁకువఁ బ్రియుఁడితుఁ డగుచున్. 23.

చ. నడికొడిగట్టుజేని కనుచాటు మెలంపవతీఁగబోఁగొట్టకున్
గడుపులు డించ నింతులనుఁ గాంతవశీకరణార్థమంత్రముల్
నొడువఁగఁ బల్లవాళిగతి లోకప్రపూఁతలు మేఁతలీయు నే
కడమయు లేక నింటఁగడకిట్టితి నిన్ గొనియాడశక్యమే. 24

క. నీకీవఱకెన్నఁడు వ, క్కాకుస కీలేదు నిర్దయామతి నేలా
కోకొమ్మ్మని పిడికెఁడు, రూక లొడింజల్లి యాతురుండై మఱియున్. 26

క. నందననృపాలుసుందరి, యుందముఁగను గొంటె మొన్న నది మొద లెదలోఁ
గందర్పదర్పమార్పను, డిం దెఱకువశరణుసొచ్చితి న్నికిచటన్. 27

క. అనిదీనాలాపములా, డిన నవ్వుచునయ్యశోద దెప్పరమగునీ
పని యైన నేన్నపొంగిన, సినుఁగూర్చెదఁ జూడు నాదు నేర్పనిపనిచెన్. 28

క. రాకాశశాంకవదన వ, రాకా యుఁకినయ్యశోద రాజాంగనతో
నేకైవడిఁ గూర్పఁగవలె, నాకాముకుఁ దెలిసె నేని యానతి యిమ్మా. 29

క. అని చిలుక తేనియలు బో, రిచియెడు జడివాన వెలిసినటువలెఁ బలుకన్
తనయంతనె తానిర్చిన, విని కోమటిచిటుకులాఁడివెన నిట్లనియెన్. 30

క. ఓరామచిలుక మాకీ, మారాము ల్విట్లు తెలియు మగవారమె నీ
దారిఁ బలుపోకలం గడి, దేఱం దరువాతి శాధఁ దెలియంజెప్పుమా. 31

చ. అనవుడుఁ జిల్కఱేఁడు విడియంపుదువారపుఁ గెంపుఁగన్న జ
వ్వని నునుదొండపంటి జిగివాతెఱజాజిన ముక్కునిగ్గు వా
నన నెఱ నేయఁ గుంకుమపసంతము సల్ల కఫాపిశేషమి
ట్లని తెలుపం దొడంగె వసుధాధిపుదూతికి చిన్నఁబోవఁగన్. 32

సీ. నదు నెత్తిమ్రుచ్చిపాలికి తాలికలొనర్చి కడలుకొల్పిన గొప్పజడలడిండు
నలికభాగమునఁ జింతాకువెడల్పుగఁ బొసఁగించుకొన్న విభూతిరేఖ
సందిటం నిరుపంక నొందు పైఁడి కుసుల్లనందంబు నొందుఁ రుద్రాక్షపూస
కటితటిఁ గాసెపై గట్టిగాఁ బిగుచుట్టు గట్టినకుఱుమాపుఁ గావికోక
నాగబెత్తంబుఁ దామ్రపురందియుడ్రి, యుంగరము జన్నిదపువాటు యోగపట్టె
యుమరజంగము రా లయ్యె నఖిలపల్ల, వాళికృతసమ్మద యయ్యశోద. 33

క. ఈలీలఁ గ్రొత్తజంగము, రాలై తనవెంట శిష్యుఁడైయొక్కఁడురా
నాలలన యిల్లు వెడలెన్, గోలయుఁ బలె నొక్కపెట్టకుక్కంగొనుచున్. 34

చ. వెడలిపురంబునం గలుగు వీథులవీథుల సౌధయూధముల్
బడిబడిఁ జుట్టి యాశునకభామఁ గనుంగొని యిట్టిపుట్టు వె
క్కడనులభించె నీకు మమకారము గానము మేల్రహింపఁగాఁ
దడఁబడ నన్నెఱుంగవుగదా యనుచుం జరియించి యెంతయున్. 35

క. ఆనందనాఖ్యధరణీ, జానియగారంబు బలువజారముఁ జేరం
గా నరిగి కృతప్రత్యు, త్థానతబహువిధములందుఁ దను సేవింపన్ 36

గీ. వారితోఁ గాశికాకృతావాసననియు, నిపుడు రామేశ్వరంబున కేగుచున్న
దాననని యు ఫలాహారమాననీయ, ననియు పసియింప వైరాగ్యమారయనుచు. 37

గీ. వారుచెట్టునఁ దనుదాన యారఁబండి, వట్టిపరువంపురసదాడియరటిపంటి
గొలుచక్కెర నెయ్యిమక్కువనొసంగ, నన్నియును నన్న చేశిష్యుఁడందుకొనియె. 38

క. చూపట్టఁగ గోమయమునఁ, జేపట్టొనరించి జడలఁ జెక్కినలింగం
బాపోకలాఁడి గైకొని, వేపికడన్నిలిపి భక్తివివశయపోలెన్. 39

క. ధూపంబు కడ్డివత్తులు, దీపంబు నొసంగి తనకుఁ దెచ్చినఫలముల్
చూపి యుపహారమిచ్చి ని, శాపతిధరుఁ గుక్కనొక్కసరిగాఁ గొలువన్. 40

చ. గుమిగొని పైలపైలఁబడికొంచు భటావళిచూడఁబోవ వె
చ్చముగొనిపోవుదాదులు నిజంబుగనుంగొని యాశశిప్రభా
రమణికిఁ జెల్ప నాయమనిరంతరవిస్మయమందిచూతమా
క్రమమని వారిచేఁ బిలువఁగాఁ బనుపం జనిమ్రోల నిల్చినన్. 41

క. ఆశశిప్రభ జంగమురాల యేమి, కారణంబిటు కుక్కలింగంబునొక్క
నరిగఁ బూజింప నిదివింతసరణిగాఁగఁ, దోఁచుచున్నది తెల్పుమా దాఁచకనిన 42

క. ఆమాయలాఁడి యపుడా, కోమలిమొగముగని గోడుగోడున నేడ్వన్
గామటియు వెరవుహోపఁగ, నామంజులవాణి యనునయాలాపములన్. 43

క. ఊరార్చియడుగ నమ్ముని, జేరజమిది విన్న నీకుఁ బెనుదుఃఖంబౌ
వేరీతినైన మఱి విన, గోరిన నన్నొంటిపడుగు కువలయనయనా. 44

క. అనుమాటవిని వయస్యా, జనములు కడకరుగ నవ్విశాలేక్షణతో
మనకథయవిశదముగ విను, మనియంతనామ్మయజోగురాలిట్లనియెన్. 45

చ. మునుపటిపుట్టువన్మనము మువ్వురమొక్కటెకుఱ్ఱవింప నం
దనఘచరిత్రియైన మనకగ్రజ నాథునిఁగాని, తన్నుఁగో
రినమగవారలన్ దనవిరక్తులకుం బ్రియులైనవారలం
దనివిదీరంగఁగూడనికతంబున నీగతిఁబుట్టెఁ గుక్కయై. 46

క. నీవపుడు పేఁడువాఁడని, భావింపక గుడిసెపైచి పరులంబొందక్
జీవేరివైతివౌవసు, ధావల్లభమణికిఁ గేళితత్పరమతివై. 47

క. ఏనపుడు కోరివచ్చిన, వానిఁబ్రియుయించుటన్న వానీపతిసే
వానిరతియు జాతిస్మర, తానూనత్వంబుఁగల్గి వార్ధముఁగంటిన్. 48

క. కావునసహోదరీమై, తీవ్రవిధినీవేపితోఁజరింతుక్ శివపూ
జావేళ నైన ననియునఁ, గావిని యారాజముఖివికాసోన్ముఖియై. 49

ఉ. గ్రక్కున మ్రొక్కి పూర్వజనికాలసహోదరలైనమిమ్ము నే
నక్కఱఁదీఱఁగంటి నొకయక్కకునిట్టి యవస్థవచ్చె నే
యక్కట సేవనన్యరతనై యొకరాజును గూడియుంటిని
క్లైక్కఁడవచ్చునొక్క యిఁకనెత్తుభవంబున నిట్టిదుర్దశల్. 50

సీ. అక్కనాకిచ్చావిహారంబు గూడదీపట్టున దొరచెట్టఁబట్టియునికి
నింకొక్కజన్మమందేనియు జాతిస్మరత్వవిఖ్యాతిచేఁ బ్రబలవలయు
నప్పటికన్యపవిత్రాభావజనితమై తనకత్వ మెడలించుకొనఁగవలయు
నటుగాన ననుఁగోరినట్టి చక్కనిచిన్నవాని దోతెంచి నావాంఛదీర్ప
మాతఁడవరోధగమనమెట్లనుచు వెఱచి, యొడఁబడకయున్న నాప్రాణముత్తరింతుఁ
దనకుఁగానని యేనంటి ననుచు ధైర్య, మిచ్చితోడ్కొని రమ్మిప్పుడేగుమనిన. 51

చ. చని యదియొక్కనాఁ డరిదిజంగమురాలయి శిష్యుఁగాఁగఁగై
కొనుమఁ బ్రవీణుఁదెచ్చి యొనఁగూర్చినఁ దెచ్చుతమిన్నశిపుత్రిభా
వనరుహపత్రనేత్రియును వాఁడును వేడుకమీఱఁ గేళికిం
బనుపడి సౌఖ్యమొందిరి ప్రభావతి వింటె యశోదనైపుణిన్. 52

క. ఈరీతి నేర్పుగలిగినఁ, బోరాదోమగనికన్నుఁ బొడిచినరీతిన్
రారాదో లోకములో, వారికినికనుటగాదు వారిజనేత్రీ. 53

మ. అనియారీకృతమూకభావుఁడయి కీరాధ్యక్షుఁడుండంగ నై
ష్వనియిల్లాలతివిస్మయాంబునిధియం దోలాడుచిత్తంబులో

డనిజంబొనె యశోదవంటిది నిరూఢప్రౌఢ చేకూర్చినన్
జనితస్వైరవిహారధీరసురతేచ్ఛాకాముకశ్రేణికిన్. 54
క. అని తెల్లవాఱవచ్చుటఁ, గని నిద్దురకరిగెఁ గిరకారణజన్ముం
డును నేఁటికిఁ దక్కెఁగదా, కనకాంగికిమానమని సుఖస్థితినుండెన్. 55
ఉ. అంతటఁ జక్రవాకవిరహప్రదమా సమయంబువచ్చినన్
గంతుఁడు రాజదూతినతికన్నను మున్నగ హెచ్చరింప సం
భ్రాంతమనోజ్ఞయై యలప్రభావతి యింద్రశిలావిభూషణా
నంతరుచిచ్ఛటల్ పెనకులై తనచూపుల నంటికొల్వఁగన్. 56
క. కలపంబునలఁదికస్తురి, తిలకము పొలుపొంద రత్నదీప్తములగు నా
వలు మెట్టి మేలిమింగురు, వలువమరం గట్టి వింతవగ గనుపట్టన్. 57
గీ. రాజుతోలునాఁటిరేయివిరాళిఁగొనుటఁ, దెలుపుమను వెంటవచ్చుదూతికయుఁదాను
సరసకేతేరనక్కీరసార్వభౌముఁ, డరిదియపరంజిపనులపంజరమువదలి. 58
క. చనువేళనిలిచిపొమ్మని, యనరాదపశకునమనుట నైననీపై
నెవరునఁదెలిపెదనొకకథ, కనకాంగీవినిన నేర్పుగలుగున్నికన్. 59
వ. అనిపలికి యాభామినీమేదురావలోకనాసారంబునం దదీయాంగీకారంబు నెఱింగి యప్పతంగపుంగవుండు హాసంబుతో నితిహాసం బిట్లని చెప్పందొడంగె. 60


ఏడవకథ.

గీ. అమరసౌవీరదేశంబునందువిటత, రంగితాభంగమోహాంబురాశి చంద్ర
కార్యకృద్వారభామాప్రకాశమాన, లపనమండల మగు విశాలాపురంబు. 61
క. ఆపురము నరోత్తముఁడను, భూపాలుండేలు నతనిప్రోవ వైశ్యం
డేపారునొకఁడు ధర్మ, వ్యాపారంబలర విమలుఁడను నామమునన్. 62
ఉ. ఆతనియాలు డీలుపడనట్టిమనోజునివాలు వాలుకం
జాతముచాలు పూలుగలసంపగికొమ్మల గీలుగ్రాలుము
క్తాతతిడాలు మేలుకొనుకల్వలతావల మేలు జాళువా
జ్యోతులజాలు జాలుకొనుచూపులఁ జూపఱ నేలుప్రోలువన్. 63
క. దానికిమోహనయనునభి, ధానము దగు విమలుఁడాసుధాకరముఖితో
నానావిధసౌఖ్యప్రద, సూనాయుధకేళినింపుసొంపువహింపన్. 64
గీ. వానికైచంద్రరేఖయన్వారవనిత, మునుపు తొడసొఁకకుండియు మోహమందు
వానియిల్లాలికై ధనవంతుఁడనెడి, వన్నెకాఁడట్టిమాదివట్టి వలపుఁజెందు. 65

క. అంతటనొక నాఁడలఘుం, డంతుండేరీతి వైశ్యవనితామణితోఁ
గంతురణకేళిఁ దేలం, గాంతుం దైవకృపకలిమి గాకని మదిలోన్. 66

సీ. అవ్విటనమరుగా హేలావికృతహాసకహకహాధ్వనిసంగతాగ్రిమగంగ
యాయమ్మ పురుషుఁడభ్యర్థియైనవధూటి నబలకార్యార్థినియైన పురుషు
బలివెట్టికొలువవారలకోరుకులొసంగు నటుగాక నొకవెలయాలినంపి
యద్దేవికర్పింతుననియెంచె నాచంద్రరేఖాబ్జముఖియు నారీతిఁ దలఁచె
నిష్టమొనరించి తమినెలయించియొకనిఁ, గాళికాభక్తి చేసి నాకాంక్షదీర్చి 67
కొందుననిచూచె మఱియొకఁగూడె దైవ, ఘటన నయ్యిద్దఱకును సంగమసుఖంబు.

గీ. కల్పితాన్యోన్యవిరహంబు కంతునమర, సముదితాళీకదైన్యవాచావిధంబు
సకలధనశాంబరీచిరాశాగుణంబ, ఖండగతినొప్పఁ దద్వంచకద్వయంబు. 68

సీ. కల్పితప్రణయవిగ్రహకాలవైదగ్ధ్యజనితమాయాతాప సంభ్రమంబు
ప్రతివాక్యశపథపారంపరీవిజ్ఞాపితాత్మీయకృతకమోహాతిశయము
దంష్ఫేతరానుబంధనిబంధనిహ్నవజల్పితసూనృతశపథశతము
కపటనిద్రాజాతకైతవోత్స్వప్నప్రణామవాచామిథోనామధేయ
మురతరచ్ఛద్మసప్రియతోష్ణపగూహ, ససకృదతులితకృతవశాంతరదశంబు
సౌఖ్యముఖ్యత్వవంచనాసమ్మదంబ, ఖండగతి నుండె నవ్వంచకద్వయంబు. 69

గీ. ఇవ్విధంబున నయ్యిద్ద ఱొనసినట్లు, యుండియొకనాఁటిరేయిఁ బ్రచండకుసుమ
కాండఖండనమున సరికట్లఁ బెనఁగి, సుప్తిఁ బొందిరి తెమ్మెరల్వ్రారవాడ. 70

క. ఆమీఁదఁ జంద్రరేఖా, భామామణి లేచి యులికిపడి భయమున సు
శ్రమించఁగ ధనవంతుని, తోమాటలఁబోటుప్రాటు దొలకం బలికెన్. 71

క. ఓరీ నాయాకారము, కూరిమిపటమునను వ్రాసికోరా యదినా
మారుగఁజూడర నాబం, గారయ్యా నీవు చల్లఁగానుండుమికన్. 72

క. అనవినిమది నిదివంచన, మనికనిధనవంతుఁ డింతయాగడమేమ
య్యెనొకో నామీఁదానే, ననుజంపితి తెలుపు మనమునంబల రారన్. 73

క. కలగంటి నీవు వేఱొక, కలకంఠింగూడినట్లు గావున నీకీనాఁ
గలుగును ప్రాణత్యాగం, బెలమిం జేసికొన నిశ్చయించితి మదిలోన్. 74

చ. కనుఁగొనఁజాలవేఱొకతె కౌఁగిట నీవు సుఖింప నిప్పుడే
పనివిని నానవావశత భావిభవంబున నైనఁ జెందెదన్
నినునటుగాదటన్నఁ బరనీరజనేత్రలఁబొందనంచు నిం
పునఁజను దెంచి గంగగుడిముందఱ బ్రాణ మొసంగుమిత్తఱిన్. 75

క. అనిచంద్రరేఖపలుకం, గనఁగొని నగవలరనట్లకానివ్వని యా
ననబోఁడి వెంటరాఁగా, ధనవంతుఁడు గంగగుడి కుదగ్రితనరఁగన్. 76

సీ. కాపుగుజ్జెతలు పొంగళ్లువెట్టినపాలకడపచారికలపొక్కళ్ళతాలు
బోరలుదెప్పించి బంతులుగట్టి యర్పించుపొట్టేళ్ళనెత్తురుబుడిదరొంపి
కోర్కెచెల్లినభుజంగులొసంగఁ బెళికిన కుక్కుటకటలంపు టెక్కగుఁపు
మంత్రిగులు కొలియింపమాంత్రికుల్ పయిబోతివన్నెయుంచిన పంచవన్నెకోళ్లు
పరఁగగుగ్గులగురుధూపపరిమళంబు, శాకినీడాకినీభూతసంభ్రమంబు
చరదితిపాణివృత్తికాతురగచయము, నలమవాగంగగుడిఁజేర నరుగునపుడు. 77

క. తనుదునుమఁ దలఁచు తత్కా, మినికన్నను మున్నెయతఁడు మినిమికటూరన్
దునిమిబలిదొనఁగ సాహస, మెనయం దలమొత్తబాన యిచ్చెదననుచున్. 78

సీ. పలుకప్పనెరగొప్పపైనొప్పు బుడుతజాబిల్లితో మృదుతనూవల్లితోడ
ననుపైఁట తెరవాటుగొనునీటుగుబ్బచన్గట్టుతోఁ గప్పురంపు బొట్టుతోడఁ
గరుణారసముదారగతిమీఱఁ జూపట్టుచూపుతో రతిఁగేరు రూపుతోడఁ
దలిరాకుజిగి త్రోఁక వెలినూకఁగల మేలికేలుతో నెలదేఁటి డాలుతోడఁ
గెంపు పవడంపు జిగిసొంపు నింపుముద్దు, మోవితోగుమ్మరనునిండుతావితోడ 79
సంతసము వింతగాధనవంతుచెంత, శాంతయై రుద్రకాంత సాక్షాత్కరించి.

క. మెచ్చితి వరమడుగుమనన్, దచ్చిత్రదయాత్వమున కతం డలరి సము
ద్యచ్చరిత విమలునాకృతి, యచ్చొత్తినరీతి నొసఁగు మని వేఁడుటయున్. 80

క. ఇచ్చితిఁ బొమ్మనికాళిక, విచ్చేసినయపుడె యతఁడు విమలునిరూపం
బచ్చుపడఁ దాల్చి యందుల, కచ్చెరుపడి యింటికరిగె నతిగూఢగతిన్. 81

ఉ. అంతట నోడచేరమునకై విమలుండు చనంగ నెమ్మగన్
వంత వొలంగఁజేసి ధనవంతుఁడు వాని గృహంబుఁ జేరెన
త్యంతధనంబుతోడఁ గల మంబుధిలోన మునింగె నయ్యెడన్
దంతురవీచికల్లరికిఁ దార్చిన వచ్చితి నంచుఁ బల్కుచున్. 82

క. ఊరిదొర జేరలెల్లను, నూరార్పఁగనిట్లు వచ్చియుండెదు వారిన్
జేరినిజనాథుఁడని క, న్నీరువడింపోరఁగ మోహినీసతిపలికెన్. 83

ఉ. అక్కటప్రాణనాథ ధన మంబుధిఁ గూలినఁ గూలనిమ్ము వే
ఱొక్క తెఱంగునం బడయనోపమె విత్తచయంబు లేనిచో

నిక్కడి సేవవారి మన మెన్నఁగఁ బోలదు మింతె చాలుఁ బో
గ్రిక్కన కక్కఱన్న మొగంబులు చూచికొనంగఁ గగ్గఁగా. 84

గీ. నేఁటి కీపాటి నీవు నాత్రిటివహిమ, నింటికే తేరఁ జల్లగాఁ గంటినింక
నిదియె పదివేలు వైభవం బెల్లవాఁడు, నల్లపూసలు చెవియూకు వాఁకు జాలు. 85

క. అని ధైర్యమిచ్చి తగమ, జ్జనభోజనములను దృప్తి సలిపి దినాంతం
బున వాతెంతును దాఁగే, శిరిశాంతముఁ జేర నరిగె లీలాపరతన్. 86

క. ఈ కైవడి నెచ్చెలి తన, యాకాంక్షలు దీర్ప నిర్భరానందము తో
నాకోడె కాఁడు చివురుం, జేకత్తి నజీరు సద్దసేయక యుండెన్. 87

గీ. వచ్చె వినులుండవి నిస్తులవస్తు చయముఁ, గొనుచు నింటికి వచ్చిన ఘోరకలహ
మయ్యె ధనవంతునకు వానికాగ్రహంబు, వాదియన నాడియనఁగ నోఁగావనంగ. 88

క. పురజనులు తమ్ముఁ గనుఁగొని, యిరువురితూకార మొకటి యేర్పఱుపఁగ నె
వ్వరివశమను చుంజూడఁగ, ద్వారమ్ముందఱఁబడిరి వాదుతోడ న్వారల్. 89

క. ఆకార యేగతివారల, వాదుడుపన్నలయు వింటివా నినలేదో
పైవలియనినఁ బ్రభావతి, మోవము వెలిఁజిలుకఁ జిలుక మొకరికిఁ బలికెన్. 90

గీ. వింటివంతయు మేదినీవిభుఁడు వారి, కలహ మేరీతి నుడిపెనో తెలియరాదు
ధర్మసంకట మిదియేల తడవుసేయ, కవలికథఁ జెల్పుమయ్య కీరాగ్రిగణ్య. 91

చ. అనవిని చిల్కపల్కు వినవమ్మ ప్రభావతి యన్నరేశ్వరుం
డనఘుత మోహినిం బిలువ నంప భవత్పతి నిన్నుఁ బెండ్లియా
డినతఱి నుంకువే మొనఁగె డెందమునం దలపోసి తెల్పుమా
కనవుఁడు నూఱుమాడలనె వానిమలుండును నట్లు పల్కినన్. 92

క. ధనవంతునట్లు యమగం, దన కది తెలియమికి నీళ్లు వానమలిన వా
తని వెడల నడిచి ప్రమదం, బున నావంపతులఁ గూర్చి పొమ్మనిపనిచెన్. 93

క. ఇంతటి నేరుపు గలిగినఁ, గాంతా కడతేఱు జారుఁగ దియుట లేదా
కాంతుం డెడఁగిన నాతని, పొంతకు నే మొగముతోడఁ బోయెదు చెప్రుమా. 94

క. అని చిలుక యూరకుండినఁ, గనుఁగొని యక్కలికి దీపకళికలతోడన్
దనమోము వెలుకపాఱన్, జనియెన్నిదురింపఁ గేళిసదనంబునకున్. 95

గీ. పల్లవియుఁ జెల్లవాఱ నప్పార్థివేంద్రు, కడకుఁ జని చిలుక సేయు విఘ్నములఁ దెలిపి
యతఁడు ప్రార్థించి పుత్తెర నరుగఁ దొడఁగెఁ, బొలఁతి చెంతను నంతకుఁ బొద్దుగ్రుంక. 96

ఉ. గంధపుఁ బూఁతఁ బోలు ఘనసారపు టిరువు గుబ్బలమీఁదు హారపుం
జందెపువాటుమాటు బుసపోవని పయ్యెదనీటుఁ జూడఁ బే
యందగు మేలుముసుంగమర నల్లఁ బ్రభావతివచ్చె మామగాల్
పొందినరాచవాని యొఱలోనికి టూరిఁ దుటారమాడుచున్.

ఉ. వచ్చినఁ జూచి కీరము రువారము మీఱ ముఖారుణద్యుతుల్
బచ్చెనపన్న నానృపతిపాలికిఁ బోయెదవే మెము పొమ్ము నీ
యిచ్చకు వచ్చినట్లు రమియింపుము కానొక మాటపుట్టినన్
నెచ్చెలి లేదుబంతియను నేర్పున దిద్దుకొనంగఁ జాలినన్.

చ. పదినెలపోరుమాన్ప నిజవల్లభు నిద్దుర పుచ్చి మామనో
రదమెఱఁగ నత్తగారికి భయంబొనరింప మఱందినూరకే
గదమఁగఁ బోడికోడలి కొకానొకనిందఘటింప వచ్చుఁ బో
కదిసిన నేర్పుచేత బెళుక స్వైరవొందిన జారకాంతకున్.

—ఎనిమిదవకథ—

ఉ. ఇందులకొక్కగాథ గలదింతటిలోఁ బతిపాటిపోవఁడో
యిందునిభాననావినుమ యిందిరకుం దిరమైన యిల్లు నం
క్రందనరాజధానికెనగాఁ దగుశూరవరావలోక మా
రందసమాఖ్యచే నొకపురంబు పరంతపరాజు ప్రోవఁగన్. 100

గీ. అచట జనవల్లభుండన నమరు నొక్కఁ, డంగసౌష్ఠవమున రతి యానవంగ
నలరు మెండైన నిండుప్రాయంబుకలిమి, రస్తుమీఱుచు నాతని గేస్తురాలు. 101

గీ. వీటఁగల కోడెకాండ్రెల్ల వింతరతుల, జవులనురగించి భయములజ్జయును దీర్చి
జారవిద్యలఁ గడు గడిదేఱియామి, టారివిడిపడ్డమరు తేజి దారిమీఱి. 102

క. తిండికతంబునఁ గండలు, మెండుగఁ దాఁబెంచి మగఁడు మెదలఁ డనుచు నె
ద్దండత నది మిండనికిన్, వండిన కుడు మనఁగ దుద్దువెఱిరి మెలఁగున్. 103

చ. పలుమఱు నేఁటిసేటి కని పానినఁ బిల్చెద నంచు బోలురో
కలికిని గూరగాయ కొనఁగావలె నంచొకతేనికార్యమే
పలుకుచుఁ గోడెకాండ్ర కనుపండువుగా నడయాడువీథిన
వ్వల నికమాట లేల తలవాకిటఁ గాఁపుర మయ్యె దానికిన్. 104

చ. కలయని వింతవాఁ డెదురుగానడతేరఁగఁ జూసి యవ్వలం
బెళుకుచునమ్మచెల్ల తరుణీ చెఱఁగించుక సోఁకెదానికిం
దలఁపున నేమినేయునొకదా యని, నెచ్చెలితోడఁ బల్కి మె

చ్చులు దులకింప వాఁడు తనుఁ జూచినఁ బక్కున నవ్వు వీఁగులన్. ౧౦౫

గీ. తనదు చిన్నెలకై యాసఁ దడవుసేయు, నసుగవచ్చిన మనసురానట్టివారి
రట్టుగావించి మగనాలిఁ బట్టఁడాసి, తొర మెట్టోయటని దుమ్ము తూరుపెత్తు. ౧౦౬

క. కంటికిఁ బ్రియ మగువానిన్, గెంటని తమకమునఁ గామినీభూతి మనన్
వెంటఁబడి కౌఁగిలింపక, నింటికేఁబో దవ్విఘాటి కెంతటి తమియో. ౧౦౭

క. పతిఁ బ్రక్కఁ బండినప్పుడు, రతికోంగక నిదుర వోదురా యరయ్యో వా
చతురుఁడ గురుకలు చాలున్, గతి చెప్పు మటంచు వానిఁ గడుబాధించున్. ౧౦౮

క. ఇట్టివగ నడుచు తనవగఁ, జుట్టములకుఁ దెలుపు మగని సుద్దులు విని యా
దిట్ట చని వారితో మఱి, యెట్టువిడుం దన్ను సాఘుఁడోల్లఁడటంచున్. ౧౦౯

గీ. మఱియు నమ్మాయలాఁడికో మటి నెలంత, లందఱును గువ్వకోల్గొనియగడు సేయ
వారిఁ గూర్చుండఁ బెట్టి తా వర్తనంబు, దెలియదేకవ విూకంచుఁ బలుకఁ దొడఁగు. ౧౧౦

ఉ. అన్నెము పున్నె మేనెఱుఁగ నమ్మ మతిం బతి నాదు పాలికిం
బెన్నిధిగాఁగఁ జూతు మెఱమెచ్చులుగా వొరు నట్టివాని నేఁ
గన్నులనైనఁ జూడ నిదికల్లయొ సత్యమొ చూచుచున్న వాఁ
డన్నలినాప్తుఁ డింకొకటి యారజ మట్టిపడ నెమ్మలంగుదున్. 111

గీ. అట్లు మెలఁగుట యేమిటి కంటి రేని, నింక నెక్కుడి సిగ్గు మాయింటి యతని
శానపుట్టింప మెలఁగుదు నట్టులయ్యు, బూచివలెఁ జూచునను వానిఁ బొడిచి త్రోయ. 112

చ. కలిగిన వాఁడు గా మరునికన్నను వన్నియగల్గువాఁడు గా
కులమున మేటి గా నపతి గోరము గానమటంచు నెంచి వే
డ్కలకెదురేగుదు న్మగఁడు గల్గియు లేని విధంబు సేసి తా
నెల గలనైన నన్నుఁ గరుణింపఁడు భోగము వారిపొందునన్. 113

క. నాసుద్ది యింతగనిమది, నోసమనక తనదు సెట్టి తొత్తులకేమో
బాసలఁట బండికండ్లఁట, చేసన్నఁట విన్నవారు చెప్పిరి నాతోన్. 114

గీ. పాన్పు కెక్కించి తనప్రక్కఁ బవ్వళింపఁ, గోరి నేఁ జూడ శీలు తాఁగుడిచి కట్టి
యూరకే యిల్లు వెడలు నాయుసురు తాఁకి, దీపములు సైత మల్లాడుఁ దెఱవలార. 115

సీ. పతిపత్నినని మేనఁ బసుపుపూసికొనంగ సొగసులాయని ముంతపోఁగ ఘటించుఁ
బెనిమిటి గలదాన నని కాటుకధరింప వేడుకలాయంచు విఱిచికట్టు,
ముత్తైదువనటంచుఁ బత్తిబొట్టువహింపఁ జిన్నెలాయని కాలఁజేతఁ బొడుచు
ధవసంగత నటంచుఁ దలదువ్వి ముడిచిన మురువులా యని ముడ్డిపోఁతి సలచుఁ

బొలుపు దిగవాడి నేచిన్నఁబోయి యున్న, నతనికెక్కడ కీడౌనొ యనుచు వాతఁ
డెంత చేసిన నేమాన కింటఁగలుగు, సొమ్ము మెయిఁబూని కానని చోటుఁ గందు. 116

క. ఇల్లిలనుండ నింటం, బల్లియు నను జౌకసేయు పలుకులు వినరే
యుల్లెడ లోకములో మగఁ, డొల్లని యాసతిని మారి యొల్లదనంగన్. 117

ఉ. వాకనరాదు గాక మలినత్వము పోగయి సేయు జోకలన్
రేకల నన్నుఁ బోలఁగలరే కలకంఠులు నేరరాయయో
పోకలు వారబాలికల పోలిక వారలమాయ చేతనన్
జౌక యొనర్చు నాథుఁ డదిచాలక దిట్టును గొట్టు నెప్పుడున్. 118

చ. కటకట నన్ను దూరెదరు గాక వివేకము లేక మీరు ని
చ్చట మగవారు లేరెకద చర్చయొనర్పఁగ వాఁడు దానికే
మిటి కని నాథుఁ గూర్చువిధి మీరలెఱుంగరె యిట్టిపోడిమే
యటమట పైనఁ దాళవశమా నెఱపాపియపుఁ బూవుబోఁడికిన్. 119

క. అని చిత్తిని మగఁడొల్లని, తనువేటికిఁ దనకటంచు దయపుట్టఁగ బో
తున బాష్పంబులు తెలిగనుఁ, గొనలం గురియంగ గోడు గోడున నేడ్చెన్. 120

గీ. వారలెల్లను బంగారువంటి నిన్నుఁ, బాసి పలుగాకులకుఁ గొంగుపఱచు చెలుల
నంటివర్తింప వానికేమాయె ననుచు, నంతయు నిజంబనుచు నిండ్ల కరుగు నంత. 121

క. జనవల్లభుండు బాంధవ, జనముల వెనఁగూర్చి భార్యవందము దెలుపన్
విని వారందఱు దేమని, నెనరున గద్దింపఁ జిత్తినీసతి కడకన్. 122

గీ. ఇంత యేటికి నీరేయి నితఁడుపడుక, టిల్లువెలువడి యెక్కడికేగుఁ దలుపు
మూసి గడియు బిగించెద మోనసోక, తెల్లవాతేన మీరది తెలిసికొనుఁడు. 123

క. ఏనిల్లు వెడలిపోయినఁ, దానుగవాటంబు మూయఁ దలఁపఁడె యంతన్
దానం దెలియదె తనవగ, నా నేరము సెప్పఁడేటి నగుబాటి వటన్. 124

క. అనవిని వారిది యగునని, చనుటయు నానాఁటిరేయి శయ్యాపయినా
ఘునిపక్కనుండి తమిరేఁ, గినఁ జిత్తిని చనియెఁ దలుపు గిఱు కనకుండన్. 125

గీ. అంతనిద్దురలేచి వైశ్యాగ్రగణ్యుఁ, డనుఁగుటిల్లాలు లేకుంటఁ గనికవాట
బంధన మొనర్చి తానుండెఁ బాన్పుమీఁదఁ, బంత మీడేరె ననుచున్న యంతలోన. 126

చ. చనుఁగవజోడు పోటొక భుజంగునకుం బదఘాతమొక్క జా
రునకుఁ గటాక్షనీలమణిరోమ లొకానొక జారకానికి

న్మనసిజకేళి యొక్కయుపనాయకునకు వ్వలిగించి వేగ జా
మునఁ జను దెంచెఁ జిత్తిని సముజ్జ్వలకేళిగృహంబుఁ జేరఁగన్. 127

గీ. పచ్చియరరనిరోధంబువలనఁజూచి, కాంతుచేష్టయెటింగి చేగడియ దివియఁ
గూడ దెత్తఁగరాదింకఁ గోరిపచ్చి, చెనఁటిచుట్టాలచేత బజీతవగుదు. 128

క. అరియెంచి వరుని వాకిటిఁ, కనుపం దానిల్లుసొచ్చి యరరముమూయన్
దనతప్పుఁ దప్పఁజిత్తిని, వనితా యేతోవ్రత్రొక్కవలయుం జెప్రమా. 129

గీ అనఁ బ్రిభావతి రసభంగ మగు నిదేల, మాటిమాటికి నడిగి నామన్కిఁగొనఁగ
వినఁగఁ జిడిముడి పడియెడుపీనువోయి, చిలుక నాతోడ నీవది తెలుపు మనిన. 130

ఉ. కీరముకెంపుసొంపు నడఁగించు మెఱుంగులముక్కుటెక్కు చె
న్నారఁగఁ బల్కెఁ కల్కివినుమత్తఱిఁ జిత్తిని చిత్తవీథిలో
ధీరతఁ బూని లేనితెగదెంపు వహించుచుఁ బల్కెనల్కతో
నేరము లేని దానికరణి న్బతి యింపున నాలకింపఁగన్. 131

గీ. వెడలిపోయితి నిన్వీథి వెంట నరుగు, పెండ్లివారలఁ జూడ నాపిన్నతనము
గూల నింతటిలో వట్టికోపమెత్తి, తలుపు బిగియించె మగఁడేమి తలఁచినాఁడొ! 132

క. చుట్టాలచెంత నాకుఁ, బట్టానరింపఁగఁ దలఁచెనా యందుకు వా
రెట్టును జాలరెకా నడి, గట్టఁగలరె నోనటఁ గన్న గలవాలైన్, 133

ఉ. ఏనటువంటిదానవె యహీన పతివ్రిత నేను గల్గఁగా
వానలుఁ బంటలుం బుడమివర్తిలునింత యెఱుంగ లేక తా
నేననురవ్వచేసినఁ దృణీకృత మింతె శరీర మొక్కమ
ట్టైన ననూనదుఃఖ మెచయన్ దనకాఁపుర మెత్తిపోవదే. 134

క. కానీ బహుతరతోయా, నూనంబైనట్టి బావి యున్నది నేను
న్నానందమిగులఁ జప్పడు, గానపుడే యగ్గయాళి గ్రక్కునఁ జనియెన్. 135

క. చని నూతిలోపలగుభు, ల్లన నొకగుండెత్తి వైచి యల్లనఁ గనుచా
టున నిలువఁబడియె నిజమని, జనవల్లభుఁ డాత్మలో విచారముమీఱన్. 136

క. ఎత్తెదగాకనిచనియె, న్మత్తచకోరాక్షి కేళిమందిర మపుడు
ద్వృత్తిఁ జారబాఱి మూసిన, ముత్తెమువలెఁ దలుపుమూసి మొక్కలమిడియెన్. 137

క. అదిగని నివ్వెరఁగునఁనె, మ్మదిగానక తద్వరుండుభ్రమాన్పడి యుండెన్
• జడికిలఁబడి యుంతట రవి, యుదయించిన వచ్చి బంధు లొక్కటఁ జూడన్. 138

గీ. వారితో నది యోయన్నలార కంటి, రా వితవిత గనన్నింత ఱట్టు సేసి
తానె తొత్తులకాంక్ష మదంబుకతన, నిల్లుపట్టక తిరిగెడు నివ్విధమున. 139

క. అని పలుక వార లలుకన్, జనవల్లభుఁ డిట్టి వానిజాతికె వెలిగా
నొనరించిపోయిరోచ, క్కనికొమ్మ యింత నేర్పు గలిగినఁ బొమ్మ. 140

క. అనినఁ బ్రభావతి తనయా, తన్మెనెయౌరా యాఁడువారి తల్లియ యనిచి
త్రినిఁ బొగడి తెల్లవాఱుటఁ, గని చనియెం గేళిలసదగారంబునకున్. 141

వ. చని యథోచితవిధంబునం బ్రవర్తిల్లెఁ దదనంతరంబ క్రమక్రమంబున. 142

చ. హరనటనాతివేగగళితాలికలోచనవిస్ఫులింగమై
సరసిజబంధుఁ డస్తగిరిచక్కటివ్రాలఁ దదీయకీచకో
త్కరములు గాలుక్రిందఁగుపొగల్బలెఁ జీఁకటి పిక్కటిల్లె నం
బరమున మించుఁ దత్త్రుటిత మౌక్తికముల్బలెఁ జుక్కలొప్పఁగన్. 143

చ. అపుడుప్రభావతీ రమణి హారమణీఘృణి ధోరణీప్రసూ
నపటలయు న్వినీలవసనభ్రమరాళియు నైలతాకృతిం
గపురువహించి వచ్చిన శుకంబు మనోరథసిద్ధిరస్తు తే
చపలవిలోచనే యని యనన్యపు దీవననిచ్చి యిట్లనున్. 144

## తొమ్మిదవ కథ

ఉ. వింటివె యొక్కవింతకథ వీనుల కింపు ఘటింపఁజాలు ని
ష్కంటకరాజమౌళి దొరగా విదిశాపురి మించు నందునే
వెంటఁ గొఱంతవోని పృథివీసురుఁ డొక్కఁడు సోమశర్మ పే
రింట నెనంగు భార్యయయి రేవతిపేరి వధూటి గొల్వఁగన్. 145

సీ. గాదెలఁ గొలుచు ముక్కారుఁ బండెడు మళ్లు నత్తొఁపు నడబావు లండ దొడ్డి
యాఁకుఁదోఁటలగుంపు పోఁకఁబ్రాకులు గుత్తచేలు గొఱ్ఱెలకదు పాలమంద
చెఱకుగానుగ మొదలైడకవర్ధిలు నేర్పు. బానిసెల్బడవాళ్లు బంటుపైద
పారిగోడలు గొప్పపడసాల మేల్మచ్చు గారముంగిలి వింతగాని పొడుగు
రాగి నగలు సదాచారరతియు దేవ, పూజనిత్యాన్నదానంబుఁ, బూనబొట్టు
చిదురఁ జల్లిన తులసెమ్మ చిన్నితిన్నె, గలిగికనుపట్టు నాతనికాఁపురంబు. 146

*గీ. ఇట్లు వర్తింప నాతని యింతి గర్భ, కలితయై చిట్టుముల బయకలు మొగమునఁ
దెలుపుఁ గనిపింపఁ దొమ్మిదినెలలునిండి, పసిఁడిరేకనఁదగు నాఁడుపడుచుఁ గనిన. 145

గీ. పురుడు వెడలినవెనుక నాభూమిదేవుఁ, డాశిశువు జన్మనక్షత్రమరసి ఖిన్నుఁ
డైసురార్చన మొనరింపఁ నరుగుదేఱ, కన్నఁ గనుఁగొని రేవతీయువతి చేరి. 146

క. ఇదియేమి మీర లిత్తఱిఁ, జదివితి రేమేమొ పడుచుజాతకమునకై
†యదిమొదలు చిన్నఁబోయితి, రెద నడరెను భయము నుడువుఁ డేలా దాఁపన్ 147

క. అవని యిది యేమియుఁ లే, దనఘగుణా! మీఁద జారయగునిది యటుగా
వునఁ జింతించెదననఁబతిఁ, గనుఁగొని యమ్మగువ నగవుగలమొగ మలరన్. 148

¶క. ఔరౌరెండ యేటి మాటలు, మేలే యిది బ్రదికినట్టిమీఁదటఁగద యీ
జోలి యెట్టులైన నైదువ, రాలై మనపడుచు గాఁగ నమరినఁ జాలున్. 149

క. అని చని యాయమజననీ, జనకులకుం దెలుప సంతసంబున వారల్
విని మనుమరాలుగావున, ననువారము దాని జారయని పిలుచుటయున్. 150

గీ. ఊరివారెల్ల రావె యోజార యనఁగ, నదియె పేరయ్యె నాజారకంబుజాక్షి
యంతనదియింతయై యంతయై వినూత్న, శైశలాకారయై మించి పెండ్లికెదుగ. 151

గీ. అడుగవచ్చినవార లయ్యబలరూప, శీలకులగుణ విఖ్యాతి చాల మెచ్చి
జారయను పేరు విన్నంతఁ జాలుటయును, బిఁట మీఁదిటి పెండ్లిండ్లు పెక్కులెడసె. 152

చ. పొలుపుగ మోసులెత్తుచును పూపలు బొమ్మన నిక్కి నాఁకట
న్నలమలమాడఁగాఁ జెలఁగుమాసిన దోసము వచ్చునంచు న
గ్గలికలతల్లి కూడఁగఁగట్టె మహీసురజాతిధర్మముల్
దెలుపుచుఁ బెండ్లిపేరకట దేవుఁ డెఱుంగు మెఱుంగుబోఁడికిన్. 153

క. వేడుకపనులకువచ్చిన, వారింగని పడుచునడుగ వచ్చిరటంచున్
గారాబుకూఁతునకుసిం, గారించుం దల్లియాస్యకమలం బలరన్. 154

క. ధరణీసురమాత్రుఁడు పే, దరయక యరుదెంచి పెండ్లి యాడినఁజాలున్
వరదక్షిణతో నిచ్చెదఁ, దరళేక్షణ ననుచుఁ దండ్రి తలచు న్మదిలోన్. 155

గీ. వార లీరీతి నుండిరో వామనయన, యంతబుద్ధవంత మనునగ్రహారమునను
వినయవిఖ్యాతి మించు గోవిందుఁడనెడు, బ్రహ్మచారిచతుర్వేదపారగుండు. 156

---

*గీ. కలికి యాతని కులకాంత గర్భచిహ్న, కలితయై చాలముద్దులుగులుకు మొగము
†యదిమొదలు చిన్నఁబోయితి, రిదియంతయు నాకుఁ బలుకుఁ డేలా దాఁపన్
¶పోరెండ యేటిమాటలు, జాలిం బడ నేల మనము సరగున దీనిం
బోలంగ నొక్కఁ దెఱఁగునఁ, బాలింత మటన్న నతికిఁ బతియిట్లనియెన్.
క. చాల యిది యాయు వలపుచు, మేలిమిగా బ్రదికినట్టి మీఁదటఁ గదయీ
జోలి యెట్టులైన నైదువ, రాలై మనపడుచు గాఁగ నమరిని జాలున్.

గీ. ఆతఁడుపనీతుఁడైన యనంతరంబ, తల్లిదండ్రులు పోవ సంతాప మెడలి
యప్పురీవరమందె విద్యార్థియగుచు, నఖిలవిద్యలుఁ దనకుఁదా నభ్యసించె. 156

క. అంతట నవ్వటు మణికిన్, గంతుపరబ్రహ్మతాపఖండనచణవే
దాంతతిరస్కృతికరణా, నంతంబైనట్టిజవ్వనం బరుదెంచెన్. 157

వ. ఇవ్విధంబున సంప్రాప్తయౌవనుండై యతండు సమావర్తనహోమంబుల వేల్చువారలం గనుంగొని పెండ్లివేల్చియుఁ గల్యాణకంకణధారులం గనుంగొని యేకాదశులు నాకబలిసంవిధానంబు లాచరించువారలఁ గనుంగొని గుబ్బకిల్లుమ్రింగియు నూతనవధూయుక్తులై యూరేగువారినిరీక్షించి మదంబునం గుందియు నార్తవశోభనపరాయణులైనవారలం గనుంగొని ఖిన్నత్వంబునొందియు వివాహవాంఛార్థియుండై కన్యార్థియై పోయి యొక్కచోట నక్షత్రానుకూల్యంబులేక మనోవైకల్యంబునందుచు నొక్కయెడ జాతివిరోధంబైన వెలవెలంబాఱుచు నొక్కచో రాశిమైత్రిత్వంబు చాలకుండినం బెండువడుచు నొక్కచోట గణవైపరీత్యంబైన సత్యంతంబు సంతాపించుచుఁ బుడమి యెల్లం జెల్లందిరిగి యలబ్ధమనోరథుండై యుండి నెండియు. 158

గీ. మునుపు చదివిన శాస్త్రసమూహమెల్ల, నూచముట్టుగ నొజ్జలకొప్పగించి
యుద్వాహకేళి చింతింపు మనికిఁ జేసి, పలుకునిద్దురలోఁ బెండ్లికలవరింత. 159

క. ఊరెల్లఁ దిరిగిచిరేనియు, పారంబగుచింత మునిఁగి పలుకం డడిగోఁ
జేరెవివాహమ్ముఁటన్నం, గోరంబగు కాంక్ష నొచునోరే తెఱమన్. 160

గీ. ఇట్లు చింతించి యప్పటుఁడేఁగుదెంచి, సోమశర్మగృహాళిందభూమి కొక్క
నాఁడు గ్రాసార్థమైరాఁగ వానిపాము, మర్యాదంబున నడిగియు నప్పుడుండి. 161

క. మనయింటఁ గన్నెయున్నది, యనఘా యిదియేమి పెండ్లియాడెదవే వీ
కును మాకును బంధుత్వం, బనుతరమై బ్రహ్మనుండి యమరినదరయన్. 162

క. అనియాముని యనవుడు మది, యనఘా యే బ్రతికితిని మదన్వయ మిదిపా
వనమయ్యె ననుచు నవ్వటుఁ, డుచితరగతిఁ దత్పదద్వయంబున వ్రాలెన్. 163

గీ. ఆతఁడును బొంతనున్నవాళ్ళెల్ల నరసి తెన్ను, యున్నవని పక్కయారేయి యొక్కలగ్న
మేర్పఱచి యిరుగడలనెరుగ నెఱుఁగకుండఁ, దనతనూభవనతనికి ధారవోసె. 164

ఉ. అంతట దానిపేరు విని యల్లుఁడు మెల్లన మామగారి నే
కాంతమునందుఁ జేరి వినయంబున నీయభిధాన మెట్టిదో
కాంతకుఁ గల్గెఁ దెల్పు మనఁగా విని యాతఁడు దానిపూర్వవృ
త్తాంతముఁ దెల్పి దీనిఁ జెడుగై పడనీయక కాచికొమ్మనెన్. 165

గీ. మంచివని నాగవల్లట మించినపుడె, యాలిఁదోడ్కొని తనయగ్రిహారమునకుఁ
బోయి తనగృహమధ్యంబు పొందుటకుఁగ, నైన బోలయక యుండంగ నలవరించి. 166

క. తలయంటు నలఁగుఁబెట్టున్, జలకములాడ్చు న్నెఱుంగు వలువలు గట్టెన్
దిలకంబుదీర్చ్చఁగలపం, బలఁదుంగోవిందుఁ డయ్యెయోరికి దినమున్. 167

గీ. ఇట్లు పోషింప నాశారదేందువదన, కెలమి జవ్వనోత్తు తెంపుఁ గన్నులును ముద్దు
లొలుకు నవ్వులుగులుకు గుబ్బలమెఱుంగుఁ, జిలుకు పెక్కులుఁ దగునయశ్రీ నెనంగె. 168

వ. అంత.

సీ. పీఠనే నెనుపోఢిపిటుఁడు పాడెనువింత యేలపడా లట్టె యాలకించుఁ ✓
బొరుగింటిమగవాని పొలుపైనఁ జెనగోడయివ్వలటోటిపై నెక్కి చూచు ✓
నాయివారి ములకై డాయువారలతోడ జోలిద్రిప్పుచుఁ బెక్కు సుద్దులాడు ✓
వరునతో మాటాడవచ్చినప్రిలమోల రాకపోకల నోయారంబు నెఱపు ✓
నింటికే లెంచు నెదుకింటి యింతితోడ, దానిచ్చావరయాధినాథునిపర్తనము లడుగు
రతు లెఱుంగకయున్నె యారాజవదన, వాఁతతప్పింపఁజేయు నెవ్వరితరంబు. 169

*గీ. ఆగ్రహంబున నిచ్చావిహారమునకు, మనసుపరువులు వాఱ నేమాడ్కి నైన
సందు గానక యిపపంజరములోని, చిలుకపోలికఁ దలఁకు నక్కలుకలాఁడి. 170

క. ఆలలన జారలీలా, లోలితమతి యుకుపుపెట్టులో జాణవునీ
వాలోచన మెయిఁ దెలుపుము, బాలాయనఁ జిలుకతోఁ బ్రభావతిపలుకన్. 171

†క. మగువయె విడిచెదననిన, న్మగవాఁడానిలుపువాఁడు మానము నీవే
మగఁ జెప్పెదవో వినితగుఁ, దగ దనియెదఁగాని తెలుపుతక్కక యెల్లన్, 172

చ. అనవిని మంచిదంచు విహాగాగ్రిణి యిట్లను నట్టిభార్య వ
ర్తనమున కార్తినొందు మతిఁ దద్ధరణీసురమౌళి యొక్కనాఁ
డనుపమవైభవంబలర నార్తవశాంతి యొనర్చి నిత్యశో
భన బహులాభకారి యగు బ్రాహ్మణభోజన మైనచిన్మటన్. 173

గీ. చిఱునగవుతోడ నిజకాంతఁ జేరఁ బిలిచి, నీకు నేర్పెడువారలు లేక యునికిఁ
దెలుపవలెఁగద కేళిమందిరమునొకట, తోయజామోద యెల్లను డాయువిధము. 174

క. మొగమున మసిబొట్టులు కర, యుగమునఁ గప్పెరయుఁ గత్తియు న్వ్రేలుచెలుల్
దిగమిడ్ గన నసుపులనులు, దగఁ జేరఁగవలయుఁ గేళిధామంబునకున్. 175

*అనుదినంబును నిచ్చావిహారమునకు.

†మగువవలపగలుమువలపులు, మగవాఁడానిలుపువాఁడు మానమునీవే

గీ. అనిన నంగీకరించి తా నానతిచ్చి, నట్టె యేతెంచు దానితో నతను కేళి
దేలి ప్రతిరాత్రమును నట్టి తెఱఁగు మీఱఁ, బడుకయిలు సేరఁగా నేఱుపఱచె నతఁడు. 176

ఉ. అంతటఁ గొన్ని నాళ్లరుగ నయ్యురగాయతవేణి యేటికిం
గాంతుఁడు వోవ వీథిఁ బొడకట్టిన కేశవనామభూసురుం
జంతతనంబునం దలుపు చాటున నుండి కరారవిందసం
భ్రాంతిని సన్న చేసి వలరాయని బాఁకి లోనొనర్చినన్. 177

గీ. అతఁ డదియాదిగాఁగ నయ్యబలమగని, మెఱఁగి చావడిలో నిల్చి మొగము సూపుఁ
జిన్నలకు లోఁగు కంచంబు చెంత పిల్లి, కరణి నెదురింటి వాకిటఁ గాచియుండు. 178

క. గోవిందుఁడు నవనవగా, నావిధ మించుక యెఱింగి యాత్మోపాయ
శ్రీ వెలయింపఁగఁ దలఁచిర, సావేశమ్మున మెలంగు నంగనతోడన్. 179

క. ఎల్లుండి సమారాధన, చిల్లరవెచ్చములు గొనఁగ శీఘ్రమె యిదె యీ
పల్లియసంతకుఁ జనియే, నెల్లిటికరుదెంతు పదిల మిల్లని పలుకన్. 180

చ. అది మదిఁ దోఁచు వేడుక బయల్పడనీయక వేఁడికంటనీ
రొలుకఁగ మోమువాంచ నతఁ డోచెడుఁ దిప్పమ్మరి నమ్మ దాశ్రువు
ల్గవయివి యంచు నాత్మను దలంచుచుఁ జింతిల నేల తే పెన
చ్చెద నని బుజ్జగించి యతిశీఘ్రము నం బురి నిర్గమించినన్. 181

క. అతఁ డూరు వెడలిచను డ, య్యతివ పడింబదిగఁ దెలిసి యప్పుడాయెదుటన్
ధృతినిల్చిన కేశవుతోఁ, బతియరుగుట తెలిపి గూఢభంగిన్మతియున్. 182

క. ఈరేయి నన్ను నిలువున, నీరుగఁ గరఁగింపవలయు నేఁడున్నవి నీ
నేరుపు లన్నియు నని నయ, గారవపువగలాఁడి యనుపఁగా నతఁడరిగెన్. 183

క. రవి గ్రుంకెఁ బంకజాత, చ్ఛవి డొంకెన్ జక్రవాకచక్రోల్లాసా
రవ మింకె జారరతమా, నవి బొంకె న్సాధునీతి నాథునితోడన్. 184

క. అంతట నగ్గోవిందుం, డెంతయుఁ గనకుండఁ బడుకయిలు సొచ్చి తద
భ్యంతరమున వస్తునమా, కాంతం బగు నటుకమీఁదఁ గదలకయుండెన్. 185

గీ. అంతటను గేశవుం డూరి యలబలంబు, మట్టుపడఁ జూచుకొని మాటుమణఁగె ననుచుఁ
గటికి చీఁకటి నెఱ నేస్తకాఁడుఁ దాను, ధృతియెసంగఁగ దాని మందిరముఁ జేర. 186

చ. ఎనయగ వచ్చియు న్బడుకటింటికిఁ దెచ్చియు మోవియిచ్చియుం
గుదురు మెఱుంగు గబ్బిపలిగుబ్బల గ్రుచ్చియు నాతగానికిన్

ముద మొదవించి యమ్ముదిత మున్నటికైవడిఁ గేళిగేహముం
గదియఁ దలంచి లేచి చని గ్రక్కున దా కటుతామసించినన్. 187

క. నన్నిచట నుంచిచనిరెం, గన్నియ మఱిరాక తడసెఁ గపటోపాయం
బెన్నెనో తా నెవ్వఁ డెఱుఁగుఁ బ్రి, యన్నాంబుజముఖుల యింద్రజాలము లెల్లన్. 188

గీ. అనుచుఁ దద్భూసురుం డెంచునంతలోన, సురియ నిప్పులు రాలుక న్నెరయు మొగము
మీఁద మసిబొట్టుమించ నెక్కులఁ దేరాఁగఁ, జూచి దిగులొందియిదిగోఁ బిశాచి యనుచు. 189

గీ. అతఁడు పరువెత్త నిదియేమియారపోకు, పోకుమనుపల్కులోడ నప్పుడదినడచి
వెంటనే యంట నీవయు వేగఁగాలి, పోవనిమ్మంచుఁ దనగేహమునకు నేగ. 190

గీ. అంతలో దాని పెనిమిటి యటుకడిగ్గి, గూఢముగ నేగి పెరటి బల్లోడదాఁటి
వెలుపటికి వచ్చి యెవ్వరే తలుపు తెఱవ, వేయనుచుఁ బిల్వ నచ్చెల్వ వేనుమడఁచి. 191

క. గడియసడలింప నతఁడ, య్యెడనవ్వగలాఁడిఁ దప్పకీక్షించి యిదే
మడరెఁ బరపురుషవాసన, చెడుగా నోడువుమని కాలఁజేతం దన్నెన్. 192

చ. అదిమొదలవ్వధూమణి పరాప్తికి దండము వెట్టె వానవా
భ్యుదయము నాయకుం డెఱుఁగునో యని యెంతయుఁ గేళవాఖ్యనం
విదితతదీయమూర్తులయి వేడుక కాండ్రిది తల్లితోడుగా
మదిగణియించిరోచెలి సమర్పణమయ్యెనె వాని నైపుణుల్. 193

క. అనినఁబ్రభావతి యిదిగా, దనవచ్చునె పురుషులే యుపాయపరుల్ వా
రిని గెలువఁ దరముగా దని, యినుఁడుదయింపంగఁ బడుకయింటికి నరిగెన్. 194

క. అంతఁగ్రమంబున నలినీ, కాంతుం డపరాబ్ధి మునుఁగఁగాఁ బుణ్యజనా
త్యంతార్తికరణపాపం, బంతయు వెడలె ననఁ దిమిరమడరెం దఱచై. 195

చ. అనుపమలీలనప్పు డసితావరణాంబరదీప్తిగుప్తయై
తనులత మబ్బులోని తెరతళ్కులమించు నవల్చిదూతిఁ దో
డ్కొని చనుదేరవచ్చునల సోమటికోడలికొమ్మఁ జూచి యి
ట్లను శుక ముత్పలాశముకుళాంచలచంచలచుంచుచంచువై. 196

చ. పనివడి రాజుఁ జేరఁ జలపట్టినదానవు చేరకుందువే
విను మఱి రాచవారు మదవిహ్వలు లించుక నేరకున్నఁ గో
పనియతిచేత మొక్కపటుపం దమకింపుదు రట్టులైన నా
థునియెడ బొంకఁగా వెరవు దోఁచినఁ బొమ్మ సరోజలోచనా. 197.

## పదియవకథ.

గీ. అమ్మ దీనికి నొకయితిహాసమలరు, వినుము ఘనశాలిఁ డనురాజు పెనుప వెలయు
మేదురోద్భటభటసింహనాదచలిత, దిగ్గజపురంబు పద్మావతీపురంబు. 198

క. అందు సువేషుండను ధృతి, మందరనిభుఁ డొక్కఁ డమరుమరుకోద్విరితూ
ఫుం దెగడి సుమతియను పే, రండినసతి యంవగత్తై యై వర్తింపన్. 199

గీ. ఆతఁ డిల్లాలిపై మోహమతిశయిల్లఁ, బెల్లుగాఁ జల్లవిడిచి వర్తిల్లు కతన
నరయఁ బాటించుకొని గణనాథుఁ డనెడి, బంటువానికి మానముఁ బ్రాణమిచ్చె 200

గీ. కూర్మిఁ జొట్టుఁ జేపట్టుకుంచ మగుచు, వాఁడు వర్తింప నెఱనీటు పగలు పూన
నెంచి యుంచుక యైన నాసించదొరని, రతుల కాసించదా చేరె బ్రాణవిభుని. 201

క. తలనొప్పి కడుపుకుట్టుం, బలుగురుపుం గాళ్లతీపు పాటించుచు వ
చ్చెలి మూల్గుఁ బాన్పుమీఁదన్, జెలువుఁడు దత్తచ్చికిత్స చేయన్నగుచున్. 202

*క. మున్నె కొలువున్నవానికి, జన్నె విడిచి యన్నెలంతె చక్కనివరు నే
మన్నా రావన్నా పో, వన్నా యనుఁగాని యోయి యన దెంతైనన్. 203

క. కనుచాటుతిండి నడిపెన, పనులం గండలును బెరిఁగి బహుతండ్రిహిడిం
బుని కొడుకన గణనాథుఁడు, ఘనబలమున బిరుదుజెట్టి కైవడి మెలఁగున్. 204

సీ. చెప్పనిపని నీళ్లు చేఁదెద ననిపోవు సంతకుఁ బొమ్మన్నఁ జింతసేయుఁ
జేఁటఁ గైకొని యాళ్లు చెరిగెద ననిపోవు దండు వొమ్మన్న సంతాపమందు
వలదన్నఁ గంపలు గొలిచిచూడఁగఁ, బోవు నగరికిఁ బొమ్మన్న దిగులు పడును
నొనరవేఁపగ నెంచు నెనఁగ లెత్తఁగఁ బోవు నారికిఁ బొమ్మన్న నులుకుఁ జెందు
నింటిలోపలి పనుల నెన్నైనఁ జేయుఁ, గడపదాటఁడు పనియైనఁ గళవళించుఁ
బెట్టుపోఁతల సొగసాని సెట్టిసాని, యింటికడనుండి నట్టాడు బంటువాఁడు. 205

క. ఇది యేమి సెట్టి యెఱుఁగఁడె, కద పెంచినచనువుబలిమికిఁ డఁ బనిముచ్చై
యొమరాడుచున్నవాఁ డని, మది నెంచుచుఁ బొడము కినుక మగుడ నడంచున్. 206

గీ. అంతనయ్యారిదొర ముత్తియములఁ జూచి, తెమ్మని సువేషు డవ్వలదీవి కేగు
మనుచుఁ గట్టడసేయఁగా నతఁడువచ్చి, పయన మెఱిగింపసుమతి సంభ్రమము నొంది. 207

సీ. మలయుచో మధురాతిమధురాధరలవాఁడిచ్చినాఁరిగోరు నీచెక్కుమీఁద
నానుచో రంగస్థలాబ్జగంధులగుబ్బ మెఱుఁగుఁజందోయి నీయురముమీఁద 208
మించుచోఁ గాంచికాచంచలాక్షుల ముద్దుమొనపంటినొక్కు నీమోవిమీఁదఁ

*తన్ననిప్రాయమువానికి.

చేరుచో నెల్లూరునారీమణులకెంపుపసమించుటనుగు నీనొసటిమీఁద
* నింటనుండిన నీసౌఖ్యమేలకలుగు, ననుచుఁగన్నులనూరార్చియక్కుఁజేర్చి
మోవిచిగురంట నొక్కి తాంబూల మొసఁగి, పోయిరమ్మనిపనిచె నప్పాపుబోఁడి. 208
గీ. అంతబుడిబుడి యేడ్పుతో నడలు దాని, బుజ్జగించుచు వేషుఁ డప్పుడె ప్రియాణ
భయసముత్కంపితగ్లాని బంటువాని, నింటికడనిల్పి పైనమై యేగుటయును. 209
చ. ఇపుడుగదా తపంబు ఫలియించె నటంచు మహానురక్తి భా
వపరత రేఁబవళ్లు తలవాకిలి వేసినయట్టు లుండ స
న్నపువిరిదమ్మితేకువసన న్మరుతూపులఁ దుష్ప్రమించఁగా
నపరిమిత ప్రమోదరసులై రమియించిరి వారలిద్దఱున్. 210
క. ఇంటి మగఁ డయ్యెదానికి, బంటుతనం బుడిగి వాఁడు బానిన యయ్యెన్
నంటున బోఁటియు వానికి, నింటన్ మేలువడి పాఁగ నిచ్చం బరఁగున్. 211
క. ఈరీతి మెలఁగువారల, దారుణ్విని రాజుకొడుకు ధవళాఖ్యాకుం
డారాగగ్గోలుగన, న్నారిపయింబడుదు వని ఘనం బగు ప్రేమన్. 212
క. ధనముల జాలెలు రతనపుఁ, బనితగు నొకవరుసపొమ్ముఁ బనిచిన గణశా
ధునకీవచ్చుఁగ దాయని, యని కోమటికొమిరె వాని యప్పనఁగొనుచున్. 213
ఉ. అమ్మక చెల్ల నేను వెలయాలనొ త్రిమ్మరి నై పురంబునం
దిమ్మరఁజూచెనో తనకుఁ దేటమిటారపునిండుఁబ్రాయపుం
గొమ్మలు లేరొ నాముకగోకయుఁ గోమటిబిడ్డ వీఁకయున్
నమ్మతమయ్యెనే యని యసత్యపుఁ దక్కులు తక్కివెండియున్. 214
క. రమ్మను మిచ్చటికిది, కానిమ్మని యనకున్న నగర మేలెడిదొర దా
నెమ్మదిఁ గనలుచు దండుగఁ, దెమ్మనిన నెట్టియెడఁ దెచ్చు నెవ్వఁ డతున్. 215
క. అనిపనిచిన దూతికయుం, జని తెలుప నాప్రజసుతుఁడు చరమాంబునిధిన్
మునుఁగరవి నెఱయుచీఁకటి, గనుఁగొని కేలుట్టిపడఁగఁ గట్టాయితమై. 216
చ. తలపరులింతనంత వెడదాఁటులతో గగనంబు చించులీ
లలవిలసిల్లి వెంటఁ బదిలంబుగ రాఁ జని యూడిగంబులన్
వెలుపలనిల్పి తానొకడ వేగ నగారము సొచ్చి యోరవా
కిలియయియున్న తల్లలితకేళినిశాంతముఁ జేరి యచ్చటన్. 217

* నింట నేయుండఁ బెరమచ్చెకంటినంటఁ, గూడకల్లాడు నీక నుకూలుఁడయ్యె
నృపతి పయనంబు చెప్పుట నీవుగోరు, పోడుములుగల్గు నీఁక నేమి పోయిరమ్మ.

క. కనియెం బాన్పునఁ గినుకం, బెనఁగొని కాట్లాడుపికిలిపిట్టలచందం
బున సుమతియు గణనాథుఁడు, మనసిజరణకరణకేళిమగ్నతనుండన్. 218

క. కనుఁగొని యిదినుఁబిలువం, బనిచియు వేఱొకనిఁగూడఁ బాడియె యని యె
ఱ్ఱకనుఁగవతో ముడిఁచిన, కనుబొమ్మలతోడఁ జేరఁగాఁజనివేగన్. 219

క. బెదిదపుటడిదముఁ గైకొని, గడితపుటొఱదుస్సి వాఁడిఖడ్గము చేతన్
దడఁబడ మొదలంటంగా, జడఁగోసి యతండు వేగఁజనియె లతాంగీ. 220

క. అమ్మఱునాఁడె సువేషుఁడు, క్రిమ్మరి యయ్యారయేటికడనుండి ప్రిమో
దమ్మునఁ దనరా కనుగుం, గొమ్మకుఁ దెలుపుమని బంటుకొడుకుం బనిచెన్. 221

గీ. వాఁడువచ్చి మగఁడువచ్చినాఁ డనువార్తఁ, దెలిపినపుడె భీతిఁ గలఁగె సుమతి
నెఱులపోకకింక వగనితో నేమని, బొంకవలయుఁ దెలుపు పువ్వుబోఁడి. 222

చ. అనినఁ బ్రభావతీరమణి యద్దిరయయ్యెడ బొంకుటెట్లు నే
కనినదిగాదు విన్నదియుఁ గాదది తెల్పినఁ దెల్పు లేకయుం
డిన మఱి యూరకుండెదవు నేనిటువంటి వెఱుంగఁ జాలుచాల్
దినమును రాజుఁజేరఁజనఁదీరక నీకథవించునుందు నే. 223

మ. అనినంగీరము కోపమేల వినవమ్మా కొమ్మ యమ్మేడ్కిఁదె
ల్పినబంటుంగని యారుజాబ్జముఖి మేల్వాయేండ్లువర్ధిల్లు చ
క్కనినా నాథుఁడు వచ్చెనంచు మునుగల్గవ్వచ్చి యా మేలువా
ర్త నిజంబొందఁగఁ దెల్పితంచు పాదిమేరల్మఱు ధైర్యంబునన్. 224

గీ. శాకికజ్జ సెఁవోడనె గొళిపలికెఁ, బొలిచెనట్టింటఁ గుమ్మరిపువ్వు మెలఁగి
యిన్నియునుగల్ల గాకుండ నేగుదెంచె, హృదయనాయకుఁడోయన్న యిదియెచాలు. 125

క. అనిపతితో నేనటకుం, జనుదెంచినదాఁక మీరచట నే యుండం
బనిగలదనుమని పనిచినఁ, జనియె న్వాడంత నవ్విశాలేక్షణయున్. 226

క. ఇల్లలికి ముగ్గువెట్టి మ, హోల్లాసము పల్లవింప నొక్కమెఱుంగుం
బల్లెమునఁ గోసివైచిన, యల్లజటాఖండ మిడియు నలరులతోడన్. 227

ఉ. ఐదువరాండ్లతోఁగదలి యాత్మమనోవిభుఁడాయఁబోయి య
ప్పైవలివేణితోఁ జెలఁగుపల్లెర మారతిభంగిఁ ద్రిప్పి యా
మోదముఁ జూపె నాతఁ డదిముందఱఁ దెల్పుమటంచు వేఁడఁగా
నాదయితుం గనుంగొని దృగంచలమం దుదయించు సిగ్గునన్. 228

చ. చెకుకలగాంచి దానిఁ జని చెప్పితిఁ బెద్దలతోడ వారల
య్యెడ ననుఁజూచి నీదుహృదయేశుఁడు వచ్చెనటంచు విన్ననె

కృ_డు నెనరొంద( గీలుజడ(గోసి నివాళి యొనర్చు మప్పుడే
కడమయు లే దటంచనిరి కావునని త్తఱి నట్లచేసితిన్. 229

క. నెఱులన(గ నెంత తేఱె, పురిగొని తెగబా రె(డేసి పొడమెడుమీరే
ముసువుగ జడయల్లెదరీ, కరణిన్నీరగు దేర(గాంచు టె చాలన్. 230

చ. అనన త(డింత భక్తిగలయంగన యింటవసించినాకుశో
భనములు గోరగా(గద యపాయము చెందక క్షేమలాభము
లనియిలు చేరుటంచును దలంచి వధూమణియుక్తు(డై నికే
తనమున కేగె వింటివిగదా సుమతీస్ఫుటచాతురీస్థితుల్. 231

చ. అనవు(డు( జిల్క(జూచి వణిగగ్రిణిరాణి సుపాణి ముత్తెపు
న్నిమకులురాల ఁవ్వి యొకనీరజలోచన యట్లొనర్చినన్
వనితలకెల్ల వచ్చునపవాదశతంబని పల్కునంతలో
నిను(డునయింప(గా( బడుకయింటికి నేగె నసిద్ధయత్నయై. 232

ఉ. అంత(గ్రిమంబునన్రివి నిజాంతరశౌరినిమామగారిగే
హాంతము(జేర్చు గారి నపరాంబుధి(గు్రింకవారితోత్సుక
స్వాంత ప్రిభావతీవికచవారిజలోచన చేరినిల్చినం
గంతుపతాణియుంగతలకారితనంబున మీఱి యిట్లనున్. 233

క. చనియె వవక్క_ఱితోన, య్యనుపక్కుకు( దో్రివనొక్క_ యిక్క_కైనన్
గనిమొక్క_వోకగ్రిక్కు_న(, జనుదేఱ నుపాయ మెఱు(గ(జాలుదె బాలా. 234

వ. వీతదర్థసమాయాతం బగునొక్క_పురాణవృత్తాంతంబు గలదంచు మాటల(బీ(టవెట్టి
యా సెట్టిపట్టితో(జలపట్టి పచ్చచట్టుపలపిట్టదిట్ట యిట్లనియె. 235



## పదునొకండవకథ.

*క. నలినావాసం బన(గా(, గల దొక పురమబ్ధికన్యకామణికిందా
వలమైఘదసారంగో, జ్జ్వలఘీంకారవిదళితదిశాభాగంబై. 236

క. ఆనగర మేలు దుర్ధమ, సేనుం డనునృపతి యతనిచెంతను శూరా
ఖ్యాను డనునొక్క_ రౌతుమ, హానతరిపుభీతిహేతు వైవర్తిల్లున్. 237

---

*క. గంగాతీరముచెంతను, బొంగెడుసంపదలచేత( బూర్ణంబగుచున్
శృంగారఖనియొ యిదియన(, జెంగల్వపురంబు పేర( జెల(గుచునుండున్.

సీ. గీఱునామము చిన్నికోరమీసలు చెంపఁ బసిమట్టుసికబొందు పట్టునూలు
వెనుకకట్టుదుమాలు వెడఁదగాయపుఁగాయదారిఁ గాన్పించు గందంబుఁబూఁతే
కమ్మిసపంచెయు గట్టికమ్మిదుప్పటి పల్లెవాటు కెంగేలిలో వంకవంకి
పట్టుచేనపరంజిపదుజాతోఁ దగుకత్తి పలుచని బచ్చెనపావుకోళ్లు
చికిలిచొకట్టు సరిపెణలిక మెసంగు, నుంగరంబులు నొకవింత యొఱపు నెఱప
నేలినాతనికొలువున కేగుచెంచుఁ, జూపఱు నుతింపనయ్యాయుధోపజీవి. 238

క. ఆతనికిఁ గలవాప్రియయను, నతిగల దయ్యాతిన నడచుచందము మెల్లన్
మతివరయ నతనిపాలిటి, ప్రతిబంధపుఁ బేరఁటాలు పంకజవదనా. 239

క. ఆరమణీనడత యొకటియుఁ, బేరొకటియుఁ గాక యుండఁ బెనుదుఃఖముగాఁ
బోరాడవిసివివేసరి, శూరుఁడు స్త్రీహత్యఁ జేయఁ జూడనికతనన్. 240

గీ. వెడలనడిచినఁ బ్రీతిరాజవీరమనెడి, పురమునందున్న పితృగేహమునకుఁ బోవఁ
దలఁచి యయ్యింతి డింభకద్వయముతోడ, నరిగెఁ బథికులచే మార్గమరసికొనుచు. 241

వ. ఇవ్విధంబునం గతిపయప్రయాణంబుల నరిగి యొక్కనాఁటి పయనంబున నదిమా 242
ర్గంబు తప్పి కాలిత్రోవంబడి యక్షుద్రనిద్రావిరామసముదితవ్యాఘ్రకిశోరక్షు
ధారావసమాకర్ణనాతిభీతగర్భనిర్భరకానవలోకి పలాయమానధేనుకావితానంబును
దదీయశ్రవణపవనచలితకీచకానోన్యకర్షణసంజనితధనంజయశిఖాభిముఖధావనాశా
ర్దూలంబును, దదీయభీషణాకారవికారావలోకనమాత్రత్రస్తతటాకగాహనపరాయ
ణవరాహంబులును, దదీయపతనచలితజలజాగ్రసముత్పతద్రథాంగసముత్తుంగపక్ష
పుటపటపటాత్కారసంభ్రాంతసకలశకుంతంబును, వెండియు వలీముఖపరికంపితశా
ఖాగళితకుసుమరసవిసరంబులపై ముసురుకొనునసమభసలంబుల వినీలంబైన నేలయుఁ
గురంగనాభికానద్యత్స్రుతమృగమదపంకిలంబైనభూమియు నభేదత్వంబుఁ జూపఁ బ
రిస్రుతప్రసవపరాగంబును, నస్తచ్ఛదరంభాస్తంభపతితరజోవ్రజంబును వేఱులేక
మీఱఁ దరణికిరణవిదారితవేణుముక్తాముక్తామణులును నచిరప్రసూతకుండలివనితాం
డంబులు నఖండంబులై మెంచుకొనఁ గానరంబులకు వానరంబులును, గవయంబుల
కు నిలయంబులును, దుప్పులకు నెప్పును, జమరవాలంబులకు విభ్రమస్థానంబును, భ
ల్లుకంబులకు సల్లోకంబును, ఖడ్గసంతానంబునకు నిశాంతంబును, మయూరంబులకు
జయారంభస్థానంబును నై సురనరదుర్గమనీతాగ్రయగు నొక్క యరణ్యానిం బ్రవే
శించి కించిచ్చలనంబులేక యాయ్యాకాశమధ్య యాభ్యగ్రియురీమధ్యంబుఁ గూర్చుం
డి మార్గాన్వేషణంబు సేయుచున్న సమయంబున. 243

గీ. చెంతబొఱెదులోనికుంజాంతరమున, నొక్కబెబ్బులియుండి యయ్యవిధిఁజూచి
కూర్చెనాహారమాఁకలిగొన్న నాకు, దైవమని యంతలో వేఱుతలఁపు వొడమ. 244

క. ఇదినాపద మిదినానద, మిదినాపాద చేరవెఱతురెవ్వరు నేఁడీ
మనవతికి నెన్నిగుండెలో, కదలక నేయున్న యునికి కార్యమెఱుంగన్. 245

ఉ. ఈవన మెల్లనేనెఱుఁడు మృగేంద్రుఁడునైతిను సాపరాధుఁడై
సేవకుఁజూరి నామఱుఁగుఁ జెందినచో మదనజ్ఞమీఁదసం
భావితుఁ జేసి వాని బహుమానముతోఁ గొనిపోవుఁగాని తే
జోవిభవంబు చూపవెఱచుం బలవంతుఁడ నేను గావునన్. 246

గీ. అట్టినన్ను నుఁజేరి భయంబులేని, పొలువుతో నున్న దీపువుబోణి చెంత
ననుచుఁ గవుకునఁబట్టరా దరయుపలయు, యోజనయొనర్చి సేయుట రాజనీతి. 247

క. కార్యాకార్యము లెఱిఁగిన, యార్యుఁడు నామంత్రి జంబుకాగ్రేసరుఁడా
ధైర్యనిధి సుమతినాయకుఁ, డర్యమపదభక్తుఁ డెచటి కరిగెనొ యెఱుఁగన్. 248

గీ. అతని రావించి నావిచారానువృత్తిఁ, జెప్పెదునొ దీని నేటి విచారమింకఁ
గమిచి నామేనిరక్తమాంసములఁబీల్ప, సాఁగె నతిగాఢతరలుఠజ్జాఠరాగ్ని 249

క. అని తెంపు చేసి కనకనఁ, గనుఁగొనల నిప్పు లురలఁగా వాలము భూ
మినిఁ దాటించుచుఁ దద్గళ,మును జూచుచు గుఱక యుఱుకఁ బోనటు లున్నన్ 250

క. ఆబ్బెబ్బులిఁ గన వచ్చెం, దబ్బెబ్బులిఁ కేమి సేయుదాన ననుచున
బ్బిబ్బోకవతి మనంబున, నబ్బురమును భయముఁ ద్రొక్కులాడఁగ నుండెన్ 251

క. ఆకలహప్రియపులిచే, నేకరణిం బ్రదికె యూరికేగఁగ వలయున్
రాకేందువదన తెల్పఁగ, దే కందముగాని నీయతిస్థిరబుద్ధిన్. 252

క. అనినఁ బ్రభావతి యిఁక నే, మని తెల్పుదు నాకుఁ జూడ నగపడియెన యా
వనితపులివాతి ; కేగతి, వినిపించెదొ దాని బ్రదుకువిధ మిఁక మీఁదన్. 253

ఉ. నావుడుఁ జిల్కపల్కు లలనా వినుమత్తఱి నవ్వధూటి ప్రి
జ్ఞావతియౌట నిప్పులినిజంబుగ నన్గనుఁగొన్న యప్పుడే
చేవదలిర్పఁ బైఁబడక చింతయొనర్చుచుఁ జేలుపోయి నే
సేవగదాననో యనుచు నీయెడ భీతియుఁ జూపఁగాఁదగున్. 254

క. అనుచుఁ దనూజులనిద్దఱఁ, గొనగోటం గిల్లి వారు కోయనియేడ్వన్
గనుఁగొని యారాచ్చవిధం, బున నిట్లను విసివినట్టిపూనిక దోఁపన్. 255

గీ. ఏలయేడ్చెద రాఁకటికేమి యొల్ల, రకట పులిమాంసమే కాని యన్నలార
మీకొఱకు వ్యాఘ్రములఁ జంపిమీఱుకతన, మాఱుచుఁ జివ్యాఘ్రిపాంతమున్నైరుఁగంటి
256

క. ఇలువాసి మేఁకు గ్రాసపు, బొలవాసిం గూర్పరోసి భువి ఘోరమృగా
వలికింపలఁకక యడవిం, బులికిం బులినగుచుఁ దిరిగి పులిపులిసైతేన్. 257

గీ. ఐననేమయ్యె నిచ్చోట నరయుచున్న, దానఁబులులున్నవోయని కాననిఁక
రెండుగలిగిన మీయిద్దఱికిని జాలుఁ, గాకయొకటుండినఁ జెజెసగఁబుగలదు. 258

క. అనిపలుక (జఘుకుమదిఁ జెనఁ, గొనఁగా మేసెల్ల ముచ్చికొనుచుం బులిమె
ల్లనెయవలికిఁజనివెసఁ జం, గునవచ్చటిలతలు దెగించికొనుచుం బారెన్. 259

క. అనినఁబ్రభావతిమదిఁబ, ర్వనని వ్వెఱనుక్కమీఁదవ్రేలిడి తలయూఁ
చి నిజంబుగ మగువలెపో, ఘనసాహసలనుచుఁ బొద్దుఁగని పల్లవితోన్. 260

క. కనుఁగొంటివె యదిచక్కన్, మనసిజనృపకీర్తిరుచిసమాజపు మొక్కన్
మినుకులకులములయిక్కన్, వినుచుక్కంజొక్కమైన వేగుంజుక్కన్. 261

గీ. అనుచుఁ గేళిగృహంబున కరిగె మఱిగ్రి, మక్రిమంబునఁ దరణిబింబంబువార్ధి
నపరవారాశిఁపఁనుజూఁచి యచటిమీన, కోటిపలలఁబటంచు ముక్కులనుబొడువ 262

మ. తనమేనందగఁదోఁచుసొమ్ములయివం దజ్జ్యోతిఁజోఁగొంచున
ల్లని మేలౌ బురుసీసుకప్పడము చాలన్మించ నేతెంచెఁ బ
చ్చనివిల్కానిజమూస్పవం బగ జిరాసంజోక తేజీవిధం
బునవవ్వేళఁ బ్రభావతీసుదతి చూపుల్వన్నెలంబర్వఁగాన్. 263

క. చనుదెఁఱఁ జిల్కతక్కర, మునవ్రాలి మెఱుంగుబోఁడి ముక్కుకొనఁజులు
క్కనఁగీరికడమకథయున్, వినిపోయినలెస్స గాదె విమలేందుముఖీ. 264

వ. అనిపలికి రాజసంభోగసమారంభవిజృంభమాణాధీనంబగు నమ్మానవతీమానసంబుఁదృ
ప్తి, చెంగటం జెలంగు మెఱుంగుటపరంజిపీఁటపయిం గూర్చుండిన యక్కురంగనయన
తరంగిత నిజవాంఛాఫలరసవీచికలం బ్రార్థింప నింతింతతరితీపుచూపుచుఁ గీరపుంగ
వం బిట్లనియె. 265

మ. వినుమారీతిఁ బదాభిఘాతపతితోర్వీజాతమై భీతివీ
డనిశీఘ్రింబున దూరమేగి దగవోట్టన్ వ్యాఘ్రిమాపండ ను
న్ననిగండోపల మెక్క యక్కలికి యంవం బందు నల్దిక్కులన్
గనుపింపన్వడగుంక్రీకాయు లదరంగాలూఁదలేకున్నెడన్. 266

గీ. కనియెఁ దన్మంత్రియైననృగాలమాళి, సుమతినామకుఁ డారీతిఁ జూచి యచటి
కేమిటికివచ్చెనో వాని నేలినాతఁ, డనుచుఁ జెంగటిపొదఁజేరి యాత్మలోన. 267

సీ. తనయున్కి యెఱుఁగకుద్ధతిఁ జెంతఁ జనుదేటికొదమపైఁ బెట్టదుకూర్రదృష్టి
వగ్గలగంతుబంతగవేయుచున్నట్టి కంఁదేళ్లఁబట్టని యందమేమొ

చెంగటఁ దిరుగుచు జెంగునదాఁటెను దుప్పులఁబట్టకతప్పె నే మొ
నొక్కెలంబునఁజేరి సొక్కుచుఁదిరుగాడు మనుబోతుఁబట్టంగ మఱచె నే మొ 268
యనుచుఁదనలోననూహించి యాత్మఁజెవరి, చూచి ధైర్యంబు వదలక చోద్యమంది
చెంతఁజేరఁగ భయమంది చాలఁగలఁగి, తలుచుభ్రమవొంది యంతటఁదా నె తెలిసి. 269

ఉ. నాలుక వ్రేలవైచి వదనంబు వివర్ణతధంబుఁ జెందఁగా
మ్రోలఁ జెలంగియాడెడు రురుప్రముఖంబుల మీఁద నేమియున్
వ్రాలనిచూడ్కి గుండె యదర న్నిలుపోపక యున్న యట్టి శా
ర్దూలకు లేండ్రుఁజూడ భయవోషముఁ జెందినరీతిగన్పడన్. 270

క. నాయంతమంత్రియుండి య, పాయం బగునట్టివేళ నధినాథుసుఖ
శ్రీయుతుఁ జేయక యుండుట, నాయశ్శి యిదిపోదు పతివనంబలరింతున్, 271

క. అనితలఁచి సుమతి చేరం, జని పులికిం గేలు మొగిచి సవినయముగ న
వ్వనినుండి యుబుసుపోకం, జను దెంచితి రేను యిచటి జాడలు చూడన్. 272

క. దొరవైన యతఁడు మఱచియుఁ, బరభూమికిఁ బోవరాదు పనిగల్గినచో
నుదుతరనిజభటయుతుఁడై, యరుగందగు లేక యున్న నాపద లొదవున్. 273

క. అసహాయశూరులరుగను, కసనుత్సాహంబు వొడమఁగానచ్చితిరి
వ్వసుధయుపు గంటిరేకద, వసతికిఁ బోవుదము తడయ వలదిచ్చోటన్. 274

చ. అనఁబులి యాతఁ డచ్చటిమృగాక్షికఠోరవచో విశేషముల్
వినినది లేదుగాన బహువింతలు తెల్పెదనంచు నెంచి నె
మ్మనమునఁ దోఁచుభీతిని నమందతరస్వర మొప్ప నాతనిం
గనుఁగొని పల్కు దైన్య మధికంబుగ దిక్కులు పాఱఁజూచుచున్. 275

క. వినుతల్లికి నేమగలం, జనియించితి నేఁడు నీదుసల్లాపకథా
వనధిం దేలఁగ బుణ్యం, బునికిం బ్రిదికిని కీర్తిభూషణమూర్తీ. 276

ఉ. సిగ్గులచేటు సుమ్మదివచించిన నాప్రొఁడ వాట నీకు నే
నిగ్గురుభీతిహేతువిపు డింతయుఁ దెల్పెద నన్యులెవ్వరీ
డగ్గఱలేరుగా మనదిటంబుఁగనుంగొన నంచు మెల్లనే
యగ్గజయానపల్కిన మహాకటుభాషలు విన్నవించినన్. 277

క. ఆఁటుదిగా వదిమృగముల, వేఁటాడన్వచ్చుమృత్యువే తప్పదు పో
రాటమిదియేల యిచ్చట, నేఁటికెడయొనర్చుకొనుట నీతియొకాదో. 278

క. అనిపలుక సుమతి యెంతయు, విని యకటా యెవ్వతెయొ వివేకవిహీనుం
డని యితని బేలుపఱచెం, జనదుగద్దా పిరికిదొరల సరసంగొలువన్. 279

క. పతికిభయమునదరుచో నది, యతిశయముగఁ జేసి మాన్పఁ దైబ్రిదుకుం గు
త్సితమంత్రి యతనిఁ గైకొను, నతిదుర్మతి యైన నాథుఁ డాప్తుఁడు గాఁగన్. 280

వ. కావున నేకాచారంబగు నమాత్యపథంబునం బ్రవర్తిల్ల వాకునకారణభయభ్రాంతుండైన యతని కనుగుణంబుగా నడుచుట కర్తవ్యంబు గాదు బహుకాలంబేతద్గృహంబునఁ బోషితుండనై యుండి యిప్పేరవుఁ దెలపకుండిన సామాన్యులలోఁ గణ్యుండనగుదు నితండు మదీయ వచనంబులు వినియె నేని మే లట్టు గాక దుర్బుద్ధియై మదీయ స్థానహానిపర్యంతంబుఁ దలంచినఁ దలంపనిమ్మని నిశ్చయించి యా సృగాలంబు శార్దూలంబు నకిట్లనియె. 281

గీ. ఎలుఁగులకు వేరువిత్తు దుప్పులకు గండ, మేదులకుమిత్తి శేళ్లకు నెదురుచుక్క
కాసరంబుల పాలిటికంటినొప్పి, యపదు గాదు గదా భవదన్వయంబు. 282

చ. అలవియె యింగ కొక్కుపులి కల్గినవాఁడయి భీతిఁ జెందియ
కొక్కులపగఁ దీర్చుకోఁ దలఁచి కోడె వయాళి వజీరుఁ డెప్పుడున్
మెలగఁడు వ్యాఘ్రచర్మమును మీనెఱడాగు ధరించి శూరతా
కలన భవత్కులంబునకుఁ గల్గదు జోడు మృగాన్వయంబునన్. 283

క. భిన్నేతరమగు నకలన, మున్నతవిభవాభిజాత్యమున్నదె కద ని
న్నెన్నుతతిఁ గొంచ గాఁడవె, యన్నన్న నఖాగ్రనిర్జితారివి గావే. 284

గీ. ఇట్టి నీవొక్కభామయే మే మొపలికె, ననుచు వెఱచితి నను టెల్ల నరయ నాకు
బుద్ధిశోధింపగాఁ బోలుఁ బొనఁగ దొరలు, తలఁప సేవకహృదయభేదకులు గారె. 285

గీ. కాక వెఱచినమాట నిక్కంబయేని, నేఁడు నీవంక శార్దూలనికరమునకుఁ
జెల్లఁబో మాంసకబళంబు బెల్లమయ్యెఁ, జ్ఞాతిపరివారములనోట బగ్గిపడియె. 286

క. మనుజాంగనయఁట తనయుల, కనపరతము పులులదుర్తింతు నవెనఁట యిదియే
వినినంతశరీరముతోఁ, జను దెంచితె యకట నీదు శౌర్యముగూలన్. 287

గీ. రమ్మనవా వెంటఁ గొంతదూరమునను, డంటతనమున నను వెన్నునంటి చూడు
నీకుఁ గైకాన్కఁ జేసెద నేఁడు దానిఁ, దత్తనూజులకంఠరక్తంబుఁ గ్రోలు. 288

క. అనవిని శార్దూలంబను, వినుమిచ్చటఁ బ్రేలవచ్చు వెసదానిఁ గనుం
గొనవంతమాట వెడలునె, నినుఁ బోఁటికి నేనెఱుంగనే నీబలమున్. 289

క. తగిలించుకొన్న పిమ్మట, నిగిలించుటె కాని కార్యమేమున్నది యా
మగువఁ జననిమ్ము పోవుద, మగునె యసాధ్యమున సాహసాదృతి నలుపన్. 290

క. దలయున నది పైఁబడినన్, జులుకనివాఁడ నని యుఱుకఁ జూతువు మఱి మాం
సలదేహుఁడ ధావనచే, నలసితిఁ బసఁ వెత్తఁజాలనా నిటనీఁదన్. 291

క. నావుకు గోమాయు వనున్, నీవిటు తప్పించుకొన గణించెదు కాయం
బీపగల డాఁచికొని యా, హా విను మెన్నేండ్లు బ్రిదుకు దయ్యా మ్రింగేందా. 292

క. బలవన్మృగసంఘములయెడఁ, దలపంపుల కోర్వలేక తత్తిమెవ మదిలోఁ
దలఁపకు ఒహుళ్భీతిని లె, మృగలఘుపరాక్రమ మొనర్ప నందుం గీర్తుల్ 293

క. నను నమ్మవేని యిచ్చటి, వని తీఁగెలు చుట్టి పెనచి నాకుస్కంధం
బెనిపైచికొమ్ము ర మ్మికఁక, నిను జూచిన నప్పుఘూటి నేలం గూలున్. 294

గీ. అనుచు నక్క నిజాభీష్ట నకులకార్య, మెనయ భోధించి పెన వైచికొనుమఁ దెచ్చెఁ
గురుబలావళిఁజేర నుత్తరుని ధైర్య, శోభితుని జేసి తెచ్చు నర్జునుఁడు వోలె. 295

క. ఈలీల వచ్చు నాశా, ర్దూలన్మృగాలముల భయముతోఁ గనఁ జేయుం
జాలుట గలనాప్రియ కిం, కేలాగునఁ గలుగవలయు నిందునిభాస్యా. 296

గీ. అనుచుఁ జిలుక పలుక నాప్రభావతి యిట్టి, యవగడంబు మాన్ప నది యెఱుంగు
నిపుడు నీవెఱుంగు నింతియేకాని యీ, తెంపునగలు మాకుఁ దెలియ వనిన. 297

శా. కీరం బిట్లను నట్లు ఘోరతరభంగిన్ వ్యాఘ్రిగోమాయువుల్
చేర నార్చిఁ దిలకించి యవ్వనిత కించిద్భీతియున్లేక ధై
ర్యారూఢిన్ మృగధూర్తముం బలుకు నాహా సత్యవాక్యత్వమీ
దేఱం దబ్బఱకాఁడ వైతి గద యింకేరీతి పెరింపుదున్. 298

గీ. పులులరెంటిని దెత్తు నీపుత్రియుగళి, మునకు నని నమ్మిక లొసంగి పోయియిప్పు
డొక్కశార్దూలమును దెచ్చియొప్పగించె, దొల్లఁటో కాననేఁడు నీయునుఱుఁ గినుక 299

మ. అనుమం దిగ్గన లేచుదానిఁ గని యవ్యాఘ్రీంద్రి మహోర భ
ద్మనసేసెం గద నక్క యెక్కడణి నమ్మన్వచ్చు నందు న్భయం
బున దాని న్వెస నీడ్చికొంచుఁబఱచెన్ భూభాగ మల్లాడఁగాఁ
దనకంచుం బసవెత్తుచోఁగలవె కాంతావంచనానంపదల్. 300

క. అనఁజిలుక కాప్రభావతి, మునుపటి వగకన్న నధికముగ వెఱపించెన్
వినుమా కలహాప్రియ యిం, తనిరూఢం బైన నేర్పు దానికె చెల్లున్. 301

వ. అనిపలికి విరహిజనమథనంబున మనసిజుండు పట్టించు ధమ్మ్యధారోదయంబునుం బోలి మిక్కుటం బగు కుక్కుటారవంబున నరుణోదయం బగుట యెఱింగి యక్కురంగనయన యంతఃపురంబునకుం జనియెఁ దదనంతరంబ. 302

క. వనజరుచిఁ గొనఁగ సమయం, బనుచోరుఁడు రోదసీగృహముఁజొచ్చి భయం
బూనఁ బఱవ నడఁచుదీపం, బును బోల్పంబడుచుఁ బొద్దు పొటుకునఁగ్రింకెన్. 303

చ. పరివిమలమౌక్తికంబుల తురాయి నిగన్నిగల న్మెఱుంగు చ
న్గవ నును గెంపుపండల దగద్ధలం బయి లొందవీక నీ
లవసనపు న్మెసుంగు పొదలంగఁ బ్రభావతి వచ్చె నత్తఱిన్
గవిసెన లోపలం జకచకల్గల దర్పణలక్ష్మిఁ గేరుచున్. 304

క. వచ్చుటయు నిచ్చలంబున్, బచ్చలపంజరము వెడలి పడఁతీ యిదె రే
యిచ్చట నున్నా నని యను, పచ్చనివిలుకాని తేజిఁ బరికించి వెసన్. 305

క. నిన్నటికథ మఱి యింకా, నున్నదియో యుండె నేని యుచితవచస్సం
పన్నతఁ దెలిపెద గ్రక్కున, న న్నరపతిపొందు నేఁటికైన న్వలయున్. 306

క. అన శుక మిట్లను గుతుకం, బునఁ గథ కొదవ యన నెంత మాఁడెమాటల్
వినిపొమ్ము పోయి యచ్చట, జనపతి రతిఁ జొక్కి తామసము చేయకుమీ. 307

మ. అని యాశాపశఁ జేసి యాశుకసుధాశాధీశవిశ్వాసనీ
ర్ఘనదీశోభితశేశయాంతరరసశ్లాఘావిశేషావనో
దనశీలాతివిశాలశీతలగుణోదారోక్తిధారానిగుం
భనగంభీరము గాఁగ నిట్లనుచుఁ దెల్పంజొచ్చె నచ్చెల్వకున్. 308

క. కాంతా వింటివె కద వి, భ్రాంతపుఁబులి నక్కఁ గొనుచుఁ బఱచుట మును పే
యంతం గలహప్రియ త, త్కాంతారము వెడలి తల్లిదండ్రులఁ జేరెన్. 309

శా. నిర్దాక్షిణ్యమతన్క యవ్వనిత యంటె న్వెంట నే యంచుఁద
చ్ఛార్దూలం బతిభీతిఁ బాఱెను లతాసంబంధ మాట న్మహో
దుర్దాంతోగ్రశిలాభిఘాతవిగళద్ఘోరాసృధారాతినం
మ్మర్దాధ్వం బగు నక్కనీడ్చుకొని సంభ్రాంతాన్యజంతుత్వరన్. 310

క. ఈరీతిఁ బఱచి పరచిం, తారంభము మఱచి ధావనాయాసమునన్
నోరెండ నిలిచె నొకకాం, తారమునం బిఱికిగుండె తటతట నదరన్. 311.

క. నిలిచి దగదీర్చుకొని హో, చ్చలుకోపముతోడఁ నింతచేసిన దీనిం
దలవ్రిచ్చక మిగ్రింగెద నను, తలఁపున జంబుకముఁ గ్రూరతరముగఁ జూచెన్. 312

క. అప్పుడు సృగాల మద్దెసఁ, దప్పించుకొనంగ నేమి తలఁపఁగ వలయున్
జెప్పుము ప్రభావతీ యన, నప్పలుఁగున కాసుధాకరానన పలికెన్. 313

గీ. కాలిసంకెలలతి కాని కాయబంధ, మప్పలియటన్న నాగ్రహావ్యగ్రి వింక
జాడిపోరాదు సాంత్వనసరణిఁ గూడ, దెట్లు తప్పించుకొను నక్కయిట్టి యెడను. 314

వ. కావున సృగాలంబునకు శార్దూలవదనగహ్వరంబె యపస్యంబు భావ్యంబని తలంచెదఁ గాని తత్ప్రాణగోపాయనంబునకు నుపాయంబు దోఁపదు. మదీయ శేముషీవిశేషం బింతియ, యనంతరకథావృత్తాంతంబుఁ దెల్పు మనినఁ గీరం బిట్లనియె.

క. ఇది తెలియు కున్నబుద్ధికిఁ, గొదవనుట ల్గాదు జాఱఁ గూడఁగఁ జనుతో
యదకచ కిట్టి విపద్దశ, యద నెఱిఁగి యడఁపవలయు ననియనుట చవి. 316

క. అవ్వలి కథ వినుమా యెల, జవ్వని యారీతిఁ జూచు శార్దూలపతిన్
నివ్వెఱఁ గనుఁగొని జంబుక, మవ్వేళను నొకనుపాయమాత్మం దోఁపన్ 317

మ. పులికిం గేలు మొగిడ్చి పల్కవినుమంభోరాశిగంభీర నా
పలుకు ల్ద్రోహ మొనర్చెరా యనుచు నాపైఁ గోపమే కాని రాఁ
గలకార్యం బెఱుఁగంగ లేవు సముదగ్రక్రోధవై యావధూ
తిలకం బిప్పటి కేగుదెంచుఁ దనజోదరిక తస్ఫూర్ధల మాన్పఁగన్ 318

క. మన మున్న చోటెఱుంగునె, యని తలఁప న్వలవదుపలహతి గళితాస్మ
త్పాదరక్తధారతో ద్రోవం, గనుఁగొని యదె యడవి జాడఁగాఁ బఱతెంచన్ 319

క. మున్నొనరించిన నేరం, బెన్నకు తత్ఫలముఁ గంటి నేకద యిఁక మీఁ
దన్నికు శుభ మొనర్చెద, నన్నరయకు మింక వంచనాపరుఁ గాఁగన్ 320

క. పెనఁ దెగించి యెచటికేనియుఁ, జనుమా శార్దూలహంతి జాడ మెయింగ్రి
ఱ్కనవచ్చిన నినుఁ బొరిగొను, ననఘా జైవాతృకత్వ మందుము నీవున్- 321

క. అని పలికినపుడె నఖములఁ, బెన పటుకునఁ దెగించి వైచి బెబ్బులి పఱచెం
జనియెన్నక్కయు వేఱొక, వనమునకున్ దెలియ వింటివా తెలిగంటీ. 322

క. అనినఁ బ్రభావతి నివ్వెర, గున మాృవ్వడి యుండి తెలిసికొని చిలుకా యీ
యనపాయోపాయస్థితిఁ, నను నడిగిన నాకుఁ దెలియునా యెంతైనన్. 323

క. అని యంతఁ దెల్లవాఱుటఁ, గని యంతఃపురము సేరెఁ గాంతామణియా
దినకరబింబము గ్రుంకిన, దనుకాకీరమణి యొప్పిదంబున నుండెన్. 324

క. అంతటఁ జీఁకటి గని య,క్కాంతామణి నృపతిఁ జేరఁ గాఁ బోవుతఱిం
జెంతకుఁ జేరినఁ గనుఁగొని, కంతుని నెఱతేజి ముద్దుగాఱఁగఁ బల్కెన్ 325

గీ. ఎంత వేగిర మమ్మ పూర్ణేందువదన, మాటుమడిగినఁ జమ్మమ యమ్మనుజవిభుని
ధామసీమకు నిప్పుడు నందాఁక నొక్క, యమలతరమైన కథ వినుమనుచుఁ బలికె.

## పండ్రెండవకథ

క. ధరపై రాజపురంబునఁ, బరఁగెడు నొకరెడ్డి గలఁడు పరిహితనామ
స్ఫురితుఁడు కృషికార్యధురీణుఁ, ధరుఁ డలరున్ హాళికావతంసుఁ డగుచున్. 327

క. ఆరెడ్డి కిద్దఱాండ్రు ప్ర, యోరుహబాణుని శరంబులో యనఁగా శృం
గారిణియు సువేషయు నను, పేరుల మెలఁగుదురు సొంపు బెంపెసలారన్. 328

గీ. చెలువుఁ జెప్పఁగఁ బగలెల్లఁ జేసి పనులు, కోరి మెలఁగుట రేయెల్లఁ గుంభకర్ణ
నిద్రఁ బొల్పడి రతికి సంధింపకునికి, వార లిద్దఱుఁ గడిదేఱి జారలైరి. 329

ఉ. చామనిమేనులున్ నునుపుఁ జన్గవ మోములలోనఁ గల్గు బల్
గోములు మానపుం బొడవులుం బిడికింట నడంగుకౌనులున్
గోమలబాహువుల్ మెసులుకొల్పెడు చూపులు ముద్దుమాటలుం
గాముని కొక్కచేవ యెసఁగన్ విహరింతురు వార లిద్దఱున్. 330

సీ. గొంటుపూఁచలు రెండుగుండ్ల ముంగరలు మైజారుచీరలు పెనసన్నగొలుసు
పెద్దమట్టెలు మట్టిపిల్లాండ్లు బొబ్బిలికాయ లొత్తులతోడి కడియములును
గప్పుపల్వరుస లుంగరములు తూలెడు కొంగులు బలుచెంపకొప్పు లంచు
కమ్మగవ ల్లన్నకాటుకరేకలు నాభినామంబులు నానచుట్లు
పసుపుఁబూఁతలుగుబ్బలబాగు దెల్పు, బిగువుఁబవికెలు చిగురుకుఁ బెదవులంటు
వీడియపుఁగప్పు లెప్పుడు వెలయ రతుల, బేరమాడుచుఁ గాపుగుబ్బెతలు జోడు. 331

క. పసుల కొడ ల్వంగక తా, మిను లిద్దఱుఁ గూడి గోష్ఠపీటుమ దాదుల్
జనదనము మిసిమియిడఁగాఁ, గనుపింతురు గున్నగచ్చ గాయఁ కరణిన్. 332

చ. దిటమున రెడ్డి పాటుపడి తెచ్చి యిడంగను గూటిపొద్దు సం
కటికెతడి వెన్నమజ్జిగలు కంకటిపైఁ బవళింటి నిద్రలన్
బొటుకులఁ జెల్లరా సొగసు పెట్టుచు మన్మథకేళిమీఁద నె
క్కటివడి జారసంగమసుఖంబున కే తమకింతు రిద్దఱున్ 333

చ. పెనిమిటి చేని పాటుపడి పేర్చు శ్రమంబున నింటికేగుదెం
చినతఱి దాలితోఁ కపయిఁ జేర్చిన కాఁగులనీరు మజ్జనం
బున కమరించి దేవతలపుట్టె మొసంగుచు బొడ్డుగిన్నెలో
మురుగుదు రాగినంకటి తలోదరు లద్భుతభక్తిఁ జూపుచున్ 334

ఉ. ఒక్కతె రెడ్డిపిక్క విసయోష్ఠుల వింతలఁ గౌఁగిలింతలన్
జక్కిలిగింతల న్మఱపి జంతతనంబునఁ బ్రొద్దుపుచ్చుచో
నొక్కతె జారుపిక్క మెలుపొందిన జెక్కులఁ జూపు చొక్కుల
న్మిక్కిలి చొక్కుచు న్మదనునిం జరితార్థునిఁ జేయు రాత్రులన్ ౩౩౬

చ. చెలువుని ముందట న్సవతి చిక్కునఁ బోరు ఘటించి లేని యా
సులు ప్రకటించి మోసమునఁ జొచ్చెద రొండొరు మీఁది చాడి మా
టల మఱి మాటమాట జగడంబులు చూపి యతండు పోయినం
గలకల నవ్వుకొందురు తమ కౌశలమాతఁ దెలుంగలేమికిన్ ౩౩౭

క. ఈరీతినుండి యొకనాఁ, డా రెడ్డిన పసికిఁ దలుగు లవసించుటకై
నారలు గావలె నని పొరు, గూరికిఁ బైపోయి మఱ్ఱియూడలు తెంచెన్ ౩౩౮

వ. తదనంతరంబ.

చ. చిటిపొటిమబ్బు లాకసపుసీమఁ గనంబడ గొప్పగొప్పలై
పటపట మ్రోయుచు న్నలినబాంధవబింబముఁ గప్పికొంచుఁ జీఁ
కటి ఘటియించి యధ్వగనికాయము పెండగిలం దటిల్లతా
కుటిలతఁ గొంచెపాటి చినుకు ల్దొరఁగించె ధరాతలంబునన్ ౩౩౯

క. అనవధినదీవిహారం, బున నధికవ్యథలఁ గార్శ్యమును బొందుతటి
న్మనసిజుఁ డేయుశరంబుల, యనువున నవ్వేళఁ జినుకు లడరె న్నదులన్ 340

సీ. గొంగడిముసుఁగుతో గొల్లలు చట్రాతిపైని బందారాకుఁ బఱచికొనఁగ
నాలమందలు మేఁత కరిగి యేతెంచి యంభారవంబులతోడ మందగొనఁగఁ
బొమగుదూటుల మాని యొదిగి క్రేపులగుంపు జననీనికాయంబు చాటుఁ జేర
నొకటి నొక్కటి చూచి యుఱికి మేకలు చెట్టునీడలఁ గుమిగూడి నెమరువెట్టఁ
దనరు నంబుదకాండ వేదండయూథ, గర్జితోర్జితభూరిభూత్కారగళిత
వమథుశీకరవారదుర్వారమగుచుఁ, జలవతెమ్మెరలేతేర సన్నతూర 341.

గీ. అప్పు డా కాపువలిగుబ్బలాండ్రు పథికు, లసుఱుమానము సురుకొన్న యమ్ముసురులోన
రాఁదు పతి యంచు నిర్భరరతులఁ దేల, మందిరమునకుఁ దెచ్చిరి మాఱుమగల 342

గీ. తెచ్చుకొని యిచ్చలోపల హెచ్చుకోర్కు, లెన్నిగల వన్ని యును దీఱ నెనసి చతుర
రతుల కఱువునఁ బడినట్టు లతులసౌఖ్య, వారినిధి దేలుచుండిరి వారలంత. 343

క. పరహితుఁడు మిన్నుఁగనుఁగొని, దురసౌనిఁకమీఁద వానతూర ల్నిజసుం
దెఱు లెదు రెదు రే చూతురు, మరు బారికిఁ జిక్కి కాన మగడవ్వలయున్. 344

క. గ్రక్కునఁ జని యక్కుఱతోఁ, జక్కెరవిలుకానికేళిఁ జతురుఁడవై నేఁ
డక్కాంతలనిద్దఱిని, బ్రక్కలనునిచికొని మేలుపడసెద ననుచున్. 345

క. తలపైనూడల మోపున్, మొలఁగత్తియు నింటిమీఁది మోవాసము మదిలోఁ
దలఁకొనఁ జలికిఁ జలింపక, బలుబూతమువోలి పెద్దపరుపున వచ్చెన్. 346

గీ. వచ్చి యాత్మీయమందిరద్వారసీమఁ, దెప్పునను మోపు వైచిన చప్పుడు విని
నరకఁ డదె వచ్చెననుచు నొండొరులతోడ, గుసగుసలుపోయి రాతని కూర్మిసతులు 347

వ. ప్రభావతీ యతిదుర్గమనావకాశం బగునిజగృహంబునం దల్లడిల్లు నుపవల్లభుల నప్పల్లవా
ధరలెవ్వ రుపవుర వెడలింపవలయు నిడియెఱింగిన యంగనలకుం బరపురుషసంగమంబు
ను బతిప్రమోహంబును సులభంబగునని పలికినం దెలుప నేరక వెలవెలంబాఱు నమ్ముద్ది
యానెమ్మొగంబుఁ గనుఁగొని యయ్యనంగతురంగం బవ్విధంబును నేన తెలిపెదనని యి
ట్లనియె. 348

సీ. ఆరీతిఁ బతివచ్చె ననివేగ శృంగారిణీసభూటి సువేషతో విచార
మేటికి నీవుకవాటంబుఁ దెఱచి వాఁడింటికి రాకుండ నేర్పుతోడఁ
గడపకడ్డము గాఁగఁబడి నివమాడుము కొదనకార్యము చూచికొనఁగవచ్చు
ననియుపదేశింప నదియట్లసేయ విభ్రాంతుఁడై నిలిచి నభర్తఁ జేరి
మత్తియాడలనుండి యమ్మగువమీఁద, గాలిసోఁకెనో యనుచు శృంగారిణియన
నంతలోనను వేవదంభాతిరోష, ఘోషయై వానిపైఁ బండ్లుగొఱికికొనుచు. 349

శా. ఓరీ నాపదమైనమత్తి మచశేఖోద్వృత్తి ఖండించితీ
వేరా యిప్పుడెపోయి మ్రొక్కుఁబడిగా నీయాడలా చెట్టునన్
ధీరోదారతఁగట్టి రార మదిలో దేవేరిపైఁగోర్కె నిం
డారంగల్గిన నన్నెఱుంగవె పిశాచాధీశవిఖ్యాతునిన్. 350

క. అవవిని పరహితుఁడాత్మన్, వనితామణి బ్రిదికియుండినం జాలు నటా
వనిరుహాముకడకు నిటపోయిన నేమగుననుచు బానికెరఁగి వినీతిన్. 351.

క. ఇదె మత్తిమీఁద నిడినఁ, జ్చెద నూడల్నేరకేను జేసిన నేఁతల్
మదినుంచకు వటభూరుహ, విదితనివేశా పిశాచవిబుధాధీశా. 352

క. అని యతఁడు మత్తిపైఁ గ్రి, క్కునని డఁ జన మారుకేళిఁ గొదవల్దీఱన్
బని చిరుప నాయకులకుం, గనలిఁక నిటువంటి నేర్పు గావలె నీకున్. 353.

గీ. అనినఁ జిలుకఁ జూచి యాప్రభావతి చెల్ల, నే నెఱుంగ నయ్య యిట్టి నేర్పు
లిద్దఱకును వారలింత చేసిరిగాని, యొక తెకెట్లు గూడునో శుకేంద్ర. 354

మ. అని యక్కోమటికొమ్మ దేవనిలయప్రాంచన్మహావర్ధల
ధ్వనిచే వేగుటెఱింగి యత్తఱి శాంతఃబొందియాసంజసం
జనితానంగశరార్తి వేఁగుమఁదమిఁ బ్రస్ఫూర్తిఁ బీక్షించి త
జ్జనపాళాయతనంబుఁ జేరఁ జనుచో శాకేశ్వరం బిట్లనన్. 355



## పదుమూఁడవ కథ

ఉ. అక్కపరాకునీకుఁ బ్రియదాప్తిఘటింపఁ దలంచిపల్కె దే
నొక్కకథోత్తమంబు వినుముజ్జయినీపురి నొక్కసెట్టివాఁ
డుక్కునఁదీసినట్టి కఠినోగ్రశరీరముతోడ వీఱు నే
దిక్కునమాఱులేక బలదేవుఁ డనం బలుపేరుదాల్చు మున్. 356

సీ. శీర్షవర్తులశిలాస్థిరమైనకేకినాఁ జిన్నారిపొన్నారి సిగపొసంగఁ
దను మేరుగిరిమీఁది తరుణాతపంబునాఁ బలుచని మట్టిదుప్పటి యొసంగఁ
గమనీయముఖచంద్రుఁ గబళించు చిల్వనా దంబైన బవరిగడ్డము చెలంగ
బాహుభుజంగమపతి నాలుక యనంగఁ జేతసాణాకత్తి చెలువుమీఱ
మొలపీణయు సాధనము రువ్వుదలు, బిరుదుటందియ వెంబడి కిల్లజెట్లు
నమరదొరకొల్వు చేసి గేహమున కేగు, మత్తరిపుశైలదంభోళి మల్లమాళి. 357

క. ఘనశ్రీబొందియు నాతఁడు, దినదినమును గొంతగొంత దిరుగుచు రాఁగాఁ
దనవారు శత్రులైరట, గనుగొనఁగా నానిలక్ష్మి కడచనిపోవన్. 358

సీ. ధనవారములు చోరతతులపాలయ్యెను సొమ్ములు కుదువను సొగసిచనియె
గాదెలధాన్యమెల్ల లకయ్యెగుత్తకై యొనసినగ్రామంబు లెల్లసెండె
నప్పులిచ్చినచోట నటమటించిరి డాఁచికొనినపత్రంబులు చినిగిపోయె
వాడకంబులుగొన్న వారలేగిరి తోఁటలెల్లను బరులచేఁ గొల్లవోయెఁ
గప్పడంబెల్ల గాలిచేఁ గదిలియురియు, నింట దొల్లెడు కుండలు నిమపకట్ల
మానిముంతలు నిలిచె సమ్మల్లపతికి, వార్ధికన్యాకటాక్షమవ్వలికిఁ జనిన. 359

వ. ఇవ్విధంబున నతఁడు దరిద్రత్వంబు వహించియు నతండు కుటుంబభరణాదరుండై 360

ఉ. మాసికవైచికుట్టినరుమాలను జాలనివట్టిబట్టయు
న్మాసినయొడ్డుదుప్పటి దనర్పఁగఁ గోమటివారిఁ జేరి శం
కాసమవాప్తి వొల్లమనఁగాఁ దమమర్దనమాచరించుచుం
గాసును గీసు దూసికొనుగాని విడం డతఁ డేమి చెప్పుదున్. 361

ఉ. కూర్మికి నూనెలంటి కలగూరలకై పొలమెల్లఁ జుట్టి పా
ల్మాలకయాత్మబంధుజనులందరియాం జని పాత్రెఁ బట్టకై
కూనతనంబునం బ్రభులకుం దనుమర్దనమాచరించుచున్
వ్రాలుడు పాత్రుతోడ గృహవాటికిఁ జేయ నతండు నిత్యమున్. 362

క. ఈరీతినుండు వాతని, గారాబుఁ బటారి తలిరుకై దువులదు నే
దారికటారి సులక్షణ, నేరెంటివఘాటి లేమిఁ బిమ్మటఁ గొనుచున్. 363

గీ. కుడుచఁ గూడును గట్టుకోఁ గోక లేక, యితనికిల్లాలి నై యుండ నేలయనుచు
సొగసుగనిపించ వల్లంబుఁ జూపినిలుచు, జారులకు నయ్యొయారి యాస్పద మొసంగి. 364

గీ. కలిగినప్పుడెల్లఁ జెలువుని చెంగట, నడఁగిమడఁగి యుండుటరిది గాదు
చేతి లేమి యప్పుడాకేతి నుండె నా, యదిపతివ్రతాజనాగ్రగణ్య. 364

క. ఈలీలజారరతివాం, ఛాలాంఛన మొంది పింఛసమకచవికచ
ల్లోలస్వాంతకనస్థుణ, శీలుం జేర్పుమఁగల మగనిఁ జేకొనకలరున్. 365

సీ. చేయప్పులడిగితెచ్చెదనంచుఁ జనికాంచుఁ గోడెమిండనిఁ దప్పకోలు మొత్తుఁ
జెఱువుగోనీళ్ళు తెచ్చెదనంచుఁ జనితెల్పు నుపభర్తకాత్మవియోగవహ్నిఁ
జీరచాకింటఁ దెచ్చెదనంచుఁ జనిచేరుఁ దరుణపల్లవుఁ డున్న తావిచోటుఁ
జిక్కంటెయొరవు దెచ్చెదనంచుఁ జనియిచ్చుఁ గమనాతురున కింపుకౌఁగిలింపు
నిట్టుజారోపభుక్తయై యేగుదెంచి, మగఁడు విందేమి చెంగటనుందరంబు
వెడలితియగాడవలనె నిప్పటవిధిని, దూఱవలదాయటంచుఁ గన్నీరునించు. 366

చ. పుడమిది చూడనింత చెడిపోయెనమోముజియ్యాఁడుతోడఁ బు
ట్టరె నమవంటిసాధ్విని బడాపగలంగనుఁగొందుర్ జారులె
వ్వరుగనఁగొన్న లేమిఁ దలవంచి రయంబున వత్తునమ్మయో
పొరుగుపొలంతియంచుఁ బువుఁబోఁడి యను న్విభుఁ డాలకింపఁగన్. 367

క. పడియుండఁ గంటినని యీ, యెడలనామేనమామ యిచ్చెనటంచున్
బడఁతియుపవాఘుఁడొసఁగిన, తొడవులుచీరలు ముదంబుతో ధరియించున్. 368

గీ. నీవుమఱియింటిలోన గుండిత్రించుచున్నఁ, గడుపునిండునె దొరఁ జేరిగాత్రిసమడుగు
పొమ్మనుచుఁ బల్కువాఁడునప్పొలఁతిజార, కాంతుఁ బొందుటకై సందుగలుగవల్లసి. 369

క. ఈగతి మెలంగునంగన, లాగాబలదేవుఁ డెఱిఁగి లలనారావే
బాగాయెంగద చిన్నెలు, నీగరితతనంబుఁ గంటి నే నివ్వేళన్. 370

ఉ. ఓసి గయాళికాన నను నుగ్రు నెఱుంగవె రోసమెత్తి నం
దోసమెఱుంగ వీటఁ గల తొయ్యలు లెల్లను గుంపుగూడి సం
త్రాసము చెంద నీగళము రాట్నమునం బిగియించి యెంతునో
కోసుక తిందునో యనినఁ గోమలి నిశ్చలధైర్యధుర్య యై. 371

ఉ. గొంటుతనంబునం గులుకు గుబ్బలపయ్యెద చక్కఁజేర్చి యే
మంటివి నన్నువంటి సుగుణాకరికా చెడుబుద్ధి లెస్సగాఁ
గంటివిగాక వాదునడకల్గలగంటివొ కల్మివోవ నె
న్నంటనెపోవునే మఱి వివేకము లోకములోనివారికిన్. 372

ఉ. లేవడిమీఁద బ్రాసినలు లేనికతంబున నూరకుండినం
బోవమి నప్పుసప్పులకుఁ బోవుట వేఱుగఁ దోఁచె నేమొకో
కావలె నట్టులైన నవుఁగా దననేటికి నేఁటినుండి వా
ఢా వెలికేగఁ బ్రాణవిభుఁ డగ్గినకార్యము సేయవచ్చునే. 373

గీ. ప్రతిన వలికెద నేను నీపాదమాన, యకట మోసంబు లేదు కొండంతపనికి
నైన బతిమాలి నీవు పొమ్మన్న వెడలి, పోవ నూరక యుండు మీపోరుచాలు. 374

క. అని విని ముదితల హృదయము, గని యెఱుఁగమి నతఁడు నిజముగా నెంచెం ద
ద్వనితయును మదనవేదన, దినశేషము దీర్చె యుగముఁ దీర్చినరీతిన్. 375

చ. లకుచకుచాలలామ శుభలక్షణలక్షిత కౌతుకప్రిదా
యక మగు జాఱుఁగొంగు దరహాసము మీసము మీఁదికేలు వా
క్స్మకుఁ దమినించు మొఱిక్కు వగతక్కులు చెక్కులు లేని మోహమూ
రక కలహించి మించు పెనురాపులు చూపులు నేచ నెమ్మదిన్. 376

ఉ. ఎప్పుడు పోదుఁ బోయి హృదయేశ్వరుమాటలు వానికెప్పుడేఁ
జెప్పుదుఁ జెప్పి వాని మదిఁ జిత్రపుమోహము చేత నెప్పుడేఁ
గప్పుదుఁ గప్పి వానియెద గబ్బిచనుంగవచేత నెప్పుడేఁ
గుప్పుదు గుప్పి వాని రతికోరుట యెప్పుడటంచు నెంచుచున్. 377

వ. ఇవ్విధంబున నూహించుచు నాచంపకగంధియు నొక్కయుపాయంబు పెంపున. 378

ఉ. ముంగిటనిల్చి యో పొరుగుముద్దియ నాపతి సెట్టి మాసె నే
నంగడి కేగలేనిపు డహర్ముఖ మాతఁడెఁ దెచ్చి యిచ్చెదం
జెంగటిగోడఁ జేరి యొకచిట్టెఁడు నూనె యొసంగ లేవె య
భ్యంగ నైమిత్తనం చడిగి యాకె యొసంగఁగఁ దెచ్చి వేడుకన్. 379

మ. తలమాసెం గద రంగ దాష్ట్ర పులమూడా నాథ సాధన్వితా
కలనాధర్మము చే ననంచ్యముగఁ బ్రేంబ్రైవభవారోగ్యముల్
గలుగం గాంతు నె యంచుఁ దేనియలు చిల్కుంబల్కి యక్కల్కి పై
న్నెలలో నాయకు నుంచి నిల్చి తలయుం జెం దాళమానంబులన్. 380

గీ. ఇట్లు తలయంటి యటకలి యిడి సులక్ష, ణాసరోజాక్షి యిఁక నెట్లు నాథ జలము
తెరలియున్నది దొరలింపఁ దెచ్చికొనఁగ, బాగుగా మారి యవ్వలి బావినీళ్లు. 381

క. ఏవరుగ రాదు గద నీ, పైనానలు పెట్టుకొనుటఁ బడుపాటుబుగా
కేనాఁటివారికైనం, గానీ నేహమున బావి గలుగ న్వలదే. 382

క. అన విని బలదేవుండో, వనితా యానలకు నేమివచ్చెంబో నే
కొని తేనే జలములు గ్రీ, ష్మున నీచలిచేత నిలువఁ గూడ దటన్నన్. 383

క. ఓనాతి సతులకుణముల, నేనాఁటికిఁ బురుషు లెఱుఁగ రే నెచ్చటికిం
బో నేల నీకుఁ గోపము, రానేల యటంచు నడిపరాకై యున్నన్. 384

క. బలదేవుఁ డపల వాపైఁ, జలమూనా నేరమెల్ల సైరించి జల
మ్ములు దెమ్ము వేగఁ బొమ్మని, పలుమఱు వేఁడుకొనఁ గపటభయ మెనయంగన్. 385

ఉ. మంచిది నీవుపంప ననుమాన మిదేటికటంచుఁ బల్కి య
క్కాంచనగాత్రి రజ్జుఘటక్రమకరాంబుజయుగ్మయై కటా
క్షాంచలచంచలాలతె యొయారపుఁగొప్పు మెఱుంగుచుబ్బుల
న్నించఁగ నేగె ముద్దునడ నీటునఁ గూపసమీపభూమికిన్. 386

మ. చని యాచేరువఁ జారుభూరుహలతానంతాన తంతన్యమా
నవపీనాఖిలసూనసౌరభనిశాంతం బైనపూఁదోఁటలోఁ
దనమేకోలున వచ్చియున్న యుపనాథప్రౌఢు నాశ్లోకమా
ననిరూఢప్రథిమానురాగ మిగులొందం గూడి క్రీడింపఁగన్. 387

గీ. అలరె వేగుఁజుక్క యదిచూచి భయమందఁ దనరెఁ బక్షిరుతము దానివినుచు
దిగులుపడఁగఁ దూర్పు తెలతెల గావచ్చె, వారికిట్లు తెల్లవారె నంత. 388

క. వినుమో ప్రభావతీసతి, తన నేరం బెట్లు తప్పదాటన్వలయున్
మనమున దీని కుపాయము, గన నేరని నారి జార గారాదుసుమీ. 389

క. అని పలుకు చిలుకపలుకుం, గనుఁగొని వైశ్యాంగనాశిఖామణి యిచ్చో
నను నడుకు టుసుగ బెడఁగున, ననఘగుణా నీవె నొడువు మవ్వలికథయున్. 390

ఉ. నావిని కీర మిట్లను ఘనాఘనవేణి సనాతనప్రివి
ణావలిఁ గేరు నీకుఁ దెలియం బడకున్న దె యైన మద్వచః
శ్రీ వెలయింపఁ గోరి తెఁకఁ జెప్పెద నప్పగిదిం బ్రభాతవే
ళావిభవంబు మీఱుడుఁ గలంగుచు జారుఁడు లేచిపోయినన్. 391.

ఉ. అచ్చపలాక్షి యింటిమగఁ డంపఁగ నిప్పుడె బావినీటికై
వచ్చితి వచ్చి జారరతివాంఛలనుండితి నింతలోనఁ దా
నెచ్చటనుండి వచ్చె రవి యీతని కెక్కడఁ బొద్దువోదు నా
యిచ్చ గలంగసాగె నిఁక నేమని యేను గృహంబుఁ జేరుదున్. 392

వ. అని వితర్కించి ధైర్యం బవలంబించి యొక్క కార్యంబుఁ గాంచి యీయుపాయం
బున కీయుపాయంబ యుచితం బని తలంచి నిశ్చయించి కుంభంబు జలపూర్ణంబు
గావించి సరజ్జుకంబుగా దిగవిడిచి తాను మెట్లవెంబడిఁ గూపంబులోనికిం డిగ్గి
కటీదఘ్నంబు లగు జలంబులం గలపడుకు లూఁది ప్రభాతసమయోచితంబుగా విక
సించు కమ్మని తమ్మియుం బోలె నెమ్మొగం బెగయించి మీఁదఁ జూచుచు దృ
శ్యం బగు భయపారవశ్యంబున నున్న యవసరంబున. 393

ఉ. ఒక్కకృషీవలాచలపయోధర నాయకుపక్క నిద్రికుం
జిక్కి విహంగమధ్యనులచే వెడమేల్కొని తెఱమాఱుగాఁ
గ్రిక్కనఁ గట్టుకొన్న చిటికమ్ములచీర తగంగఁ దక్కటీ
భాక్కచకుంభ కుంభముప బాగొనరం జనుదెంచె నూతికిన్. 394

గీ. వచ్చి జలములు చేఁద నవ్వామనయన, యానవాబ్జంబు వాంచి నిజాధినాథు
తోడిపాలయల్కఁదోయంబుఁదొలఁగివచ్చు, వరుణసతివోలునమ్మల్లతరుణిఁగనియె. 395

క. కని మొఱవెట్టినఁ జెంగటి, జను లొక్కట మూఁగ వారి సందడిపలుకు
ల్విని యాఁడువారు సేరం, జనుదెంచెం జెట్టి దట్టిచల్లడములతోన్. 396

గీ. వచ్చి నిజభార్య చేసిన వగలు గాంచి, దిగులుపడి మున్న గా నరుదెంచి యున్న
దానియుపభర్త తోడుగాఁ బూనివెడలఁ, దిగిచితోడ్కొనిపోయె నమ్మగువవతఁడు. 397

క. ఏనంవిధ చాతుర్యము, నీవెఱిఁగితివేని మేదినీవరుఁ జేరం
బోవచ్చుఁ బోయి క్రిమ్మర, రావచ్చుఁ బ్రభావతీ పరాకా యనినన్.

క. నాకేమి తెలియు నని యా, కాకోదరవేణి కమలగంధాంధమరు
త్పాకము రాకనిశీధిని, పోకడ గని యంత నంతిపురమునకరిగెన్. 398

యిఱుకుమూఁకు పెరంటిలో నెక్కు బావి, మునుఁగుబన జొప్ప పెనువామిసెన ముఁగఱచ్చి
జోలు పిడకెలకుప్పల వాలిగుంత, దసర నిరతంబు వెలయు న తని గృహాంబు. 405

1. అతనికి సుకేశి యనియెడు నాలి వెనుక, నప్పె గుణవతి యనఁగ నిల్లాలొకర్తు
చిత్తసంభవు చెకత్తి చిపురుగోపఁ, జేనకొరకనమూడీన నచ్చెరువుగాఁగ. 406

సీ. సాక్షాత్కరించిన జలదేవతయనంగ నీలాటిరేవున నీటుచూపు
రథముపైఁ గనుపించు రతిదేవి యన జొన్న చేనుఁ గాచుటకు మంచియపసించుఁ
గెళికాఁగళితమౌక్తికము లేరెడు పనాంబుజపాణినా నిప్పుపూవులేఱుఁ
గాలచక్రముఁ ద్రిప్పు కమలనాభునిశక్తి నా నూలువడుక రాట్నంబుఁ ద్రిప్పు
మేఁతగొని పచ్చి తిన్నిచ్చుమిన్కుపిరంగి, వొరతురంగవిలాసంబు వొరయఁగొల్చు
గంప లింటికిఁ దెచ్చు నాకాపుబిగువు, టొంగపగలు గుబ్బలాఁడి యొక్కొక్కవేళ. 407

సీ. తిరునాళ్లకై పోయి తిరుపతిలోఁ గొన్న నొక్కుప్రూనలపేరు టెక్కుచూప
జిగినుంగనముఁ గూర్చి మగఁడు చేయించిన మెఱుఁగుకమ్మలు వింతయొరపు నెఱపఁ
దనుఁ జూడవచ్చుచోఁ దల్లి తెచ్చిన యట్టి యల్లికనాను సోయగ మెసంగ
మొదటికోడలి దంచుఁ దుది నత్త యిచ్చిన చుట్టుమెట్టెలజోడు సొంపు నింపఁ
గడియములు కెంపురవలయుంగరము వెండి, కుప్పె సౌరంబు కఱమాపుఁబూనలపు
చీర కుడిపెట్టెలోపలి సిస్తుఱవిక, యొసఁగఁ జరియించు నిట్టు లయ్యొమ్మలాఁడి. 408

గీ. దానివలలకుఁ జిక్కి మోదమునఁ జొక్కి, యుండెడువాఁడుఁ జొక్కనాఁ డుదయవేళ
మితిమెఱుంగక తుంపురు లీఁనఁబడఁగ, బొన్నకూతును బజ్జిగ జుర్రి లేచి. 409

సీ. మొలకు సగంబును దలకు సగంబుగాఁ గట్టిన యయగారి కరలచీర
పై నల్లకమ్మల పచ్చడమ్ముపు దోలుపావలు చేతిలోఁ బట్టుకఱ్ఱ
కత్తెఱగడ్డంబు కఱకు జుంజురు మీసములు గోపశంబైన పలకటోపు
మొలయుంగరము వ్రేలి వలముగాఁ దీర్చిన సాభినామము ధీవరము లమరు
గడుసుపిక్కలు గలిగిన మడిమలమర, వెంట నిరువంకఁ బెంపుడువేపు లరుగఁ
గెలనఁ దగు నెడ్లకొట్టమీక్షించికొనుచు, నింటివెలుపలి తిన్నియ కేగుదెంచె. 410

చ. దుసికిలజాఱు కోరసిగ దుప్పటినీటు లలాటపట్టికం
బొనఁగు విభూతిపైఁ బసుపుబొట్టును దొట్టిన కల్లు చొక్కు వె
క్కసముగ నెఱ్ఱవాఱిన వికారపుఁ జూపులుగాఁ గనంబడ
న్వెసఁ జనుదెంచె నొక్కబవనీఁడు తదీయనమీపభూమికిన్. 411

గీ. వచ్చి జవనిక వాయించి వరుసతోడఁ, దాతతండ్రుల చొవరితనము లెల్ల
వెన్నికై వారమొనరించి యింపు నెఱప, నతనిఁ గూర్చుండనిడుకొని యాదరమున. 412

మ. కలలో దేవర చెప్పె రేయి యొకటం గన్పించి నెయ్యంబు పా
టిల నీపాలికి దేవ్రఁ డింక బవనీఁడే యంచుఁ బాన్నాడఁగా
వలె నేబాపన మొప్పెనైన సరియే వారెల్ల పాత్రాలునీ
వలెఁ గోరించిరె నిన్నె కొల్తు ననుచు న్వర్ణించుచో నంతటన్. 413

గీ. ముదుక తలపాగయును బాహుమూలమందుఁ గవిలెచర్మపుటొఱలోని కత్తిగంట
మలతినీర్కావి కోవిత లమర గ్రామ, కరణమే లెంచి రెడ్డిచెంగట వసించె. 414

క. శశికేతి నెల్లవారలుఁ, జేరవాలాంకుండు రచ్చసేయఁ దదీయాం
భోరుహముఖి నరికాపుటొ, యారులఁ గూడుకొని నిజగృహాంతరసీమన్. 415

గీ నెవనమంత విత్తాపోయె నవుర రారె, గుంపునంపును లేకుండ గుంజుపోగు 4
గాఁ బదారింటితెరమును గాఁగ నూలు, వడకరేయంచు నొండొరు లాడివికొనుచు. 416

క. వడి దారము చెవులుం ద్రొ, క్కుడుపలకయు దిండు కదురు గుంజలునుం ద్రొ
క్కుడుబొమ్మయునుం ద్రిప్పుచు, పుడకయుమంగలపు రాట్నములు గైకొనుచున్. 417

గీ. ఎడమదెస దొడ్డుగా వైచి యేకులెల్లఁ, గెలనఁ బలువగ వేఁపుడుగింజ లునిచి
చేవపీఁటలమీఁద నాసీనలైన, వారలై వావివరుసలు వదరికొనుచు. 418

సీ. గుంపునంపును లేక కొనసాగఁ బ్రోగు వేఁట మెఱుంగుఁజూపు పేరెములు వారఁ
బ్రత్తియంపుపదుములఁ బనిగొంటిరే దూది యనెడి పాటలఁ దేనెచినుకు లీన
నేయితోఁ జెలఁగు కేలెత్తుచో భుజమూలకాంతులు బయలు బంగారు సేయఁ
బుడుకఁ ద్రిప్పెడు రయంబునఁ బైఁటజాఱుచో మినుకుగుబ్బలు తళుక్కనిరహింప
ముడిచికొన్నట్టి తెలిగంజి మడతచీర, లరిజితోడ నిగ్గుచే పసుపంటినట్లు
పానఁగఁజరణాభతోఁ ద్రొక్కుడుబొమ్మమీఁద, బచ్చెనఘటింపవడికిరప్పద్మముఖులు. 419

సీ. పోలిరెడ్డికి మగపోఁడిమి లేదుగా గాది కేలాగునఁ గడుపునిక్క
నెవరికే మగవారు వచ్చెద రదె చక్కఁజెక్కుకో పయ్యెదచెఱఁగుకొండి
యోసి లేవే మల్లి వేసాలు సేయకు మగవార లెఱుఁగని మర్మమెద్ది
నీకేటి సిబ్బితి నెరరాగవై మించి యడఁగిఁ ద్రొక్కినదాన వత్తగారిఁ
బెద్ది వినలేదె మనసుబ్బి పెరఁటిగోడ, దాఁటగా మామ గనెనఁట యేటిసుద్ది
యోవఁగి మగఁ డొల్లకున్న నదేమి సేయు, ననుచుఁ గసివోవఁ బలుమాటలాడికొనుచు. 420

గీ. ఎన్నికలు పత్తి పుంజంబు శేర్పరించి, పంటకట్టులు వాజితో మపడగ లూచ
కండె లొనరించి చాలించి కాపుటింతు, లున్నయవ్వేళ నద్భుతం బుట్టిపడఁగ. 421

సీ. నునుపుగా దువ్వి తీర్చిన కెంపుబావిలేంపు పసమీఱు నొసటి కెంపుసుపుబొట్టు
మెడతోలు పావాలు నిమురగవ్వలసండ సన్నంపుఁ జికిలిదర్శనపుఁ జేరు
నెడమచేఁ బల్లిక నడినయంబా రిన్నపాఁజేఁ బట్టిన నాగపడిగకోల
కటిఁ గాసెకట్టుగాఁ గట్టిన చెంగావి నిద్దంపుఁ బుబ్బల నీలిఱవికె
పదయుగంబున గజ్జెలు బాగు నెఱపఁ, బరపురాముని పైఁ బాటఁ బాడికొనుచు
సొంపుమీఱంగ నెక్కాలో జోగటంచు, ముంగిటికి వచ్చి నిలిచె మాతంగి యొకతె. 422
గీ. దానికై యిల్లుగల రెడ్డిసాని జోగు, పెట్టుటకుఁ బోయి పొదిగిలిపట్టి నిలిచి
గణకుఁ గని వాని ప్రాయంపు కలిమియెల్లఁ, గొల్లలాడుమనని యెంచికొనియె నఁతఁ. 423
సీ. మెలిపెట్టి చుట్టిన తెలిపరంగి ముడాసు పైలపేటాడబ్బు పసులఁ జెలఁగు
బంగరువాఁతలపట్టు హిజాము కంబరు చీనినిముతానిపాదునొసలు
తనుకాంతి గనుపింపఁ దనరు నంగీజోడు పలిపెంపు శాలువ వల్లెవాటు
పడుదలలోన డాబాకత్తి వదలుపాపోసులు గోరంటఁ బోలుచు గోళ్లు
నడుమసీలున్నతోలుడాల్బెడఁగుమూప, నభయముగ వెంటనరుదెంచు నభరువాఁడు
నమరుముసైదు తేజితో నరుగుదెంచె, దారుణాకారుఁడైన యుద్ధారుఁడొకఁడు. 424
గీ. వచ్చి యయ్యూరివెలుపలి రచ్చరావి, క్రిందుర్వారుఁడై తలారికి బులావు
ఝగడికే యనుమాటకుఁ దలఁకి రెడ్డి, తోడివారలతోఁ జేనితోపఁబట్టె. 425
క. అంతటఁ దదీయగేహా, భ్యంతరముం జొచ్చెఁ గరణ మతిభయమునఁ ద
త్కాంత తదాకృతి గొంతకుఁ, గొంత విలోకించి మించి గుణవతి యాత్మన్ 426
గీ. కోరినప్పుడె యీతనిఁ గూర్పవచ్చె, నొక్క నాపాలి యేకేవుఁ డొకరిపాలి
బంటుగా కిట్లు తురకరూపంబుదాల్చి, యనుచుఁదలపోసి యేకాంతమగుటఁ దెలిసి. 427
క. అళుకక రమ్మని భయముం, దెలుపుచుఁ దమ్ముమిమునిని దేవరయిఱ్లో
పలనుంచి కమ్మలూఁగం, గులుకుచుఁ దాఁ గడపమీఁదఁ గూర్చుండె వెసన్. 428
గీ. కలికిచూపుల మాటలకందువలను, జేరికలానర్చి మేకొనఁ జేసివాని
నెనసి యప్పుడె దేవరయిల్లు పదుక, యిల్లు గావించె నంతఁ బూర్ణేందువదన. 429
క. అది మొదలుగ నాతనిచే, పదలక మఱి తాననంగ వాఁడనఁగా నెం
పొన్నగి వేఱులేక తమిన, ప్పున్నవతి మన్మథునిలంకె మానిని యయ్యెన్. 430
సీ. కలికిమాటలు కిలకిలనవ్వు లోరచూపులు మోవివిఱుపులు గులుకునడలు
బెళుకునంపములు గొబ్బిళ్లపాటలు కొప్పుసవరించు నేర్పు చేసన్నవగలు
గోటిచిమ్ములు తెచ్చికోలు నివ్వెఱ లేని వెఱపును నెచ్చెలి వెన్నచఱపు

మోముదీప్తులు బొమ్మసుడి యొప్పు తాటింపు రానిజంకెన కావరంపుఁ బొవరు
మొలకనిక్కులు పట్టి కొంకులును వలపు, చాటుపిలకడ లలఁతివేసటలుఁ జూపు
గడియులో వాని దాయనఁ గన్నయపుడె, కొమ్మ మాయని జంత్రంపుబొమ్మకరణి. 431
సీ. పాయుగారి సంతతుఁ బోవువారలచేతఁ దెప్పించుఁబోఁకలు తెల్లనాకు
మితిలేని కూలి చాకిటి కిచ్చి కైకొను గడియకొక్కటి గాఁగ మగుపుఁజెర
లూటినంబికి మోహ మూరించి తెప్పించి పూను మాపటివేళఁ బూవుటెత్తు
లగవాటె కేమైన నర్పించి పలుమాఱు మెఱుఁగుపెట్టించుఁ గొప్పిమ్మసిపొకమ్మ
లనుదినంబును దలగడు గపఘరించు, నరిదిగంధపు టెఱపూఁత లలవరించుఁ
గమ్మపారాయికై సంచకర మొసంగు, చిత్తజాయత్తయై కాపుచిన్నెలాఁడి. 432
వ ఇవ్విధంబున నున్నంత. 433
క. ఆపల్లె నుల్లసిల్లెను, కాపులకుఁ బురోహితత్వగౌరవమునకుం
బ్రాపగుచు నొకమహీసురుఁ, డేపార్చిద్దు సుశర్మ యనఁగ నింపెసలారన్. 434
ఉ. అక్కట పొట్టదించిన నొకక్షర మైనను రాదు లెక్కలుం
దప్పులు గాని యమ్మనిన దమ్మన నేరఁడు వేదమందు సాం
పెక్కిన యన్నివిద్యల నహీనుఁడ నేనని కాపువారిచే
మొప్పులు గొంచు నాతఁడు సమున్నతగర్వము పాత్రి వర్తిలున్. 435
చ. తెలువరు లైన యట్టి పరదేశమహీసురు లర్థవాంఛఁ ద
త్పురమున కేగుదేర వెడపోస్యములం బచరించి వారిని
ర్భరగతినోడఁ గూయుఁ దమబాపఁడె గెల్చె నటంచుఁ గాపుల
చ్చెరుపడ వారు కంటికిడి సింతురె వీరని యాతఁ డుబ్బునన్. 436
క. జలముల మొనలియు గుహలోఁ, బులి గంపపుమ్రానిమీఁద భుజగముబలె నా
పాలికగ్రామంబున నతఁ, డలయం బరులెవ్వ రైన నడుగిడకుండన్. 437
క. అతని కుటుంబిని పతిదే, వతయై వర్తిల్లు శీలవతి యనఁగ నరుం
ధతికిం బ్రీతియై గుణనం, తతికిం గతియగుచుఁ బురజనంబులు మెచ్చన్. 436
గీ. ఆమహీసురుఁ డొక్కనాఁ డాహలాంతుఁ, డెలమి వింతటి పండుగ కలిమి వెలయఁ
జేయువార్తలు వినుచుఁ దాఁ జేనికడకు, నేగు తత్తర మొనగూడ నిల్లువెడలి. 43
సీ. అబుతఁ గీల్కొన్న మత్తరములధావళి యంసాగ్రమున గోనె యసిమినంచి
కట్టినముతకనీర్కావిధోవతియునాపై బిగించినయది గ్రాఁతబట్ట
తలచుట్టుకొన్న చింపుల బైరవానంబు చెమటచేఁగరఁగాడు నేనబొట్టు

మారేడుబుజ్జలోమంత్రాక్షతంబులు పదములజిజ్జోడు పాదరక్ష
లాడిసిపంచాంగ మొకకేలఁబొడుపువ్రేల, వెండియుంగరము మెడవ్రేలుముణికి
జందెములు నవ్వయాచ్యుతస్మరణమాస్య, సీమఁగనుపింపఁ బఱతెంచెఁ జేనికడకు, 438

ఉ. వచ్చినఁబెద్దరెడ్డి సుగవాటివిమేలిప్రుడైన నీడకన్
వచ్చితెయంచు బావయనువానిని దిక్తిరలాడిపొఁడా
యిచ్చటఁ జల్లువిత్తు ఫలియించునె వేళగుణం బెఱింగి నా
యిచ్చకు మెచ్చుగావదరు మిప్పుడనన్నిని యాతఁడుబ్బుచున్. 439

ఉ. చెప్పిన నేమిలేదుగద చింపులబోవతిఁ జూడుమేను వీ
కెప్పుడు మేలుఁగ్గోరి మఱియొక్కలిదివికి గ్రామసంగకుం
జప్పిడిఁ దించుమెంత్రిక్కుకొనుజాడ లేకుంగనె యిట్టిపట్ల నే
చొప్పననాశ్రితుం గరుణఁజూడవుగా కదియేల యిత్తఱిన్. 440

ఉ. నిన్నటిరేయి నాయెదుట నిల్చెఁజుమీ కలలోన వీడుమే
ల్పన్నెదు వేరటాల్పిలిచి బాపఁడ రెడ్డికిఁ జెల్వరాజెన
న్నెన్నఁడు దిన్నెఁజెట్టి నుతియించుచుఁ గొల్వరటంచుఁ బల్కి నా
కన్నుల నీరువొట్టి పులకల్గనుపట్టెదుఁ జూడుమిప్పుడున్. 441.

క. అన రెడ్డిమనసు గరఁగం, గనుఁగవనీరొదవి జాఱఁగను బాపఁడ నే
వినలేను తాళుచెప్పకు, మని మునుపటి దానిచిన్నె లాత్మకుఁదోఁపన్. 442

క. ఆలనియెంచక మనియెదు, కాలంబునఁ దల్లిమాట గడవక దానిం
నేలనిడి కాలరాచితి, నీలాగున వచ్చునను చెవ్వఁడెఱుంగున్. 443.

గీ. అనుచు ధైర్యంబుఁదాల్చి యాయన్మనస్య, మప్పుడేకంటి నింకఁ దానడిగినట్లె
తీసెఁబెట్టుకకొలిచెదఁగాని నేఁడు, మొదలునామాలుగా నీవు మ్రొక్కుకొనుము. 444

గీ. అనియెనీరీతిఁ దానికై యవనిసురుఁడు, సివమువుట్టించి యపుడు చేఁజేతఁదీసి
కొనియెఁబుట్టెఁడు విత్తులు కొలుచు మంచి, వేళవచ్చితిననుచు భావించుకొనుచు. 445

వ. అయ్యవసరంబున. 446

చ. తలపయిఁ బైఁటమట్టుపయిఁదాల్చినపుట్టికలోనఁబొల్చునం
బలిగల పంటియుం జిలుమువాయఁగఁ దోమిన కంచము న్సము
జ్జ్వలమగుచూపుడాలు ముఖవారిజవైరికి వెల్లపాఱడ
ల్బలెఁ దగ రెడ్డికోడలు విలాసముతోడుత నేగుదెంచినన్. 447

గీ. అప్పుడవ్విప్రుఁ డలికఘర్మంబుపటలి, జాఱిపీడెంపుచొళ్లతో సంధిసేయ
బెనుఁగునివ్వెరతో నోరుతెఱచికొనుచుఁ, దప్పకీక్షించె దానిసౌందర్యవహిమ.

గీ. చూచినప్పుడె విలుపాఱవైచి సరస, తామరసభీమతరగదాదండ మెత్తి
దండహత్తి మనోజుండు దండవెట్టె, నమ్మహీదేవు నెమ్మది రిమ్మవొడమ. 448

ఉ. అంతట రెడ్డిపంపఁగ మృగాక్షి గృహంబున కేగ దాని యా
ద్యంతశరీరసౌష్ఠవమునందు మెలంగు మనంబులోపలం
గంతులుగోరి కోరికలు గంతులువైవఁ గృషీవలాజ్ఞ గే
హాంతరమందు చెందు విరహజ్వరముజ్జ్వలమైనఁ గుందుచున్. 449

గీ. అర్ధరాదేవుఁ డాహాలికాబ్జవదనఁ, గన్నకన్నుల కింటిలో గరితరూప 450
మెట్టులుండునో కాని సహింపఁడయ్యెఁ, దద్బహుంకృతోపచార విధంబులెల్ల.

సీ. కీలుగంటిదియేలపోలఁగా నునుగొప్పఁ గీల్కొల్పుకొమ్మంచుఁ గీజుపోరుఁ
బసుపుబొట్టిదియేల నొసటవిభూతిరేఖయమర్చికొమ్మంచుఁ గంటగించుఁ
గాసెకట్టిదియేల కపురుగా మైజారుచీరఁదాల్పుమటంచుఁ జిమ్మరేఁగు
లక్కకుల్లిదియేల చొక్కంపుటంచుకమ్మలు ధరించుమటంచు నలుకఁగాంచు
భార్యతో నాయమయు వెఱ్ఱిపట్టెనేమొ, యనుచు నాలాగెకావింప నతఁడుహాలిక
లికుచకుచపేషమే కాని యకటదాని, యొరపులేదని యాత్మలోఁ బరితపించు. 451

గీ. గేస్తురాలొక్కపరి రతికేళిమీఁద, మనసుపాటించఁగంకటి మైలచీరఁ
బఱచి విడెమొల్లరేయంచుఁ బలుకరింపఁ, గుక్కకూఁతురవలదంచు వెక్కిరించు. 452

సీ. ఒడిలోనఁబంచాంగముంచుకొన్నది గానకెటుపోయెననుచు నూరెల్లవెదకుఁ
బనిలేనిపని వీథిఁజనుచుఁ గ్రమ్మరు శాత్మగృహమంచు నెంచి యిల్లిల్లుఁ దూఱు
నప్రదుఘుక్కి యొనర్చి యపునషే సంకటి తింటినా యని యింటి తెలుపనడుగుఁ
✓గురుచనోవతి గట్టికొని యెవ్వరో యిట్లు గట్టిపోయి రటంచుఁ గలవరించు
గడియలోఁ దెల్లవాఱె భాస్కరుఁడు గుంకె, జాగులేలంచు సందెపై సందెవార్చుఁ
గఱతుమాయల నుమ్మెత్త కాయదిన్న, పొలుపు సారెకుఁ దెల్పు నప్పుడమివేల్పు. 453

వ. ఇవ్విధంబునం బునఃపునఃప్రవర్ధమాన మన్మథోన్మాదుండై యమ్మేదినీదేవుం డొ
క్కనాఁ డహర్ముఖంబున సంధ్యావందనార్థంబు తటాకలితవిటపిచ్ఛటాకం బ
గు తటాకంబున కరిగి తదీయ తోయజామోద మేదురమధువ్రతవ్రాతతీవ్రాత తారవం
బులం బొలుచుచున్న సమయంబున. 454

క. హేలికడానిసడాకల, పోలిక గల యిరుగు పొరుగు పొలఁతులతో నా
హాలికబాలిక తలిరే, ఖాలిక యచ్చటికి నీటికై యరుదెంచెన్. 455

క. వచ్చిన మేనికిఁ బ్రాణము, వచ్చిన యట్లైన మెచ్చి వసుధావిబుధుం
డచ్చపులాక్షీమణికిన్, ముచ్చటతోఁ జేతులెత్తి మ్రొక్కెనయంతన్. 456

గీ. అయ్యవారెవ్వరికి మ్రొక్కెనంచుఁ బలుక, నెవ్వతెకు నేల మ్రొక్కెనో యెమ్మెలాఁడి
నమ్మియే దేవరకు మ్రొక్కినాఁడొ యనుచు, నవ్వు చేడెలఁ గూడియన్నాతి చనియె. 457

క. వాలాయము దినదినమును, బాలామణి వచ్చుననుచుఁ బాఱుఁడు ప్రీతిః
గాలమునఁ దత్తటాకము, కూలంబున ముక్కుపట్టుకొని కూర్చుండున్. 458

గీ. ఉండి నీటికివచ్చినయువిదఁ జూచి, సన్నఁగా మ్రొక్కు మ్రొక్కఁ దజ్జలజనయన
తనకు మ్రొక్కుటఁ దానాత్మఁ దలఁచితలఁచి, యేటికీయాలోచనయటంచు నింటికరుగు. 459

క. అంతట వినుమొకవాఁడ, కాంతామణి యతని మనసుఁ గనవలెననుచుం
జింతించి జోడు ప్రాయపు, టింతుల నెడఁబాసి నీటికే తెంచుటయున్. 460

గీ. అతఁడు గనుఁగొని యిది సమయంబటంచు, మఱియు మఱియును మ్రొక్కె నమ్మందగమన
కడవ యటు డించి తెలిసెఁ గాక యనుచుఁ, జెంతకే తేర నాతఁడు చేరనరిగి. 461

క. ఆశీర్వాదము మేరధ, రాశాసిభవత్కుచద్వయంబునకు సుధా
పేశలహాసాననరా, కాశశికిన్ నీకు మేలుగావలె నబలా. 462

క. ఇన్ని దినంబులు ననియె, న్మన్నన నీవెన్నఁడైన మమునమ్మినవాఁ
డున్నాఁడే బాపండని, వెన్నెలచూపులను జూడవేకద నన్నున్. 463

చ. అనవిని నవ్వి యవ్వికసితాంబుజలోచన పైఁటకొంగు కే
లునను లివెట్టుచుం దళుకుతళ్కునఁ జూపులఁ జూచి రెడ్డినీ
ఘనతయెఱింగి తానడవఁగా నదిగాదని యేఁ జేయఁగ
ల్గినపని యేమియున్న సవులే దయఁబల్కితివే మె యీఁగతిన్. 464

క. అదియుండనిమ్ము నేనడి, గెద నొక్కటి నీవు దినముఁ గేలెత్తి ముదం
బొదవఁగ మ్రొక్కు ఘటింతువు, గద యదియెవ్వరికిఁ దెలుపఁగావలె ననినన్. 465

గీ. అతఁడిట్లను నోజలజాస్య నీకుఁ, గాక యింకెవ్వరికి మ్రొక్కఁగాఁ గడంగు
నతులధర్మపవిత్రింబులైన పాక, రంబులనుమాట లిఁక నేల త్రివ్వవలయు. 466

క. అతిథినయివచ్చినాఁడ, న్రితిభిక్షయొసంగి నన్ను రక్షింపఁగదే
సతినీపితృదేవతలకు, గతిగల్గెడునని వాలికకామిని కలఁకన్. 467

గీ. అమ్మ నేఁ జెల్ల బాపనయ్యా మది యేమి, రజ్జులాడెదు మంచిగురస్తువగుదు
చేరిమాటాడినపుడె పాసిగ్గుపోయె, నారయంటివి లెన్సబాగాయెఁ గాదు. 468

గీ. ఓడకిటువలె నీవింతవాఁడవేని, మించితిగినట్టి బుద్ధి చెప్పించవచ్చు
గ్రామమునకెల్ల వాలిమికాఁడవగుట, బ్రతికిపోతివి పోర బాపనగరాన. 469

క. పరమామోదత నెంతటి, వెరపరి విధి తెలిసినప్పుడె విద్వాంసునికాఁ
తురవగుపని యాతఁడా సుం, దరవడ్డింపంగ భోజనము దీర్చె వెసన్. 480

సీ. సోలనీటను నీడఁ జూచుచుఁ బట్టెవర్ధనము నిండఁగ నక్షతలను వెత్తి
యకుసుమోఁబడు పంచామృతము చందమొదవంగఁ దగ వేపచెక్కఁ గందంబులంగి
నరసినసిగలోన నంటినాఁడిచ్చిన గన్నేరుపూవులు కొన్ని తుజేమి
తడియారి యాఱకుండెడు పాత్రఁ దోపతిబట్టవేమరు ఓంజపెట్టికట్టి
కూర్మిసతి పెట్టెలో దాఁచికొన్నవల్ల, గరిలపండుగుచీరఁ గైఁగట్టుకొనుచు
సతనుఁడెనకొల్ప దేవాలయంబుఁ జేరి, పాద్దుగుఱింక కముకెన్న సొంపులు జనింప. 481.

క. ఈదారిఁ జేరి యే కెలి, రాదా యెనిదేమి యనుచు బ్రాహ్మణుఁడు ఒహి
ర్వేదికి వచ్చుచుఁ గోవెల, లోదూరుచునుండె నంతలోనఁ దలారుల్. 48-

గీ. అతని తహతహ గనుఁగొని యారయాతఁ, డేనధూమణి రాకకో యిచటనున్న
వాఁడు మంచిది యదియును వచ్చినప్పుడె, పట్టునటంచుఁ బోంచికో పన్నగుండు. 483

ఉ. హాలిక బాలికామణియు నంత నిజాంగము మీఁదనున్న ని
చ్చాలిభమనోధినాథుని కరమ్ముల మెల్లనెడించి సావాన
శ్రీలసమానయై వెడలి శీఘ్రగతిం జనుదెంచి చొచ్చె దే
వాలయము న్మనోరథపరాయణుఁడైన సుశర్ము మెచ్చఁగన్. 484

క. గురికాఁడు రాక మనమీ, తరుణీభూసురులఁ బట్టఁదగదని చుట్టుం
బురిగొనుచుండిరి యాతల, వరులంతట నదియు నతని వాంఛలు దీర్చెన్. 485

క. ఆలోన యామికావళి, యాలోచనయొజ్జఁగ్రి మగని హాలికాళికచం
జాలిబడకుండఁ గావఁగ, శీలవతీకాంత కొంత చింతయొనర్చెన్. 486

క. అని మఱియు నాపరిభావతిఁ, గనుఁగొని యచ్చిలుక పలికెఁ గలికీయిఁక సా
ధ్వనితామణివారల నే, యనువునఁ గావవలెఁ దెలియనడిగెదఁ జెప్పుమా. 487

క. అని యడిగినకథకద్భుత, మున మునుఁగుటఁ బలుకలేని మద్దియ మొగమున్
గనుఁగొని యదియుం దెలిపెద, వినుమని యెం జిలుక యామృతవిధమధురోక్తిన్. 489

గీ. అట్లు తలపోసి యొకయుపాయంబుఁ గాంచి, బల్లెమునఁ బెద్దజోతియోర్చి యదమకొనుచు
నిల్లువెలువడి దేవతాగృహము చేరఁ, దెగువమై వచ్చె శీలవతీలతాంగి. 490

క. ఆ వార్తఁ జూచితలవరు, లే వెలఁతయొకొండ దీప మెత్తఁగవచ్చెన్
బోనిమ్మని కనుఁగొనన, మ్మానిని గుడి సొచ్చి కనియె మగనిన్ గుఱ్ఱన్. 491

క. కని వచ్చితి నెంచకుఁడని, తన చేలము దానికిచ్చి దానిపటంబుం
దనకటి ధరియించి రయం, బునఁ బల్లెరమీఁపుగొంచుఁ బొమ్మని పలికెన్. 492
*క. పనిచిన మెచ్చు మహాలికాం, గనయీశ్వరుమ్రొక్కు చెల్లెగద యింక మహా
న్మనపటివలె మనుష్యము దయ, ననిచని పతిప్రక్క ముగ్ధయై పవళించెన్. 493
ఉ. అంతఁ దలారులాత్మవిభుఁ డచ్చటికిం జనుదేర జారవృ
త్తాంతము దెల్పఁ బట్టుఁడని యాతఁడు నం గుడసొచ్చి దివ్వటీ
ల్చెంతకుఁదెచ్చిచూచి యిది శీలవతీసతి యాతఁడెంచఁ ద
త్కాంతుఁ డటంచు సిగ్గువడి తెప్పెఁ బ్రయోజనమంచుఁ బోయినన్. 494
గీ. రమణుఁ దోడ్కొని తనమందిరమునకరిగె, శీలవతియంచు పచరించు చిలుకఁ జూచి
యాప్రభావతి యప్పుడే యుడిగెఁ దెల్ల, వా రెనని యేగెనంత నగారమునకు. 495
క. చనినాఁటి రేయి నరపతి, సెనయం దగ్గేహసీమ కేగెను దానిం
గనుఁగొని యొకకథవినుమని, యనియెం గీరంబు పలుకు లమృతము దొలఁకన్. 496

—◆ పదునైదవకథ. ◆—

(*)క. కుముదబిలం బను నొకపుర, మమరుసురవ్యజనితధ్వజానీకమద
భ్రమదభ్రమదభ్రిబుదా, సుమదామకటాక్షజనితసూనశరం బై. 497
గీ. అందుఁ దనరారు పిరాఖ్యుఁడైన యొక్క, రౌతు వానికి దోసిటిప్రాలముద్దు
గుమ్మ మనవతి యన నొక్కకొమ్మ గలదు, కమ్మపూవులరెమ్మ బంగారుబొమ్మ. 498

---

*క. అప్పుడా శీలవతి కేల నొప్పపల్లె, మెలమి తానందుకొని కాఫుటింతశివుని—
(మ్రొక్కు చెల్లించువిధమున మద్దునడల, గుడివెడలి చేరె నిల్లుల్క గుబ్బలాఁడి.
(*)క. జగతిఁ బొగఁడొందు విద్యా, నగరంబునఁ బరమధూర్తనాయకులగుచున్
నెగడుదు రిద్దఱు భూసుర, లగణితులై విందుఁడనఁగనను విందుఁడనన్. 1
సీ. తల్లిబిడ్డలు నన్నదమ్ములకైన నాఱునిపో రెగల్పించి రట్టుసేయు
యామికావళికన్నుఁ బ్రామి యంతఃపురాంగణములైనను జొచ్చి కన్న పెట్టఁ
పతిభక్తి నతినరుంధతివంటివాల్గంటి నైన జెల్లించి వెల్లాలిసేయఁ
దప్పకశకునియంతటివానినైన జూదంబున గెల్చి పందెంబు గొనఁగ
జీరకును గొల్లెకును లంజవారితల్లి, పూటకొప్పించి తియ్యనిమాటలాడి
రాయిగరగించుచును నవ్వురమున వారు, లోకనిలోక్కఁడు మెచ్చకయుండు రెప్పుడ 2
సీ. పగడసాలలఁగోడిపడవులఁ బుట్టచెండాటల నిష్కారణార్యనింద
మదిభోగములఁ జేరి మగడాలిచక్కటికథల దుర్వ్యవహారకర్మకలన

క. ఆలలన నాయకని యుప, లాలనమునఁ దనివిలేక లలితాకారా
వాలములగు జారులకును, గూలముగా మెలఁగుచుండుఁ గోర్కులు దీరన్. 499

సీ. అత్తగారికిని దీర్ఘాయువిచ్చినయట్టి శ్రీహరిదేవునిమీఁదఁ బండ్లుకొఱుకు
భర్తకుఁ బొరుగూరుపయనంబుఁ జెప్పని ధరణీధవునిమీఁదఁ దప్పు లెంచు
జంద్రసూర్యులప్రకాశము మాయఁజేయని కటికిచీఁకటిమీఁదఁ బెటికవిఱుచు
✓ బసులగోడలు వాన్పివసుధపైఁగూల్పని ముసురువానలమీఁదఁ గసరుఁజూపు
పదినెలకు రేలు మఱి పారవశ్యగరిమ, నెనయఁజేయని నిద్రసేమేమొ దూఱుఁ
దపులుకోర్కులచే వెలిచవులకరుగ, సందుగానక కుందునయ్యిందువదన. 500

చ. కడకుఁ బొలంతినం గెలనఁగాపుగనుండెడు చేడెతోడ నీ
వెడపకవింతవానిరతికేగతి నేగుదుపమ్మ చెల్ల యె
క్కుడుభయమయ్యెడుం దలఁచికొన్న నెయంచని యిట్టిసౌఖ్యమె
క్కడఁగలదంచు విస్తరముగా నదిచెప్పినఁ గోరిజారులన్. 501.

చ. జననము నందినం బురుషజన్మము కావలెఁ గాక యాఁడుదై
వనుగుడిమూద్రవైచికొనినం దగులేకకులాంగనాస్థితిం
దవరినఁ గామరూపమయినన్వలదాయని చింతసేయు న
వ్వనరుహపత్రనేత్రితలవ్రేఁతకుఁ దప్పులుగల్గనేర్చునే. 502

---

దీవుల నీరాటరేవుల రచ్చల మాటలజనవశ్యమంత్రశక్తి
బొమ్మలాటలవట్టిఁ బూటకంబుల వంతుపాటలకొక్కపరనశక్తి
పగటినిద్రల వెలయాండ్రఁ బట్టుపనులఁ, జాడికూఁతల బరిహాసవరణిసడక
లేనిదుష్కులబెట్టుటఁబూనికొనుచుఁ, బొద్దుపోనిత్తురెపుడును భూమిసురులు. 3

గీ. వారలంతట నలకంచివరదరాజు, గరుడసేవ నిరీక్షింప నరిగి పోవ
పరునవెంబడి జని యన్యభామినీవి, లోకనాపేక్ష నెమ్మదిలోన హెచ్చ. 4

సీ. వృద్ధవేశ్యతనూజవిటుఁదిట్టుమాటల వెలపువ్వుబోండ్ల నవ్వించుకొనుచు
నత్తకోడండ్రకాట్లాటమాటలఁ గులస్త్రీలసిబ్బితిచూపి చెప్పికొనుచు
మరునితోనిల్లాలు ప్రతిరాత్రి యాడుమాటలఁ గులాంగన గుట్టుకలఁచికొనుచుఁ
✓ గొట్లకేగొణిగెడు గుంపనిమాటల కొమిరబానిసెగుంపుఁ గూర్చుకొనుచుఁ
గొడెకాండ్రెల్లఁగూడిరాఁ గొంతతడవు, కథలు మఱికొంతతడవు శృంగారవతుల
చిత్తములెఱుంగు నేర్పులుఁ జెప్పికొనుచు, నరుగుచోఁ ద్రోవఁగడపిరయ్యవనిసురులు 5

గీ. పరునడిగ్గినచోఁ దమవంతువగల, కానపడి చూచు కొమిరయిల్లాండ్రచెంత
నగుచున న్నేలవేల్పులన్నంబువారి ప్ర. కొండ్రువారలు వండినకూరలిడఁగ. (పాఠాం 6

గీ. వచ్చి కల్పితసంభ్రమావార్య యగుచు, మ్రొక్కి దీవించు నాతని మోముఁ జూచి
యన్న యాశీర్వదించినయంతఫలము, నీవు వచ్చినకతమున నేఁడు గలిగె. 514

సీ. మనయమ్మ కడుసుఖమ్మున నున్నదే యయ్య పెద్దవాఁ డయ్యెఁగా పేర్మి నతనిఁ
బోషింతురే మీరు పొరమాపు లేక నా యరిది చెల్లెలి వచ్చి యత్తవారు
తోడ్కొని పోయిరే మారంబుగాన యేవార్తయు వినము మూవదినె వేక
టని వింటి నే బిడ్డఁ గనియె నే మగవానిఁ గనియెనో యది మేలుగాక యాఁడు
దాన నై పుట్టి మిముఁ జూడఁ గానకిట్టు, లేను బడుపాటు చాలదా యెన్నఁడైనఁ
దలఁతురా నన్ను మీరు డెందంబు నందు, నేల తలఁతురు మఱచిపోయితిరి నన్ను. 515

చ. చెలియలిపెండ్లి చేసితిరి చిల్లరపబ్బము లెన్నియైన శో
భిలె నను నెన్నఁడైనఁ బిలిపించితిరే పిలిపించకున్న నే
మల రెడుకూర్మి నాఁడుఁబడు చానపడుం గద యంచుఁబచ్చపోఁ
గులు గలచీర యంపనొనఁగూడకపోయెనె యేమిచెప్పుదున్. 516

గీ. ఇపుడు మీపుణ్యమున నాకు నేమి కొదవ, యుండె నేనుధరింపఁగా నొకరి కీయఁ
గలదులే యందులకు నంట గాదు మీద, యాతిదాక్షిణ్య మిటువంటి దంటి నింతె. 517

క. అనవలసి యంటి నిన్నుం, గనుఁగొనుటే చాలు బడలికలు కనుపించెం
జను మెమ్మె కంచ మిడినది, యనుచుం గను గీఁటి పిలువ నాతఁడు మదిలోన్. 518

గీ. కల్లవగజాదకత్తెలఁ గంటిఁగాని, యింతమాయల జగజంత నెందుఁగాన
నెట్లు నమ్మెడి వార యీయింట దీని, కడమనడతలు తెలుతము గాక యనుచు. 519

క. చని యది వడ్డింపఁగ భో, జనకృత్యముఁ దీర్చి యంతఁ జలజాప్తుఁడు గ్రుం
కిన దానికన్న నన్నం, గని కూటములో వసించెఁ గంకటిమీఁదన్. 520

చ. మదవతి యంత నాత్మవిభు మన్మథకేళిని దేల్చి కూటి చా
క్కొదవఁగ నిద్రఁజెందు పతి నొయ్యన నారసి లేచి చెంబుతో
నుదకముఁ గొంచు ధూర్తమణి యుండెడిచోటికి నేగి మాయపు
న్నిదుర వహించి యున్న యతనిం గరసంజ్ఞల లేపి యిట్లనున్. 521.

క. ఏమోయి నిన్న నడిచిన, నామాటలు పొంచి విని ఘనంబై తగుమ
త్ప్రేమ యొనఁగూర్పవచ్చిన, సామివి గద నిన్ను మెచ్చఁ జనదే నాకున్. 522

సీ. అంవగాఁడ పగుదు వప్పుడె కంటి నీ, దారి మగఁడు నిద్రఁ దేలె నన్ను
వెనెకు నటకుమున్న వేగఁ బోవలయు నీ, జోలి యేల పక్కఁ జోటొసంగు. 523

చ. అనవిని వాఁడువల్కు భవదద్భుతచాతురిలో శతాంశమై
నను గలదా మదీయనిపుణత్వము నేర్పరులందు నిన్ను నె
న్నినఁ దగు మున్ను నాగుణుతు నీవు నెఱుంగవు నిన్ను నే నెఱుం
గనెకద యిట్టిచో నిజముగా నిలనాడితి గాన మానినీ. 524

క. అది యెంతయైన నున్నదె, కద యీయద్భుతము జోక గలుగుట మేలౌ
ముదిత కొఱగానివాని, ట్లొదవినచో మదనకేళి కొడఁబడఁ దగునే. 525

క. అన విని యది యిట్లను నా, మనముఁ గనవ్వలసి పలుకుమాటలు చాలు
న్మన యిద్దతి ఘనసాహస, మునకు న్మల మతనుకేళి మోదము గాదే. 526

క. చక్కనివనితాపురుషుల, కెక్కడివావులు మనోజుఁ డెక్కడనున్నాఁ
డక్కడఁ దగవులు నడచునె, మొక్కలితన మేల మేలములు వల దింకన్. 527

క. అని పలుక మఱియు నాతఁడు, మనసీయక యున్నఁ జూచి మంచిది పతిచే
నినుఁ దునిమించెద ననుఁ గనుఁ, గొనరా యని బోఁటి పోటుకూఁతలు వెట్టెన్. 528

క. గడగడ వడంకి యతఁడో, పడఁతీ నీవానతిచ్చుపనిఁ జేసెద నా
కడ నెగ్గుఁ దలఁపవద్దని, యొడఁబడిన న్మంచి దని సముత్సాహమునన్. 529

క. ముదినాతని రక్షింపఁగ, నది యెంచెఁ బ్రభావతీ మహామతి వాదే
కద యెట్లు కావవలెఁ బది, పదిగ విచారించి తెలియఁ బల్కుమ టన్నన్. 530

క. కోమటిమిటారి చిలుకా, నామతివిస్తార మేమనవ్వచ్చు పచ
క్ష్మి మెఱయ నీవె తెల్పుము, నా మంచి దటంచుఁ గీరనాథుం డనియెన్. 531

వ. ఇవ్విధంబున నమ్మదవతీవరారోహ, యుపాయపరాయణయై యుండె నంతకమ
న్న కర్ణచ్ఛేదనం బగుతదాక్రోశంబు నిద్రాభంగంబుఁ గావించుటయు నవ్వీర
దదరిపడి లేచి కృపాణపాణియు వికటీకృతభ్రుకుటినిటలుండును నగుచు వచ్చు
నంతకమున్న యయ్యింతి సమంతిక ప్రవర్తియగు నాధూర్తుని నవికారంబుగాఁ
డియుండు మని బోధించి యగాధవ్యథాబాధితయుం బోలె నిజనాథుని కదుఁ
గాఁ బఱతెంచి సాక్రందనంబుగా ని ట్లనియె. 532

క. పని గల్గి నీరపాత్రము, గొని ముంగిటి కేగుదెంచి కోయనుకూఁత
ల్విని చేరిన వికృతాకృతిఁ, గని యున్నాఁ డన్న యేమి కతమో యెఱుఁగన్. 533

క. ఇన్నాళ్లు రానివాఁడే, యెన్నిక లావఁగూర్వ నిచటికేతెంచెనో మా
యన్నమఁ గనఁగొన రావే, నిన్నని వచ్చుట నుపేక్ష నించుట తగునే. 534

క. అన విని వదరకు వే యా, తని కేమియు లే దటంచు దాని పిలుందం
జని పిరుఁ దతని యాకృతిఁ, గని తోవం గాలి సోఁకెఁ గావలె ననుచున్. 535

గీ. వెన్న చఱచి ధవళ వెఱవకురా యంచుఁ, బలుక నంత నతఁడు తెలివి నొంది
వారిఁ జూచి లేచి మీరేల వచ్చితి, రేమి యెఱుఁగనైతి నింతతడవు. ౫౩౬

చ. అనవుఁడు నవ్వి వీరుఁడు నిజాంబుజలోచనఁ జేరఁబిల్చి మం
తనమున నీతఁ డొంటికి మనంబున భీతి వహించె నేమొ నీ
వినుఁ డుదయించుదాఁక వసియింపు సహాయముగాఁగ నంచుఁ బో
యిన నగి ధూర్తుతోడ రమియించె వధూమణి యాన దీఱఁగన్. ౫౩౭

క. అంతటఁ దెలతెలవాఱెం, గాంతా యని పలుక వైశ్యకామిని యిచటి
న్వింత గద తెల్లవాఱెఁ, కుంతల యని యంతిపురము గుట్టునఁ జేరెన్. ౫౩౮

గీ. చేరి రేయి మహీకాంతు చెంత కరుగు, దానితోఁ బూని తోయజోద్యన్మరంద
ధార లూరఁగఁ గీర మోతరుణి యొక్క, కథ విను మటంచు వెన నరికట్టి పలికె. ౫౩౯


పదాజివకథ

క. ఏలానగరంబున గో, పాలుం డొకఁ డమరు విష్ణుభక్తుఁడు ధర్మ
లోలమనస్కుఁడు తంత్రి, పాలుం డనువాఁడు నిఖిలబంధుప్రియుఁడై. ౫౪౦

సీ. పులుల వాకట్టుమందులు, పాముబదనిక ల్పాదుగు చేపుఁడుమంత్రములను గోడె
దా మొనపగ్గము ల్త్రలత్రాళ్లు నురిత్రాళ్లు చిక్కంబులును జల్దిచిక్కములును
మాఱుమానిసిఁగన్న దూఱువేపులజోళ్లు కొలికిచెప్పులు జమ్ముగూడ లలఁతి
పిల్లగ్రోవులు నెక్కువెట్టినవిండ్లు కంబళ్లు దుప్పట్లును వల్లెత్రాళ్లు
మొదలుగాఁగల పరికరంబులఁ గొఱంత, లేక భూమీరుహచ్ఛాయలేగ్రవాళి
గాఁగ వాఁడాలమందలఁ గాచుచాళి, నడవిమానిసి యై తిరుగాడు నెపుడు. ✓ 541

చ. పిదికిన యాలపాల్వెదురుబిఱ్ఱును కావడికుండ నించి య
య్యదుపతికిం బ్రియంబుగఁ దదావృతవహ్ని సమిత్పరంపరా
భ్యుదయము నొందఁజేసి పయిఁటాంగలి వెట్టి భుజించు నాతఁ డిం
పొదవఁగఁ జేకటాకుల వనోర్విని మందలఁ గాచువేళలన్. 542

సీ. మేరలెంచక నూరివారిండ్లకేగి పాల్వెరుఁగు వెన్నలు మ్రిచ్చిలించె ననుచు
నీరాడుతతి వాఁడువారుకట్టినపాఁతె లెత్తుకపోయి చెట్టెక్కె ననుచుఁ
బ్రదుకుభాగ్యము క్రిందఁబడఁగ బాపన యిండ్లకరిగి యాఁకటికిఁ గూడడిగె ననుచుఁ
గడపటఁ జుట్టాల గరితెలపైఁటలోఁ జెయివేసి యేమేమొ చేసె ననుచు
వ్రాసికొన్నారు బాపనబైసిగాండ్రు, కొలముసామి విచారించుకోక యిట్లు
చేయునే యుంచుఁ బెద్దలచేత వినెను, కృష్ణకథలందు నిటువంటి వెల్లవినఁడు. 543

సీ. తులసిపూసలు పోఁడిమితలయు నష్టాదిష్టి పట్టెనామములు సంపగ్రిముసనొప్పఁ
బసుపులెత్తిన యెద్దుపై నొంటి తముసరావుచుండు వేణునాదములు పొసఁగ
రచియించు తప్తముద్రలును బైఁపైఁబల్కు గోవిందలును హాస్యమావహింప
నతిరసంబులఁబుట్టి యవసతులైన వారలకోసంగెడు దీవనలు సెలంగఁ
గాలమువారించఁగల! గొల్లకొడుకుఁగవఁగ, ఇంటిలునువోలెఁ జుట్టును ల్వొంటనంటఁ
గోర్కిమొక్కులు చెల్లించుకొనఁగాఁగ, నాతఁడేతేఁటఁ దిరుపతిఁ దిరిగివచ్చె 544
క. వానికి మనోహరయనం, గానొక యంగన యొసంగుఁ గలతుని తేజీ
కూనయన వానిగేవగి, జీనీజముదాళి యనఁగ నేమ మెసంగన్. 545
క. శోభితముఖదారితశశి, వైభవ యాలోకన గురుపర్ధితనదన
ప్రాభవ యెవ్వరితగమ, యాజ్ఞభిరగభిరనాభి నభినుతిసేయన్. 546
చ. చనుగవయొప్పు వెన్నడుము నన్నదనంబు మెఱుంగులీనుమో
ముఁగల తేట వెన్నడలముద్దును మాటల నేర్పు కోపుచూ
పునఁగల యందముం బిఱుదుపొంకముఁ గల్గినదానిఁజూడ నో
బ్బునఁ బదివేలమన్మథులు పుట్టుమెనప్పురిఁ బల్లవాళ్మలన్. 547
శా. మైనిగ్గు తెరయెత్తగా నమృతకుంభంబంది యేతెంచు పూ
యూనాయణిలీలఁ దక్రిఘట దీవ్యన్మనయై చూపుల
జ్ఞానమ్రిత్నముఁ జెందఁ జల్లఁగొనరో చల్లంచు నేతెంచుచో
దానింజూచిన కంతుఁడైన రతిమీఁదం దప్పు గల్పింపఁడే. 548
క. అలీలావతి, తంత్రి, పాలుఁడు దినదినము మండపాలై తిరుగన్
జాలివడి మనసుఁబట్టం, జాలక పరపురుషభోగసంగతిఁగోరెన్. 549
సీ. అరిది సిబ్బెపుగుబ్బ లన్యుచేతికి నిచ్చి నప్పుడే చనదె శుద్ధాన్వయంబు
పవడంపుజిగిమోవి పరుపంటి మొనకిచ్చి నప్పుడే చనదె గుణార్జవంబు
మితిలేని మెఱుఁగుమేనితరు కౌఁగిటికిచ్చినప్పుడే చనదె మహాభిమాన
మతనిఁగన్నొఱఁగి యింగితజాయఁబొందిన సుద్దులెంగిన రాజా బుద్ధిచెప్ప
నింతయేమిటి కాజారుఁడేలుదెంత, తెవ్వలుగొన నమ్మరాదంచుఁ దెలిసికొనరె
యకట తిమిరంపునిండుప్రాయంబు కతన, నెఱుఁగ రింతియు కాకరాకేందుముఖులు. 550
ఉ. ఆమ్మహిళాలలామ వినుమాగతి జారులఁగోరి కానిశా
ర్యమ్మగునైన మాళొలము రాధకువచ్చిన దూతసాహురా
నిమ్మని విశ్వయించి యెదురింటి గుణార్ణవ నామధేయునిం
గన్మిన్మనవాళితంటి యొలపాయను చూఱలోనం గె పాసికిన్. 551

సీ. ఒకతె క్రొవ్వాడము నయ్యె నుప్పులాఁడికిఁ గమ్మతెమ్మెయుండమ గ్రమ్మ నెమ్మిగమన
నొకనవ్వువాడము నయ్యెరగవేణికి మిన్నగన్న కెంపులవన్నె చిన్నిమోవి
నొకతళ్కువాడము నయ్యెవిచమిన్నకు మంచి యంచగుంపులసంచు మించునడల
నొకనీటువాడము నయ్యెకుసితంబకు మేటిరంగుబంగరపు బెడంగుమేన
నత్తయానతి మజ్జిగలమ్మువేళ, దానిదాయునీక్షించె నేని యింక
జాలిమాటలు తలమీఁదిచల్లకడవ, పడుటసైతము నెఱుఁగ దప్పడఁతి యపుడు. 55

*సీ. ఆగుణార్ణవునియిల్లాలికి మెఱుమెచ్చుకూర్మితో వండినకూరవెట్టఁ
గమ్మనేతులు చల్లకడవలోపల డాఁచికొనిపోయి పురయామికుల కొసంగు
నేరంబులో మెరు నియతికానికి గట్టిమీఁగడ కానుకగాఁగనిచ్చు
నాజ్ఞవెట్టఁగఁ గర్తలైనబంధులకు నెయ్యంబున నడుగని యప్పలిచ్చు
దనవిధంబంతె మెల్లనేతప్పదార్చు, వలసియాలీలమెలఁగు నవ్వనజగంధి
జారవిద్యలకొడిగట్టు సతులకింతె, యెచ్చరిక యుండవలయుఁ బూర్ణేందువదన. 553

క. వినుము ప్రభావతి నేమ, న్ననఁ దెలిసెదఁ జూపిమాపి యనుటయుఁ గాదా
యనితెలఁపకు మిఁకనీకై, నను హెచ్చరికింతలేక నడువం దగునే. 554

గీ. తగవవధరింపు మవలికథావిశేష, మమ్మనోహర యిట్లు గుణార్ణవునకు 555
మేలువడియున్న నొక్కనాఁడేలినాతఁ, డనుపనాతఁడు పొరుగూరికరుగుటయును.

క. ఆఘోషాంగన మదన, జ్యాఘోషం బితరవరసమాక్రమనిష్ఠా
ద్రాఘిష్ఠంబై మించె ని, దాఘసమవియోగవహ్నితన మదిముంచన్. 556

సీ. అవలించి పిదుకని యావులుండఁగ వేగ దోహానధేనువుదూడవిడుచు
బానలోపలఁ బచ్చిపాలుండ మించిచేమిడియిడ్డ పాల్పొయిమీఁదఁ బెట్టు
పేరిపక్వంబైన పెరుఁగుండఁ గవ్వంబు పులిచల్లలోనుంచి చిలుకఁబోవు
వెనలలో మూనాళ్ల వెన్నలుండఁగ వాఁడు కాఁచిడించిననెయ్యి కరఁగఁబెట్టు
దివమునను సంజకడయంచు దివ్వెలెత్తు, దద్దరిలినట్లు నడురేయి పొద్దుపొడిచె
ననెడుమతిఁ బాచిపనులు చేయంగఁబూను, వలపువెట్టికిఁ జిక్కి యవ్వనజగంధి. 557

క. ఈరీతినుండ మచ్చిక, దేరవ్వలసీవిరియెల్లఁ దెప్పించుటకై
వారసతుల్ప్రజగులతోఁ, బోరామియొనర్చఁ బసులపొంగలి వచ్చెన్. 558

సీ. ఇంకనాల్గావంబు లిడనైతిఁగా యంచుఁ గుమ్మరి నెమ్మదిఁ గుందికొనఁగఁ
గుడుముగూకలకెల్లఁ గొనవైతిఁగాయంచు బేరి తేరని యారివేర మొంద 559

*ఇంటవండినకూరలిచ్చి సారెకును గూర్మిచెలువునితోడ మచ్చికలు సేయు.

గొత్తియునుంచల నింపుకొనసైతిఁగాయంచు గొల్లవాఁడూరకే కుళ్లుకొనఁగఁ
జెనుపసుపే విత్తుకొనసైతిగాయంచుఁ గాపునిద్దురలేక కళవళింప
మొనసి వెలచూపిచూపకమునుపె వారి, సరకు లమ్ముడువోయె నేఁటివారి
కేని బాటింపవలసి పేరెక్కినట్టి, యాదివంబున నంబురుహాయతాక్షి. 560

గీ. అపుడు పొంగటికైన బియ్యంబుఁదెమ్ము, శీఘ్రమునటంచు నొకరూక చేతికిచ్చి
యత్తపొమ్మనవమ్మనోహరతరాంగి, పాంథ్రమైనట్టి చెంగటి సంతకరిగె. 561

క. తండులములు గొని పుట్టిక, నిండం బెట్టుకొని రాఁడె నేఁడైనను జా
రుం డని మదిఁ దలఁచుచు న, ఖ్ఖండం డేతేఁ దత్సమీపహితమొదవఁగ. 562

క. కనుచూపు మేర దానిం, గనుఁగొని యమ్మగువ యగునొ కాదో యనుచుం
జనుదెంచి గుణార్ణవుఁ డే, గినకార్యము చక్కనగుటఁ గెరలిన తమితోన్. 563

క. అంత మనోహరుఁ గనుఁగొని సంతసమున మనసు నిలుపఁ జాలక యపుడే
కంతురణకేళికై యుప, కాంతునితో నచట వల్లికాగృహసీమన్. 564

గీ. చేరి పుట్టిక వెలుపలి చెట్టునీడ, డించి పొదలోని కరిగి యమ్మించుబోఁడి
జారుతోఁగూడి తమ్మినేజావజీడ, దురమునను దన్మయావస్థతో రమించె. 565

ఛ. ఆదిగని యొక్క ధూర్తవరుఁ డబ్బుర పొంగటికంచు నెమ్మదిం
జెవరక మెల్లనే యరిగి బియ్యముఁ గైకొని యొంచరానినే
ర్పొదవఁగ గంపలోన సికతోత్కరము న్వెసనించి పోయిన
న్మవవతి జారుఁ బొందెడు సుమాళిమె కాని యెఱుంగ దేమియున్. 566

గీ. అంతఁ బొదరిల్లు వెడలి గుణార్ణవునకుఁ, బురముఁ జేరంగఁ బెట్టిపోవఁజెప్ప
నందడిని గంపయెత్తి మస్తంబు మీఁదఁ, బాల్చి కొనివచ్చె నదియాత్మధామమునకు. 567

ఉ. వచ్చిన నత్తగారు తలవాకిటికిం బఱతెంచి యింతసే
పెచ్చట నేమి యం చని శిరోగ్రమువం దగుగంప డించి నే
మెచ్చితిఁ గోడలా యిసుక మేదినిఁ బుట్టద టంచు సెంచియో
తెచ్చితి వంచు నాగ్రహమతి న్నమకె న్వలెతాఁడు మూంగిటన్. 568

క. ఆయెడ నాగోపాంగన, యేయనువున బొంకవలయు నెఱిగింపఁగదే
కాయమ్యతినిర్జితశశం, పాయన నచ్చిలుకతోఁ బ్రిభావతి యనియెన్. 569

క. చిలుకా యీచిక్కులు నం, ధిలుగాధలు నాకుఁ గానె నేర్చితివో కా
వలసి తలంపునఁ దలఁచితొ, తెలియదు గద యవలికథయుఁ జెల్పుము వేగన్. 570

వ. అనిన విని యాభామాలలామంబునకుఁ గీరసార్వభౌముం డిట్లనియె. 571

క. ఆదారి నత్త కినిసెనొ, లేదో యాతోన నమ్మలించుచు నేనిం
కేదియుఁ జెప్పిన నిక్కము, గాదే కద యనుచు గోపకామిని యేడ్చెన్. 572

క. ఆమాటలు విని యత్తద, యామేదురహృదయయై ప్రియంబున నడుగం
గోమలి యిట్లను గోకిల, కోమలవాక్కలిని గేలిగొనియెడి పగిదిన్. 573

గీ. ఓపలే నన్ను విడక కెం పావవు చూడ్కి, నంపఁగా నేను మీకు మా తావ వెలఁది
సంతకేగితిఁగదయందునరఁగఁ జెలఁగు, మడివిడువరాక వెనజాజ్ఁపడియెనమ్మ. 574

క. వెనకితి నవ్వోఁ గానక, కద యంతటఁ బ్రొద్దువోవఁగా భయమున నె
మ్మది నింటికిఁ జని తూర్పె, త్తెద నని యచ్చోటి యిసుము దెచ్చితి గంపన్. 575

చ. వెలుపల వడ్డి కిచ్చినను వీసము వచ్చును నట్టు లాయెనో
బలబలవేగ వచ్చు నలబాపని కిచ్చినయట్టు లాయెనో
యెలయక వాల్గుచట్లు పెరుఁగమ్మినఁ జేతికి రాసి రాక నా
వలె నలసంతలోనఁ బడవైచినవారలఁ గాన నెచ్చటన్. 576

క. అని పల్క నత్త కనికర, మున రావే యెంత లేదు పోయిన యపుడే
మనసొమ్ము గాదు వగవకు, మని యూరార్పంగ నది గృహంబున కరిగెన్. 577

క. ఇట్టివగఁ గనినఁ జనుమా, గట్టిగ నని చిలుక పలుకఁగాఁ దమిలోడన్
నిట్టూర్పు నిగుడఁ గోమటి, పట్టపుదేవేరి కేళిభవనం బెడసెన్. 578

క. ఆపగలు గడవఁ బడుటయు, భూపతిభవనంబుఁ జేరఁబోయెడు తఱి నా
కోపనఁ గనుఁగొని సుమన, శ్చాపుని యెకిరింత సంతసం బుప్పొంగెన్. 579

శా. క్రోగ్రగ్రావభిదాదికీర్తితగుణవ్యూహౌఘ గాఢత్రినే
త్రగ్రావోద్ధరణోగ్రబాహుబలగర్వగ్రంథిలంకాధినా
థగ్రీవాగ్రసనోజ్జ్వలాద్భుతభుగస్త్రస్థేమ వాతూలభు
గ్భుగ్గ్రావజత్పటుశౌర్యవైభవహృతాంభోధిప్రభుప్రాభవా. 580

క. భూదేవకలత్రఘ్నవచః, కద్రూభవభూరిభావుకప్రాభవ దై
త్యాద్రివరధ్వంసన నవ, క్షుద్ర కృపావీక్ష భానుకులహర్యక్షా! 581

హంసయాన వృత్తఖడ్గబంధము.

దారితారిభూరిధైర్యధామధామభూరుహా, భారతీశవంద్యశౌరి భాస్వదబ్జలోచనా
నారదస్తుతప్రభావ నవ్యమేఘసన్నిభా, భారతీశశాంకకీర్తిభాసుమూరిరంజనా! 582

గద్య. ఇది శ్రీచక్షాదరీనృసింహకటాక్షవీక్షణసమాగతకవితాధార పాలవేకరికులకలశాంభోధిసుధాకర తాడిగోళ్ళ కరియమాణిక్య నృపహర్యక్షపౌత్ర కదురధరామండలాఖండలపుత్ర విద్వత్కవిరక్షణానుసంధాయక కదిరీపతినాయకప్రణీతంబైన శుకసప్తతి యనుమహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము. 583



శ్రీమదుమారమణాయనమః.

# శుకసప్తతి.

## తృతీయాశ్వాసము.

క. శ్రీజానకీమయూరీ, రాజన్మేఘాయితాంగ రతిరాజశత
భ్రాజితసౌందర్యసుధా, రాజితగిరికీర్తిసాంద్ర రామనరేంద్రా! 1

గీ. అవధరింపుము సకలరాజాధిరాజ, నతపదాంభోజుఁ డగుధర్మనందనునకు
నరసలౌకికవైదికాచారవిహిత, హితకథారమ్యుఁ డగుధౌమ్యుఁ డిట్టు లనియె. 2

గీ. అటుల నిజగృహమున కేగి యబ్జవదన, పగలు గడవంగఁబడుటయుఁ బార్థివేంద్రు
కేళిగృహమునకరుగునవ్వేళఁ గాంచి, మరుని యొకరింత సంతోషభరితయగుచు. 3

క. ఒకకథ వినియెదె మతి పోం, దికతో నటు నిల్చి తర్జనీనాసాయో
గకరణధురీణ మిది యని, యకలంకసుధావిధోష్ఠ లలరం బలికెన్. 4

క. ధరశాలివాహనుం డను, నరనాయకమౌళి పెనుపనలువై విభవా
కరము ప్రతిష్ఠానం బను, పురమలరు న్వేల్పుఱేనిప్రోలుం బోలన్. 5

క. ఆప్పురిఁ గుబేరుకలిమికిఁ, దప్పులు ఘటియించు సోమదత్తుం డను పే
రొప్పు నొకవైశ్యుఁ డలరుఁగ, నుప్పటిలిని గీర్తివల్లికోటులు ప్రాఁకన్. 6

సీ. నవరత్నములు సువర్ణమును వెండియును లోహాంతరములు పటలాంశుకములు
గోవజవ్వాది కుంకుమపువ్వు పచ్చకప్పురముఁ బన్నీరు చెంబులుఁ బటీర
తరుఖండపటలి యందలపుఁ గొమ్ములు జల్లి నవరము ల్పాదరసంబు జాజి
యింగువ యేలాలవంగము లోడపోఁకలును గోరోచనగంధకములు
కొచ్చికుక్కలు మానిసిక్రోఁతులరిది, పంచవన్నెల చిలుకలు బహువిధముల
పావురాతిన్నె లిఁక మీఁదఁ బలుక నేల, పావలువానింటఁ బులిజున్ను మొదలుగాఁగ

క. ఈళము మొమ్మెంగియు బం, గాళము పైగోవ మొదలుగాఁ బొదలెడుద్వీ
పాళిఁగలనరకులాతని, కొలువ దిగుమాట నిజముగలవాఁ డగుటన్. 8

శా. ఏయూర్వం ధనయాపణంబు మఱియింకే చేరి పేరైన నా
త్మీయత్త్వం బగువిత్త మేయడవియందైన న్నిజవ్రిష్వ ఖ్రా 9

చాయసంపద వృద్ధిఁ బొంద ధనదస్పర్ధాళుఁడై నిల్వెఁబో
యాయూరవ్యాఁడు గోల్లకుంబడగలెన్నెనం బ్రిమోదంబునన్. 10

చ. పలసిన చేరముల్దెలియవచ్చినవారలు వాడుగల్గువా
రలు తెగగుత్తగొల్లలును రత్నపరీక్షలవారు కార్యము
ల్గలిగిన యింగిలీషులముఖాములు చెంగట నుల్లసిల్లఁగాఁ
గొలువొనఁగు న్మహీశుగతిఁ గోమటి యాత్మ గృహాంగణంబునన్. 11

క. ఆతఁడుధూర్తచకోర, ఖ్యాతంబగు నొక్కచిలుక నతులితగమనా
యాతేరితవిజ్ఞాన, న, మాతల శేముషిఁ గృపాళుఁడై పోషించున్. 12

గీ. అప్పురంబునఁ గామసేనాభిధాన, యైన వెలచానమీఱు జయైకతాన
మీనకేతనవలిపప్రసూన శరస, మానతానూనవీక్షావితాన యొకతె. 13

ఉ. కారుమెఱుంగురాచిలుక కస్తురివీణె పదాఱువన్నె బం
గారము నచ్చుతప్పె తెలిగంబుర వెన్నెలలోని తేట సిం
గారపురీవి తేనగవుగల్గిన చక్కెరకీలుబొమ్మ యొ
య్యారపుజీవగఱ్ఱ యన నచ్చెలి మెచ్చులుగాంచె నెంచఁగన్. 14

సీ. ప్రత్యక్షబాహాటపాంచాలనటనలు గనుపట్టఁగాఁ బుస్తకములు చదువుఁ
గనుఁగొన్నరూపమచ్చున నొత్తినట్టులఁ దళుకొత్తభావచిత్రములు వ్రాయు
నట్టువకాని యందముగాక వింతగాఁ గోపులు గల్పించుకొనుచు నాడుఁ
జేరి తంబురమీటి సారసుధాసూక్తిఁ దేటలూరగ వింతపాటఁ బాడు
జాతివార్తలుదొలఁక రసంబుగులుక, గవితరచియించుఁ గల్పించికతలునుడువు
మనసు గరఁగంగఁ దీయనిమాటలాడుఁ, జిలుకరౌతుకటారి యవ్వెలమిటారి. 15

సీ. పలుకుముద్దులకుఁ గోవెలజియ్యగాండ్రిల్లఁ గుంటెనకాండ్రి వెన్వెంటఁ బడఁగఁ
జనుజక్కవలు గన్న సన్యాసులైనను దలవరివారితోఁ జెలిమి సేయఁ
దళుకుఁజూపులకు విద్వాంసులైనను నిజరామలతోడ రాదాపొనర్పఁ
బొలుపున కాచార్యపురుషులైనను దమ వేషభావలమీఁద వెగటు పడఁగఁ
దొంపిగనిచూచినట్టి పతివ్రతలును, నిజకులాచారవృత్తిపై నెటికె విఱువ
వింతయొయ్యారమెసఁగఁ గోవెలకుఁ బోయి, మరలి యింటికివచ్చు నమ్మచ్చెకంటి.

చ. తొలఁకెడు తత్తరంబువగలోఁ బొడనిగ్గుహిజారుమీఁద మె
ఱిసిలువడినొంటికట్టున ఘటించినచీర నగంబుమూఁపుపై

నలువడ బోఁటి దట్టి మొదలైనవి తేఁ దిరుమంజనంపు వే
ళలు దటితప్పెనంచు నవలాభయమందుచు నిల్లువెల్వడన్. 17

క. కోడు మెత్తుకొలుకుగుడికిన్, నడుచు న్వ్యాళపడుచు నాభినామమునం గ్రొ
మ్ముడిసోఁక న్మడిచారు, న్వడిజాఱుం బైఁట వింతవగఁ గనుపింపన్. 18

సీ. తానున్న కేళికంతటికి గణాచారి పెక్కుసుద్దులు మ్రోయు పెద్దబేరి
పేరుకోఁదగినట్టి యూరలేనియుటంకు పరులబుద్ధులకుఁ జొప్పడనిమంకు
కల్లలుపచరించి గద్దించు తాటోటు పూనియొక్కరికీయలేని జాటు
కలహంబెకూడుగా మెలఁగెడుగయ్యాళి నిష్ఠురత్వము సూపు సెటకరాళి
వేరిజప్రగట్టిజంత పాదూరినంత, చలముసాధించు దిట్ట రోసాలపుట్ట
లోకములకెల్ల నూచి యల్లుండ్రిబూచి, యెంచఁగల యుచ్చమల్లి యయ్యింతితల్లి 19

గీ. దానినుతియింపఁదరమానె తాటకావ, ధూటితల్లియొ పూతనతోడఁబుట్టొ
శూర్పణఖ మేనగోడలో చూడ లంకి, ణీతనూజయొ యనఁగ వన్నియకు నెక్కె. 20

సీ. ఇరుగింటిదయ్యంబు పొరుగింటికినిగూబ యెదురింటివారల కెదురుచుక్క
వాడకుఁబగ యూరివారలతలనొప్పి పెంపుడుకూఁతుండ్రి పెద్దపిడుగు
పరదేశులకుఁ బులి బాపలగాలంబు యాచకకోటుల కానవిఱుపు
దాసర్లమిత్తి సన్న్యాసులతెరబొమ్మ జోగిజంగాలకు సొంటికొమ్ము
పాఠకులకొజ్జునట్టువపాలియదురు, గ్రొవి భరతంపుటయగారి గుండె దివులు 21
బట్టువాకట్టుబవనీలపాముకూన, యనఁగ విఖ్యాతిఁగాంచు నాయాఁడుఁగూచి.

సీ. గూనివీఁపనరాదు కోలమూతినిజాఁచుఁ గోడిపెమోమనరాదు గోడఁగసాగు
బాకిమోమనరాదు పగసాటిబెదరించు నొంటిపల్లనరాదు కంటగించు
నరవెండ్రుకనరాదు నాఁడెల్లజగడించు వాటుగాలనరాదు చేటుఁదెచ్చుఁ
జెవుడనఁగారాదు చేట యెత్తుకవచ్చు గ్రుడ్డికన్నరాదు గొట్టుసేయు
వెఱ్ఱియనరాదు పైఁబడివెక్కిరించు, గామిడనరాదు మొగమున గంటువెట్టు
పెంకియనరాదు వట్టిగుంపెనలుసేయు, మద్దియనరాదు గ్రుద్దునయ్యోద్దుమొద్దు. 22

క. గడెతడవు వేసటలచే, సుడివడ కటులనదు పాఁతసుద్దులు విన్నన్
వడినిచ్చు నొక్కఁడిచ్చిన, యడగొంటుంబదుకక్రిందియాకులు రెండున్. 23

సీ. రమనేలినట్టి గురస్తునందు రదేమొ నేలమిన్నులు గొల్వ నేర్పుటరుదె
మేనకాంగననంటుకాని మెత్తురదేమొ సృష్టికిఁ బ్రతిసృష్టి సేయుటరుదె
కడవఁబుట్టినవానిఁ గడునుతింతురదేమొ పాథోధిపుక్కిటఁబట్టుటరుదె

లంకఁ గాల్చినవాని బింక మెంతుర దేము హెచ్చుమందుల కొండఁ దెచ్చుటరుదె
యనుచు మదితప్పి తప్పి నీళ్లానిపూని, తోడిముదుసళ్లఁ జెక్కండ్రఁ గూడఁ బెట్టి
పట్టి తలనొవ్వ రవ్వగాఁ బవలు రేలు, వట్టిపగ్గెలు పేర్చెలు నవ్వారజరఠ. 24

క. అదిసమ్మదిపదలని చల, మొదవఁగఁ దనసుతకుఁ బైఁడి యొకనిద్దురకున్
బదివేలమాడలీయక, కదియఁగ నీ దెట్టి విటశిఖామణి యైనన్. 25

క. ఆకామసేనవచి బోంకము గనుఁగొనుట మదనభూతావేశ
వ్యాకులిత మానసాంబుజుఁ, డైకుందుచు సోమదత్తుఁ డతివిరహమునన్. 26

క. అక్కలికి కొనఁగవలసిన, రొక్కము పురహరుఁడు దానరూపము రతిగాఁ
జక్కరవిలుతుఁడు వెలపు, నొక్కలితన మెపుడుఁ దన్ను ముంపఁగ నుండెన్. 27

ఉ. అంతట నొక్కనాఁ డతఁడొయారము మీఱఁగఁ గామసేన సే
కాంతము నందుఁ జేరి మనసారఁగఁ బుక్కిటి వీడె మిచ్చి గి
ల్గింతలెసంగు కౌఁగిటి బిగింపుల నింపులనింపు పారువా
వింతరొద ల్ముదంబు నొదవించు నటు ల్కలఁగాంచి వేడుకన్. 28

చ. తనచెలికానితోఁ బసిఁడి దార్చక యేవల కామసేనతో
సెనసితి నిన్న నంచు వచియించిన వాఁడు దానియింటికిన్.
జని మది నిల్పఁజాలక ప్రసంగవశంబున సోమదత్తుఁడా
డినవచనంబు లెల్లఁ బ్రకటించినచో వెలముద్ది యుగ్రయై. 29

క. ఏనెఱుఁగకుండ నాసుత, తో నెనయుట యెట్లు లిట్టి దుడుకులు గలవే
కానీ రొక్కంబీయక, పోనో చూచెదము తనప్రభుత్వం బనుచున్. 30

సీ. శ్లేష్మంబు కుత్తుకఁ జిఱ్ఱుబుఱ్ఱన కఱ్ఱుకఱ్ఱను దగ్గు లగ్గలముగాఁగఁ
జన్నులు తలఁగడ నంచులవలె వ్రేళ్లి పయ్యెద మీఁద జంపాల లూఁగ
భీవనశాలతోఁ బెరుఁగువాఁగడుపులో బల్ల వల్లడలందుఁ దుళ్లిపడఁగ
బుగ్గలాహిరియాటఁ బోడము వాసనతోడి కంకినోటను జొంగ యంకురింపఁ
దిరుకొళ్లములోఁనఁబడినక్రోఁతియునుబోలె, పడఁకుకొంచును నెదుట నివ్వాఁడిఁగన్న
గ్రుడ్లు మిడికించుచును గుడ్లగూబ రీతి, వేగఁ దనయిల్లు వెడలె నావృద్ధవేశ్య. 31

గీ. అంతలోవసె శాలివాహను దివాణ, మునకు నేగుటకై బంధుజనులు గొలువ
వచ్చునలసోమదత్తు నవ్వారవనిత, జనని వీక్షించి నందడి జడియ కరిగి. 32

గీ. పైత్రసీరానుకతమున వెడలునట్టి, చొంగ్గు జోఁదట్టి యొకకన్ను వెక్కఁ బెట్టి
వడిగఁ బోవఁబోవు వేసి చందమునఁ బట్టి, పరుస మెచ్చఁగ సూరుజ ప్రముఖుఁ బలికె. ~~32~~ 33

శా. అయ్యో యల్లుఁడ యెంతపెద్దఱిక మయ్యా నిల్చి మాటాడవే
వియ్యంజాలని సెట్టివా నెనరులే దీపట్ల నిక్కైన నీ
వియ్యాలందఱి కేదిదిక్కు మఱి నీ వెన్వెంట నేవచ్చు మా
యయ్యల్ చెప్పరె నీకు మాకుఁ దగవీయాదాయమే కంటివో. 34

క. నలుగురిలో నిట్లాపని, పలుకఁగఁ దగనైన వెఱ్ఱిపట్టినకతనన్
దెలిపెద నీకేగోనము, గలిగిన బ్రతికితిమి మంచికార్యం బిదియున్. 35

క. ఇయ్యెడఁ గలిగిన రోవెల, యియ్యక నా కీయుక లేక యిటు నే నింటం
దయ్యమువలె నుండఁగ మా, తొయ్యలితో నెట్లు కూడితో నేనెఱుఁగన్. 36

క. పైఁడేమి ప్రొంతి యిదిగో, నేఁ డిచ్చెదు మ్రుచ్చు పగల నెలఁత రమింపం
బోఁడిమి చెడదే మఱి బురి, కాఁడవు గదకొదవలె జగంబు లెఱుంగున్. 37

గీ. నిన్న నే నన్ను మొఱఁగి పోచిన్నదాని, నక్కటా యొడరేవున నమ్మికొందు
వేమిటికొ జాఱవిడిచితి వింతెకాని, యంత దబ్బఱకాఁడ వీవౌదొ కావొ. 38

గీ. మంచిమణులకు వెలఁ బొసఁగించువేళ, హెచ్చువెలలకు సొమ్ము చేయించు చోట
నగరి జాలెలు నీయింట నిగిడియున్న, వింతమాకేల మారొక్క మిచ్చిపొమ్ము. 39

క. అవ సోమదత్తుఁ డద్భుత, మున నచ్చట నిల్చి వెఱ్ఱియుద్దియ కలలో
నెనసితి నీదు తనూభవ, ననుపమరతి నింతెకాని యన్య మెఱుంగన్. 40

గీ. అనిన నమ్మూర్ఖ మంచి దక్కైన నేమి, నాతనూభవవలన ననంగసౌఖ్య
మబ్బెఁగద నీకు నిదియు లేదన్న నందు, వర్ధమిప్పించి యువ్వల వడుగువెట్టు. 41

క. అనిగట్టుపేము వచ్చటి, జనములు సామ్మియునికిఁ జనదని వగదెం
చినదాని బోడుకొనిపో, యెవతెం డింటికిని రొక్క మిచ్చెద నంచున్. 42

క. చని ధూర్తచకోరమునకుఁ, దనవృత్తాంతంబుఁ దెలుపఁ దత్కారము న
వ్వి నిజంబుగఁ గెలిపించెద, నిను వెఱవకుమనియె వైశ్యనీరజగంధీ. 43

క. ఆవైశ్యునిఁ దత్కారం, బేవిధి గెలిపింప నలయు నెఱిఁగింపఁగదే
నీవేజాణ వటన్నన్, భావించుచుఁ జిలుకతోఁ బ్రభావతి పలికెన్. 44

క. ఏలాగున గెలిపించెనొ, బాళి మెయిం బ్రహ్మలోకపర్యంతము నే
నాలోచన యొనరించితిఁ, జాలదు నాహృదయ మిది నిజంబుగఁ దెలియన్. 45

వ. అనిన విని యవ్విహంగమపుంగవం బనంతరకథా విధానం బిట్లని తెలుపం దొడంగె నవ్విధంబున నాధూర్తచకోరంబు దత్తప్రతిజ్ఞం బైన విత్తంబు సోమదత్తుని చేత మాటుగట్టించి [illegible] బైదుర నొక్క నిలువుటద్దంబుఁ బెట్టించి పెద్దలతో నవ్వై

లముద్రిం బిశేషించి దర్పణప్రతిబింబితార్థంబుఁ గైకొనుమని పలికిన నచ్చిలుకవారును స్వప్నవృత్తంబునకు నిదియె సమానంబని నిర్ణయింప నప్పుణ్యవృద్ధయు నగణ్యలజ్జానమ్రవదనయై సదనంబునకుం జనియె ననిపల్కు-నవసరంబునం బ్రభాతం బగుటయు. 46

క. అంతఃపురంబునకరిగి ది, నాంతమునన్నృపతిఁ జేరి నరిగెదుతమితోఁ
కెంతకువచ్చినకో మటి, యింతింగని చిలుకరాయఁ డిట్లనిపలికెన్. 47

క. రమణీయాదూర్తచకో, రముకథయిఁకఁ గొంతకలదు రాజవియోగ
ఖ్రిమనుడఁచి తెచ్చి కోల్నె, య్యామె తోడుతనైన వినుమటంచుం బలికెన్.

క. ఆగతి నింటికిఁ జనిగా, భోగము ముచ్చటను యాత్మపుత్రికతో నా
లాగెల్లఁ దెలిపి పరిభవ, యోగంబున మదికిఖేద మొదవఁగ నంతన్.

సీ. పుట్టిలమ్మ యటన్నఁబో యెంతలేదను నంకవీరులటన్న జాముగోలుగు
నెక్కలమ్మ యటన్న నొక్కటికోదివచు భోతురాజులటన్న బూతునడవు
ధర్మరాజులటన్న దబ్బఱలేతిట్టుఁ గంబమయ్య యటన్నఁ గాసియుమియు
గ్రామగంగయటన్నఁ గాదానురో యను దేవాదులన్న గద్దించిచూచు
నిన్ని దేవళ్లఁగొలిచి నేనేమిగంటి, పోయి వచ్చిని పులుగానిపులుఁగుచేత
మోసపోయితి ననికుంది మొనయు ఖేద, మారంట మొనర్చ విసివి యయ్యారిబసివి. 50

సీ. నట్టింట దేవళ్లు పెట్టెఁ బెట్టినతిన్నెఁ గొట్టించి వెనఁ బందిగూడు చేసె
మెడనున్న పాదాలు విడిచి యెవ్వరిఁగన్న మెరుగుతలారికి మురువు చేసె
బానలో దాచిన పట్టుపుట్టము చించి పొదుగుడు కోళ్లకుఁ బొత్తి చేసె
దేవాదుల కడెంబు దిగిచి కమ్మతగాని పట్టికానికి మొలకట్టు చేసెఁ
గాటికేవనికి మీఁదుగాఁ గట్టె యున్న, గట్టివరపాలి వరపానిగాఁగఁ జూడఁ
కాడఁబోఁగూడ కొక్కుమాటాడకుండ, గుండనికి రంగుబంగారు గోరు సేసె. 51

గీ. అంతఁ దత్పుత్త్రి కీరమా యింత చేసె, దానిఁజూడు దినకున్న నేనుసాని
కూఁతురనె యంచుఁ దల్లినిగుస్తరించి, మఱియు నవ్వార్త యూరెల్లనుఱపనిచ్చె.

క. వలసిన నతికే చిన్నెలు, గలవోయ చ్చిన్నెల్లఁ గనుపించుచున
వ్వెలవెలఁది సోమదత్తుని, వలను న్లోఁగొఱచి మేలువానిం జేసెన్. 52

గీ. చేసియొకనాఁడు మీయింటి చిలుకకతలు, చెప్పనందురు నామాట చిన్నఁబుచ్చ
కిప్పుడె తెప్పించరా దాని యెడను గలుగు, పొలుపు గనుఁగొని మరల నంతృప్తయు గాసి 54

చ. అనవిని సోమదత్తుఁడు నిజాప్తులఁ బంచిన వారు తెచ్చినం
గనుఁగొని కామసేనయు వికాసపు మాటలు గా వచించి యెం

దును వరిశేక మించు నలఘూర్తచకోరశుకాగ్రగణ్యముం
దనగృహాసీమనుంచుకొని దబ్బుఱ నెయ్యము నిబ్బరంబుగన్. 55
గీ. కొన్ని దినములు చన రోషకుటిలహృదయ, వనజయై దీని మాంసంబు వండుమనుచుఁ
జిలుక నెవ్వరుఁ గనకుండఁ జేతికొసఁగ, బోనకత్తియు వెనపాకభూమి కరిగె. 56
మ. అపుడాఘూర్తచకోరకీరవరమ య్యాపన్మహాంభోధియే
నిపుణత్వంబున నీఁదఁగావలయు నీ నేర్పెల్ల శోభిల్లఁగాఁ
జెపుమా చూతమటంచుఁ బల్కి తెలియం జింతింపఁగా నవ్వి పై
శ్యపయోజాన్యకుఁ జిల్క తక్కిన కథాంశం బిట్లు తెల్పం దగన్. 57
క. ఆరీతిఁ బాకగేహముఁ, జేరిన యావంటలక్క చిలుకం దఱుగం
గోరి పచనక్రియాచిం, తారతితో నీలకత్తి నబుగడ నెమకెన్. 58
ఉ. అత్తఱిఁ దాని జూచి శుక మంగన యెంతటిపుణ్యమూర్తివో
బత్తిజనింప వాదు చెఱఁ బాపెదుఁ గావున నిన్ను వంటి యు
త్కృత్తమకేను నేర్పెదు ప్రయోజన మున్నదె యైన నామనం 59
బుత్తలమందె నీకిటులయో జరయింతటి పాటొనర్చెనే.
క. ఏమ దిరికాలం బెఱుఁగుదు, మానిని పదినాళ్లలో సమంచితరేఖా
నూనవయి నిండు జవ్వన, మూనంగా నీకు హేతు వున్నది సుమ్మీ. 60
వ. ఇంత యొఱింగిన నీకీ యపాయంబుఁ దప్పించుకొనరాదే యని యంటివేని యలంఘ
నీయంబగు విధివిధానం బిట్టి దని నిశ్చయించి యున్నదాన నది యట్లుండె నవయౌ
వనాపాదకం బగు నొక్కమంత్రింబు నా కభ్యాసం బై యుండు; నది నాచోడ
నెపోయెడుం గదా యను విచారంబు తీరకునికి నీకు నుపదేశించెద దానివలన నీకుఁ
బ్రాయంబు వోడముట కడుగ జేల నీవిచ్చినవారికిం గలదు కాలయాపనంబు సేయ
క యిచ్చోట గోమయంబున నలికి ముగ్గువెట్టు మనుటయు నావృద్ధసంభ్రమాశ్చ
ర్యానురుద్ధయై యచ్చిలుక చెని నచ్చట మనిచి తదుక్తప్రయోజనంబులకు బోయిన. 61
క. ఆఘూర్తచకోరము గరు, దాదృక్పటపటనినాద మడరం బరదు
ష్పాథంబై వరమావా, బాధత్వర మెఱయగా నభంబున కెగిరెన్. 62
గీ. ఎగిరి వెంగట నీశానగృహముతోనఁ, గూళ్లుపెట్టిన చిలుకలఁ గూడుకొనియె-
దాని గానక భయమంది బోనకత్తె, కార్కొనాకవపాకపాకం బొనర్చె. 63
క. ఆకోమసీన మదిఁ జిం, తాకలుషతమాని సోమదత్తునితోన్నే
లేకున్నతటి బిడాలం, బాకీరముఁ బట్టి చంపె ననుచుం బొంకెన్. 64

క. ఆటుకవుక నేర్పుగలిగినఁ, గుటిలాలక నేఁడు నీవు కోరినపనికే
గుట తగులేకుండినచో, నిటనుండియె మరలు మని శుకేంద్రుఁడు పలికెన్. 65

గీ. అంతలోనన యరుణోదయంబు మించ, వావ్రిభావతి యంతఃపురాంతరమున
కరిగియానాఁటి రేయిభూవరునిఁ జేర, నేగుచోఁ జిల్క యక్కలికి కిట్టులనియె. 66

గీ. అతివ ధూర్తచకోరశుకావతంస, మంత చేసినఁ గామసేనాంబుజాత
గంధిఁ జెఱతు నటంచుఁ గంకణము గట్టె, నెట్లు చెఱపంగవలయు నీ వెఱుఁగఁ జెప్పుమ. 67

క. అని పలికె తెలియ నేరని, వనితామణిఁ జూచు కీరవల్లభుఁ డది దా
వినిపించఁ దొడఁగె ననితర, జనితరసంస్తవ్యవచనసంభావ్యముగన్. 68

క. ఆగీతిఁ దలఁచి ధూర్తచ, కోరము తత్ప్రియకు వేళఁ గోరుచు నుండన్
మారునిచెలిఁ జెనకెదునో, య్యారముగల కామసేన యంతటిభక్తిన్. 69

క. ఒక నాఁడు కోవెలకు నే, గి కపర్దికి మ్రొక్క గర్భగృహమునఁ దన్మూ
ర్తికి వెనుక డాగికొని యా, శుక మిట్లని పలికెఁ దద్వచోగతిగాఁగన్. 70

ఉ. మెచ్చితి నీదు భక్తికిఁ సమిద్ధవిశుద్ధకళాభివృద్ధికిన్
వచ్చినగాదు నాపలుకు దప్పదు చొప్పదుఁ గాయసిద్ధి యే
నిచ్చెద నీవుఁ దల్లియు మఱెవ్వరితో నెఱిఁగింపఁ బోక యీ
వచ్చుసరోజశాత్రవుని వారము నాఁ డిటు రండు వేడుకన్. 71

క. తొలునాఁడు బోడలైని, శ్చలభక్తిం జోగులకును జంగాలకు మీ
యిలు చూఱవిడిచి యిటురా, వలయున్ వైష్ణవుల కొనఁగవల దేమైనన్! 72

క. వారు శివద్రోహులు గద, యీరసమున శైవమతము హెచ్చఁగరాదం
చేరీతినైనఁ జెఱతురు, నారీమణివారిమాట నమ్మకు మింకన్. 73

క. అనిపల్క వాల్గుదిక్కులు, గనుఁగొని శంకరునిమాటగా నమ్మి కృపా
వననిధిహారత్రిభువనపా, వనధీరస్వాంత యనుచు వర్ణించి వెసన్. 74

క. గుడివెడలి వైష్ణవులు గను, పడకుండఁగఁ జెలుల నరిగ పట్టుమటంచున్
బడఁతి తన యింటికడకున్, వడిఁజని నిజజననిఁ బిలిచి నగుమొగ మలరన్. 75

క. హరుఁడానతిచ్చినాఁడె, వ్వరితోఁ జెప్పకుము సోమవారము నాఁడీ
ర్వురకు నెలప్రాయమిచ్చుం, జరయున్మృతిలేదు సంతసంబయ్యెఁగదా. 76

చ. అన విని వృద్ధవైశ్యపులకాన్వితయై నవయౌవనంబు నే
నెనసితి నేని యీపడుకటిల్లుముదీయము నీవు వేఱె యిం

టనుబవళింపునున్న జగడాలకు రాకుమె యూరనీవునే
నునుగడియింపఁ జొచ్చినఁ దనూభవ గోడలు పైఁడిసేయుమే. 77

సీ. ఇప్పుడే తెచ్చి నీ కిచ్చెదఁగాని యీతళుకుఁగమ్మలు నేనె తాల్చికొందు
నృపులచేఁ దెచ్చి నీకిచ్చెదఁగాని నీపెద్దముక్కఱ నేనె పెట్టికొందు
నృపునిచేఁ దెచ్చి నీకిచ్చెదఁగాని నీబాగడలజోడు నేఁబూన్చికొందు
నెటులైనఁ దెచ్చి నీకిచ్చెదఁగాని నీమట్టెలు నేఁగాళ్లఁ బెట్టికొందు
నౌర నీవు గడించిన పనుచువాకొ, సంగఱుండిన మఱి నేను సంతరించు
సొమ్ముఁ బిమ్మట నీకీయఁ జూడు పాపరి, తాపమనిపల్కి యుత్సాహచాపలమున. 78

సీ. కుఱుచనెరు లుద్దికొని కొప్పు సవరించుఁ బసవెత్తి కాటుక బర్ణిణపెదకు
సొంపుతో నద్దంబుఁ జూచి పండ్లిగిలించుఁ బడఁబోవుచును ముద్దునడలు నడచు
గోరంబుగా సారె గుంటకిన్నులు ద్రిప్పుఁ జూపఱ నగు నోరచూపుఁ జూచు
గరిడి కేగవనంచుఁ గాసె దాల్పఁగఁ బోవు బాకినో రెగనెత్తి పాటపాడు
నింటి కెవ్వారు వచ్చిన నెవయుఁ దనకు, నదిగొఁ బైఁడీయ వచ్చి రటంచు లేని
బింక మెక్కించుకొని సారె బిగియునపుడె, ప్రాయ మేతెంచెనంచు నప్పుణ్యవృద్ధ. 79

గీ. ఇప్పు డెట్లున్నదాన మీ కేలచెప్ప, రౌర లెస్సాయె నని యొద్దివారిఁ దిట్టు
గుంపుగొని చూచువారలఁ గొట్టఁబూను, వెరఁగుపడి యింటిబిడ్డల వెక్కిరించు. 80

వ. ఇవ్విధంబున బహుప్రకారదుర్వికారంబులు మీఱఁ గుమారిం జేరి. 81

క. ఏమో తెలుపఁగవచ్చితి, భామా యీలోన మఱపుపాటిల్లెఁ గదే
యేమీ మఱవక తనకు, న్నేమంబును బ్రాయమిచ్చు శివుఁడుండంగన్. 82

క. గడుపీలో మన మేగతి, నడువవ్వలె నేమి చెప్పినాఁడు శివుఁడు నీ
వడిగితివో లేదో తెలియం, బడు మవుగద నీకుఁ దెలియఁబడ దింతైనన్. 83

గీ. పసుచపే గాకయుండినఁ బ్రాయమిపుడె, యిమ్మనఁగరాదె సోమవారమ్మటంచు
గడు వొకటియేల యింతలోఁ గాలమేమొ, దేశమేమొకదా యంచుఁ దెలియునటవె 84

క. అనినవిని కామసేనా, వనజానన విన్నయట్టి వచనములెల్లన్
వినిపించిన నేమేమీ, యని యమ్ముదిజంత చింతయాకులపఱపన్. 85

క. బ్రదుకెల్లఁ జక్కనగునని, మదినమ్మితిఁ గూఁతురా ప్రమాదము రాదే
సుదినిల్లుచూలవిడిచిన, నిదియేమో మీఁది కార్య మెవ్వఁడెఱుంగున్. 86

గీ. ఆశపడి బోడనైన నేనగుదుఁగాని, యింటిసొమ్ముక్కకాసైన నీయనొకని
కొల్లసేజవ్వనంబు పొల్లోయి దెట్లు, తగదు నీమాట నే వినుదానఁగాను. 87

క. అనఁ గామసేన యంతటి, పనిరాదమ్మ కుముదబాంధవధరుఁడా
డినమాటకుఁ దప్పటవే, యని సమ్మతిపఱచి నిర్భరాహ్లాదమునన్. 88

క. త్యాగధ్వజమెత్తించి స, మాగతయాచకుల కీశ్వరార్పణమనుచున్
భోగము చెలి ధనమెల్లం, బ్రోగులుగా నొసఁగెనకలము న్వినుతింపన్. 89

సీ. పట్టెనామంబుఁ గీడ్పఱచి నూతనవిభూతిని త్రిపుండ్రంబులు దీర్పవచ్చు
ద్వయము పోఁబెట్టి శైవపురాణపద్యపాఠికల వేమాఱుఁ బఠింపవచ్చు
వనమాలికలు పాఱవైచి రుద్రాక్షపూసల పేరు లఱుత నెక్కొలుపవచ్చు
విష్ణుసంకీర్తన విడిచి శంకర హరశబ్దము లుచ్చరించంగవచ్చుఁ
గాని భుజములు కాఁతులు గాచి యున్న, తప్తముద్రలు మఱుపెట్టఁదరమె యనుచు
వైష్ణవులభావవైరాగ్యవైభవంబుఁ, బొంద నది శైవులకొసంగె భూరిధనము. 90

వ. ఇవ్విధంబుగా నిజాంశుకావశిష్టంబుగా గృహపరిముఖంబు లగు ధనంబులు సకల భూషణంబులును త్యాగంబుగావించి యమ్మించుఁబోఁడి జననీయుతంబుగాఁ బ్రతీక్షించుచు నయ్యైందువాసరంబు ప్రసన్నం బగుటయు. 91

చ. తిరుపతికొప్పు లందముగఁ దీర్చినబూడిదబొట్లు మించి వే
ర్పఱచిన మించునట్టి రుద్రాక్షల పేరులుఁ గావికోకలున్
హరశివశబ్దము ల్దగమృగాంకకళాధరు గేహసీమకే
గిరి గుడి మేళము ల్పొదలఁ గిన్నరకంఠియుఁ దానితల్లియున్. 92

క. చని భావజారి సేవిం, చినిజంబగుభక్తి నొంది చెంతవసింపం
గనుఁగొన వచ్చిరి బహుయో, జనదూరమునందుఁ గల్గు జనసంఘంబుల్. 93

గీ. ఇవ్విధంబున భూజను లెల్లఁ జూడఁ, బ్రొద్దుకైవారిలుదాఁక నప్పాలతు లుండి
యేమొ సర్వేశ్వరుం డిట్లు తామసించె, ననుచుఁ జింతించుచున్న యయ్యవసరమున 94

గీ. గోపురముమీఁద ధూర్తచకోరకీర, మెక్కపరిజలార మీకేల తిక్కపట్టె
వీరిబగిసికి మఱి గారవించి హరుఁడు, కాయసిద్ధి యొసంగునే కల్లగాక. 95

క. అనివాఁగుతన్నుఁ దునుమం, బనుచుటయును వారికొంప చెఱచుటకై దే
వుని వెనుకనుండి తానా, డినమాటకు వారలచ్చటికి వచ్చుటయున్. 96

క. వినిపించిన నింతేనా, యని యందఱు నవ్వ లజ్జ నానతముఖులై
చని రవ్వేశ్యలు తమ్ముక, మునకుం గలనేర్పు నీకుఁ బొనఁగ న్వలయున్ 97

క. అనినఁ బ్రతాపతి మదిమిం, చిన వెఱఁగున నిన్నువంటి చిలుకలనేర్పు
గ్లనగునె యనుచు వేగుట, గనుగొని వెనఁ బనియెఁ గేళికాగృహమునకున్. 98

క. ఆఁనాటిరేయి బాళిన్, నాయకమౌళిఁ జేరఁబోయెడు తఱిన
మీనాయతాక్షిఁ జూచిప్రి, మానాంబకతురగ మతులసూక్తిస్ఫురణన్. 99
క. వేసారక మద్వచనము, ధీసారము మెచ్చనీక తగుఁగావున నీ
వీసారి యొక్కకథవిను, మాసారిజయప్రదమ్మయా యనిపలికెన్. 100


పదునెనిమిదవకథ

క. కలదభ్రంకషకేతన, చలదభ్రంబైన నైమిశం బనుపురము
జ్వలవిభ్రమపరిపూరిత, కలశుభ్రకరాననానికాయం బగుచున్. 101
క. రజకుఁ డొకఁ డప్పురంబునఁ, బ్రజ మెచ్చఁ దనర్చు వీరబంధుం డనఁగా
నిజవంశోచితధర్ముఁ, ధ్వజమై తగుపాటి వైభవం బలరంగన్. 102
మ. బహిరభ్యంచితరాసభోత్కరము ఘాఘారావభాస్కృత్కరం
బహరీశోదయకాలధౌతవసనాయాతాచ్యుతశ్రీవ్యచో
బహుళం బాయతకుంభకంబు గిరికాబాధార్థమార్జాలమై
గృహ మొప్పన్ రజకాగ్రగణ్యునకు దూరీభూతదారిద్ర్యమై. 103
ఉ. వేళమై కోడికూఁత యగువేళలఁ జల్ది భుజించి బండ్లు గం
గాళము కూడునీరుచవుకారముఁదే విడియంపుఁ జొక్కటో
మైలల మోపు వీఁపున నమర్చిన రేవుగుఱ్ఱాని నెక్కి వ
య్యాళిగఁ బోవు వాఁడు విమలాపతటాక సమీపభూమికిన్. 104
క. ఆవీరబంధువునకు, న్భావజభుజవిజయసాధనంబగు నిల్లా
లై వెలయు నొక్క కోమలి, లావణ్య వరేణ్యయై కళావతి యనఁగన్ 105
చ. మినమిన లీను మేను నెఱమించుల కొంచెపుటంచుఁ గమ్మలుం
గొనఁబగు ముద్దుమోము నమకొన్న మెఱుంగులకట్లదండయుం
గనుఁగవఁ గల్గు తేఁటి యొడికంబును నందికడెంబు మించ న
వ్వనిత యువాంతరంగ మృగవాగురయై మెలఁగుం గృహంబునన్ 106
గీ. ఆకళావతి నిజనాయకాల్పరతుల, నీగి మారవికారంబు హృదయ మన్య
పురుషసంభోగవాంఛతోఁ బొందుఁజేయఁ, దద్వశంవదయై నితాంతంబు మెలఁగు. 107
క. వెలవెట్టి వేఱకైకొన, వలదే కద యింటఁ బౌరవనితలచీర
ల్గలుగఁగ నందులలోపల, వలసిన యటువంటి వింతవన్నెలు చూపున్ 108
మ. పటసమ్మార్జనగీతరాసభచయప్రస్థానశబ్దంబులా
కృట నోర న్వెడలం బసన్న నతిసింగారంబు వీక్షించి నీ

విటు నిద్రింపు మటంచు లేచి చన నయ్యబ్జాక్షి యవ్వేళ నా
రట చేయు న్మదనాస్త్రకోటులకు జారక్రీడలం బోరిడయ్యె. 109

ఉ. తన నరిచాకెత ల్తనకు దాపుగ వారలకెల్లఁ దాను గుం
టెనలు వహించుకొంచు నెఱటెక్కులు నిండు విడెంపు చొక్కులు
న్మనసుఁ గరంచు నేర్పువగమాటలు నేరని తప్పుపాటలుం
గనఁబడ నవ్వధూటి పతికన్నులు మూసి చరించు నిచ్చలున్ 110

క. సొగసుఁ గని దాని పెనిమిటి, మగటిమి యొఱఁగియును మాటిమాటికి నకటా
సిగపోయిఁ బోనిమ్మని, తగులుదు రుపనాథులాసుధాకరవదనల్. 111

సీ. మిహిరావలోకన మేటికి వీక్షణాయానదుర్ధమదోష మడఁపకున్న
మృత్తికా స్నానమేమిటికిఁ దదీయదేహస్పృష్టికలుషాల నడఁపకున్నఁ
బమిపంచగవ్య మేపనికిఁ దదీయాధరాస్వాదనైర్మల్య మడఁపకున్న
వేలిమి యది యేల వింతఁగా దీనితో భోగించు పాపంబు పోకయున్నఁ
జటులగాయత్రి యేల తత్సంగమూది, సాంతదుష్కృతదోషంబు నడఁపకున్న
నిన్నియును నేటికనిరజకేందువదన, వేదవిప్రులు తలఁతురు విదితముగను. 112

క. ఈరీతి మెలఁగుదాని యొ, య్యారముఁ గనియొక్కశూద్రుఁ డధ్వగుఁడు మహో
దారుఁడుచారణుఁ డనియెడు, పేరునఁ దగువాఁడు మదనభీతాత్మకుఁడై. 113

క. చోరుని బుద్ధిదియైన, స్వైరం బింటికడఁ దెలియఁ జని చూచెదఁగా
శ్రీరమణి దారియని యా, చారణుఁ డరిగెం దదీయసదనంబునకున్ 114

మ. చని కాంచెం గుసుమాక్షతంబు నదనాంచత్పానపాత్రింబు భా
సినిజానన్నసమున్నతాననతదాసీసైకవృద్ధాక మ
ద్ధినరాహ్లాదకరాతిసౌరభము మధ్యైకుండ్వవిన్యస్త మ
గ్రినిచోదత్పరిమాణభాజనము నాకాడంబరీకుంభమున్. 115

వ. కనుఁగొని నితాంతోదకంబును నిస్తులంబు నగుట శాక్తేయమతంబువారును పెద్దల మఱుఁగున మెలంగు కురంగనయన లరుగుదేఱం దగిన మదిరామందిరం బని డెందంబునం దలంచి నిజమనోవంచనాచుంచుచంచలలోచనాగమనంబుఁ గోరుచు నతఁ డందుఁ బ్రచ్ఛన్నవేషంబున నుండె. 116

క. సివసత్తులును దలారులు, బవనీలు న్మఱియు నాటపాటలవారుం
జవులునుతించుచు మదిరా, నవముం గొని యొక్కఁడొకఁడె జరగినపిదపన్. 117

సీ. ఇంటివా రెవ్వరో యెందు గాన మటంచు నదిగొ కూర్చున్నదాయమ్మ యనుచు

నమ్మకతాను గానక వచ్చితి నటంచు నిది యెవ్వరుండెడి యిల్లటంచు
నంగడికరుగుచో నరుదెంచితి నటంచు వచ్చి జామయ్యెఁ బోవలయునంచు
నరిడిబిడ్డలకు మందడుగవచ్చితి నంచు నే నందులకు వచ్చినా నటంచుఁ
జేరిరవ్వేళఁ దమమునిచెలఁగులందుఁ,
గాసు దుడ్డును బంగారుపూస వెండి
తునక మొదలింటి చిఱువాఁడు గొనినదెల్లఁ,
గొనుచు మగవాండ్రు తమకెల్ల గుట్టుమెఱయ. 118

గీ. అట్టులరుదెంచి తక్కువయనుటగాని, దోసమాడుదురాయని యానవంబు
మంచిదని యల్లవృద్ధవర్ణించిలేఖ, లానఁగి క్రోలిరి మైరేయ మోపినట్లు. 119

చ. కనుఁగవనోరగల్లుల వికారపుఁ జూపుల కోపు లానుతో
డసె దళమెక్కు నాలుక తడంబడుమాటల పచ్చితేఱమో
మునఁ బనిలేనినవ్వుల సముజ్జ్వలచంద్రిక లామతింప న
వ్వనరుహలోచన ల్సవము వచ్చినయందముఁ జూపిరందఱున్. 120

గీ. ఒకతెవృద్ధకు మధుమూల్య మొసఁగుటరయ, లేక కొమ్మని మఱియొక్క రూకయొసఁగ
నొకతె గ్రోలియు మైరేయ మొల్లకెక్క, మరల నిమ్మనిదానివేమరునుగనతె. 121

సీ. కసినికోఁతలు గోసి గారింతు రని బూతు తెలియఁగా వదినెలఁ దిట్టువారుఁ
బురిఁ బాసి వేఱు కాఁపురము సేయుద మన్న వినఁ డని పతి దూఱి వనరువారుఁ
గడుపార మగనికే గంజిపోయ దటంచు నత్త దుర్గుణ మెంచి యలరువారుఁ
దా నెవ్వతెయొ నన్నుఁ దఱిమి యీడ్వ నటంచుఁ దోడికోడలిఁ జెడనాడువారుఁ
గేరి యొకకొంద ఱాత్మల మీఱినట్టి, మాట లెల్లను మధుమదోన్మాదగరిమ
నలుకమెఱయంగ లక్ష్యసంప్రాప్తవీక్ష, జాబ్జముల హాసవిన్యాస మమర మఱియు. 122

సీ. మగని నిద్దురపుచ్చి మఱివచ్చెద విచార మడఁచి యింటికి నేగు మనియె నొకతె
నినుఁజూడఁగా వింకే నిలువలే నొకసారి యటుచేరి నిల్వరాయనియె నొకతె
యమ్మ నేఁజెల్ల నయ్యాట మెందాకఁ జేనరిగాద విడువరా యనియె నొకతె
బతిమాలి నేనె పైఁబడు టెంతియే కాని యాలిపై దయచూడవనియె నొకతె
యత్తవాకట్టుమంత్రంబు లడిగె నొకతె, విభుని జోకొట్టుమందులు వేఁడె నొకతె
మధువుచొక్కునఁ దేలి గూఢమగువలందు, జారసాన్నిధ్య మప్పుడు సాక్షాత్కరింప. 123

క. ఈలాగున వాలాగున, లీలాలోలలగు నచటి లేమలతోఁ ద
త్కాలింబగిలిన రజకవి, శాలేక్షణ వగలు గాంచి చారణుఁ డాత్మన్

క. ఇది దాట్లమారి యగునని, సవపడి మఱువాఁడె యొంటిపాటున మేకో
లాచవింపఁ దాపి యింటం, దుదగానని ప్రేమ దానితో రమియించెన్ 124

క. వింత లగు లాలనమ్ముల, నంతన మెనఁగించి మించు చారణరజనీ
కాంతునిసన్నిధి నప్పుడ, కాంతామణి మనసు చంద్రకాంతం బయ్యెన్ 125

గీ. అంత నయ్యింతి తప్పక యతనిఁ జూచి, యెంతనెఱజాణయో కాన నిట్టివాని
వీనిఁ బోనీయరాదని మేనుమేను, నెనయఁ గూర్చుండి వానితో నిట్టు లనియె. 126

క. మగవానినమ్మవచ్చునె, యగపడి తనకార్యమైనయందాఁక విరా
ళిగదింతు రంతనెక్కడి, జగజోలియటంచు నెరసి చనఁ జూతురుగా. 127

క. ఆఁటది వలచుట యరుదే, నాఁట న్మళి వలచెనేని వాఘుని బెఱపో
రాట మొనర్చినఁ గోసిన, గాటం బగుఁగాని యెడయఁగా లేదు చువీ. 128

ఈ. అంత యెఱుంగనేర్చిన విటాగ్రణివౌ దటుగాక యున్న నా
యంతటి వానిఁబూని వెలయాలివలెం బతిమాలఁ జేయదే
యింతటిలోనె మీపురికి నేగక యిచ్చటఁ గొన్నినాళ్లునా
చెంతనె యుండి నీవలపు చెల్లఁబడిం గడ తేర్పరా యిఁకన్. 129

క. వెచ్చమునకు లేకుండిన, నిచ్చెద దిన మొక్కమాడ యిచ్చటి మఱి నా
ముచ్చటలీ వీడేర్చినఁ, దచ్చనగా దేలమూలధనముం గరముల్. 130

గీ. అనుచుఁ మేకోలుగావించి యపుడె పోయి, తనగృహంబున గూటిలోఁ దలుపుమాలఁ
బిడతలో నాయకుఁడు దాఁచి పెట్టినట్టి, మాడలర్పించి వానితోఁ గూడి మెలఁగె. 131

క. ఆవీరబంధుఁ డంతట, భూవరు వెనువెంట దండు పోవుటయునిజే
చ్చావిధిఁ జారణుఁ గూడిక, లావతి బహుభోగలీలలం దేలంగన్. 132

క. తోత్రవనిటు వచ్చి వచ్చియుఁ, నీవెలఁదిన్రీతులయందు నెనసినవాఁడం
బోవలయు నూరికనుచుఁగ, లావతితోఁ జారణుం డలంప్య పేర్మిన్. 133

గీ. వచ్చి బహుకాల మయ్యె మావారిఁ జూడ, నూరు సేరంగవలయు నీయొద్దవాసి
పోవఁ గాళ్లాడ విఁక నేమి బుద్ధియాన, తీయవే యన్న బెగడి యయ్యిందువదన. 134

క. ఏమంటి వూరి కేగవలె, మంచిది పోక నిలువవచ్చునె పొమ్మా
నామాటకు నౌననఁగా, దీమిక్కిలిమాట లేల తెలిసెద వదియున్. 135

క. కాక నామీఁది తమి నీకుఁ గలిగెనేని, నీదువెంటనె పెట్టుక పోదు గటిత
వాత్మఁ గొంకుదు వేని నీవరుగు మూరు, నెనసి నీవు సుఖంబుండు మింతెచాలు. 136

చ. అనుడు నతండు మోహమున కాడిద వింతియు కాక నీవెవ
చ్చినఁ గనునన్న నీపలుకు సేయుచునుందు జనంబు మెచ్చఁగా

నిను నఱచేత నుంచుకొని నేఁ బదిమాళ్లకుఁ గొన్నతొత్తు మ
ద్వనితి కలంచె నేని పెడవాడనె వైవనె యింత యేటికిన్. 137

గీ. అనిన నంగీకరించి యయ్యంబుజాక్షి, యప్పుడే పైనంబు నంజోక లమరఁ జేసి
చారణుని వెంట నింటి విచార ముడిగి, చనియెఁ దొలికోడికూఁత పొద్దుననె లేచి 138

వ. ఇవ్విధంబున నవ్వధూమణి యుపనాథాధీనయై యరుగునెడఁ దృతీయదినప్రయా
ణంబున. 139

సీ. పరికరోత్తర యుక్త పాథేయమును నజంబీరమై యొకనాఁటి బియ్యమున్న
యసిమిలోఁ జలువ మాయక యుండ మడఁతవెట్టిన చల్లడము దుప్పటీరుమాలు
నొరపుగాఁ బొలుపొందు నురగవల్లి దళంబు పూగపూరితమైన పారలతిత్తి
వేళ్లఁ బ్రతిక్షణార్ద్రీకృతశంఖచూర్ణంబైన లోహకరండకంబుఁ

గీ. గాళ్ల బిడివాళ్లు నికటమార్గప్రపాన్న, రసనము స్నేహనజనితమా రాగమమర
నృపతిచే నంపకము గాంచి యిల్లుసేర, వచ్చె నాదారిఁ దన్మనోవల్లభుండు. 140

క. అప్పుడా రజకాంగనయే, నెపమున బొంకంగవలయు నీమదిలోన
న్నుపమగని చూచితెలియఁగ, జెపుమా చూజెనమునీదు శేముషిబలమున్. 141

క. అనినఁ బ్రభావతి శుకపతిఁ, గనుఁగొని యప్పుడెట్లు బొంకఁగావలె నంచు
న్ననువడిగితి వింతేకద, వినిపింపుము తెలియ నట్టివిధమని పలికెన్. 142

క. ఈకథ తెలియ నెఱుంగుదు, నాకొక పెద్దతిక మిచ్చినం గాదనరా
దేకద యైనను వినుమని, యాకీరం బనియె ననియతాదర గరిమన్. 143

శా. ఆరీతిం బతి చేరవచ్చుటయు నయ్యబ్జాక్షి వీక్షించి చిం
తాయూథం బగుభీతి దోఁచి ధృఢధైర్యస్థైర్య యై వానికిఁ
నోన్నరాడింప వశక్య మాకరణిఁ గందోయిం జలం బుబ్బిము
న్నైతైపాఱఁగ నేడ్చెఁ గమ్రకలకంఠీ నాదభేదంబుగన్. 144

గీ. ఏడ్వనింతటి యపకార్య మేమి యనుచు, దిగులుపడి నిల్చుమగని నెమ్మొగముఁజూచి
రెన్నవచ్చితి నినుఁజూయలేను వేగ, వచ్చెదనటంచుఁ బల్కినవాఁడవయ్య. 145

క. మఱచితివెసుమ్ము శీఘ్రము, పఱతెంచెద ననుట యడుగువాసినచోన
క్కఱవాయు ననుట నిజమని, యెఱుఁగరుగా పతులనమ్ము నిందునిభాస్యల్! 146

చ. పతిపరభూమి కేగినన పారమనోవ్యథఁగుంది ధైర్యవి
చ్యుతి దివనంబు లెన్న కొనుచు న్సతులుందు రెఱుంగలేఁడె కా

యతఁ డొకవన్నెలాఁడి మొగమంటి కనుంగొనుచు న్విరాళిచే
నతమని నమ్మియుందు రిది సాజమెకా మగవారికారయన్. 147

గీ. మన్న పురుషుని చెడనాడు తగవ మీఁదఁ, బోయి పులుగానిపురుషయిపుట్టునను మ
బాపనమ్మలు చెప్పినపాట మేలె, యనుచు నేనుందు నిను దూఱుకొనఁగ వెలచి. 148

గీ ఇవ్విధంబున నుండియుంకేమియందుఁ, గానికలఁగంటి యటుపెన్నఁగన్న యాపుడె
యుగము గుర్తింగినయట్లైన నొల్లఁబోయి, నిలువఁగూడకయెన్ని యెన్నికలాపాడమె 149

ఉ. ఆయన యొంటిగాఁడు వెలయాండ్రి తగు ల్గలవాఁడు వాఁడిమిం
బోయినచోట మాట పాఱపొచ్చెము నైఁపని రోసగాఁడుగా
యీ యెడ నేమిపుట్టునో సహింపగరాదు విచార మంచు నా
థా యిఁక నేమి యేనగరియైనను బోయెదనంచుఁ గ్రిక్కునన్. 150

శా. చూపట్టంగలదాన నొంటిమెయి నిచ్చోఁ బోవరాదంచు నే
నీప్రణ్యాత్మునితో డమర్చుకొని యిట్లేతేరఁగాఁ దోవనే
నాపాలం గలదేవుఁ డీకరణిఁ జెంత న్నిల్పెఁగా నిన్నుఁ జే
ర్చె పెక్కేండ్లు సుఖమ్ము నన్మనము నాచిత్తంబు రంజిల్లఁగన్ 151

గీ. ప్రాణనాయక మదిదోపఁ బాపమునకు, మగడ వింతియకాక నామదికిఁ జూడఁ
దండ్రివైనను నీవీవ తమ్ముఁడయిన, నింకనెన్నటికిని నిన్ను నెడయవెలతు. 152

మ. అను నిల్లాలిని గౌఁగిటం బొదివి నెయ్యం బార నూరార్చి య
వ్వనితం దోడ్కొని వచ్చి యందటె నెగు ల్వారించి తంచుం బ్రియం
బున నాచారణుఁ వీడుకొల్పి తనగేహుం జేరె నాతండు కా
మినియుం దానును నిట్టినేర్పవలెఁ జామ్మి నీకుఁ గోకస్తనీ. 153

గీ. అనుచుఁ గీరంబు వల్కె వైశ్యాంబుజాత, గంధి నివ్వెఱపడి యదిగాక జంత
యనిప్రమోదించి యరుణోదయంబుఁ గాంచి, యరిగె శశికాంత బద్ధశుద్ధాంతమునకు 154

క. ఆమాపు వలపుతోఁ బ్రువన, భామాపుష్పాస్త్ర భూమిపతిఁ జేరుటకా
రాదు యరుదేర శుకము సు, ధామయమధురోక్తి నద్భుతంబుగఁ బలికెన్ 155


పందొమ్మిదవకథ

క. కనకాంబరి కనకాంబరి, యనఁగా నొకపురముగలదు హర్మ్యాగ్రవినూ
తన హరిమణి ఘృణితిమిరో, జ్జనితరహఃకేళిసౌధజాలం బగుచున్. 156

గీ. ఆపురంబేలు నీలవాహనుఁడనంగ, రిపుతమోహేళి యగునొక్క నృపతిమౌళి
యతని చెంగట ధీయుఁడనంగ బిరుదు, నిండు మాస్టీఁడు నెగడు మన్నీలు నొగడ. 157

సీ. తలపాగపొరిమీఁద జెలఁగెడు నాయుధార్చనసల్పినట్టి దాసనపుఁబూవు
నెడమచే గొలుసును బొడపుగత్తియుఁ బూలబిరుదొందు కుడికేలఁ బెద్దకత్తి
దట్టిలోఁ జెక్కు నిద్దావంకి కుసుమ పూవన్నియ దుప్పటివల్లెవాటు
భుజములు విరులచేఁ బూజించు బోడిక లున్నవైన ముందరి బిరుదుడవిణ
దండహాంపీరశీలగుండు గండ యనుచు, బద్యము పఠించు జీతంబు బంట్లుఁ జూడ
మూగికొను పౌరజనులగుంపులుఁ జెలంగ, నతఁడు దొరకొల్వు చేసి గేహమున కరుగు. 158

క. ఇల్లిల నడచు నాతని, యిల్లాలు దనర్చు నొకతె హేమాంగి యన
న్వల్లభుని కన్న దీనికిఁ, జిల్లరవిద్యలకు బిరుదు చెల్లు ననంగన్. 159

గీ. పరభయంకరబిరుద విస్ఫురితుఁడైన, కాంతు నయ్యిందుముఖి తనకాలికింది
కసవుగా నెంచు వెడమాయగప్పి జార, ధవులమాటలు వడఁకి యాదలధరించు. 160

చ. పతి యతిశౌర్య మెంచి యుపభర్తరతాప్తికిఁ జేరకున్న న
చ్యుతమగు ధైర్య మిచ్చుచు నరయా మగవాఁడ వటంచు నెట్లు పు
ట్టితి వికఁ నేమి తన్భుజపటిష్ఠత లోన లొటార మింతె నీ
పతనికిఁ గొంక నేలని భయస్థితిమాంచి రమించుఁ దదరతిన్. 161

క. ధవునకు నుపభర్తకు బాం, ధవము న్ఘటియించు జారునందనె యాతీవ్ర
యవివేకవర్తనంబులు, చెవికింపులు గాఁగ మగనిచేఁ బొగడించున్. 162

గీ. ఇవ్విధంబునఁ దనపోక లెఱుఁగనీక, మగనిఁ బోకొట్టి నెరివచ్చి సొగసుజెట్టి
వాడలోఁ గూడు జారులవల్లెతాఁడు, చెలువున మెలంగు నక్కొమ్మ సొలపుగ్రమ్మ. 163

క. అంతటఁ బెంరాణువహను, మంతుండను పేరఁ బరఁగు మాష్టిని మదా
క్రాంతుని గెలిచెదనని నిజ, కాంతుఁడు చనఁ దొడును మాలెఁగడ యిపుడనుచున్. 164

గీ. అలరి హేమాంగి పతివచ్చు వంతలోన, వలచి వలపింపనేర్చు జవ్వనపు వన్నె
కానితోఁ గూడి కడలేనికాంక్ష దీర్చి, కొనియెన నటంచుమది నెంచుకొను మనుండ 165

ఉ. ఆపురి నొక్కసెట్టి గలఁ డన్యవధూమధురాధరామృతే
చ్ఛాపరతంత్రుఁ డొక్కదివసంబున వీథిఁ జరించువేళ వాఁ
డాపువుఁబోఁడిఁ జూచి విరహాతురుఁడై తన సర్వశక్తులం
జూపి యు దాని గర్వఁపు మచుక్కులు గాంచి విరంవ మించఁగన్ 166

గీ. అక్క వానరమందు నయ్యంబుజాక్షి, నడచుతఱి వామపదముంచు పుడమిమీఁది
యిసుము గైకొని తనయింటికేగి పొద్దు, గ్రుంకునందాఁక వేగి నెక్కొన్న బాధ. 167

ఁ తనపసుకట్టిల్లు గోమయ, మున నలించుక యలికి మీఁద మునుపాఁగొని తె
చ్చినయిసుము నించి పయిన, వ్వనితామణి రూప మొనర వ్రాసినవాఁడై. 168

సీ. చుట్టు యంత్రంబు లిఖియించి శుద్ధహృదయు, పద్మాఁడు దిగంబరుండు దిగ్బంధనిపుణుఁ
డగుచు నర్చించి ధూపదీపాదులొసఁగి, కోడిబలియిచ్చి కూర్చుండి గురుని దలఁచి. 169

క. మన మేకాగ్రముగా మో, హనమంత్ర జపం బొనర్చి యర్ఘ్యము లొసఁగన్
గనఁబడియె నప్పుడే మో, హినీ వ్యాఘ్రముఖమరన విజృంభణవృత్తిన్. 170

చ. కనఁబడి కొప్పువీడ వలిగబ్బిచనుంగవ పైఁట జాఱఁ బూ
సిన సెఱితావి గందవొడి చిందఁగ నందెలు మ్రోయ దీర్ఘలో
చనరుచి తోడ ఫ్రీరమణి జగ్గన వేఁడుచు ముద్దువెట్టుకోఁ
జనుటయు నిర్వికారమతిఁ జాగిలి మ్రొక్కి యతండు నిల్చినన్. 171

క. మెచ్చితి నీకోరిన నతిఁ, దెచ్చెదఁ దంత్రంబు కడమ దీర్చుము వెస నీ
విచ్చుట నని మోహిని చన, హెచ్చిన మోహమున మల్లుఁ డింపుజనింపన్. 172

క. మకరాంక పంకజాతాం, బకయని యంత్రంబుఁ దుడిచి భక్తి పెయిం ద
త్సికతోత్కరంబు నవఘట, శకలంబున నునిచి శేచు సమయము నందున్. 173

మ. ఎవనెం దాప మిదేమొ యంచుఁ బొగులన్ హేమాంగి పై నంతమో
హిని యావేశ మొనర్చి తెచ్చి నిలుపన్ హేరాళ మాబాలి న
వ్వనితం జూచి యతండు తద్రతిననిర్వాచ్యైకసౌఖ్యంబుఁ జెం
దిన యాపిమ్మట నమ్మిటారి మది నెంతే తెల్వినందిల్లఁగన్. 174

ఉ. ఎన్నఁడు వీని పొందెఱుఁగ నేగతి వచ్చితి వచ్చుమాత్రమా
క్రొన్ననవింటివాని రొలగోలు దురం బొనరించి డిస్సిన
ట్లున్నది మే నిదేమిగతమో యెటులైన నిఁకేమి వీనిఁబైఁ
కొన్న మనంబుఁ ద్రిప్పనొనఁగూడునె యున్నది చాలు నిత్తఱిన్. 175

క. తను ముంచినది సముద్రం, బనవిన మే రూపవంతుఁ డైనం గాకుం
డిన నామదిగరఁచె నే, ర్చిన యప్పుడె యితఁడు నాకుఁ జిత్తజుఁ డరయన్. 176

గీ. అని ప్రమోదించి తనహృదయంబుఁ దెలిపి, వాని డెందంబు దెలిసి యవ్వనితతలఁపు
లేమి నేకుఱుటకు బొనలిచ్చి వాని, మొగము వీక్షించి పలుకు నమ్ముద్దుగుమ్మ. 177

క. ఇచ్చటికేరారాదీ, వచ్చటికెప్పుడైనఁగాని యరుదెంచెదు లే
వచ్చునవాపదయంతటఁ, బొచ్చెము లేనట్టి మోహమున కిడఁగలుగున్. 178

గీ. కాన సిగనొక్క చిఱుగంటఁ గట్టికొన్న, వాఁడవగుచును వాకిట వచ్చి నిలిచి
గంటమొరయింపు విని యేను గదియవచ్చి, తలుపుఁ దెఱచెదనిమ్మాటఁ దప్పవలదు. 179

చ. అని సమయం బొనర్చి వికచాంబుజలోచన యింటికేగ నా
యన దినమున్ దదీయ వచనాదృతి నాగతిఁ జేరి తత్ప్రతిం
దనరు మనుండు నంతనొకనాఁ డినబింబము పశ్చిమాంబుధిన్
మునిఁగినఁ జీఁకటుల్ జనముద్ధతిఁ జూపెడువేళ వేడుకన్. 180

క. ఆహేమాంగి నిజాలయ, దేహళి నిలుచున్నచో నతిక్షుద్బాధా
మోహితుఁడొక తెలువరి దృఢ, బాహుండనువాఁడు భుక్తిపరతంత్రుండై. 181

గీ. మాఁడ యిచ్చెద నన్నచోఁ గూడు పెట్టి, రిం పచనస్థలంబైన నీయ రిట్టి
...లకొంపను వచ్చితి ...లేక, గంజిపోయుదురే యిందుఁ గలుగువారు. 182

క. ఇలు వెత్తిఁ ట్టుకొని పోఁ, గలుగుదురే దివికిఁ దాము గడపట్టఁ బోయగూ
ళులవెంటఁ జూరె యపుడీ, యలమట వాటిల్లదే దయాస్థితివలనే. 183

క. మగవారు కఠినహృదయులు, మగువలు జాలొన్న వారి మాటలకు మనం
బు గరంగు నందు రిచ్చటి, జగజంతలు మగలకన్నఁ జత్రాళ్లు సుమీ. 184

గీ. మంచి దధికారినగుచు నమ్మనుజవిభుని, గొలిచియైనను గొంపలు గూల్చుకున్న 185
నష్టసేయుదురే యంచుఁ జనెడు వానిఁ, గాంచి హేమాంగి ప్రొద్దుపోకలకుఁ బిలిచి.

క. ఏమోయి యేల దూలెదవు, వీమాడ్కిం బురము జారినెల్లను నీవే
రే మెచ్చట నుందుము వీ, గ్రామంబున కరుగుదేఁ గారణమేమో. 186

వ. అని నప్పలుకులకుఁ జంద్రికాసక్త చకోరకంబునుంబోలెఁ దిరిగి తత్సమీపంబున కరిగి చోపుణ్యాత్మురాల నీవైన నాదరించి మంచిమాటాడితివి గదా యిదియె నాకుం బరమలాభంబు మధురాపురంబు నాకొణయాచికాపురంబు తామరతంపరవేదియగ్రహారంబు శ్రీధాన్యకటకంబు మదన్వయంబున కాకరంబు. కంబుధరసాదాంబురుహంబు వేదలతాలవాలంబు నగు శ్రీశైలంబున కరిగి క్రమ్మరివచ్చువాఁడఁ బొద్దుగాని పొద్దున నీయూరిం జేరి నెప్పెయుంగమింజేసి యన్నవిక్రయపరాయణామశనంబులుం గావక యాఁకటఁ గటకటంబడి గ్రాసంబు వేఁడినఁ జెముపురుపునం బోలె విదలించువారలేగాని యాయానం బెటింగి రమ్మనువారులేరు మాడలుండినంత గూడు గాదుగదా వలసినపదార్థంబుఁ దెచ్చియిచ్చెదఁ బాకంబొనర్చి పెట్టిన నీకులకోట్లకుఁ బుణ్యంబయ్యెడు నని నుడివి యెడనెడ నప్పడంతి యల్పస్వరంబున నిజవయఃప్రమాణాదు లడుగుట వలనను మందమందంబుగా భాషించుమనుటవలనను గొంతకొంతనందియంబు వొడమిన నడంచికొని తదానీతుండై గృహంబుఁ బ్రవేశించి దీపప్రభాభగద్ధగాయమానం బగు తదీయశరీరంబును ననన్యసంచారంబు

వ. అట్లు వెడలి యతండు.— 198

సీ. కంబళీకార్మితక్ష్మాభాగసవిధంబు జేయువారలతోడఁ బోరువారు
[illegible]బహువర్ణనీయవిచిత్రియు ల్చెవులొగ్గువారితోఁ జెప్పువారు
[illegible]ఖ్యాప్రరాధ్వపరిమాణ మదనెఱింగినవారినడుగువారు
[illegible]యపరాభిసారికాకోటి తోడనవ్వుల బేరమాడువారు
[illegible]ఖ్యాత్రపణాళి వైచి, శీమతిమిరోద్ధతికిఁ బ్రతిష్ఠించువారు
[illegible]సమాయాతిపథికు, లమరగనుపట్టు రచ్చకొట్టమునకరిగె.
[illegible]ల నచెవ్వరనుచుఁ, దెలిసికొన సేనయాపరదేశిననుచు 199
[illegible]మోనమాత్మనెంచి, యుసుసురటంచుఁ బొరలాడుచుండెనంత.

క. [illegible]పంబున నె ఘోరదావుయంత్రి, నక్తపదుఁడొక్కఁడారసి జారయెన్ని 200
కాఁపురంబులు గూల్చితో కదయటంచుఁ, బలుక నావంటివాఁడిందుఁగలిగెననుచు.

తే. అప్పృథబాహుఁడొయ్యనఁ దవగ్రిగతుండయి పిన్నవాఁడ నీ
కీదిన యేలవచ్చెఁ బురినెవ్వరివాఁడవు తెల్పుమంచు న
త్యాస్పృతివిడెమిచ్చిన నతండిదె చెంగటిశూవ్రిపిథిలో
నైమవమింట యొక్క కులటాంగనయున్నది పాపమూర్తియై. 221

సీ. దానితో నొక్కజగజెట్టి తగిలియుండు, వానికడిగంపువాఁడనై యేనుగొలిచి
యుందు నది సైఁపలేక నేఁడొక్కముచ్చుఁ, దనము నామీఁద మోపినంత నైతలార్లు. 222

తే. వినవచ్చు దొంగగాయని, యెుఁగనిట బొండకొయ్యనుంచిరి కన్వే
గనవనుకఁ దెలిసికొనియు, చ్చని ననుబొమ్మందు రింతె యుది యట్లుండెన్. 223

గీ. అయ్య మీరెవ్వరన నాతఁడాత్మవృత్త, మంతయును దెల్పఁ జేఁజేతనప్పళించి
ఎవ్వియాపిల్లబంటు సానలినవదన, సుమ్ము నన్నింతి చేసె ననూయచేత. 224

క. నీవేలతగిలితయ్యో, భావాయిఁక నేమి యొకయుపాయము వినుమా
నీవాంఛదీరు భోజన, మావనరుహగంధి రతియునబ్బెడునీకున్. 225

చ. ఇద సిగనంటఁ గట్టుకొని యేగి తదీయగృహంబు మొగ్రిల నీ
వెసభయమింతలేక మొరయింపుము జెట్టియు నిట్లు సేయుఁ ద
త్పదతియొవప్పు నిచ్చకముఁ జాడుమటంచొక గంట యిచ్చినం
బొదలి తదుక్తరీతి నటపోయి వెనక్ దృఢబాహుఁడయ్యెడన్. 226

సీ. గంట మొరయింప నవ్వాలుగంటి తలుపు, తెఱచితో కొనిపోయి మందిరములోన
నునిచి నీకిడఁగోరి నేఁడొక్కపక్షిని, మున్నగొంటినటంచుఁ బ్రేమంబు నిగుడ. 227

క. అనఁటోకునవన్నము శా, కనికాయంబునుపఁ బాపి కట్టడికానా
యనుచు భుజియించి దీపం, బునుపమిఁ దనతెఱఁగు తెలియకుండఁగ నంతన్.

క. రమణీయశయ్యపైఁ ద, త్కమలేక్షణఁగూడి మదనకదనక్రీడా
త్యమితానందముఁ జెందెం, దమిదీఱఁగ బంటువానిధర్మంబనుచున్.

ఉ. అంతట మల్లవర్యుఁడు లతాంతకృపాణనితాంతముద్రిత
స్వాంతతవచ్చినిల్చి తలవాకిట ఘంటిక మ్రోయఁజేయు న
య్యింతి యిదేమొ యంచు నొకయించుక చింతవహించి తద్విధం
బంతయుఁ గాంచి నిన్నెఱుఁగవా యనుచుం దృఢబాహుతోననన్.

గీ. మంచిదెవ్వని చేతన్నొ మర్మమెఱిఁగి, వచ్చితెందులకేమి నీవాంఛదీని
జెట్టియరుదెంచె వానిజోకొట్టి నిన్ను, బనుతునంచాఁక నట్టుకపై వసించు.

క. కదలకు మచ్చట పాము, న్నది యందురటంచు వానినల్లించి రయం
బొదవన్వాకిలి దెఱచిన, మదయులరం జెట్టికేళిమందిర మెనసెన్.

గీ. అంతలో నేమిచెప్పుదునట్టియపుడె, వచ్చెహనుమంతగర్వదుర్వారశౌర్యుఁ
డైన రణధీరుఁడేతెంచి యధికహర్ష, మెనయ వాకిలి దెఱవ నవ్వనితఁ బిలువ.

క. గుండె పటుక్కున వచ్చె వి, భుండిఁక నెట్లనుచు మల్లపుంగవుఁ బక్కుం
డుండెడునట్టుకపైవా, రొండనులం గానకుండ నునిచి వికీలన్.

గీ. గడియ సడలించి కన్నెటఁ గాళ్లుకడిగి, కొమ్మకౌఁగిటఁగదియించి కస్తరించి
పడుకయింటికి నరిగి దీపంబుఁబెట్టి, మనినిజోవంత మాద్యంతమును వచించి.

చ. తనభుజశక్తి మెచ్చి నముదారతనచ్చటి భూమిభర్త యి
చ్చినధనమెల్లఁ జూపి యిదిచేయటఁ జూడఁగ దీనివంకఁ జూ
మ్మని వివరించి చెల్వుటకు నయ్యెడ నుస్సిక్కృపాణిఁ గేలఁ దాఁ
కొని ఝళిపించినం గడుబెగుల్పడి యాతనిదిక్కుఁ జూచుచున్.

క. అట్టుకపైఁ దగు తెఱువరి, జెట్టియుఁ దముఁ జూచె నేమొ చేతం గరవా
ల్పట్టెనని తలచితత్తర, ముట్టిపడం డిగ్గనతికి యువిడిఁబలువన్.

గీ. అపుడు సందియమంద రోషార్తుఁడైన, పురుషుతో వదియేలీలఁ బొంకవలయుఁ
బలుకుమనినఁ బ్రభావతీపంకజాక్షి, తేటపడ నీవ యిదియును దెలుపుమనిన.

గీ. చిలుక యిట్లను నప్పుడచ్చెలువ మోస, కారి పెనిమిటి యోరవన్నె కారిమగడ
యేలచూపితివిప్పుడ యీధనంబు, ధనపిశాచంబు లిదియుఁ బొంద్దుమ్ముసుమ్ము.

క. ధనముపిశాచులుగుంటా, ధ్వనితోఁ గాచుకొనియుండు ధనమనవినమే
కనుఁగొంటిమిగద గంటలు, చనునే పలికొట్టకర్తుఁయ మిలుచేర్పన్.

తే. ఇంకనైనను బలిదెచ్చి యీయకున్నఁ, బోనఁగదని పల్కి నతఁడు కాంబోలు ననుచుఁ
గాఢనొప్పియుఁ జూడక కాపుటింటఁ, గోడిఁ గొని తెచ్చి బలి పెట్టి కోర్కెఁ జెందె.

చ. అని తెలుపం బ్రభావతి యయారె కథాస్థితి యంచు మెచ్చి యా
య్యినుఁడు సురేంద్రదిక్కుధరి నెక్కుట కేళినిశాంతసీమకుం
జని తమి నాఁటిరేయి నృపచంద్రుని జేరఁగఁ గోరి యేగుదెం
చినఁ గని దానితోఁ బలుకుఁ జిల్కమరందరసంబు చిల్కఁగన్.

వ. ప్రభావతీ నిజవచనవక్తవ్య వార్తావిశేషంబు పరులచేతం బలికించి తనయందు నీష ద్దోషంబు లేకుండం జేసిన బాలసరస్వతీనామధేయ యగునమాత్యనందనకుం గలయ నివార్యప్రభావంబు నీకుం గలిగినం గాని యొప్పని యుప్పనికింబోవుట ముప్పవుగదా యనిన నప్పడంతి తప్పక కనుంగొన నప్పతత్త్రిగోత్రారి యిట్లని చెప్పందొడంగె.

——ఇరువదియవకథ.——

ఉ. ఉజ్జయినీపురంబు మెఱయు న్మణిహర్మ్యశిఖావిహారియో
షిజ్జన మొక్కచో జలము చేఁదికొనం దలవాంచెఁ దన్ముఖో
ద్యజ్జలజాభిమాతికి భయంపడి దేవనదీరథాంగముల్
పజ్జ ముడుంగఁబోఁ బృథుపద్మకుడుంగములం దడంగఁగన్.

ఉ. ఆప్పురమేలుఁ బూర్ణకరుణాభరణుం డగువిక్రమార్కుఁడు
దీపితమంత్రశక్తిఁ గడిదేఁజిన భట్టియు బాయమాత్మఁ బా
హోపరిపాలితం బటు సమగ్రశుభప్రతిపాదిగా బుధ
స్థాపకదానలక్ష్మి యను దాది యశోరుచి కన్యఁ బ్రోవఁగన్.

ఉ. ఆతని కొక్కమంత్రి గలఁ డద్భుతశీలుఁడు పుష్పహాసవి
ఖ్యాతుఁ డతండు నవ్వివ లతాంతపువాన యొసంగు నిస్తులా
స్తోత్కరాద్భుతక్రియలు చూచినయప్పుడు మానసైకళో
త్కాతిశయంబు బల్మిని దదాస్యము హాస్యముగాన దిన్నఁదుక్.

గీ. అంతనొకనాఁడు విక్రమార్కావనీంద్రుఁ, డంతిపురమునఁ గదళిక యనెడు పేరఁ
దనరు మోహపురాణియుఁ దానుఁ గూడి, పొత్తులభుజింపఁగా నొక్కబోనకత్తె.

గీ. ఒరపున నరాకఁ జేపలయూర్పుఁ గూర, యిడినఁ గదళిక చేయెగనెత్తి యాస్య
మవలగాఁ ద్రిప్పి యిదియేమి యారగింప, ననెడుపతిఁ జూచి రాని జంకెనలు నిగుడ

ఉ. ఎన్నఁడు మున్ను నిన్నఁ గాని పరువన్నఁడుఁ గన్గొన గందు మీలని
ట్లెన్నిక లేక యిట్టి భుజియింపఁగవచ్చుఁ బతివ్రతాత్వసం

సన్నిధినైన నాకనుమఁ బల్కినపల్కెరమందుఁ ద్రుళ్లియ
క్కన్నులకల్కిమాటకుఁ బకాపక నవ్వె విపశ్చిమానసుల్.

క. నవ్వినఁ గనుఁగొని పొదిసిన, నివ్వెరచేతులను వార్చి నృపవరుఁడంతన్
నిన్నటిలు సందియంబున, జవ్వాదుమనంబుతో హజారముఁ జేరెన్.

గీ. చేరిమంత్రులరావించి చిన్నఁబోవు, మొగముతోడుత నద్భుతంబును వచింప
నేలనవ్వెనో యుడికీనమీలు తెల్పుఁ, డనుచు గద్దించి యడుగ నయ్యాలఘుమతులు.

క. ఇదియేమొ యిప్పుడు తెలియదు, గదతెగ వివరించి చూడఁగాఁ దోఁచినచోఁ
బదపడి చనుదెంచియు విని, చెదమన వారలకు నృపతి సెలవిచ్చుటయున్.

క. పనిచినఁ జనువారలలో, ఘనబుద్ధియనంగఁ బేరుగలమంత్రి గృహం
బున కరిగి హాస్యహేతువుఁ, గననేరక వగలఁబొగులగా నట్టియెడన్.

క. బాలసరస్వతి యతిమాత్ర, శాలినియగు మంత్రితనయ చనుదెంచియు దే
మాలోచన యని యడిగిన, జాలాపము లెల్ల విని మహాద్భుతమతియై.

వ. తన్మత్ప్రహాసంబునకుం బూర్వంబునం బ్రవర్తిలిన కపలికాపిక క్రమార్కుల వాక్యంబులామ్రేడితంబుగా విని యంజనముట్టంబున నిక్షేపంబునుం బోలె మనీషాజలంబునం దత్కారణం బెఱింగి యయ్యా యీయాశ్చర్యంబు పధూశాంబరీవిడంబనంబునం బొడమినయది పాముజాడ పామునకుంగాని పరులకుం దెలియఁబడని తెఱంగున నంగనలకుం గాని యిత్తెఱంగుఁ గనుంగొన మీకుంగోలఁది గాదీకట్టుబట్టబయలుగావించినం బాపంబు ప్రాపించుఁగావున విజనాంతరంబున నుపాయంబున భూనాయకునకేఁ దెలిపెద నని యజ్జనకుని వెంట వసనాచ్ఛాదితాంగోళికారోహణంబునం దెరవాటుంగునం గూర్చుండి యక్కురంగనయన యాప్రసంగంబు దిగిచి రాజపుంగవుతో ని ట్లనియె.

గీ. విక్రమార్కేంద్ర సర్వజ్ఞచక్రవర్తి, యయ్యు నీకార్యమన్యుల నడుగఁదగునె
యడిగితేనినిజోదంతిమపలనొడివి, యడలుపద్మినిఁ బోల్పఁ బట్టగదువీవు.

వ. అనుచుం బల్కెఁ దదనంతరంబు ప్రభాతతరమణీమణి యరుణోదయంబుఁ గాంచి కేళీనిశాంతంబునకరిగి యారాఁటిరేయి భూనాయకు పొందుదెందంబునం దలంచి యానందంబునఁ గందర్పశాంబరీమత్తవేదండంబు చందంబున మందమందగమనంబునం జనుదేర మన్మథతురంగంబు గనుంగొని యంతరంగంబుప్పొంగ నయ్యంగనామణికిట్లను నట్లాబాలసరస్వతియు నావైహారిణహాస్యంబు నాకాతరేఖాపరాభూత కుసుమశరాసనుం డగు నారాజన్యమూర్ధన్యుతో నుపమానంబుగా యవనికాభ్యంతరంబున

సీ. పక్షపుటాంతర ప్రాపితముఖపాళి శాఖాగ్రవసనదండజవ్రజంబు
బర్హావిభ్రమజాతభయసర్గిణ బిలముఖోద్గమ నానమర్థాహినముదయంబుఁ
గేదారకృతతటాకోదారపరితరత్పాలోల సంచరద్ధలికనికర
మర్ధముహూర్త సాపాయితసికతావశిష్టాంబురాశి యాశీచయంబు
గిరిదరీసుప్తగర్జితోత్కరహరాత్పరి, బుద్ధసంక్రుద్ధశార్దూలభూరినఖశి
ఖోరునిపాతనమిపగండోపలంబు, వర్ణనమొనర్పఁదగియె నవ్వర్ష మపుడు.

ఉ. అంతట నాత్మలో సుమతి యంబుజబాంధవుఁ డస్తమింపఁగా
నంతలు నింతలుం గల మదాత్మజు లాఁకట నేమయిరో మ
త్కాంత విభుండు తెచ్చుఁ గవ గ్రాసమటంచుఁ దలంచుచుండఁగా
వంతయొనర్చెఁ జల్లనగు వానలు నెండలు జిత్త యిత్తఱిన్.

క. దినదినము నకక యేవన, మున కేగక యున్న నింటఁ బ్రోయి రాఁబడుగా
పెనువాన యింతట న్వేలి, సిన నేగతిఁ బోదు జిత్తచేతులతోడన్.

క. నేఁటి కొకపూఁటకేనియుఁ, గూటికి లేకున్న నేపు గొడ్డలియెత్తం
బాటిల్లదు-బలిమి నిరా, ఘాటత్వర నడవికరుగఁగాఁ దర మగునే.

క. అనితలఁచి వాల్గదిక్కులు, గనుఁగొని సముదారదారుకల్పితగణవా
థునిఁజూచిదొరకెఁ గదరా, యనుచు న్వేసఁ జేరి యాతఁ డతికుతుకమునన్.

గీ. చేరి యాచేవ్రమానిపిల్గారినతికి, చెక్కలొనరించి యంగడిఁ జేర్చి యమ్మి
యింటికేగుట కార్యమింకేటిదేవుఁ, డేనుగూటికి వగవఁగా నేమికలదు.

గీ. ఊరివారెల్ల నేఁటేఁట నొప్పగింపఁ, గడుపువిరియంగఁ దిని పండ్లుఁగుడుములెల్ల
వారికొంపలలోఁ దప్పిదారి యున్న, వెల్ల దినుమని తన తేజి కిచ్చుసెలవు.

క. కావున మతిపిఁ డెక్కడి, దేవుండొకొ దేవుఁడైన దృఢతరకరుణా
శ్రీవెలయ సిరులొసంగఁడె, యీవేళం దనకటంచుఁ గృతనిశ్చయుఁడై.

గీ. పొడవుగా నెత్తి గొడ్డలి పూనిపట్టి, నఱకఁబోయిన నవ్వృక్ష నాయకుండు
నిలునిలువు మింత యేటికి నేఁటినుండి, దినము నూటేసి మాడలు దెచ్చియిత్తు.

వ. అనిపలికి యాశ్చర్యమగ్నుం డగు నతనిచేతికి నిజమాయాప్రభావసంపన్నుం బగు మా
డలముడుపుతుండాగ్రంబున నొసంగి ప్రతిదినంబు నంబురుహాబంధుబింబోదయంబున
వచ్చుచు మెచ్చువ్వారితో నేనియు నివ్విధంబునుం జెప్పిన నీకు నాకుం బనిలే దనియను
చున్నంతలో నొట్టుపెట్టినగతి వాన దొట్టున వెలిసిన నదియును లంబోదరముహూద
రంబుగా నెంచి యింటికిం జని తనవాలుగంటికిం ధనంబొసంగిన నొయ్యన వలయు

వస్తువు లస్తోకంబుగాఁ దెచ్చికొని కృతకృత్య యయ్యె నదిమొదలుగా నతండును బూర్వోక్తసువర్ణప్రదాయకుం డగు వినాయకు వలనం దినదినప్రవర్ధమానమహావైభవుండై యుండె నంత.

క. పొరుగింటి యువతి మందో, దరి యనునది పద్మినీసుధాకరవదనా
గురువిభవముఁ జూచి నిరం, తరతాప మసూయకతనఁ దను నలయింపన్.

మ. ఒకనాఁ డాయమయింటి కేగి కపటోద్యోగంబున న్లేచి మ
చ్చికతో ముచ్చటలాడి నీకు సరి యేసీమంతినుల్ లేరు సు
మ్మకనక్కంబులు గావు లేమిపడుచో నీకైవడి న్వైభవా
ధికవై యుండెదువేళ నేకగుణసందీప్తస్థితిం గాంచుటన్.

క. ఒకమాటఁ దెలిసికొనవేఁ, డుకయై యుండు మఱి యెన్నఁడు న్నేరాఁగా
డకయుందు పనులబడిన్, వకుటిలహృదయాబ్జ వగుట నడిగెదఁ జెప్పుమా.

క. ఏనెఱిఁగిన బ్రదుకే గద, యీనడువడి యెట్లు కలిగె నింతటిలోఁ గాం
తానిక్షేపముఁ గంటివో, పోనీ యెట్లైన గూఢమున వర్ధిలుమా.

చ. అనవిని పద్మినీసతి ముఖాబ్జమునం జిఱునవ్వుదోఁప నా
కును మది సందియంబె యెనఁగుం ధనమేగతిఁ జేరునంచు నే
వినినది లేదు మద్విభునివేఁడెదఁ దెల్పెడివారెవారు చె
ప్పినవదియెల్ల నీకు వినిపించెద నీయెడ దాఁచనేర్తునే.

గీ. అనిన మందోదరీమందయాన పల్కు, లెన్ని నేర్చితి పద్మినీ వెలుఁగకుండ
నడఁచుకొన్నాఁడె నీమనోనాథుఁడకట, యిదియెనిజమైన నీమను వేటిమనువు.

మ. అకటా నీవిటు చేటుపాటులకు లోనైయున్న యిల్లాలవిం
తెకదా పుట్టినయిల్లుఁ జేర్చ వగలేదే సొమ్మునీతోడఁ ద
ల్పక నెవ్వారికిఁ దెల్ప నాస్త మది దాఁపం బల్కఁగాఁ బోలునే
లిక యెన్నేనియు నేల చాలు పలుకు ల్విన్నంత నే తోఁచెడిన్.

క. నామగని వంటివాఁడే, భూమిన్ లేఁడమ్మ యేనె పోరాడుదు గా
కేమాటయైన నాతో, దాముసుపే తెలుపు నవ్విధంబట్లుండెన్.

గీ. ఇది యెఱుంగక యున్న నాకేమి కొదవ, నీకుఁ దెలియక యుండుట నీతికాదు
చేరివయవేఁడు మిమ్మాటఁ జెప్పకున్నఁ, జత్తు సరిపోదు ననుము నిస్సంశయముగ.

మ. అని మందోదరి యింటికేగుటయు నయ్యబ్జాక్షి యారేయిఁ జ
ల్లని పూఁబాన్పున విడెమిచ్చి పతి కుల్లాసంబుఁ గల్పించి యా

యానతో మిమ్మిఁక నమ్మరాదు గద నాథా యీసిరు ల్గల్గు టె
ల్లను నాకు న్వివరింపరైతిరని లీలాకోపముం జూపినన్.

క. సుమతి రతికేళి మీఁదం, దమకము గలవాఁడు గాన దాని ననంబం
ధమహోనునయోక్తుల వ, శ్యమునం గదియించి కూర్మిఁ గడలుకొనంగన్.

క. ఇది తెలిపిన నపుడే సం, పదవోవుం గాన నెఱుకపఱపక యుంటిన్
గొనవా యిది నావలనన్, ముదితా! మది తాపమేల మోవియ్యఁగదే.

గీ. అని యతఁడు వెండియును వేఁడ నవ్వధూటి, యింతలోఁబోవుసంపద యెన్ని నాళ్లు
నిలుచు! నాకెండ నాతోడఁ దెలుపఁదగదె, చాలువిడుమంచుఁ దరితీపు చలము నెఱప.

క. అనుమతి యప్పుడు కుసుమశ, రాసోన్మాదమున నాగణాధిపుకరుణా
శ్రీనముపలబ్ధిఁ గంటిను, హానంపదలంచుఁ దెలిపె నాద్యంతంబున్.

క. అంతట నది యప్పుడె చని, మంతనమున గోడఁ జేరి మందోదరితో
నంతయును దెలిపి క్రిమ్మరి, కాంతునికడనుండె గుట్టు గలయదివోలెన్.

శా. ఆనందోదరి చిఱ్ఱుబు స్సనుచనూయాక్రాంతయై పోయి యే
మేమో వేఁడెడు బిడ్డలంగదిసి యేనింకెచ్చటం దెత్తున
య్యామీతండ్రి గడింపలేదు గద వెయ్యార్లెన్నఁడుం జాలు మీ
మోము ల్దిందురుగాక యింకనుచు వీఁపు ల్బిట్లిపోఁ గొట్టుచున్.

గీ. చట్టితోఁ జట్టి పగులంగఁ గొట్టి తనదు, పదరులకు నింటి బలుకుక్క లవరి కూయ
నడరు భయమున గుక్కుమిక్కనక వెనుక, వెనుక కొదిగెడు తనప్రాణవిభునిఁ జేరి.

క. మగవాఁడ ననుచు నున్నా, వగునగునే కడుపుగట్టి యప్పులు మిగులన్
దెగిచి యిటు వండిపెట్టినఁ, బొగులవు కుంభంబుమీఁదిపాట్లెలుక్రియన్.

క. కిర్గాతికాండ్రె యెపుడుం, దగ్గని సంపదలఁ బొదలఁ దామది యకటా
బగ్గువమందెను నీకును, సిగ్గించుక లేదు డొక్క జేనెఁడు గాదే.

క. పొరిగింటి పద్మినీసతి, గిరుకుచు మట్టియలు గిలుకు గిలుకని నడువన్
మెరమెరలు పుట్టవే కాఁ, పుర వేఁటికి మగఁడు పొట్టపోయక యున్నన్.

క. అని శాంతిదెమ్చుకొని ప, ద్మిని చెప్పిన మాటలెల్లఁ దెలిపిన నతఁడే
నును జని పిల్లారిని వఱ, కినసతఁడే యిచ్చు సిరులు గెలిచితిననుచున్.

గీ. అంతవేగిన గణనాయకాలయమున, కరిగె నాతండు సుమతియు నపుడె చనియె
హారి నిద్దజేఁ జూచి యవ్వారణాస్యుఁ, డధికకోపానుతాప దురాపుఁ డగుచు.

గీ. ఒరుల కేటికిఁ దెలిపితివోరి యనుచు, సుమతిఁ గొట్టించెఁ బ్రమఘయౌధవుల చేత
నేరనీ వేలవచ్చితి వోరి యనుచు, నట్లు సేయించె నాఁడేగినట్టివాని.

గీ. ఆసుమతి యట్లునొగిలి గేహంబుఁ జేరి, యంతయును దెల్పఁ బద్మినియుడరు వగలఁ
దూలి మందోదరీకాంత తోడ నేల, దెలిపితి నటంచు మిగులఁ జింతిలఁదొడంగె.

ఉ. కావున విక్రమార్క వెనుకన్మదిలో నిటువంటి కార్య మే
లావినిపింపు మంటి నని లాఘవవృత్తికి లోనుగాక నీ
వేవిశదంబుగా నరయుమీ దినమెల్లను దోఁపకున్న నే
నీవిధమంచు జెప్పు వచియించెద నేఁడటు పోయివచ్చెదన్.

క. అని బాలసరస్వతి య, జ్జనపతికిని దెలిపె నని రసస్థితి మిగుల
న్వనిత కలశుకము దెలుపం, దినకరుఁ డుదయాద్రి కరుగుదేఁ దటి యయ్యెన్.

క. అంతఁ బ్రభావతి కేళిని, శాంతమునకు నేగి నాఁటి సంధ్యావేళన్
గంతునిభుఁ డైన ధరణీ, కాంతునికడ కరుగుచో శుకం బిట్లనియెన్.

గీ. అమ్మ యమ్మంత్రిసుతప్రభావమ్ము వినుము, విక్రమార్కవసుంధరావిభుఁ డొకింత
తెలిసికొనలేక మఱునాఁడు పిలువఁబనుప, జనియె నమ్మనసయున యాస్థానమునకు.

వ. చని యవనికాంతసమాసీన యగుటయు నమ్మనవేశ్వరుం డితరప్రసంగంబున కవకా
శం బొసంగక యంబుచరహాసంబునకు గారణంబుఁ దెలుపుమనిన నచ్చెలువ కలక
లనవ్వి పరుల నడుగందగని కార్యం బడిగెద విట్లయిన ననాచరణీయం బగుప్రయో
జనం బొనర్చి యాపిమ్మట వనటకుం బాలైన పాలికయను బాలికతోడి పోలికగ
లవాఁడ వగుదువది యెట్లనిన నవధానంబుతో వినుమని యిట్లనియె.

— రెండవయుపకథ —

క. ధరపైఁ రత్నావళి యను, పుర మొక్కటి కలదు గగనపూరితమణిగో
పురమై పరమైశ్వర్యా, కరమై నరమైకలనదగాగోత్కరమై.

క. అపీట రత్నవిదుఁడనఁ, గావైశ్యాగ్రణి యొకండు కలఁ డాతనికిన్
దేవేరి యొకతె మన్మథ, దైవతమై పాలికాభిధాన తనర్చున్.

క. ఆపాలిక శశిరేఖా, రూపాలిక జారజనశిరోమణి సురత
వ్యాపారమునం దన్న, వ్యాపారప్రేమఁ జెందు టరయుట కతన్.

సీ. *ఓవరిపైన నీ కునికిఁ గావించిరే బజగెశీయనిదూఱు బావగారు
పొరిగింటిగోడ చొప్పన గట్టివైచిరే యవునె నిన్ననిదూఱు నత్తగారు

* కడపపై నిన్నంటి కాఁపురంబుం చిరే — పాఠాంతరము.

వాకటిచెంతఁ గావలియుంచిరే నిన్ను గామిడి యని మాఱు మామగారు
పెరటిలోపలఁ బాతిఁపెట్టిరే మే నిన్ను వగలాఁడియని దూఱు వదినెగారు
తోడికోడలు పగచాటి వీడనాఁడు, నాగడ మొనర్తు రెప్పుడు వియ్యములవారు
నేరముల నెంచఁ దొడఁగుబాని నెలగుంపు, పతిపృథక్తల్పశయనుఁడై భయముఁ జూపు.

క. ఈరీతి నింటివారలు, కారియ యొనరించుకతనఁ గాఱ్కొని యుండన్
నీరజలోచన నెమ్మది, జారజనాయోగవాయుసఖు కున్ముఖయై.

గీ. అంత నయ్యింతి యారుమాఱైనదాన, నైతి నేకద తగువాని వాత్తుకొన్న
నింతకన్నను నన్ను వీరేమి సేయు, నేస్తరని నెమ్మనంబున నిశ్చయించి.

గీ. తనకు ననుకూలయగు నొక్కదాని తోడ, మాలిమియొనర్చుకొని యుంచి మంచిపెట్టి
దానితో నొక్కనాఁడు మంతనమునందు, నింటివారలకసినికో లెల్ల నుడివి.

చ. పరపురుషాభిలాష మదిఁ బాటిలు టంతయుఁ దెల్పి తత్పురీ
పరిసరభూమినున్న చలిపందిరి నొక్కనిఁ దెచ్చి కూర్చినన్
గిరివరగామివీ సురతకాలమునందు నిసుం దలంతు దు
ష్కరమని చూడ కింతయుపకార మొనర్చుమటంచు మ్రొక్కినన్.

గీ. అదిదిగుల్పడి నీవెట్టు లరుగుదెంతు, వెన్నికా నటుమీఁద నీకేమికాక
ముక్కఱయుఁ గమ్మలును దాల్చుమరియునన్నుఁ, జూడఁజాలక యిమ్మాటలాడె మొ

క. అని పీడనాడ దాని, న్మనమున జడుపుడుపు తేటమాటలచే న
వ్వనిత పొసఁగించి పసుపన్, జని క్రమ్మరవచ్చి యది నిశాముఖవేళన్.

గీ. అమ్మ నీమాట మీఱరాదనుచు నడిగొ, నిలిపివచ్చితినొక నిందు నీటుకానిఁ
బురబహిర్నిర్జనప్రపాభూమి నచటి, కెట్లు పోయెదు పొమ్మని యేఁగుటయును.

గీ. అందఱును నిద్రవోయెడు నంతతడవుఁ, జింత చేసియు సంకేతసీమఁ జేర
వెరవుగానక పాలికాతరళనయన, యాత్మలోనన యొకయుపాయంబు నెంచి.

క. ఇది సేయరాదటంచు, న్మదినెఱిఁగియుఁ దహితవాక్ రమాతనయు వశం
వదయగుటం బానుపు డిగి, పదయుగళము సద్దడంచి భయవిరహితయై.

గీ. చని యధిశ్రయణిని వహ్ని సంగ్రహించి, యింటినడికొప్పతగిలించి యెఱుఁగనట్లు
ముంగిటికిఁబోయి రొదగాఁగ మొఱలువెట్ట, నదరిపడి లేచి గృహదాహమనుచు బెదరి.

వ. శిశురక్షణంబునకుం బశురజ్జుమోక్షణంబునకుం గృహోపకరణసంగ్రహంబునకుం ద
స్కరనిగ్రహంబునకుం బాల్పడి గురుజనంబు లేమఱిన నందడిం బడి యప్పడంతి
బుసిబుసివడలతో నగరరక్షకాధ్యక్షపక్షంబగు సాహసంబు సహాయంబుగా నమయ

స్థలసరణిం గైకొని చనవంతఁ బావకుండును బవమానప్రవర్ధమానుండై నిలయాధారవేణువివరజనితచిటచిటధ్వానంబు లాపోశనమంత్రోచ్చారణంబుగాఁ దైలఘృతాదికంబు లెడనెడం బానీయంబులుగా నయ్యాగారం బాహారంబుగాఁ గొనియుండనివిననక పూర్వకృతఖాండవదాహం బుదాహరించు తెఱంగున బ్రతివిశాఖాతిప్రతాపంబుఁ జూపుటవలన ధనంజయాభిధానంబునుం బుష్కరోజ్జృంభణ విధానంబువలనం బృహద్భానునామంబును గృతార్థత్వంబుగా విహరింపఁ దొడంగె నంతకమున్న పౌరజనకోలాహలంబులతో జంటయై మింటికెగయు నెఱమంటలం గనుఁగొని దూతికావచనంబునం బానీయశాలాగతుండైన జారుండును నిజమందిరావనపరుండై క్రమ్మరియె నంత.

ఉ. పాలికనిర్జవాది భయభావము దూరము చేసి వానియా
శాలిజనింప నేగి చలిపందిటి ముందట నన్యభీతిచే
వాలుగు దిక్కు లారసి ఘనంబగు చీఁకటి కందరంబునుం
బోలు తదంతరాళతలము న్వడిఁ జేరి మహోరిరంసయై.

క. అప్పట జారుని గానక, యచ్చెలి యుచ్చలితమానసాంభోరుహయై
తిప్పవడి తెప్పుకోలగు, హెచ్చరిక స్మృతియుఁ వాని నెల్లెడ నెమకెన్.

గీ. వెదకి కానక వాఁడునా హృదయ మెఱుఁగ, వేఁడిదాఁ గెనో యని బహిర్వేదిఁ జూచి
యెచట లేఁడెందొ యరిగినాఁడే మొయనుచు, నరిగి పందిటిలో నెల్లనరసి పొగిలి.

శా. ఏరా మాయనిబారికాఁడియను నన్నిట్లేతురా తాళఁగాఁ
లేరా నేరము లేటి దూఱక దయాలీలం గటాక్షింపరా
మేరా గారవ మారఁగా రతినము స్నేహంబు లీకుండుటల్
రారా కూరిమిమీఱఁ జేరి కయికోరా జారవీరాగ్రణీ.

గీ. ఇప్పుడా యిందువచ్చుటి జేమియనుచుఁ, గోపమున డాఁగితేమొ మద్గురుజనంబు
కను మొఱంగుట కొక నేర్పుఁ గాంచఁగోరి, యుంటి నేరంబు సైరించు టుచితమిపుడు

క. అని బతిమాలియు జారుం, గనుఁగొనఁగా లేక దూతికం దిట్టుచు న
వ్వనిత నిరాశంబగునె, మ్మనము రతికిఁ దఱమఁగా నమందవ్యథయై.

చ. వెలువడి చక్కఁజూడ కవివేకము గాంచితి నేమొ యంచుఁ బం
దిలికయిపోయి యుంపరసి నిక్కముగా నతఁ డిందు వచ్చుటే
కలుగ దటంచు నిర్ణయముగాఁ దలపోయుచు నింక నేఁటితోఁ
బొలిసితి జారవాంఛ ననిపోయె నిజాలయసీమ డాయఁగన్.

క. చని యగ్నిభయముఁ జెందిన, తనవారిం గదిసి బహువిధంబులఁ దాను
న్ననయము నుండెను వింటివె, జనవర యేతత్కథాప్రపంచం బెల్లన్

గీ. అవ్వధూమణి యిది యకార్యం బటంచు, రొంచ కిల్లగ్నికై యప్పగించి జారుఁ
గలయకడలినయ ట్లగుఁ దెలిసిచూడ, నమగరానిది నీవున న్నడుగు టెల్ల.

గీ. కాన నేఁడెల్లఁ దెలియఁగాఁ గానకున్న, నెల్లి తెలిపెద నీకిది యెల్ల ననుచు
నరిగె బాలసరస్వతి యనుచుఁ జిలుక, వలుక నంతటిలోనఁ బ్రభాతమైన.

గీ ఆప్రభావతి యంతఃపురాంతరమున, కరిగి యారేయి మేదినీవరునిఁ జేరఁ
బోవుచోఁ గీర మనియె నంభోజవదన, వినుము బాలసరస్వతీ విమలమహిమ.

క. అంత మఱు వాఁడు ధరణీ, కాంతుఁడు పిలిపింప వజ్జగన్మోహిని య
త్యంతవిభాసితమణి ఖచి, తాంతరపల్యంకికా సమారోహణయై.

సీ. నేల జీరక యుండఁ గేలఁ గుచ్చెలఁ బూనుకొని యూడిగపుఁజెలుల్గనిసి నడువ
మణిమెట్టు పదవుతో మంత్రాక్షతము లీఁజుఁ బొల్పడి భూసురభామ లెదుర
నొక్కకే లొడగుపై నుంచి యేకాంతంబు దెలుపుచుఁ గూర్మినెచ్చెలులు సనఁగ
నెదురుగాఁ బఱతెంచి నృపమౌళి సమయంబు హెగ్గడికత్తియ లెచ్చరింప
కోరి పురివారిజాక్షులు గుంపుగూడి, యమ్మయిదిగాక యైశ్వర్య మార యనుచుఁ
బలుకఁ గ్రోయిలపరిభాష నలతి నగవు, మీఱ నన్నారి యరిగె వాజారమునకు.

క. అరిగినవప్రతిసీరాం, తరమునఁ గూర్చుండి యద్భుతముగాఁ బాథ
శ్చరవానమని ప్రసంగాం, కురి మెత్తిన విక్రమార్కకువలయపతితోన్.

గీ. అవ్వరారోహ పలుకు నన్నడుగ వలవ, దన్న నడిగెద విట్లేని యధిపమున్న
పలుకవల దన్నఁ బలికి యాపైవిచార, మందు నలదందశూక మట్లగుదు నీవు.

వ తత్పురావృత్తాంతం బవధానాయత్తంబగు చిత్తంబులోనవధరింపుము.

——మూఁడవయుపకథ——

సీ. నవ్యాశైలాసీత జపతపస్సంజాత యఖిలజగత్ఖ్యాత యైన మాత
జడధినాయకు నేలుబడి గన్న యిల్లాలు నిఖిలపుణ్యపుచాలు నిలుచుప్రోలు
అభ్రఘట్టనఖేలనాభీలకల్లోల యఘతూలికాజాల మడఁచుకీల
ఫణిలోకవిజ్ఞానపాటవాంతర్మీన వినుతసన్యావితానమునకు వాన
యధిపతి సమాగమార్థప్రయాణనమదు, నముచితాంబుజనాళ భక్షణవిలోల
ఘనగమధ్వానపటుపటూత్కారచారు, భూరిపితపక్షకేరి కావేరి వెలయు.

సీ. జలమానవులు చిమ్ము జముదాళి చాలునా మిసిమివాలుగ మీలు మిట్టి పడఁగ
వరుణుండు వైచు మవ్వపు బిల్లగోలనాఁ దరగ తూరుపు గట్టుదాఁక నిగుడ
నళులపరంగుల పారిగోలుగుంపునా వనజంబు లలఁతి గాడ్పునఁ జలింప
సలిలాబ్జపాణి యచ్చపు మేలుముసుఁగునా ఫేనపంక్తులు దరినాని యెసఁగ
నలరు మాత్సరునిషానమాగ తెంచు, కేళివృథబింబపాళి కాకృతికదంబ
ఖేలనాలోలమదమిళచ్ఛోళబాలి, కాముఖస్తోమ యయ్యాపగాలలామ.

ఉ. ఇవ్వలి రేవులం దుమికి యీఁది తటాలున నీటినాలుగా
నవ్వలిగట్టుఁ జేరు ద్రవిడాంగన లంబురుహోత్పలంబులన్
దవ్వుగఁ ద్రోచు జాడ తగుఁ దన్నది జందెపువాటుగాఁగ మై
మవ్వపు నీలపు న్సరు లమర్చిన చెక్కున నక్కడక్కడన్.

క. అనములనమానబిసరుహ, విసరలసద్ధూళి కలితవిభ్రమదావ
ర్తనమునయం బానదిలోఁ, బొసఁగుం జలనరుల గొడుగుబొమ్మరములనన్.

వ. వెండియు నఖండతరతీరాగ్రహారయాయజూక నిరంతరప్రతిష్ఠిత సవనపవనసఖధూమస్తోమంబు లంబుధిభ్రమావలమాన జలపానవిలోలవలాహకంబుల చందంబుఁ బొందుపఱుప, నిరుపమానతటసైర్యస్థాపితకాశాతిప్రకాశకుసుమంబులు పుణ్యనదీశ్రేష్ఠతాప్రతిపాద బిరుద చామరంబుల సింగారంబులం బొంగింప సముత్తుంగ ఘటచ్ఛటాజాలగౌరవాతిభీత నిజపఘాజనసమాఖ్యానవచనముఖరపథికతరుణీనికరంబు లుల్లసితవల్లభచర్యానకాశాత్మచర్యాత్మదృతదీపకలాపంబుల విధంబునం జెలంగ నభంగబాహాప్లవనపరాయణజనోత్తమాంగవలయితధవళవసనంబులు విహారసమాయాతస్రోతవ్యాళకంచుకసముంచితకుండలీకృత భోగంబుల సోయగంబునం గనుపట్ట నీరు గట్టున నెట్టుకొను తియ్యమామిడిచెట్లులం దొరంగుఫలరసంబునం బదనైన తావునం బొదలి పాలు పచ్చెలిమబిడెళి మేత్తురసంబునకుఁ దోడుచూపు వేరుపనసపంటిరసంబుల కాలువలకు వింతలుగల్పించు నానాప్రసూనరసంబుల నిర్ఝరంబు లుభయపార్శ్వంబులం బొలుచు నితరనదీకదంబంబుల చక్కఁదనంబు నెక్కాలుప నిక్కునం బిక్కటిల్లు తమ నిబ్బరపు గుబ్బలకు సురాళింపఁబూను కరణిందాల్చు కనకకుంభంబులతో రంభాస్తంభంబులనడుమ వెడలి పోఁకప్రమాకులనొరసికొని యాకుఁదోఁటలకుం గేడించి లికుచవనాంతరంబు ముందఱం గనం జెలువుమీఱ సప్తసముద్రంబు లేకీభవించిన తెఱంగున నంబుతత్త్వంబు సాక్షాత్కరించిన విధంబునఁ బ్రవాహావిజృంభణంబు చూచుచుండ నొక్కనాఁడు.

క. మహీధరనాయకుఁ డగునొక, ఫణివరుఁ డవగడము కతనఁ బడి యున్నదిలోఁ
గణనాతీత భయంబునఁ, దృణముం బలె ఝరము వెంటఁ దేలుచువచ్చెన్.
గీ. వచ్చు నతనిఁ జూచి వణఁక వెంబడినట్లు, భీతినరుగు నొక్క భేకవిభుఁడు
శాస్త్రబుద్ధిమణివిభాసితతత్ఫణా, గ్రంబు నెక్కి బ్రదుకఁ గంటి ననుచు.
క. ఘనతరతరంగఘట్టన, జనితవ్యథనిజఫణాగ్ర సక్తుండగు నా
తని నెఱుఁగఁ డురగవరుఁడుం, జనియెం దరిఁజేరలేక ఝరవేగముచేన్.
క. చనువేళఁ దద్విధంబుం, గనుఁగొని తత్తీరశాఖిఁ గాలూఁదిన ఖం
జనవరుఁ డొకఁడిది యారా, యనినవ్వుచు మఱియు నమ్మహాహికి ననియెన్.
గీ. అకట ఫణిరాజ నీకు నాహారమైన, కప్ప తలమీఁద నుండుట గానవేమొ
తెలియ కేమయ్యె దరిఁజేర నలఁతదీనిఁ, దీని గబళింతునని యుంటివేని వినుము.
క. ఇదిమంచిబుద్ధి యింకన్, బదటముచే నిందు కేని భాషింపకు ప
ల్కొదవేని నోరు నిలుపక, పదరిన భూసురుని పగిది పాటువు సుమ్మీ.
క. అనుచుం బాలసరస్వతి, జనవర ఖంజనము నపుడు సర్పముతోడన్
వినిపించిన యాకథ నే, వినిపించెద నేఁటిప్రొద్దు పోవం జనియెన్.
గీ. కాన నేఁడెల్ల మదిలోనఁ గార్యసరణిఁ, జూచియూహించి తలపోసి చూచికొనుము
యెల్లి తెలియంగలేకున్న నేనె వచ్చి, తెలిపెద నటంచుఁ బలికి యక్కిలికి యపుడు.
క. జననాథుఁ డంప నేగెను, దనయింటికి నటంచుఁ బలికి తద్దయుఁ బ్రేమం
బునఁ బల్కె వైశ్యభామిని, విని వేగుట గాంచి మదనవేదనమతితోన్.
గీ. అంతిపురమున కేగి యయ్యబ్జనయన, నాఁటిరాతిరి భూనాథు నరయఁ దలఁచి
దూతికాయుక్త యగుచు నేతెంచినట్టి, సెట్టిసానిఁ గనుంగొని చిలుక పలికె.
గీ. సకలశుభమస్తు తే వైశ్యసారసాక్షి, యక్కడికి జెల్వ నిల్చితి నమ్మకథయు
మదిఁ దలఁపువచ్చె నటుల నమ్మంత్రితనయ, వేగ మఱునాఁడె భూమీశువెట్టబుద్ధి
మాన్ప మదిలోఁ దలంచి సంభ్రమముతోడ.
వ. నవరత్నఖచిత చతురంతయానాధిరూఢయై యవ్వరారోహ హజారంబుఁ జేరంజని యు
పనికాభ్యంతరంబునఁ గూర్చుండి మీనహాసకారణాధీనాజ్ఞానపరుండై యున్న యు
న్నరేంద్రచంద్రుం గని తత్కథాప్రసంగంబు వినుమని యిట్లను నట్లు మహాప్రవాహ
ముఖంబునం బడి తెప్పిరిల శక్తి చాలక మండూకధృత మస్తకంబై పోవు నమ్మహా
భుజంగంబుతో నాఖంజనం బిట్లనియె.
క. ఆకథ వినుమని తగ్గా, థాకథనకుతూహలంబు బెరుమఁగ వెంటన్
నాకపథంబునఁ బోవుచు, నాకుండలివిభునితోడ నతఁ డిట్లనియెన్.

## —ఉపకథలో నుపకథ.—

సీ. తామ్రపర్ణీతీరధరణిపై నొకయగ్రహారంబు శోకాంబియనఁగఁ బరఁగు
నచ్చోట విష్ణుశర్మాఖ్యుఁడౌ నొక్క భూసురుండలరు నద్భుతచరిత్రుఁ
డాతండు సుకుమారి యనుభార్యతోఁగూడి యఖిలసౌఖ్యంబుల ననుభవించు
నంతటనయ్యింతి యాత్మజాతులఁ గాంచి కడియంపుఁజే మీఁదుగాఁగ దివము
సేయుటయు వార్ధకమ్మున ఘోరతరవి, చారగరిమను నతఁ డర్థసంగ్రహమున
కిచ్చగింపని యాతని పృత్తి మెఱిఁగి, తల్లియు సహోదరీజను లెల్లఁ గదిసి.

గీ. భార్యయుండిన వనమైనఁ బట్టణంబు, పత్ని లేకున్న గృహమైన బహుళగహన
మగుచుఁ గాన్పించు నరులకు నంతయేల, నాలు లేకున్న విధినైన నధముఁ డండ్రు.

క. యాగముల!నయోగ్యుండగు, భోగములకు బాహ్యుఁడౌ సుపుత్రోదయలీ
లాగణ్యయైనభార్యా, యోగము లేకుంట నరుల కుచితమె చెపుమా.

గీ. ఎంతదుఃఖమైన నింటికి వచ్చియి, ల్లాలి మొగముఁ జూచినపుడె తలఁగు
నిది యెఱింగి కాదె ఋషులువసిష్ఠాదు, లునుసభార్యులగుచు వినుతిఁ గనిరి.

క. ఒడలంటఁ గాళ్లుపిసుకం, గడివెఁడు వేన్నీళ్లనీయఁ గంచము వెట్టన్
బడకయమర్పఁగఁ జేతికి, విడెమీయఁగ భార్యకాక నేఱొక తగునే.

గీ. తిథులయందైన మఱి యపత్నీకుఁడనుచు, బ్రాహ్మణార్థంబుఁ జెప్ప రేపాటివారు
నొకతె రూపసిగాకున్న నోసియన్న, నోయనెడు మాత్రమునకైన నుండవలయు.

క. కావునఁ బునర్వివాహము, గావలయునటంచుఁ దెలుపఁగా నాతఁడు మే
ధావిని యను భూసురసుతఁ, బావనతరవంశజాతఁ బరిణయమయ్యెన్.

క. ఇలునించికొనుట మొదలుగఁ, జలమున మెండొడ్డి మిగులఁ జండించుచుఁ ద
త్కాలకంఠిగురుజనంబుల, కులధర్మం బెంచక్కేలుకొంచుం దిరుగున్.

సీ. తండులమాషముద్గముల గాదెల నించిమీఁద బిళ్లలమర్చి మెత్తు వెట్టుఁ
బక్వశాకం బెల్లఁ బతికంచముననుంచి యొడికంబుగాఁ బట్టి యార్చివైచు
నాజ్యతైలఘటంబులన్నియు వాసెనల్గట్టి యందనిచోట నుట్టెనుంచు
దధిపయోముఖరసద్రవ్యంబు లెల్ల దొంతుల సందు మూలమూలల నడంచుఁ
జిక్కఁజిలువాన మొకయింటఁ జేర్చితలుపు, చిలుకుముద్రించి బీగము చేయిరొండెఁ
జెక్కిళ్లొమఁ గ్రొత్తవలపునఁ జిమ్మిరేఁగి, వల్లభుం డెల్లయెడఁ దన్ను జెల్లవిడువ.

గీ. ఇంటనెవ్వారయిన !భిక్షమిడిన ముష్టి, వెట్టినఁ గరాళితేజి యొప్పిదము దోఁప
నెగిరి పడి యిందులకు మీర లెవ్వరనుచుఁ, బెద్దపులిఁ బోలె రొప్పునాబినరుహాక్షి.

క. సాయి ల్లిదినాకాంపుర, మీయెడ నాసొమ్ము దినుట కెవ్వరు మీరా
రాయంచు నత్తపదిచెల, వాయోడక కసరుఁ బోరు వారలతోడన్.

గీ. ఇవ్విధంబున మెలఁగు నయ్యింతియొంటి, తిండికతమున నిసుమడి కండపట్టి
నీరుపోసిన మేనితో నిలుపరాని, మనసుచే జారభోగ మేమఱక తిరిగె.

సీ. కలికిమాటలు కిలకిల నవ్వు లోరచూపులు మోవివిఱుపులఁ గులుకు నడలుఁ
బైఁటజార్పులును సోబానపాటలు కొప్పునవరించు నీటు చేసన్నవగలు
గోటిచిమ్ములు తెచ్చికోలు నెవ్వగ లేని వెఱపులు నెచ్చెలి వెన్నుచఱపు
మోముద్రిప్పులు బొమముడి బొమ్మతాటింపు రాని జంకెన కావరంపుఁబొగరు
మొలకసిగ్గులు వట్టికొంకులును దలుపు, చాటునిలుకడ లలితివేసటలు చూపు
గడియలో వింతవగ కానిఁ గాంచెనేని, కొమ్మ మారుని జంత్రంపుబొమ్మకరణి.

గీ. ఇవ్విధంబునఁ జలిదీతి యింటిపనులు, నూఱునటు వెట్టి వల్లభునోరుఁగొట్టి
యెల్లసొమ్ములు జారుల కెదురు వెట్ట, సాగె నిచ్చావిహారనిశ్చలత మీఱ.

సీ. పొంకంబుగా నూనె పంకించి సవరంబు కుప్పె గన్పడఁ గొప్పకొప్పువెట్టు
నీటికాఁగులలోన నీడ చూచి రువార మిట్టోర యనఁజాదుబొట్టమర్చుఁ
జనుదోయి జిగిమించుకొనఁగఁ బూసినమడ్కి రహిమించు గుత్తంపురవికఁదొడుగు
సురటి విచ్చినరీతిఁ దొరయు కుచ్చెలనేల జీరాడఁగాఁ జల్వచీరఁగట్టు
జాఱు పైఁట చెఱంగు బంగారు పూల, గాజులబెడంగు జారశృంగారములకుఁ
జొక్కుచూపు మెఱుంగు తళుక్కుమనఁగ, వీథి నేవేళ మెలఁగు నవ్విప్రవనిత.

క. అంతట మగనికి నన్నం, బింతయిడక వండినట్టి దెల్లను జారో
పాంతములఁ జేర్ప నాతఁడు, నంతవ్యథఁ గూటిబీదయై నెవ్వగలన్.

క. నీనడకలు గంటి గదే, కానీవే నగరఁ జెప్పి కారించెదని
న్నేనంచుఁ గుంటిసుంకరి, పూనిక బెదరించుఁ బోలఁతి బొమముడి వెట్టన్.

గీ. అంత నయ్యింతి యొక్కింత యళికియాడి, ప్రేగులోపలితీఁట నీబీదమునలి
కన్ను లుండంగఁగదనన్నగదుమసాగె, ననుచు జింతించి యొకయుపాయంబుఁ గాంచి

గీ. గ్రామదేవతయగు నమ్మగారి గుడికి, దినదినంబును జని మహాదేవి మగని
గ్రుడ్డిగావింపు మేఁకపోఁతఁ గోడిబలియుఁ, బొంగలిఘటింతునని మ్రొక్కి పోవుమగిడి.

ఉ. అంతట విష్ణుశర్మ జఠరానలతాపము పర్వ నెంతయుం
జింతవహించి యించుకయు శిక్షయొనర్ప నదక్షుఁ డౌట నీ
యింతి నిజేచ్ఛమై మెలఁగనిమ్ముఁక నన్నముఁ బెట్టనేని నా
కంతిమొచ్చాలు దీనికి నుపాయముఁ జూచెదనంచు నెంచుచున్.

తే. ప్రతిదినంబునఁ దన నమ్మినవారికిఁ బెక్కి, దినదినము భార్య చవిరియెడు తెఱఁగుఁ దెలిసి
యిచటికిఁ గొంకవారఁడు మున్నుగా నరిగి శక్తి, వెనుకఁ గూర్చుండు నంతనవ్వానిత వచ్చి.

క. అన్నా ప్రతిదినమును నే, నిమ్ముడిఁ గ్నేఁడుకొనంగ నెన్నటికిఁక నీ
వన్నెగని గ్రుడ్డి చేసెదు, నమ్మినవారికోర్కెనీకొనర్చుట గాదే.

క. అని మ్రొక్కిన నప్పలుకు, ల్విని ధరణీదేవుఁ డెలుఁగు వేఱొకభంగిన్
దనరంగ నద్వైతప, ర్తినగతి నిట్లనియె నమ్మలికి మెల్లఁ జనన్.

క. నీమగని నంధుఁ జేసెద, నామాటల్వినుము మతంము నలుగుడుపడరా
హోమపువ యతని కన్నము, ప్రేమంబునఁ గంచమరసి పెట్టుము దినమున్.

చ. అన మేధావిని శాంకరీపచన మేయంచు న్వితర్కించి యం
తరి శాంతంబున కేగి వల్లభునకున్వర్తింప నన్నంబు శా
కరికాయంబును సంఘటించిన నిజాగారంబుఁ జేరంగ వ
చ్చినవాఁడై యతఁ డంధకుండకొ మనశ్శ్రీనిట్లను భార్యతోన్.

క. తరుణీ యే మో తెలియదు, తెరగట్టినయట్టు లున్నదే కన్నులకున్,
దెసవడుగుచు వచ్చితి మం, దిరమున కిఁక నేమి యనుచుఁ దెలుపుదు నీకున్.

క. కన్నుల్గకరణి నేరము, లెన్నక నీయిచ్చఁ దిరుగు మిదియు మొదలుగా
నన్నము వస్త్రంబిడుచున్, నన్నుం బోషించుమింక నలినదళాక్షీ.

వ. అను నప్పలుకుల కప్పడఁతి యతనిం దప్పక కనుంగొని యితండు నిజాగమనసమయమునయింటిలోన లేఁడనియు నింతలోన నిప్పాపి కంధత్వంబు ప్రాప్తించెనే యనియును మదీయభ్రమావిభ్రమం బింతియె కాక లోకంబులో నుపలంబులుపలుకంజాలు నే యనియును జల్పపరాయణుండై యితం డద్దేవియుఁ గున గూర్చుండి పలికెం గావలయు నని సిద్ధాంతీకరించి వంచనాపటం డగునితనిం బోషించిన మంచిదాన నగుదు నేయనియెంచి కావించినమంచితొన్నశాకానీకంబులు జారలోకంబునకర్పించినవ్విష్టాశర్మయు నెత్తెఱుంగక నిత్తెఱంగున చూటలాడి నోటికూటికిఁ జేటుదెచ్చుకొంటిఁగదా యని డెంపంబునం గుంది వినిందిత రసనుండై కృశించెం గావున మానంబున నుండుమని ఖంజరీటంబు తెల్పిన సానుభవంబున మేనుమఱచి యయ్యూరగవరుండేతత్కథావిశేషం బింతయొప్పునే యని యుచ్చైస్స్వనంబునం బలికిన నులికిపడి యవ్వలికిం జనిన మండూకమండలేశ్వరుం గనుంగొని యిప్పాట నోటికశి పోఁగొట్టుకొంటివే యని ఖంజరీటం బరిగెఁ గావున.

గీ. పదుల నడుఁగరాని పరమరహస్యంబు, లడుగఁ దగునె విక్రమార్కభూప
నీవె తెలిసికొనుము నేఁడెల్ల రేపున్న, జెప్పులెలియ నేర్పఁజింతు నీకు.

గీ. అని యమాత్యతనూజ యయ్యర్థిఁ బుచ్చెత, నంపకము గాంచి యింటికి నరిగెననుచుఁ
జిలుక వచియింప నంతలో జలజబంధుఁ, డుదయగిరి సౌధశిఖపైఁ బొడలుటయును

చ. కనుఁగొని యాప్రభావతి జగజ్జనరంజన రాజభావనం
బెనయక చిల్కపల్కులకు నేమఱియెక్ వ్యాసయిం బటం మో
హానగృహసీమఁ జేరి మఱి యంబుజము ల్ముకుళించు వేళఁ బూ
నినపని కేగుచోఁ గలువ నేజపురాయని జేజి యింపునన్.

గీ. కప్పురపుబొట్టు నైమటచేఁ గరఁగి జాఱెఁ, జక్కఁ దిద్దును పూర్ణిమాచంద్రవదన
యింతలో నొక్కకథ వినిపింతుననుచుఁ, బలుకఁ బోదఁగాను బులకండ నెలుకుచుండ.

క. మఱునాఁడు విక్రమార్కం, డరసియు దెలిసికొనలేక యమ్మంత్రిసుతిం
బరిచారికయువతి పరం, పరఁ జేఁ బిలిపించికొని సమాదరణమునన్.

గీ. తెరమఱుంగున నిలుపనత్తెఱఁగుపదుల, నడుగఁగూడని యికార్యమడిగినప్రశ్నె
ప్రబలతరమైన జాతిస్వరంబుఁ జూపి, యడలు తురంగంబుతోడ జోడగుడు పిప్ప.

## అయిడవ యుపకథ.

ఉ. ఆకథఁ జిత్తగింపుము ధరాధిప సాధువనం బనంగ న
స్తోకతరప్రసిద్ధిఁ బొలుచుం బుర మొక్కటి యందుమందరా
ఖ్యాకలితుండు శూద్రుఁడు నయాన్వితుఁడై తగు నాతఁ డిందిరా
లోకన మేమిలేమి నతిశోకదరిద్రతఁ జెంది యుండుచున్.

సీ. కొలుచువారల నోరుగొట్టి లెక్కలుఁ వ్రాసి హరువుమీఱఁగ మణియములు చేసి
భ్రమసి యాసానలరసవాదము లొనర్చి ప్రకటించి రాజపట్టికలు దీర్చి
ప్రతివాసరంబు లేర్పడఁగఁ జేసుకట్టి వాటంబుగాఁ బెరువాటు గొట్టి
వేళ్లమందులమర్చి విషవైద్యతవహించి తఱుఁగుచేరముల నెంతయున్నమించి
ప్రముచ్చువగయును గనిచూచి మూటమోసి, సుంకరులతోడ నావఁగూడి జూదమాడి
యిల్లు వర్తించియును నాతఁడేమియందు, గళవళముఁ జెందెఁ గూడుఁగోకయును లేక.

గీ. అంత నమ్మందబుద్ధి డమందార్తి నుదర, పోషణంబునకై యూరిపొంత దోస
తోఁటఁ గావించెఁ గావడిపాటుపడుచు, నదియు నర్ధ్యవ్యదృక్ప్వరం బైతనర్చె.

ఉ. అంతట నొక్కనక్కదొర యంబుజబాంధవుఁ డస్తపర్వతో
పాంతముఁ జేరుదాఁక బోరియం జఠరానలకీల నెంతయుం

జింతిలుమంచి చేలు తన జీతపుబంటులు దాను భీతియు
క్కింతయు లేక యే పెనవి యేగుఁ దదీయఫలంబు లన్నియున్.

గీ. ఆసృగాలాగ్రణికి ఘటకాఖ్య వెలయు, వాతఁడీరీతిఁ గర్కరికాతిపక్వ
ఫలపరంపర నుదరసంభరణవృత్తి, నడుపుచుండఁగ మందరుం డలుకవోడమి.

ఉ. అక్కట దోసతోఁట యదియైనఁ దదీయ ఫలంబులమ్మ యీ
డొక్కను సాకఁగోరితిఁ గడు న్నడురేలునవచ్చియెవ్వరో
మక్కువలేక నాకడుపు మంటయుఁ బుచ్చికొనంగఁ బూని యీ
చక్కరివంటి పండ్లు తినసాగి రటంచుఁ గృశించు నెంతయున్.

చ. ఒకమృగధూర్త రాజవరుఁ డుజ్జ్వలనీతివిదుండు ధీరనా
మకుఁ డతిదూరఘోరవనమధ్య విహారుఁడు విద్విషద్విదా
రకుఁ డొకనాఁడు వేడుక సంగళముగా భటకోటితోడ నో
డకయరుదెంచె నచ్చటికి కటత్తటిదీక్షణవీక్షితాస్యుఁడై.

గీ. వచ్చి బడలిక దీర్చు దుర్వారకర్క, రీఫలామోదధారంధరీవరిష్ఠ
పవనముల చేత నాహారభాగ్యమిచట, నబ్బునని యెంచి కెలని ఓట్టడవి విడిసె.

క. తనమంత్రివరులతో మం, తనమున నీదోసతోఁట తనరెడు చోటన్
మనజాతి వారలుండరె, యని యాలోచనమొనర్చె నానమయమునన్.

మ. ఘటకుండంతట వేగవాఁడు నడువంగా ధీరుఁ డారీతి వ
చ్చుటలెల్లన్విని మంత్రులం బిలిచి యిచ్చోఁ బోయి సంధించి యు
త్కటమద్వైభవమెల్లఁ జూపు టనువో కాదో విచారింపుఁడే
మిటికన్న న్మన కొక్కవేళకగు తన్మైత్రత్వమంచెన్నదన్.

చ. అది యటులుండె నంతటిమహామహుఁ డిచ్చటి కేగుదెంచినం
దుది మొప లేనెఱింగియు నెదుర్కొని పూజయొనర్పకున్కి యి
ప్పుడు మనము ట్లొనర్చినను బ్రాభవహానియె గౌరవంబు సొం
పు దవర మున్న మ్రొక్కిగద మ్రొక్కగొన న్వలయుం జగంబునన్.

క. అనిన విని సచివులందఱు, వనఘామతి యాతఁ డింత యధికుండైనన్
గొనివచ్చి పూజలిచ్చిన, మనకుం దప్పేమి యది సముంచిత మనినన్.

గీ. బుద్ధిసారాఖ్యసచివుండు పూని పలుకు, దొరను మంత్రులఁ జూచి సంతోషమయ్యె
మొదల నెంతైనఁ జన వాకు మునలిచ్చి, ధీరజంబుకవరుని సంధింపఁజనుఁడు.

వ. అనిన నం దదీయసంధానసముత్సాహభంగకారణం బగు నతని ప్రతికారవచనంబులకుఁ
జిడిముడిపడి యితండేమియేలుంగు విచ్చేయుం డనుచు సంధానపరకృత్యులైన య

మాత్యులం గూర్చుండనియమించి యామృగధూర్తచక్రవర్తి యిట్లనియె.

క. ఒకనికిఁ దెలియు న్వేఱొక, నికిఁ దెలియక యుండుఁ గార్యనిర్ణయమితఁడే
టికి నడ్డుగాళ్లు వైచెనో, యకటా యది యెల్లఁ దెలియ నడుగవలయున్

క. అనిబుద్ధిసారు నెమ్మొగ, మునఁ జూపులు నిలుపఁ గేలు మొగిచి యతండో
యనఘాత్మ వీరికన్నం, ఘనుఁడంగా నైన నొక్క కార్యము వినుమా.

చ. మును వినియుందు ధీరుని సమున్నతగర్వవిహారుఁ డంచు నా
తని మదికి న్భవద్బలవితానము చీమలచాలుఁ బోలె నై
కనఁబడు నీవు పల్కు నుడికారపుమాటలకెల్ల నాతఁడా
డును విరసంపుఁ బల్కులు గడు న్మఱి మోసము వచ్చు నత్తఱిన్.

క. మోసము వచ్చుట యరుదే, యీసునఁ దద్గర్వ భావమలిచటి న్మృగా
గ్రేసరులు నైతురే విను, మాసమయము సుమ్ము దొరల కవగడ మరయన్.

గీ. అతఁడు గర్వయుక్తుఁ డౌటయుఁ గాకున్న, నొకనిదర్శనము మహోగ్రశౌర్య
ప్రభుగుణంబు విడిచి పరభూమి కింత దూ, రంబు వచ్చునే నరాళి మనుచు·

క. కావున గర్వాతురుఁడై, కానెఁ గాదేని యిచటి కర్కరికాళిం .
దావిని తదాశ వచ్చెం, గావలె నెక్కైన మనకుఁ గావలెఁ జుమిమ్మ.

మ. మనకీకర్కరికాఫలాళిగద సామ్రాజ్యంబు గల్పింపఁ జా
లినయాహారము దానికై యితఁడు దోర్లీలానముల్లాన తం
జనుదేర న్మనమేగి విందులగతి న్సంధించు టేకార్య మి
ప్పని నాకు న్సరిపోదు మీకు రుచియింపం బోలు నిప్పట్టునన్.

వ. అకార్య మాత్సర్యకృతానురాగు లగు నీనియోగుల మాటలకుం గోపాటోపంబు నా మదిం బొటిల్లదు దుష్టనిరసనశుభావయనిష్ఠాగరిష్ఠులు కాక కాలోచితపరిభంజన మాత్రకృత్యులగు వార లమాత్యులే యది యట్లుండె నతనిం గని తోడితెచ్చితేని యుందదీయశ్రమాపనోదారం బగు నాహారం బిడవలయుం గదా యీకర్కరీవనం బు కొంచెం బగుటం బరాక్రమంబుఁ జూపకుండునే యంటివేని దానికిం బ్రతికా ర్యం బీయుపాయంబునఁ బన్నివచ్చెదనని కర్ణోపాంతంబునం గొన్నిమాటలు నొడి వి నిజాధినాథు దెస దరహాసం బగు నంగీకారంబుఁ గైకొని బుద్ధిసారుండు తదా స్థానంబు వెలువడి.

క. తటచలితచలదళిచ్యుత, తోటతోటరవశాలిఫలమిథోరణకేళీ
పటుకరజలచరనికరో, త్కటమై తనరారు చెఱువుకాలువఁ జేరెన్.

గీ. చేరి పనివ్రాని యిటకవచ్చితి మదుక్తి, కొదవపడకుండ నెల్లొఁనగూడు నొక్క
కార్య మని నాల్గుదిక్కులు గనుచునుండ, దైవవశమున నత్యద్భుతంబుగాఁగ.

సీ. క్రవ్యాగతోగ్రకాకవిఘాతమక్షికాపుంజమై తగు వెన్నుపుంటితోడ
బాలకక్రీడావిపాటితరోమజాలంబైన యట్టి వాలంబుతోడ
నగ్రిమపాదబంధాతికృధానముద్ధనములౌ వెడవెడ చాట్లతోడఁ
గఠినిజస్వామి కరకాష్ఠనిహతజాతంబులై తొరఁగు రక్తంబుతోడఁ
గర్ణకంశోదరాధారకంబు లగుచు, నమరు ముయ్యార్వు పిడుఁదుతండములతోడ
నచ్చటికి వచ్చె నొకయశ్వ మల్పహేష, జాతి దెల్పఁగ జలపాన సంభ్రమమున.

ఉ. వచ్చి జలంబు గ్రోల నిలువంబడఁ గన్గొని బుద్ధిసారుఁడు
ద్యచ్చతురత్వ మొప్ప వినయంబునఁ జేరినమస్కరించి యో
యిచ్చట నిన్నుఁ జూచి చనియెం బహుకాలము నేఁడుగంటి నా
ముచ్చట లెల్లఁ దీఱ మన మున్నటి నెయ్యము లెంచుకొందువే.

చ. అది యటు లుండె నీతను వనంతబలాఢ్యము బక్కచిక్కియు
న్నది యిది మాఱురూపువడి యద్దిరయిద్దురవస్థ యేక్రియం
గదిసెనొ నన్ను వంటి చెలికాఁ డొకఁ డుండఁగనిమ్మనోవ్యథా
భ్యుదయము వొంద నేటికి నయో నను వింతఁగఁ జూడఁ బాడియే.

క. అనిన విని యత్తురంగం, బనఘా నిను మఱవనేర్తునా బహుకాలం
బునకైన బుద్ధిసారుం, డనుసుకృతివి గావె నెయ్య మలఁతియె మనకున్.

క. మామా యల్లుఁడ వని మన, మామాడ్కిన్ భావియొకటి యమరించినయ
శ్రీమించఁ బ్రవర్తిల్లుట, యేమైన న్మఱచువాఁడనే గుణహారా.

చ. ప్రకటవిషాదవేదనపరస్పరవృత్తి నినుం గనంగఁ దా
పకవిహితప్రవృత్తికి నవజ్ఞతయెంచక పల్కరించి నీ
వకుటిలవృత్తివైతి వినయాభరణా మదిఁగోరియుందు మా
మకహృదయవ్యథాకథ సమస్తము నీకెఱిఁగింప నెప్పుడున్.

ఉ. ఈపురినొక్క రెడ్డి వెలయిచ్చి ననుం గొనితెచ్చి పోషణ
శ్రీపరివర్ధమానునిఁగఁ జేయుట నీవు నెఱుంగుదే కదా
యాపయి వాతఁడొక్క యెడరైన నను న్వెలకిచ్చె నన్యవి
త్తాపహృతిప్రవీణత మతిహారికి వేఱొక చేరివానికిన్.

క. ఆతఁ డింక నేమి సెప్పను, నతతము నాహారసంతసంతల కట్ట్యు
ద్ధతిఁ బెజికలెత్తితిఱుము, క్షితిసరయం డింకయైన మత్తను బాధన్.

గీ. పెజికయేచాలు నాండ్లి విఱుఁగఁ జేయ, దానిపైఁ దానునెక్కు నింతయును గాక
యుకటవయ్యాళిగాఁగఁ జొమ్మనుచుఁ గొట్టు, నతని చేతులలోఁ జెంగలమ్మ గొట్టు.

మ. పొరుగూళ్ళం దియవాళ్లనాగిన భరంపువ్వానిసి నోర్మయని
స్థిరవృత్తిన్ననుఁ జూపి సుంకములటంచుం గూళియంచున్వరా
లురయం బారఁగమోచి నన్నుఁ దఱుము న్లోభాప్తి మైఁదాసిరా
దయుఁడై మేఁపఁడు కాళ్ళు గట్టివిడుచుం దత్తత్ప్రదేశంబులన్.

గీ. గొఱపమాలెదు నీరొర్చ్బుగొడవయెఱుఁగ, గడ్డివేయఁడు కవణంబు గానివాని
జంబుకాధీశ మాడు మీచాయనేను, గజ్జమైపుట్టి యీగోడుగుడువవలసె.

క. త్రిమ్మరి మాపటికై తన, యిమ్మనకే తేర దుక్కియెనుపోతులు రెం
డిమ్మలఁ గొమ్ములఁ జిమ్మం, గ్రమ్మివ నిర్దయతఁ బసులగాడిఁ గట్టన్.

ఉ. అక్కటి నాత్మకుంము కినవారసి తెమ్మని కూఁతు చేతికిం
జెక్కుడుఁ బొఱయాయ వడి నెట్టది వెల్వడి చేనిమంచపై
నెక్కినజారుఁ గూడి రమియించి దినాంతమునందు వచ్చి బ
ల్లొక్కులు నా మొగంబున విదుర్చును గొన్ని తృణాగ్రఖండముల్.

క. తొంటిజని వానియుప్పటు, తింటిఁ జూమా యింతపాటుఁ దెచ్చుకొనుటకై
కంటికిఁ గూరుకురాదాఁ, కంటికిఁ దుదిలేదు చిక్కి కరియొ యెట్లుందున్.

క. ఇటువలె నున్నదివాకథ, ఘటకన్నృగాలేంద్రిఁ గొలిచికదయుండుదు వ
ప్పటుమతికి నేమమేయి, చ్చటికేటికి వచ్చితవిన జంబుక మనియెన్.

గీ. అకట నీయట్టి సుగుణరత్నాకరునకు, నిట్టిదురవస్థవచ్చె నే యింకమీఁద
నంతయును జక్కపయ్యెడు నన్మదాగ, మనము వినిపింతు వినుమానమానమాన.

క. ఘటకునకహిభయమొదవె, న్నటుగతినీకుఁగల పక్షపాతమతనిపై
నటియింపఁజేసి మెలఁగుము, దిటమలరం దార్క్ష్యనామధేయుఁడ వగుటన్.

వ. అని ధీరాగమనంబు సవిస్తరంబుగాఁ దెలిపి వెండియు.

గీ. నీవుమా కెల్ల దొరవోలె నేఁడు మొదలు, కొన్ని నాళ్లుండు భవదీయఘోరమూర్తిఁ
గాంచి ధీయుం డపూర్వమృగంబటంచుఁ, దలఁగునదిమాకు శుభము గంధర్వరాజ.

క. ఈరేయి దోసపండ్ల, వ్వారిగఁ దిను మర్కుఁ డపరవసుధాధరముం
జేరినపిమ్మట నిలుమీ, చెవుప నేఁపుడు వచ్చి చేర్చెదఁ దోఁటన్.

క. అనిపల్కి బుద్ధిసాగరుఁడు, చనియంతయుఁ దెలిపె ఘటకజంబుకకులపా
ఘనకంతటఁ జారులుదె, ల్పిన నదివిని ధీరుఁడొక్కలేనగవలరన్.
క. తనమంత్రి సుముఖనామకుఁ, గనుఁగొనుటయు నతఁడులేచి కార్యమువీఁడ
న్ననుఁ జిత్తగింపుమనుచుం, జనియెం దత్తురగమున్న చక్కటికెలమిన్.
చ. చని కరముల్మొగిడ్చి బుధసన్నుత జంబుకజాతివాఁడన
త్యనఘుఁడ నే నతీతమున నాగతమున్మఱివర్తమానమున్
గని వివరింతు నిప్పుడొక కాజియచే వెతఁ జెందినాఁడ వి
ద్దినమున నీకుఁగల్గువడ వేఁడఁగ గర్కటికాఫలావళుల్.
చ. ఇది నిజమైన తేపువచియించెదఁ దక్కిన కార్యమంతయున్ •
దుదినొక విన్నపంబువయతో వినుమాఁకటఁ గుందినాఁడ నేఁ
డదనున దోసపండ్లుతిను నత్తఱి నన్నొకసారి పిల్వనేఁ
జెవరని ప్రీతి నివ్వెలుఁగు చెంగట నివ్వలఁ బొంచి యుండెదన్
*క. అనిపూన్చి ధీరుతోన, త్యనుపమగతి సుముఖనాముఁడవగడమగు న
ట్లొనరించి వేగవచ్చితి, నని తెలిపెన్రవియుఁ బశ్చిమాంబుధిఁ గ్రుంకెన్.
వ. అంత.
మ. రవిరాకన్మదిఁగోరు పద్మినులు చక్రస్త్రీలు మోముల్మడుం
పవియోగవ్యథఁ గుందఁ బొల్పడియె మామాడ్కిన్మముంగోరుకై
రవణీశోకము చెంగలించె నదిచంద్రప్రేమ మన్మద్విలో
కవిస్పష్టంబనిజారలాడ నడరెంగాఢాంధకారచ్ఛటల్.
శా. ఆవేళ న్నిజకామినీ కరగృహీతాభీలదండావనీ
జావాలీకృత బాహుమూలుఁడు మహీయఃకంబళాచ్ఛాదితుం
డావిర్భూత కఠోరరోషుఁడయి యాత్మకల్పితోర్వారువ
న్యావీరుజ్జ్వలితోత్పలావన పరుండమ్మందరుం డుండఁగాన్.
వ. ఘటకుఁడు పంపఁగా నరిగి కంపవెలుంగు తలంగఁద్రోచి యు
ద్భటగతి బుద్ధిసాగరుఁ డటుం దారునఁ గర్కటికాఫలాళిఁ జా

---

*గీ. అనిన విస్మయమంది యయ్యశ్వరత్న, మెంత తార్కాణగాఁ జెప్పె నితఁడటంచు
నెంచి యాహారవేళఁ దలంచువాఁడ, ననుచు నమ్మికలిచ్చిన నాక్షణంబ.
క. చని సుముఖుం డధిపతితో, ననఘాయీయశ్వమునకు నవగడమగున
ట్లొనరించి వేగవచ్చితి, నని తెలిపెన్రవియుఁ గ్రుంకె నాసమయమునన్.

పుటయుఁ దురంగము న్మానవెఁ బో లతిక లైగిపోఁ బత్రముల్
త్రుటితములై పడం బృఘులతుండము భూస్థలి సోఁకునట్లుగన్.

గీ. అంతసుముఖుని దలఁచి యయ్యశ్వరత్న, మలఘుహేషారవంబునఁ బిలుచుటయును
నిదియె పండ్లెల్ల దినిపోయె నేమెఁ యనుచు, మందరుఁడు కోలఁ బేఁ బఱమార్చె దాని.

క. ఇటువలె నొగిలి తురంగం, బటునిటు వడి పాఱిపోయి యస్మద్ధ్వనియే
మిటికిం జూపితికట యని, చటులవ్యథఁ గుందె మహీభుజా వింటికదా.

క. కావున నేఁడెల్లను నీ, భావంబున నరయు మెఱుకపడకుండినచో
నీవిధమని జలచరహా, సావిర్భూతికిని హేతు వమరవచింతున్.

గీ. అని నియోగితనూజ యయ్యధిపుఁ డనుప, నిలయమున కేగ నని చిల్కపలుకఁ గమ్మ
తమ్మినెత్తావి తెమ్మెర ల్గ్రిమ్ముటయును, నలప్రభావతికేళీగృహంబు జేరె.

ఉ. అంతఁ గ్రమక్రమంబున నహస్కరబింబము పూర్వశైల సౌ
ధాంతహిరణ్యకుంభము విహాయన మండలనామ ఖేటకా
భ్యంతరధాతురాగముపరాఁద్రివిమానవితానితాతిదు
ర్దాంతవిభావిభావ్యముకురంబును నై జలరాశిఁ గ్రుంకినన్.

సీ. అద్దంబులోఁ దోఁచు వజ్రరేఖయనంగ మోముపైఁ దెలినాభి నామమమరఁ
దలిరాకుపై మొగ్గ నలరు మొగ్గ యనంగ మోవిపై ముక్కఱముత్తె మమర
వలమురి పై నంటు జలధిపంక మనంగ గళముపైఁ గస్తురి కప్పు మెఱయఁ
గాలాహిపై మించు కంచుకంబో యనంగ జడమీఁద ముడి పూవునరము లూరయ
లతనుదోహదధూమము ల్గప్పుకరణి, నంగయష్టికనీలసంవ్యాన మెసఁగఁ
గదలి యేతెంచె రాజసంగమసుఖైక, పరతఁ జెంది ప్రభావతీపద్మగంధి.

ఉ. వచ్చినఁ జూచి కీర మనివారిత చాతురిమీఱ నారి నీ
యిచ్చ గణాధినాథు గణియింపు తదావృతి లేకయున్న నీ
వచ్చటి కేగుకార్యము రయంబునఁ గూడదు చిత్తగింపుమా
తచ్చరితం బటంచు నుచితంబుగ నెచ్చెలి నిల్పి యిట్లనున్.

గీ. అంతమఱునాఁడు విక్రమార్కావనీశుఁ, డలయమాత్యతనూజాతఁ బిలువఁబనిచి
చనవరులు చెంతఁ గొలువనాస్థానసీమఁ, జేరి సింగఁపుగద్దె నాసీనుఁ డగుచు.

గీ. తెరమఱుంగునఁ గూర్చుండి తేనెవాన, ప్రబలఁ గథఁజెప్ప నేర్చినబావనమ్మ
యిప్పుడైనను దెల్పుమా యేలనవ్వెఁ, బక్వమీనము లనుఁడు నప్పడఁతి పలికె.

క. అడుగం గూడని కార్యం, బడిగెద వట్లైని మును గజాస్యునితో వా
దుసుగక యొనర్చి పిమ్మట, యడలిన వటమునవు నుద్ది యగుదువు సుమ్మా.

—కలువయుపకథ—

చ. అరిమొలు లంటివేని విన మాహురీశాహురి నుండి పన్నగాం
గదుని నివాసమై యలరు కాశికిఁ బోయెదుత్రోవ నీడపు
ట్టను గద నాఁగ మించిన యెడన్నొకచో నొకశేఁతమఱ్ఱియ
భ్యుదయము నొందసాగెఁ దఱి నొందినవానలచేత నంతటన్.

గీ. అధ్వగులు కోడిగములకై యాకులెల్లఁ, ద్రెంచి శాఖావితానము ద్రుంచిపైవ
మోడుపడియుండె నదినిల్వనీడకట్టు, గొవ్వుమయునుజేమితనయందుఁగుదురుకొనఁగ.

గీ. అంత నొకశైవుఁడాత్రోవ నరుగువాఁడు, కెలని కొలనున నాహ్నికక్రియలు దీర్చి
చెంతఁబడియున్న జాయిమాచెట్టు మొదటఁ, జేర్చి విఘ్నేశుఁడగుచుఁ బూజించి చనిన.

క. అది మొదలుగఁ దెరువరులిం, పుదలిర్పఁగఁ దెచ్చితెచ్చి పుడిసెఁడు నీళ్లుం
బదియొను గఱికి పోచలు, గదియించి చనంగ నచట గణపతి నిలిచెన్.

సీ. పాల్పొంగి పఱవలై పాఱఁ జెంగటి యూళ్ల కాపుగుబ్బెతలు పొంగళ్లువెట్ట
నీళ్లువెల్లువగట్టి నికటాగ్రహారధరాసురుల్నారికేళములు గొట్ట
యుండిగళ్లిండఁ బొన్నాళ్లు కేగెడు జెరులకలంకభక్తిఁ గానుకలు వైవఁ
గుప్పగాఁ దెరువాట్లు గొట్టెడు పెనుదొంగ బంటులాదాయంబు పంచియొసఁగ
నీడపందిరి చెంత గన్నేరుతోఁట, నమ్మిపూజించు గ్రొత్తకోణాచినంబి
పొంతనిచ్చిన దారువిభూతిపాత్ర, మమరఁ గనుపట్టె నచట విఘ్నాధినేత.

సీ. తనువలంచినవేళ ధరణీధరకుమారి పాలిండ్ల బోరునఁ బాలు గురియఁ
బొడఁగనవచ్చు వేల్పులజేని కరిఁ జూచి దాక్షాయణీభర్త తన్నుఁ దలఁప
మానసునిల్వమి నెమ్మి మాపునై వయ్యాళి మన్నీఁడు తనుఁజూచి మరలిపోవ
మముఁ బిల్వఁబంపు కొమ్మా యని ప్రమథసంఘమ్ములు తన పేరఁ గవ్వములను ప
నతులకైలాసలీలాగృహాంతరాళ, కేళికాపాళికలును గపోల మరిచ
కాయమానమహాచ్ఛాయజాయమాన, మేదురామోదుఁ డయ్యె లంబోదరుండు.

క. ఆతనికి వెలిచి పత్రిక, వ్రాతము తనుఁ జెనకకునికి వటభూరుహమా
త్యాతతశాఖాగ్రవసద్యోతటినీహంసికాసముత్కర మయ్యెన్.

వ. ఆసమయంబున.

సీ. పాటలావనిజాతపటలదోహనము కాసారార్ధ్రజలకుంభజన్మమూర్తి
సహకారశుకభారసాధారకరణి వన్యానంగశాలిఘాలాక్షుషిత్త
శాల్మలీఫలపండ్రసంఘట్టనంబు దక్షిణమరున్మనహస్తిసింధురుతము

పథికప్రపాంగణప్రాపకశ్రాంతజనము నాఁటికి కానిమ్న గాఢఘటకటీమ
మహితశైత్యవహనస్తనమార్గవర్తి, చటులజంఘాలవాత్యాళిజనితవేళ
తాలవృంతాదమూల్యప్రదాయకంబు, పసరు సంతప్తజనము నిదాఘదినము.

మ. తురగాస్యోత్థిక్రిమికల్పితద్విగుణితమహోగ్రాంబువాహంబు వేఁ
జరమార్గాగతిమైన గాలి కెదురై నాగోజ్జ్వలస్యంపితం
బు రహింగ్రాఁగ గుమారు గాలిపటముం బోలెం దపినెల్లనే
తిరగంగా నిటులయ్యె నాఁగ దినము ల్దీర్ఘంబు లయ్యెం గడున్.

చ. పడమటిగాలి వెట్ట నొకసారియుఁ గ్రోలమి నీరసంబులై
జడిసిన చిల్వగుంపు లొకసారియు మ్రింగమి పొమ్మసిల్లి మ్రా
న్పడినగుటాని నొల్లని ధనాయునికిం దనవాహనంబులం
బడిబడి యుంపెనో యమురభర్త యనం దనె దాఘఘర్మముల్.

మ. జలజాప్తోగ్రమయూఖపుంజకుముకిస్వప్రాశ్వకాంతోపల
మ్ములసోఁకించి తిదుగ్ధతాగ్నులనముం బోధించి వాత్యానవా
నిలవేగంబునఁ గాలుకొల్పి పతిగాసికంబు పాకంబుగా
నలరించె న్నమయాఖ్యపాచకుఁడు భూతాహారసంప్రాప్తికిన్.

మ. జలమింక న్నయనంబు లాతపభయశ్రాంతంబులై మధ్యసం
ధ్యలనుం దోఁచని యంబుకేళిక యుప్రాతర్వ్యాసరాపోదయం
బులఁ గాన్పించె ననంగఁ దీరనగరాంభోజాతనీరాకరం
బులు నీరార్చుటకైన బల్చెలమల న్వెల్వొందె నవ్వేసవిన్

గీ. దారుణారుణకిరణసంతాపదశల, ననుభవింపఁగఁ జాలక యంబుదములు
మెఱుపులుఱుములుదొరఁగిభూమిపనికాయ్య, దేశములకెల్చెధూమంపుఁదిత్తులగుచు.

క. ఆవేసవి నిష్కాసితుఁడై వసుధాదేవుఁ డొక్కఁడాత్మపురీ యా
త్రావేశితకుతుకంబున, వావటము న్నట్టిత్రోవ నరుదెంచె వెసన్.

సీ. గమనవేగంబునఁ గావిడి వెనుక వెక్కసపుఁ బ్రోఁతలఁ గిఱ్ఱుకఱ్ఱుమనఁగ
నగళికరోటి పై బిగియఁ జుట్టిన పటాంచల మింత గాలిచే సంచలింప
సరకులుంచిన మాత్రసంచిలో నంటగట్టిన యట్టి నేతిలడ్డిగ దవర్పఁ
గొనలెత్తి కడియఁజెక్కిన కావిధోవతిపైఁ గట్టుకొన్న కంబళి యొసంగ
నాతపగ్లానిచే నీడలరయఁ బాఱి, గాఢపిపాస నిరాశచే గ్రమ్ముకొనఁగ
వచ్చివచ్చియతండు దుర్వారపుణ్య, శక్తిపాత్రపమైన యవ్వటముఁ జేరె.

వ. చేరి తద్విశాలపానీయశాలాంతరంబునం బరికీర్ణోశీరతాశీతలం బగు భూతలంబున విశ్వాసోచితవచనముఖరుం డగుచు విపథంబు డించిన విధంబునం గంబడి పఱచి సుఖాసీనుండై యచ్చోంగటం గూడిన యధ్వనీనులవలన యాచితోపలబ్ధం బగు తాంబూలంబునం బరితుష్టుండై యందు సందంబగు పండిటక్కోరణంబుగా హత్తించిన పసుపుటాకులగుత్తుల కత్తమిల్లు సెత్తావుల మొత్తంబులు తోలప్పంతంబులై దిశాభిత్తికల నొత్తుకొనుటకుం బ్రమోదాయత్తచిత్తుండగుచు దట్టంబుగా నట్టులం బెట్టిన సారంబు లగు ఘృతక్షీరపూరంబుల నగ్గలిడి యగ్గలపునిగ్గులు గల పాలబుగ్గలు ముద్దాడి నిద్దంబులై వ్రేలు వైణవడోలికల బాలకుల నునిచి జోలలు వాడుచు నిజమందిరాంగణంబునం బోలె మెలంగు పథికాంగనలం గనుంగొని యాశ్చర్యధుర్యుం డగుచుం జెంగటం జెలంగు నికుంజపుంజంబులం బరిచారికలు సూపాన్నశాకంబులు పాకంబులు సేయునంతకు నిద్రాముద్రితులై సమయంబగుటయుం గెలంకునం బొంకంబగు కొలంకున నకలంకంబులగు జలంబులం దోంగి సుస్నాతులై వచ్చి యచ్చటి శాయమానంబుల నాలంబమానంబు లగు గోపీచందనశ్వేతమృత్తికాదులు మతానుసారంబుగాం దాల్చి చను నధ్వన్యమాన్యుల నాహారంబు లడుగు తెరువరుల దీనాలాపంబులకు దుర్వారనిర్వేదంబు నొందుచు నపారపిపాసాయాసులై చెరి తదీయాధికారి దత్తామలకపూర్వకంబుగా శీతలోష్ణోదకంబుల యథాభిలాషంబుగం గొని ప్రసంగవశజనితంబులగు రాజకార్యంబులం బక్షాపరపక్షంబులు వహించి పోరాడు గ్రామీణుల నిరర్థప్రయాసంబునకుం దరహాసంబు సేయుచు దధితక్రవిక్రయంబు లుపదేశమాత్రంబులుగా జారాన్వేషణంబులు ప్రదానకార్యంబులుగా సమీపజనపదంబులనుండి వచ్చియున్న యాభీరభీరువుల పరిభాషల భావం బెఱింగి యంతరంగంబులం గరంగి మార్గశ్రమంబును దినావసానప్రవాసల దూరంబులును విచారింపక తదాసీనులై సంకేతలతాగృహంబుల కరుగుకుమారపాంథుల వయోమదాంధత్వంబుం దిలకించి యించువిలుకాని యకాలశౌర్యనిర్వాహణంబునకు మెచ్చుచు నత్తైర్థికుండు పూర్వరాత్రంబునం బ్రయోజనవశంబున జాగరూకుండై యుండుటం జేసి శయనించి నిద్రాముద్రితనేత్రుండై యుండునంత.

గీ. తత్ప్రపాంతరజనుల సంతాపదశల, పాలుపడని తనప్రతాపంబు రోసి
కొంచెపటచెనో రవినాంగం గోష్ణమయ్యె, నతులయామశయానాంతరాతపములు.

గీ. అప్పుడచ్చటం గూడిన యధ్వగాళి, చనియె నిర్దిష్టనగరవిశ్రాంతినొంద
ప్రొద్దుగ్రుంకినం బిట్టారిపూజ సేయు, బ్రాహ్మణుండును జెంగటిపల్లె కరిగె.

ఉ. అంతట మేలుకాంచి వసుధామరవర్యుఁడసార్యనిర్గత
ధ్వాంతము నధ్వనీనరహితత్వముఁ జూచి దిసల్లనింపలో
నెంతయుఁ జింతనొంది తెరువెక్కడనో కనఁగూడదీడ నే
కాంతముగాఁగ నిల్వఁగ భయంబగుచున్నదటంచు ఖిన్నుఁడై.

క. అంతవిచారించియు ఘన, సంతమసముకతన వెడలి చనరామినతం
డంతిక తటాకమున సా, యంతనవిధిఁ దీర్చివచ్చి యతిభయ మెనయన్.

శా. గంగే ఢుంఠి గణేశ భైరవ మహాగౌరీపతే పాహియం
చుం గాశీపురి వేల్పులం దలఁచికొంచుం బవ్వళించెం దటో
త్తుంగాత్యాతతశాఖికిందఁ దనకుం దోడేమియున్లేమినా
నంగాఁ జోరభయంబు చీమచిటుకన్నం గావడిం జూచుచున్.

గీ. ఇట్లు శయనించి నిద్దురయైనయతనికి, వమ్మహీజమ్ముఁ జూఁచి వృక్షాగ్రగణ్య
యలగయానట మైన నీయంతగలదె, నిన్ను మావంటివారు వర్ణింపఁగలరె.

గీ. నద్విజాశ్రయములు భవచ్ఛాఖలెల్ల, నిబిడవర్ణాత్మకంబులు నీదుజడలు
హరిగతిప్రతిపాదినీయగ్రిమరయ, నీమహాగమ విఖ్యాతి నెఱయ మెఱసె.

క. నీనీడఁ జేరుకతనన, హీనతరఖ్యాతిఁజెంది యీసుమవూజల్
బోనములునడపఁగా నీ, యేనుఁగుమొగమయ్య వెలసె నిచ్చట ననినన్.

చ. అలరమహీరుహాగ్రిణి నిజాగ్రసతిప్రభయంకరంబుగాఁ
గలకలనవ్వి యోబుధశిఖామణి నీఘణితంబులున్న వే
చెలఁగితి నీదునీడ వెలసెం గణనాయకుఁ డన్నమాటకున్
భళిభళి నిశ్చితార్థమతిభంగికి మెచ్చుమి దోష మొందదే.

క. అనుమాటకు శైలసుతా, తనయుఁడు కోపించి మంచితగవా నేనిం
దునికిన్నివిటు ప్రబలితి, నినుజేరుట వెలసినాఁడనే మహీరుహామా.

క. మును పున్నయునికిఁ దలఁపక, నను జేరుటకతన వెలసినాఁడీగణరా
జనిపలుకనొప్పరెటులా, డెను సిగ్గుజనింపదేమొ డెందములోనన్.

గీ. అనినఁ జలపాదియై పాదపాగ్రగణ్యుఁ, డిట్లనియెఁ దైర్థికుండౌర యట్టివేళ
పిరికలవాంబుకతమున వెఱపులేక, యుండఁగన్గాఁగ దాయని యూకొనంగ.

మ. జలరాశింబవళించు శౌరి సుదరాంచల్లోకచాతుర్దశీ
కలితున్నగ్నకయుండఁ బత్రమున విఖ్యాతంబుగాఁ దాల్చి మాఁ
ఘులలో వగ్రగణ్యతందనరు నాకున్నీవుపాత్రవన్న సి
గ్గులచేటింత యెఱుంగ కాడితివి నీకుం బాత్రుఁడై యుండఁగన్.

క. వానిఁడ నిలుము పక్షికులు, కానుకగాఁ గొన్ని యొసఁగఁగాదే మతినీ
కీవడవి గలిగెన్నేఁ, గానవు మత్కృతమహోపకారము సుమతీ.

మ. అని లంబోదరుతోఁ బటం బతికుతర్కాలంబమై యున్నచో
నివబింబంబు నయుంబుఁ గాంచుతతి నాపృథ్వీసుపర్వార్యుఁ డా
త్మనగర్యావరధుర్యుఁడై యరిగె నంతం బద్రిమాఖర్వగ
ర్వనిరాసంబున కంబికాసుతుఁడు దుర్వారప్రభావమ్మునన్.

మ. హితపూజాపరుఁడైన భూసురునితో నేనిచ్చటన్నిల్వ నేఁ
డతినమ్మానముతో స్థలాంతరసపర్యాలోలతం బోయెదన్
మతిఁ జింతింపకు మంచుఁ బల్కి తలఁగెం బానీయశాలం బడెం,
బ్రతివేళాగతపాంథవేధవటముం బ్రాగ్రూప మొందె న్వెసన్.

క. ఆవెనుక నేలతొడరితి, దేవునితో ననుచుపటమతివ్యథఁ జెందెన్
భూవల్లభ వింటివికద, యావగయుగుదీవు నన్ను నడిగితివేనిన్.

క. అటు గనుక నీవె తెలియుము, పటుగతి నేఁడెల్లఁ గానఁబడకుండిన ని
చ్చటి కెల్లివచ్చి తెలిపెద, ఘటియింపు మనుజ్ఞ మన్నికాయంబునకున్.

గీ. అని ప్రధానతనూజగేహమున కరిగె, ననుచుఁ గిరంబువల్కి సుధాంశుకాంత
నికరములనీరు జాఱక నిలువఁ జూచి, యాప్రభావతి క్రీడాగృహంబుఁ జేరె.

క. క్రమమున భావ్యుఁడంతటఁ, గమలాసీనుఁడయి కమలకరుఁడై కమలా
రమణీయుఁ డగుచుఁ గ్రుంకినఁ, బ్రమదాంబుధి దేలఁ యాప్రభావతి బాలిక్.

గీ. రాజవిరహప్రభావతికచ్యుతంబు, కృతసఖిప్రార్థనాశతాంగీకృతంబు
నైనభూషణచయము నేపైనదనినఁ, జేరఁ జనుదేరఁ జూచి యక్కీరవరుఁడు.

గీ. అమ్మనినుఁ జూచినపుడెల్ల నయ్యమాత్య, తనయతలఁపునఁ బాఱెఁడు దానినైపు
ణీవిశేషంబు వినుమంచు నిలువఁబట్టి, గట్టిచలముట్టిపడ నెట్టిపట్టి కనియె.

క. తనుమదిఁ గనఁ జాలకయ, త్యనుపమమగుచింత విక్రమార్కుఁడు పిలువం
బఱిచిన యమ్మఱునాఁడుం, జనియెన్నవబుద్ధితనయ నవినయగరిమన్,

వ. అని యథాపూర్వంబుగా నాసీనయై మానహాసకారణాజ్ఞాసాధీనుండైన యమ్మానవా
ధీశ్వరుం గుఱించి యాస్థానంబునం గల జనంబులు నిజమధురవచన సుధాసారంబున
కుఁ గర్ణాంజలిపుటంబు లొగ్గ నక్కాంజనయన యిట్లనియె.

గీ. పరులు దెలియంగరాని యీపరమగోప్య, మైన కార్యంబు నీవు నన్నడిగితేని
నృపతి జారుల కెడసినచపల యనెడి, కాంతతో జంట యగుదు వాగాథ వినుము.

## ఏడవయుపకథ.

క. సౌరాష్ట్రభూమిలోపల, గౌరవుఁ డనునృపతి యేలఁగాఁ దగు విభవా
ధారంబను పురిఁ గథకా, ఖ్యారాముఁడొక్కభూసురాగ్రణి వెలయున్.

సీ. అలికి ముగ్గులు వెట్టినట్టి తిన్నెలు కంచు బోరుతల్పులు పాలవోసిచాల
యార్చునచ్చువనంగ నొనరు చావడి తాళువారంబు చిన్నిగవాక్షలమరు
వంట కొట్టును చిలువాన మించిన మిద్దె పట్టెమంచముతోడి పడుక యిల్లు
పడసాలముంగిలి పందిరి పసిగాడి కాయధాన్యములున్న కణజములును
బెరటిలో నారికేళ జంబీరముఖ్య, నిఖిలఫలవృక్షములు మంచినీళ్లబావి
యమర నయ్యింట నిత్యకల్యాణములును, పచ్చతోరణములు మించఁ బరఁగునతఁడు.

గీ. అతనిప్రియ పుత్రి యగుచపలాఖ్యయొకతె, పేర్మిఁబోషింపనాటఁ బెండ్లికెదగ
మునుఁడు మఱచినసాము వేమఱుఁ జేయుఁ, దలఁచిసావనగరడిలో దట్టిఁ గట్టి.

క. అంతట నక్కన్నియనొక, యంతర్వాణికి నొసంగి యుక్కథముఁడు గే
హాంతమున నిలిపికొనియు, న్నంతట మోదము జనింప నాదంపతులున్.

క. ఆరీతినుండు నంతట, నారమణీమణికి యౌవనాగమ మొదవం
గూరిచిరి వరునితోముద, మూరఁగఁ దలిదండ్రులొక మహూర్తమునందున్.

క. ఆరేయిచపలముగనిం, జేరుటయేకాని యేమిచెప్పకలోకా
చార మెఱుంగని యాతని, గాంచి మొక్కింత యైనఁ గానక చనియెన్.

క. దినదినము నిట్టులూరక, చనిచని యామీఁద సిగ్గు చాలించి ముదం
బెంయం బైకొని చూచియుఁ, గనదయ్యె నాపని సురతకాంతుఁగుణమున్.

సీ. తలుపు చెంగటఁ గొంతనిలిచి యాకర్షణశ్రీలేమిఁ దనుదానచేరసరిగి
క్రముకఖండము లీయఁగాఁబోయి సంగ్రహోన్మేష లేమిని శయ్యమీఁద నునిచి
కదిసి పానము లొత్తఁగాఁ బూని యంగీకృతిస్ఫూర్తిఁ గనమి భీతిల్లి లేచి
ప్రేమగన్పడఁ బల్కరించి ప్రత్యుత్తరస్థితిగానఁబడకున్న జిన్నఁబోయి
శాస్త్రపాత్రక్రమానంతజాడ్యుఁడైన, ధవునిగని యుస్సురంచును దలుపుమూసి
గుబ్బకవమీఁది పయ్యెదకొంగు పఱచి, నేలఁ బవళించు మగువ కన్నీరు దొరఁగ.

సీ. కవగూడి యెడఁబాయఁగా లేని మిథునంబు కాంక్ష వీక్షించి యేకారఁదోడఁగు
నన్యోన్యమైత్రి నయ్యాటలాడెడు పశ్వాదులవేడుకకు భావమునఁ దుఃఖ
భాగ్యంబుగల సతీపతుల నిర్భరరహఃక్రీడలకెల్ల గుర్రికిల్లు మిగుల

మదనకేళీపరిమ్లానాంగులగు దంపతుల యం దమునకుఁ గొందలముఁ జెందు
నర్థినిర్వక్రితవుణ వయోమదాంధ, గంధసింధురగమనలఖండసౌఖ్య
మెంత గల్గియునంభోగహీనమైన, నెట్లు భరియింపఁగలరు మహీమహేంద్ర.

క. పగలెల్ల నింటిపనులకు, నగపడ నొకరీతి మఱచియైనను నుండున్
మగువ నిశాముఖమైనం, దిగులుపడు న్మగని వగగణించుచు మదిలోన్.

సీ. పట్టికాఁపురమింత రట్టాయెఁగాయంచుఁ దల్లి పెల్లగువంతఁ దల్లడిల్లు
బాయాబహుజ్ఞప్త జామాతృజామ్యుఁడై తండ్రి యందంద డెందమునఁ గుందుఁ
గోధిత మొందిన న్ననఁ గొడుకు దుర్గుణమెంచి యత్తమామలెత్తు మాటాడ వెఱచుఁ
దాఁజెప్ప చదువులింతకుఁ దెచ్చెఁగాయంచు మామ యే మన లేక మోము వాంచు
మర్మమెఱుఁగని వార లిమ్మగువకేమి, యొచ్చమున్న దోకో మగఁ డొల్లఁడనుచు
నాడుకొనఁ బొత్తు రక్కటా యాఁడుఁబుట్టు, పుట్టరాదుసుమా లోకమున నరేంద్ర.

గీ. ఇట్లు వర్తింపనొక్కనాఁ డిరులుగవియ, వేళఁ గార్యాంతరాపేక్ష వెంటఁబడఁగ
నింటివారికిఁ జెప్పక నేగెఁ జపల, మగఁడు పొరుగూరికై బుద్ధిమంతుఁ డగుట.

క. ఆరేయి వానిచెలికాఁ, డారాధ్యుఁ డనంగఁబరఁగు నాతండుతదా
గారమునఁ బడుక యింటను, దారతదాగమనకాంక్షియై పవళించెన్.

గీ. అంతఁజపలావధూటి నేఁడైనమంచి, బుద్ధిపుట్టదె మగనికా పూర్ణదైవ
కరుణనని కేళిగేహంబు గదిసియచట, వానినిజనాథుఁ డని మదిలోన నెంచి.

శా. చేరంగాఁజని యక్కటా యధిపమీచిత్తంబు రాఁదన్న నీ
పేరీతింబద సేవ సేయుమని మీరేనన్ను శిక్షించి యే
నేరంబైన సహింప భాగ్యముగదా నిష్కారణం బిట్లు నా
పేరన్న న్మదిఁ గంటగించెదరు పెంపేమీకు నన్నేఁచుటల్.

క. అని దైన్యముతోఁ బలికిన, వినియాతఁడు మదనవిశిఖవివశుం డగుచున్
మనుదాని తెఱఁ గెఱుంగుట, నెనసినతమి సురతకేళి నింపుఘటింపన్.

క. ఆ వెనుక మగఁడు గాఁడని, భావంబునఁ దెలిసి సిగ్గువడి యంతటిలో
దైవాధీనం బిది యని, భావించుచుఁ జపలమృదులభాషల ననియెన్.

గీ. ఇంత మోసంబుఁ జేసినాయీలువెల్ల, నపహరించితి విఁక నేమి యైనకార్య
మయ్యె నేకద యీరీతినను దినంబు, నన్ను మన్నింపకున్నఁ బ్రాణములు విడుతు.

క. అనిపలికె నదియు మొదలుగ, వెనుదీయక యుజ్జయైన వేళల నెల్లన్
జను దెంచు వాని రతిన, వ్వనితామణి తనివిలేక వర్తిలఁ దొడఁగెన్.

సీ. భర్తృఁడు ప్రాతరౌపాసనాగ్ని యొసంగి దుడుకుఁగా ముంగిటఁ బొంగి చూచు
నాయకునకు మజ్జనజలంబు ఘటియించి తాపియింటికి నేగితడవు చూచు
ధవుని చెంగట నిష్టదైవపూజ కమర్చి తలవాకిటికిఁ బోయి నిలిచి చూచుఁ
బతికంచమున శాకవితతులు వడ్డించి నిలువఁగూడక గోడసిక్కి చూచు
నెంతబాళియొకాక యయ్యిందుముఖికిఁ, గూర్మి నారాధ్యు రాకలు గోరుటొకటె
కాని ప్రాణేశు పరిచర్య కానివావి, యయ్యొ నేమందునయ్య యయ్యతనుమహిమ.

సీ. శివితో నేటినీటికిఁ బోవుచో వెంట వెంటవచ్చితిఁ జుమా విద్రుమోష్ఠి
పొరుగింటి చెలిఁ గూడి సరసము ల్పలుకుచోఁ జెంత నిల్చితిఁ జుమా దంతిగమన
ముంగిటజననితో ముచ్చటలాడంగ నిక్కి చూచితిఁ జుమా చొక్కులాఁడి
పడుకయింటికిఁ జెలుల్ప్రార్థించి యనుపుచోఁ దలుపుమాటితిఁ జుమా తతనితంబ
యనుచు నారాధ్యుఁ డొంటిపాటైన వేళ, నవ్వధూమణితోడ మోహంబుఁ దెలుప
నప్పడంతియు నవి నీవు చెప్పనేల, వినరనా కన్నులెందున్నవనుచుఁ బలుకు.

క. ఈరీతినుండు నంతట, వారల యందములు నవనవలుగా విని య
య్యూరెల్ల గుజగుజలఁబో, జారునితోఁ జపలతెలుపుఁ జాంచల్యముగాన్.

క. వచ్చెఁగద పెడఁద మనకిఁక, నిచ్చట నడయాడఁ గూడ దెటకేనియు నే
వచ్చెద రమ్మటులైన, న్విచ్చలవిడి నడువవచ్చు వెలిపల మదిలోన్.

గీ. అనిన భయమంది యాతఁడో యబల యింత, సాహసక్రియ చేయంగఁ జను నె మనకు
ననుచు వారింప వినకది యతనిఁ గూడి, యరిగెఁ దెగియించి నిర్భరసురతవాంఛ.

శా. ఆరీతిం బహుదేశము ల్గడచిపో నారాధ్యుఁ డాత్మాంగనం
గారాము ల్దలపోసి యొక్కయెడ నిక్కట్టైనచో దాసినా
నారత్నోజ్జ్వల భూషలూడ్చికొని యానందంబు తోడం బురిం
జేరెం దచ్చపలాక్షియు న్వగవఁ జొచ్చెం గార్య మిట్లౌటకున్.

గీ. వింటివా విక్రమార్క యవ్వెలఁది సేయుఁ, దగనికార్యం బొనర్చి దుర్దశఁ గృశించె
గాన నవ్యుల నడుగఁగా రానిమీన, పాపహేతువు మఱినీవె యరసికొనుము.

చ. తెలియఁగఁ జాలకున్న వచియించెద నోపని యింటికేగ న
చ్చెలువయటంచుఁ జెనియలు చిల్కఁగఁ జిల్క వచింప నంతలో
బలబల వేగవచ్చినఁ బ్రభావతి కేళిగృహంబుఁ జేరి చం
చలమతి నాఁటిరేయి నృపచంద్రుని పొందికిఁ గోరిచేరెఁగన్.

గీ. చిలుక వీక్షించి కలదు విచిత్రగాథ, యది యగాధసరోజగాగాధరోష్ఠి
యనుచు వచియింపఁ బొడఁగె భాషార్థ్యమాన, మధురిమాధురీణత సాధురీతి.

గీ. చేరి యెన్నికథలు చెప్పినఁ గనలేఁ, విక్రమార్కధరణివిభుఁడు పిలువఁ
బరుపనేగి మంత్రితనుజాత తత్సభా, ప్రాంగణమునఁ దొరమఱుంగుఁ జెందె.

గీ. తనదు కథలకుఁ దరళికాతరళనయన, యాదిగాఁగల్గు నంతఃపురాబ్జముఖులు
పుష్పహాసప్రముఖ మంత్రి పుంగవులును, వచ్చి యుండుటఁ దెలిసియవ్వామనయన.

మ. సభవారెల్లను సద్దుమాని వినుఁడీ సర్వంసహామండల
ప్రభుతోఁ దెల్పెద విక్రమార్కనృపచంద్రా సావధానంబుగా
శుభదం బీకథఁ జిత్తగింపవలె నంచుం దెల్పఁ జొచ్చె న్స్మర
ద్రథకేళీవనికామరందరసవాచాప్రౌమణీచాతురిన్.

## ఎనిమిదవయుపకథ.

క. గంధవతీనామకమున, సుంధర నొకపురము కరము శోభిలు భాస్వ
త్సైంధవచయాతిపత్రిత, బంధురమణిసౌధకేతుపటపటలంబై.

క. అనగరరత్నమేలు, న్ఘనధనుం డనఁగఁ బరఁగు మానవపతి తత్సూనుం
డభిమానధనా, ఖ్యానవనీశుండు వెలయు నధికప్రజ్ఞన్.

గీ. ఆతఁడు జనకుని వెనుకఁ బట్టాభిషేక, మవధరించి నిజామాత్యులాప్తకోటి
యనుదినంబును విన్నవించిన వివాహ, మొల్ల నని నిస్పృహుండయి యుండె నంత.

క. చరపరులంపఱు నొకనాఁ, డనఘా కల్యాణమొల్ల ననుకారణమే
మని యడిగినవారల దెసఁ, గనుఁగొని యభిమానధనుఁ డకల్మషఫణితిన్.

క. ఇట్టిది యడుగనె తగదీ, పట్టున మీకెఱుక లేక పలుమాఱు మొఱల్
వెట్టెదరు గానఁ దెలిపెద, గట్టిగఁ గామినులవల్ల గారాదు మదిన్.

క. పురుషజనవంచనార్థము, సరసిజ సంభవుఁడు తనదు సామర్థ్యముచే
నిరుపమముగ నిర్మించెను, దరుణులమాయోపజీవితాచణగతులన్.

గీ. జవ్వనము రాకమును పె విశ్వప్రపంచ, మంతయును వ్యగ్రత మొనర్పియడఁచికొందు
రేమి యెఱుఁగని కరణి సహీనబాల్య, చేష్టఁ బ్రకటింతు రవనిరాజీవముఖులు.

సీ. చిన్నారిచన్నుల కన్న మున్నుగఁ దోఁచు లోకప్రమోహనలోలచింత
కలికిచూపులవాఁడికన్న మున్నుగ మించు గురుజనోజ్జ్వలత్పృణీకరణపటిమ
కటితటీచక్రింబు కన్న మున్నుగఁ దీఱు నన్నృతవాక్యస్థాపనాత్మశక్తి
చిన్నారు నైమిన్న కన్న మున్నుగఁ బొల్చు జనవిస్మయప్రదసాహసంబు

గాఁక చాతుర్యధుర్యతకన్న మున్నె, ప్రౌఢమై గంభీరజారరస భోగవాంఛ
కనులను ఖలకు యౌవనాగమము కన్న, మున్నె గాఁగల్గు పాపనమూహ మెల్ల.

క. పెక్కులుగలవాఁడైనం, జక్కనివాఁడైన రతులఁ జతురుం డైనం
దక్కరు మగనికి నిక్కం, బక్కట జారునికిఁ దక్కినటువలె యువతుల్.

క. మగువలు గరగరికై తగు, మగవానిం జూచి వీఁడు మగఁడైనఁ గదా
తెగదుఃఖం బనుకొందురు, దిగఁగాఱుచు రేపుడు నెమ్మది న్వారిమగలన్.

సీ. గజకర్ణముల కింత గల్గినఁ గల్గనీ కలికి నెమ్మదికి నిల్కడలు లేవు
కమలమూపున కింత గల్గినఁ గల్గనీ కాంత నెమ్మదికి నిల్కడలు లేవు
చలదళంబులకింత గలిగినఁ గల్గనీ లలన నెమ్మదికి నిల్కడలు లేవు
శారుమింమున కింతగల్గినఁ గల్గనీ పడఁతి నెమ్మదికి నిల్కడలు లేవు
జలదముల కింతగలిగినఁ గలుగనిమ్ము, కమలనేత్రల మదికి నిల్కడలు లేవు
కావున వధూటికల యిచ్చకంబు లెల్ల, నిశ్చయించిన మగవాఁడు వెఱ్ఱివాఁడు.

క. బిసరుహనయనలు మాయా, ప్రసరిల్ మఱి వారిపొందు గారాదె కదా
యసమానమనీషాఢ్యులు, వసియింతురె యాఁడుఁబ్రతిమ వ్రాసిన యింటన్.

క. కావున వివాహవిమ్మతి, గావించితి ననుచుఁ బలుకఁగావార లయో
దేవా సర్వజ్ఞుఁడ విటు, లీవాక్యము లాడవచ్చునే యివ్వేళన్.

గీ. ఎంచి చూచిన నూటవెయ్యింట నొకతె, గాక సతు లెల్ల జారసంగమసుఖైక
పరతఁ జెందిన వాన లేకరణిఁ గురియుఁ, బంట లేచందమునఁ బండుఁ బార్థివేంద్ర.

క. ఇలువరుసయు మానువమును, గలరాజుల యిండ్లఁ గన్నెకలు పుట్టునెడం
దెలిసిన వరించి మఱివా, రిలనగరికిఁ దెచ్చి నెనుపరాదా చాలన్.

వ. అని నిర్బంధించిన నయ్యభిమానధనుం డయ్యకొని సమున్వయమాన్యులగు రాజన్యుల కన్యాజనంబులం బ్రతీక్షించుచుం బుట్టినయప్పుడ సూతికాగృహంబులు సొచ్చి బాలికాచతుష్టయంబుం బరిగ్రహించి నిజగేహంబునకుం దెచ్చి వియచ్చరపథావరోధసౌధనికరం బగు నంతఃపురంబున వేఱువేఱుగృహంబుల నునిచి క్రమక్రమంబున మదనసేనయు మంజువాణియు మణిమంజరియు వకరంగయు ననునామంబు లిడి పోషింప నొక్కదాదిం గట్టడ సేసి కొండొకకాలంబునకు జవ్వనంబు నివ్వటిల్లిన నవ్వేలందులకు వరుసక్రమంబున ననుదినంబునుం గామోపభోగంబులం బ్రమోదం బావహిలం జేయుచు నప్రమత్తుం డైయుండెనంత.

క. ఆకామిను లధిపతిరతి, నేకట చీఱుమి మనోభవేషువితానం
ఫెకెలనొందఁగఁ బరపుర, తాకాంక్షాయత్తచిత్తలై నెవ్వగలన్.

సీ. మగవారిఁ జేయక మమ్ము నాఁడువారిఁగా నీరీతిఁ బుట్టింప నేల యనుచుఁ
బుట్టించెఁబో సాధుపురుషుతోడుతఁ గూర్పక క్రూరుతోఁ గూర్ప నేల యనుచుఁ
గూర్చెఁబో పసిపాటి కొంపలోఁ గూల్పక నీదుర్గమునఁ ద్రోయ నేల యనుచుఁ
ద్రోచెఁబో దయఁ జూచి ఖేచరత్వ మొసంగ కీమానుషం బీయ నేల యనుచు
వారు రేలుఁ బవళ్లు దుర్వారఘోర, కోపమునఁ బల్కెడు దురాపశాపములఁ బ
ఔయుపాసనఁ డేమి గాకునికి పలుకు, టువిదతాటంకకరణము హవార్త మహిమ.

గీ. వారలీరీతి నుండ దుర్వారచోర, గతులఁ బ్రతిగన్నవాఁ డొక్కకన్నగాఁడు
కార్యసాధకుఁ డను పేరు గలుగువాఁడు, వాఁడు తత్పురికాళికా వసతిఁ జేరి.

క. ఈరాజు నగరికలిమికు, జేరుని బొక్కసము కన్నఁ బెట్టిన ధనము
వ్వారిగఁ దొరకు నస్మద్గృహా, దారిద్ర్యం బపుడు గాని తలఁగ దటంచున్.

క. రేలెవ్వరు గనకుండఁగఁ, గాళీదేవిం బెకల్చి కడనుంచి తదా
భీలస్థానము మొదలుగఁ, దాలిమితో నేల మాలెఁ ద్రవ్వఁగఁ దొడఁగెన్.

క. పగలెల్లఁ గాళికన్మై, చ్చగ బిలముఖమున నమర్చుచు వాఁడొక నా
లుగుదినములలో నరపతి, నగరంటఁగఁ ద్రవ్వెఁ దెగువ నాటుకొనంగన్.

గీ. ఇదియె ధనమున్న గృహమని యెంచి యచట, నిర్గమద్వార మెడలించి నెమ్మి వెడలి
దైవవశమున మదనసేనావధూటి, పడుకయిల్లొట నిలిచి విభ్రాంతుఁ డగుచు.

ఉ. పానుపుమీఁదఁ గెందలిరుబాకు నజీరుని బాహువైభవ
శ్రీనిధి యైన యమ్మదనసేనఁ గనుంగొని పొంగి నాకుఁ జే
కానుక చేసె నీనృపతి కామిని నాదగు భాగ్య మెంత సొం
మ్మైనవదేల దీని బిగువారెడు కౌఁగిటఁ జేరఁ గల్గినన్.

చ. అని తలపోయువాని పొలుపద్దిరపాటునఁ జూచి విస్మయం
బనుపమలీల దొట్టిన భయంబును జిల్లరనీయ వాని నె
ల్లను గడఁద్రోచి యీపురుషలాభము దైవము గూర్చె నంచు నిం
చినతమి యాన నమ్మదనసేన మనోభవమూయమానయై.

ఉ. గ్రక్కునఁ గౌఁగిలించి తలకన్వల దెవ్వఁడవైన నేమి నా
చిక్కని గబ్బిగుబ్బలకుఁ జిక్కితి వెక్కడఁ బోవవచ్చు నా
యక్కఱఁ దీర్పవచ్చిన లతాంతకృపాణివి నీవె నీవు నే
డక్కితి నంచుఁ బ్రేమ నిగుడం బువుపాన్పునఁ జేర్చియచ్చటన్.

క. అనిరోధ మంటి తాఘర, మునివార్యోపర్యధక్రియానిష్కారణం
బనితరపూర్ణానందం, బనఁదగు రతి నప్పుడాటి యాతనిం గలసెన్.

గీ. కలసి యిట్టు లలభ్యయోగంబు దొరకె, ననుచు వెఱగంది యిటకెట్టుఁ జనఁదెంచి
తెవ్వఁడవునీవునీకుఁ జేరేమియనచు, నడిగియంతయుఁ దెలిసి నెయ్యమునమఱియు,

క. తను రాజు చెట్టఁబట్టిన, యనువుం జిరకాలకాంక్షితాన్యజనాలిం
గనతయును దెలిపి యదినేఁ, డొనఁగూడె న్నిన్నునంటి యోజపటి కతనన్.

గీ. రాజకులవశ్యుఁ డాత్మభార్యాచతుష్క, నిలయముల వర్పవెంబడి నిద్రనలుపు
నాతఁ డిటు రానిదినములయందు వచ్చి, యిచట సంభోగ మొసఁగి నన్నేలుకొనుము

మ. అని ప్రార్థించినఁ గార్యసాఫకుఁ డమందానందముం జెంది చం
దనగంధీ ముదుబంధ నైతిఁగద నీతారుణ్యవిస్ఫూర్తికై
ననగమ్యం బిది యిందు రాకెఱఁగు నండన్వచ్చుఁ గాకీనికే
తనసీమం దినమీవు మత్కృత బిలద్వారంబున న్వచ్చినన్.

చ. అనవిని పొంగి యామృగమద రాంగి తరంగితసంభ్రమాప్తి నా
యన వెనువెంటఁ దత్కృతబిలాధ్వగతిన్ ఘనసాధ్వసప్రదం
బనఁజను కాళికాగృహగుహాంతర భాగముఁ జేరిచీఁకటుల్
పెనఁగొనఁ దూర్పుమూల రతిలీలలఁ జారుని గూడివేడుకన్.

క. బిలమార్గంబునఁ గ్రమ్మఱ, నిలయము సేరంగఁ జని ఘనీకృతమోహా
కుల మొదు లెఱుఁగనికైవడి, నలచోరుని విడక యాలతాంగి మెలంగెన్.

క. అనియా బాలసరస్వతి జనపతికిం దెలిపెనని రసస్థితి మిగులం
గనఁబడఁ గీరము నొడువఁగ, దినకరునిరథంబు తూర్పుదిక్కటిఁ దోఁచెన్.

క. ఆంతఁ బ్రభావతి తనయ, భ్యంతరమందిరముఁ జెంది యారేయిధరా
కాంతుని జేరుటకాతోర్కు, పాంతమునం గులుకఁ జిలుక యల్లనఁ బలుకన్.

క. వినవమ్మ విక్రమార్కుం, డనుపమవిస్మయముఁ జెంది యవ్వలికథయే
యనువునవడచెనో చెపుమా, యనసచివుని కెనయ సవినయంబుగఁ బలికెన్.

గీ. మహిపయంతట నయ్యభిమానధనుని, రెండవసుచాణి మరునికూరిమి పటాణి
మంజువాణిమనోవ్యథ మగికఱవునఁ, బడినగతినుండఁ దత్పురప్రాంతసీమ.

గీ. ఏటిపరినొక్క సన్న్యాసి యింపునింపు, మఠము గావించుకొని శాస్త్రమంత్రతంత్ర
వేదవేదాంతవిద్వన్మహత్వగరిమ, నతని కెన లేదనఁగ వార్తకెక్కి వెలయు.

గీ. త్రిషవణస్నానములు నిష్ఠ దేవపూజ, గ్రంథపారాయణముఁ బరబ్రహ్మచింత
భైక్షభుక్తి హరికథాక్షణంబు, నజినశయనంబుఁ గల్గి యయ్యతి వసించు.

క. ఆసమయంబున భృగుఁడను, భూసురుఁ డొకఁ డొక్క కార్యమున కై తమితో
నాసన్న్యాసికి నంతే, వాసిత్వము మెఱయఁగా ధ్రువంబున మెలఁగన్.

సీ. ముదముతో యతికన్న మున్న మేల్కని గోమయంబున వత మెల్ల నలికి పైఁ
దపసి యేటికిఁ బోవు రీతి నంటి వెంటనె నడచు నాతని కమండలువుఁ దాల్చి
నవ్వాన్యసి దేవపూజకుఁ బూనుచో నుపకరణము ల్దాలిచి శీఘ్రమున నొసఁగు
సంయమీశ్వరుఁడు భిక్షకుఁ బోవునెడ గోచియును నార్ద్రపటఖండ మొనరఁ దాల్చుఁ
బారికాంక్షికి నజినంబుఁ బఱచి రాత్రి, పరమశుద్ధాంతరంగుఁడై పదము లొత్తు
నెలమి నయ్యాత్మికలలోనఁ బిలిచె నేని, స్వామి పని యేమి యనుచు హస్తములు మొగుచు.

క. ఈరీతి నుండ నాతని, మేరకు నొకనాఁడు మిగుల మెచ్చి యతీంద్రుం
డోరీ యలరితి నిచ్చెద, గారవమున నడుగు మేమి కావలె ననినన్.

గీ. అతఁడు ప్రణమిల్లి పల్కె సంయమివరేణ్య, విన్నప మొనర్ప వెఱతు నావెఱ్ఱితనము
ముద్దుగాఁ జూచు కరుణాసముద్రమూర్తి, వగుటఁ దెల్పెద నా కోర్కి యాదరింపు.

ఉ. మాపొరుగింటి శూద్రుని కుమారిక చిన్నటనాఁట నుండియున్
నాపయిఁ బ్రేమఁ గన్నది యనంతర మొక్కఁడు పెండ్లియాడి వాఁ
డీపురిలోన నిల్వ డలనీక పరుండటు చేరకుండ నం
జ్ఞాపరుఁడౌచు దానిననిశంబును నేలెఁడు సంయమీశ్వరా.

సీ. ఈమాటతో నారాక కెదురుచూచుచు ముద్దుగాఱఁగా నదె నిల్చి కడపఁ జూచి
నను జూడఁ గోరి క్రొన్ననతీవ నడయాడు విధమున నది కుల్కు పీఠిఁ జూచి
నీటికై వచ్చుట నెపముగ నాతోడఁ బలుకుచు నది చెందు బాళిఁ జూచి
తమవారి మొఱఁగి తత్తరముహత్తఁగ వచ్చి యది నన్నుఁ గలయు పూఁబోదలఁ జూచి
యేను భరియింపలేక మీకృప నమ్మి, యించియున్నాఁడ నన్ను నీడేర్పవయ్య
యార్తరక్షణ మఖిలపుణ్యము గదయ్య, కూర్మి నెటులైన నను దానిఁ గూర్పవయ్య.

గ. అనినఁ జిఱునవ్వు నవ్వి యయ్యతికులేంద్రుఁ, డౌర మన్మథు నిజమాయ కడ్డ మెవ్వ
రంబుజాననముఖులలో ననుచు నతని, జేరవకుఁ బిల్చి యొక వేరు చేతికిచ్చి.

క. ఇది త్రొక్కినఁ జనవచ్చు, న్నది దలచిన చోటికి కభ్రమార్గంబునన
మ్మదవతిఁ గలసెదు పోపో, మ్మదసందియ మెడలి రాత్రి కేగుమటన్నన్.

మ. భృగుఁడారేయిఁ దదౌషధాప్తి నుహితాంఘ్రిద్వంద్వుఁడై పోయి య

భ్రిగతింపన్గృహసీమశిగ్గి మఱుబా బాఁబోలు వాశాంతోఁ;
వగకేయూవృతిఁగూడి క్రిమ్మఱియుతం గాఁకైవడి నేత్రలత
వ్రేఁగనేత్రామణి పొందుఁబాయక యతిప్రీతాంతరంగంబునన్.

క. అమ్మాలికపై దానివి, ధమ్మరివాృసినవసంధిఁ దగఁడుపాదివి ప్రా
ణమ్మవరె దాఁచికొనిమతి, యెమ్మెయిఁ గర్జములదాని నేమఱకుండెన్.

క. అంత నొకనాఁడతండు పు, రాంతిక నదిఁజేరనరిగి యమ్మాలికఁ ద
ద్రత్నాంతమునమంచి దైవా, క్రాంతమతిం డిగ్గి యొడలు కడిగికొనంగన్.

గీ. రాజశుద్ధాంతపుష్పితమరాళ మొకటి, యరుణపద్మదళభ్రాంతి నచటనున్న
మాలికఁ గ్రహించియవరోధమునకుఁజనియె, భృగుఁడుతదభావమునకు నెవ్వగలఁ బొగిలె.

ఉ. అంతట నమ్మరాళము విహారమహారతి మంజువాణి గే
హాంతరసీమపైఁ జనఁ దదాపథముంగొని యవ్వధూటి వి
భ్రాంతతఁజెంది దానివయి బంగరుతీఁకున వ్రాసియున్న య
త్యంతపరిస్ఫుటాక్షరచయంబుఁ బఠించి ప్రమోదమగ్నయై.

క. ఇది తొల్లి క్రీడఁజనవచ్చు, నదిఁ దలఁచినచోటికభ్రిమార్గంబున నం
చొవవిని యాలిపియున్నది, గద దేవునికరుణ మెచ్చఁగావలె ననుచున్.

వ. తలంచి బహుకాలాభిలాషితం బగు పరపురుష సంగమం బనఃభూతంబైన భంగిం బొంగి మనోరథపరంపరాక్రమిత దినావసానయై నిశాసమయంబున రాజకుంజరుండు మణిమంజరీమందిరగతుం డగుటయెఱింగి యక్కురంగనయన తనముంగిటనిల్చి పదాంగుష్ఠంబులన యూర్ధ్వమూలం బవలంబించి కాళికాగృహంబున కరుగవలయునని తలంచి నిరాధారంబగు గగనాంగణంబున కెగిరి దైవవశంబునం గాళీనికేతనద్వారంబున మొగులుతీగలు దిగవ్రాలి యడుగుడించిన మెఱుంగుతెఱంగున వ్రాలి కేళికాగతుల మెలంగు నవసరంబున.

క. పరనగరరాజసుతుఁడో, క్రూరుఁడప్పరమునకు నాత్మకార్యంబునకై
యరుదెంచి యునికి నిజ, తామరసేక్షణఁ దలఁచి యతఁడు మన్మథవశుఁడై.

సీ. నిదురగానక యొకచోటనిలువలేక, వీథిఁ గ్రుమ్మరుచుండి యవ్వేళ నటకు
వచ్చి మరులచ్చివంటి యమ్మచ్చెకంటి, మెచ్చి మఱలెచ్చి యంటిన మెలఁతతోడ.

గీ. పలుకరించి తదాకారభావచేష్ట, కముల శుద్ధాంతకామినిఁ గాఁగఁ దెలిసి
యుల్లికి తలఁకినశాతని కలఁపెంగి, యూన్పుహాంగన వేగ దాయంగి నరిగి.

ఉ. ప్రేమగనంబుజాస్యఁ బలుకరించిన వాఁడవు పోదురాయయో
నామగవాఁడ లెస్స నిను నమ్మితి రమ్మనిపిల్చి కాళికా
ధామమునం బ్రతీచికడఁ దాను నతండుఁ బ్రసూనబాణ సం
గ్రామవినోదకేళి సరిగాఁగఁ బెనంగి యనంతరంబునన్.

గీ. తనచరిత్రంబు నడివి యాతనివిధంబుఁ, దెలిసి యికమీఁద రాత్రులు దినదినంబు
నిచ్చటికి రమ్ము తత్రియైన నేమవత్తు, నను చు నొడఁబాటు చేసి యావనిత చనియె.

క. చని నాఁడు మొదలుగాఁ బ్రతి, దినతమితో నజ్జయైన వేళల నృపనం
దనుఁ బొందు నడుపుచుండెన్, ఘనతరమునిదత్తమాలికా మహిమమునన్.

చ. అని సచివేంద్రనందన ధరాధిపుతో వినిపించె నంచుఁ జెం
దిన నెఱనేర్పుతోఁ జిలుక తెల్పఁ బ్రభాతముగాఁ బ్రభావతీ
వనరుహగంధి యంతట నివాసముఁ జేరి దినావసానసం
జనితకుతూహలాప్తి న్ప్రపచం ద్రుని దూతిక వెంటవచ్చినన్.

క. శుకమిట్లను వినవమ్మా, సకియా యలవిక్రమార్క జనవరుఁడు దద
గ్రికథావిధ మడుగన్నం, త్రికుమారి మనంబు గొలుపఁ దెలుపం దొడగెన్.

గీ. దేవయభిమాన ధనుని తృతీయభార్య, యైనమణిమంజరీ హంసయాన తనదు
ప్రాయమెల్లను గోర్కులపాలు చేసి, యుపపతిక్రీడ కేకారు చున్నయంత.

క. ధరపై నిగమావతియను, పురమునఁ గ్రూరుఁడను నామమున నొక శూద్రుం
డరివరనికరభయంకర, కరకరవాలాంకుఁడై జగన్నుతిఁ గాంచున్.

క. ఆతనికిఁ జపల యనఁగాఁ, గాతరమృగనయన యొకతె గల దది మదిలో
నీతిగణింపక జార, వ్రాతములకు హృదయ మిచ్చి వర్తిల్లుటయున్.

గీ. అతఁడది యెఱింగి కామినీహత్యకళికి, యాలిఁ దోడ్కొని పరభూమికరుగు బుద్ధి
గంధవతి చెంతకరుదేరఁ గతిపయప్ర, యాణముల నంతనచ్చపలాబ్జనయన.

ఉ. వీఁడిఁక నెన్ని దేశముల వెంబడిఁ ద్రిప్పునొ యేమి చేయను
న్నాఁడొకొ కాదటంచు జతనంబునఁ గన్న మెఱింగిపోయిన
న్వాఁడిమి వెంటనే వెదకవచ్చుఁగదా యెటులైన నీతనిం
బోఁడిమి మాన్చి కాని మఱిపోఁదగ దంచు విచారఖిన్నయై.

క. పెనవులు తడపుచుఁ బనములు, గుడిగొనఁగా నొక్కచోటఁ గూర్చుండి యహో
హృదయేశ యెచటికిఁ డ్చెదొ, కద నాథం దక్షి వశముగాఁ దని పలుకన్

గీ. అతఁడు చోరభయంబున నవ్వధూటి, మేనిసొమ్ములు తనయొడిలోన డాఁచి
నీరపాత్రంబుఁ గైకొని నెమకఁ జనియె, వారిదనదీకూపముఖ్యంబు లంతలోన.

మ. ఒకశూద్రుం డభిరామనాముఁ డొక యుద్యోగంబు పై వచ్చి య
మ్ముకురాస్యం గని యొంటినున్న దిది యేమో యంచు మాటాడనిం
చుకశంకించినఁ జేరఁబిల్చి తన యస్తోకవ్యథం దెల్పి య
వ్వికచాంభోరుహగంధి వాని మది యుద్విల్లారఁగాఁ జేయుచున్.

గీ. నీవు నామీఁదఁ గోర్కి జన్మించెనేని, కాఁపురమునకు నుండెదఁ గాని యిటకు
వచ్చు జలములు గొనుచు నావరుఁడువాని, మొఱఁగిపోయిన వెదకుచు నరుగుదెంచు.

గీ. శూలికీలారికం బంపెఁ గొంటువానిఁ, జెనకి నిర్జించిపోవ నీచేతఁగూడ
దట్టు గావున నిట్టు సేయంగవలయు, ననియుపాయంబుఁ జెప్పిన యంతలోన.

ఉ. క్రూరుఁడు నీళ్లుఁ గొంచు నటకుం జనుదెంచినఁ దత్ప్రియుల్లనీ
శేరువానేత్రి దప్పి యొకరీతి నడంచిన యట్లు చేసి యీ
యూరికిఁ బోయినేఁ డిచట నుండుదమా యని మువ్వురు న్రయో
దారత నేగి గంధవతిఁ దద్దయు మెచ్చుచు వచ్చుచు న్నడన్.

క. ఆరమణియు నభిరాముఁడు, గూర్మిని నిరువంకఁ బెట్టుకొని యయోధ్య యీ
యూరికి దొర లేఁడా యీ, చోరునిదండింప ననుచు క్రుక్కక కూఁతన్.

క. ఆమాటవిని తలారుల, దేమని గద్దింప నామృగేక్షణ రోదగా
నాముగఁ డితఁడని యయ్యెభి, రాముని వెసఁజూపి నిబ్బరంబునఁ బలికెన్.

సీ. ఆలుమగఁడును నియ్యూరి యఱుత నిలిచి, చలిదిభుజియింప నాసొమ్ము సంగ్రహించె
గొట్టుసేయుక వీనిఁ జూపట్టుకొనుచు, నిచ్చటికిఁ దెచ్చితిమి పట్టు డిప్పుఁ డితని.

వ. అనిన విని యన్నగరరక్షకు లాక్షేపపూర్వకంబుగా నతనిం బట్టుకొని బాధించి శో
ధించి యొడిలోని యాభరణములం గనుంగొని దొంగయగు నని నిశ్చయించి యభిమా
నధనున కెఱింగించి యూఁడుత్తరువులు గైకొనినిజకామినీకువానసంజనిత విస్మయా
ద్భుతపరిత్యక్తాదరుం డగు నతనివధియించి యమ్మండనంబు లిచ్చినం జపలాభిరాము
లునంపూర్ణకాములై యచ్చే నరిగి రాక్రూరుండును వన్యాయహాతుం డయ్యెం గా
వున నవిశాచంబై యాచారవంతులం గని తలంగం బాఱుచు మాంత్రికులం గని గడ
గడవడంకుచు నాయుధహస్తులం జూచి యేచినభయంబునుం బొందుచు శైరవా
జ్ఞావశుండై కాఁ హారంబుఁ గొనంగానక వెఱచినవారి వెంటంబడి తదీయజనప్రికల్పిత

రాత్రి కాననంబుల నుద్దండతరజఠరానలంబున శృంగాటకంబులం గాపుగ జీత లంబుగా భగ్నువం దరికొన బలియుద్వించు పొంగళ్లవలనం గొంతగొంత సంతసించుచు నిమిషంబులకుం గడగానక యప్పట్టణంబున నెట్టుకొని యున్నవాఁ డగుటం జేసి యతం డొక్కనాఁడు.

క. నరపతికిం గానుకగా, విరిపొట్లము గొనుచు నొకఁడు వీథింజనచో
గురుతర మగు నురుచిరతఁ, త్వరిమళముల వెంటనంటి పాయక చనియెన్.

ఉ. భూపతి యంత నవ్విరులపొట్లముఁ గైకొని కొల్వుదీర్చి క్రీ
డాపరమైన బాళి నిగుడ న్నవనంతిపురంబుఁ జేరి కొం
మ్మాపువుబోణి యంచు మణిమంజరి కిచ్చి తదీయ మన్మథో
ద్దీపితకేళిఁ దేలి పొడతెంచు రవిం గని లేచిపోయినన్.

క. ఆకమలనయన పరసుగ, తాకాంక్షల్ నిగుడ నెవ్వఁడైనను మగవాఁ
డీకడకు వచ్చి కోరక, నాకొనఁగూర్చునని నెమ్మనంబునఁ దలఁచన్.

క. కూర్మిం దవ్వుడు తనయా, కారము తో నిలిచి యొఱుకుగాంచిన దానిం
జేరంగ నరిగి వెలివకు, మోరమణీ వినుము మన్మహోదంతంబున్.

చ. అని నిజభార్య చేసిన యపాయమునం దనకట్లు సంభవిం
చిన యశరీరిశాస్త్రితులు చెప్పి యిఁకం జఠరానలంబు చే
తను వెరియం దొడంగె నని తా యిపుడన్నము వెట్టితేని నీ
వనిచిన పంపుఁజేసెద శుభంబగు నీకని మ్రొక్కి వేఁడినన్.

క. అమ్మగువవచనలఁ గూరిచి, యమ్మాడ్కి భువినాఁటదాన వైనన్నే వే
యమ్మహితసాహసమునా, కిమ్మా నాకోర్కు లెల్ల నీడేఱుటకున్.

క. అని మెచ్చి క్రోయనిం గనుఁ, గొని వాహనముగుచునన్నుఁ గొని చనఁగలవా
మనమునఁ దలఁచినచోటికి, దినదినము న్నీకు మంచితిండి ఘటింతున్.

గీ. అనిన నిమ్మోదికొనుట భాగ్యంబుగాదె, బ్రతికితినటంచు వాఁడొడఁ బడినఁజూచి
యబలబోనంబు వానికాహారమిచ్చి, తోయజానన యర్ధమురేయి వేళ.

క. పతిమకరందాగ్రహనను, గతిఁ గాంచుట దెలిసి గగనగమనకూర్మిరో
ద్ధతివాహనయైవిజన, క్షితివలఁచుటఁ జనియె కాళిగేహము చేరన్.

క. చనివాహనంబుడిగియ, వ్వనితామణి పథికుఁడైన వైశ్యుని నొకనిం
గనితనవర్తనమంతయు, వినిపించితదీయ కథలు విని మోదమునన్.

గీ. అతఁడుం దానును గాళిగేహంబులోన, దక్షిణప్రముఖ రతికేళిఁ దనివినొంది
యనుదినము నాతఁడటువచ్చునట్లు చేసి, పోయి మాలీల మెలఁగెనప్పొలఁతిమజీయ.

ఉ. దేవరకొల్వు దీరిన మదీయగృహంబున కేగువాఁడనై
యేవెఁ బోవుచోఁ గురిసె వృష్టిపంచాకతోంఘుర్ఘురా
రావమహాశనిధ్వని పరంపరతో నొకవాన యున్న రే
యావిలమానసాంబుజుఁడనై యొకమండపసీమఁ జేరితిన్.

గీ. అప్పటికి వచ్చె నిమ్మందయాన వచ్చి, తెరకిరింది ప్రతీక్షణాధీశుఁ డైన
గడ్డఁ జేసినవాఁ డతికుత్సితుఁ డగుచు, నింతతడ వేల రావైతివే యటంచు.

గీ. గుండెలు బ్రుళ్ళఁ దన్నిన గ్రుక్కుమిక్కు, రనఁక యాతని కినుక చల్లారనిచ్చి
విక్రమార్కుఁడు నిద్ర గావించుదనుక, వెడలి రారావటంచును వేఁడుకొనియె.

గీ. అతని పదఘాతముల కోర్చి పట్టెవాని, కిన్నిరులబంతి ప్రేటున కింతయూర్చి
వచ్చెనే యంచు నవ్వితి వసుమతీశ, చంపరియటంచు నాతప్పు సైఁపవలయు.

క. అనఁ విక్రమార్కభూపతి, విని వెఱఁగున ముక్కుమీఁద వ్రేలిడి చింతన్
మునుఁగుచు బాలవరస్మృతిఁ, గని తెలిసెనీమ్నవహాసకారణమూలే.

గీ. కాకయుండినఁ బైలపక్షంబు లైన, మత్స్యములు నవ్వునే యంచు మందబుద్ధి
నఃస్కటాకావనైతి నీహంతలాఁడి, వగలు నమ్మితిఁ గద పతివ్రతయటంచు.

క. అని మతిముఁ బదియుఁబదియును, గనుఁగొని కదళికకు నాజ్ఞఁ గల్పించె న్యా
స్త్రనిరూపిత పద్ధతిన, జ్జననాథుఁడు వింటివా నిశాకరవదనా.

క. అని చిలుక పలుకఁ బూర్వా, వనిధరశృంగాగ్రమున దివాకరుఁ డెనఁగం
గనుఁగొని పరిభావతీసతి, చని గృహమునఁనుండి తన్నికామఖవేళన్.

క. పుడమికొరఁ జేసు వేనుక, పాడముగఁ జనుదెంచి కీరపుంగవుతో నీ
కడుపెల్లఁ గథలు గద ని,న్నడుగంబనియేమి పోదునా యని పలుకన్.

గీ. పోయిన మిమ్మందువనన యపూర్వమగుచు, నలయు నొకకథ విను విక్రమార్కనృపతి
యవ్విధంబున నిజసతి కాజ్ఞ వెట్టి, పుష్పహాసుని జూచి యింపులు జనింప.

శా. ఈయాశ్చర్యము కంటిమే కద పురాదృష్టాద్భుతం బేమి యో
యీయాఖ్యానముఁ దెల్పుమన్న నతఁడుద్యత్ప్రీతితో నిట్లనున్
సాయంకాలనటన్మహానటజటాస్ఫూటాటవీవ్యోధునీ
వ్యాయుక్ఛంగఘుమంఘుమోహమితి వాచాచాతురీధుర్యుఁడై.

శా. పన్నద్రిప్రతిమానధైర్య విబుధధ్వంసిప్రభూద్భూతభీ
నిష్పన్నక్షితిభృద్విరోధిమునిద్విజ్యేష్ఠత్రిజగన్నామభృ

ద్వస్వాదిత్యముఖార్త్తబర్హిచయ దివ్యద్వారివాహోదయా
భాస్వద్వంశపయోధిశుభ్రకర శుంభత్కుంభకర్ణాంతకా.

క. ఖరకరకులశరనిధిశశ, ధరఖరసురవిమతశమన ధనదసఖధను
ర్ధరణభయదభుజభవహర, సురవరముని నికరభజిత శుభకరశరణా.

స్రగ్విణి. మానితాబ్జేక్షణా మానిసంరక్షణా
భానుసూను ప్రియంభావుకప్రాభవా
దానసంతుష్టగోత్రాసుధాంధస్స్తుతా
జానకీస్వచ్ఛభూసారసేందిందిరా.

గద్య. ఇది శ్రీమత్కాదిరీనృసింహకరుణాకటాక్షవీక్షణ సమాగత కవితాధార
పాలవేకరికులకలశాంభోనిధి సుధాకర తాడిగోళ్ళకరియమాణిక్య
నృపహర్యక్షపౌత్రపవిత్రచరిత్ర కదురధరామండలాఖం
డలపుత్ర విద్వత్కవిరక్షణానుసంధాయక కదిరీ
పతినాయకప్రణీతంబైన శుకసప్తతియను
మహాప్రబంధంబునందుఁ
దృతీయాశ్వాసము.



శ్రీరస్తు

# శుకసప్తతి.

## చతుర్థాశ్వాసము.

క. శ్రీ 1

గీ. ఆవధరింపుము సకలరాజాధిరాజ, నతపదాంభోజుఁ డగు ధర్మనందనునకు
నరసవైదికలౌకికాచారవిహిత, హితకథారమ్యుఁ డగుధౌమ్యుఁ డిట్టులనియె. 2

గీ. అవధరింపుము విక్రమార్కావనీంద్ర, చిన్ననాఁడేను మున్ను కాశీపురస్థ
లావలోకనకాంక్షచే నరిగి యరిగి, జంబుకేశ్వర మనుపట్టనంబుఁ జేరి. 3

### —తొమ్మిదవయుపకథ.—

గీ. కంటిపాంథజనాహ్వానకారిమృదుల, వాతపోతచలత్పటకేతనాంక
మైనదీయశ్రియచ్ఛితాహారియగుచు, నలరునొకవంటకూలి యొయ్యారియిల్లు. 4

సీ. పాళిపుట్టించె నవ్యఃకల్పితానల్పరసపూర్ణగాథాదురంతపటిమ
రక్తిగల్పించె ధారాళవాచాసుధా మాధురీధుర్య సంగీతరీతిఁ
దెలియఁజేసె ననేకదేశసభాంతరారాశికాంతరనికరప్రపంచ
మస్ఫురం బొసఁగె శబ్దార్థవైచిత్రినిబంధనోజ్జ్వలగద్యపద్యసమితిఁ
దద్గృహాలకన్నకల్పితశౌరకాయ, మానసోమసమానీతులైనపథిక
కథికగాయకచాటుసత్కవులయుపర, పూర్వ్యగంతరసల్లాపములు నరేంద్ర. 5

చ. చిటిలినవాభినామ మొకచేఁ దెలనాకులు చాయతోఁడి
పుక్కిటివిడెయుం బెడంగుగ బిగించినపైఁటచెఱంగులోనఁ బి
క్కటిలు కుచాబులుం బసిఁడికమ్మ తళుక్కను చెక్కుదోయి
చొక్కటముగ ముద్దుగుల్క నొకకల్కి వెసంజనుదెంచి యచ్చటన్. 6

సీ. మఱివండిపెట్టుకొమ్మలు లేరె మావెంటఁ బడుదురటంచును బాయఁబలికి
పోవఁజూచినఁ దిట్టిపోదురిదేల వాదాడఁజాలమటంచు నాసగొలిపి
యటువంటివారమా యాఁకలిదీర్పు మిక్కిలిపుణ్యమన్న నంగీకరించి
కమ్మలుగదలఁగన్బొమ్మలు నిక్కిడ శారజమ్మునఁ గూలిబేరమాడి
వచ్చు తెరువరులందఱు వంటపనికి, నన్ను మెత్తురటంచు నందములుమాపి
బాళిపుట్టించు దానికప్పథికులెల్ల, నొడఁబడికమీఁద నే మిమ్ములొసఁగిరపుడు. 7

గీ. వారితో నేను భుజియించి వనజబంధుఁ, డస్తగిరిఁ జేరుతఱి నైన నపుడు నడికిఁ
బోవువారలఁ జూచి నేఁబోక నిలిచి, వంకజవాప్యతి జలములానతియు సంగ. 8

క. ఆసమయంబునఁ జీకఁటి, మూసినతిన ముదుకచీర మైకొలనిగ్గు
ల్వాసులకుఁ బెనఁగఁగానొక, దాసియరుగుదెంచి యొకసుధాకరముఖితోన్. 9

క. ఏమోగునగునలాడిన, నామగువము కేమి సేతు ననవిగుమగవాఁ
డీమాటకు నొడఁబడఁడ, కామినియెడ మాట నిల్పఁగాలేనైతిన్. 10

క. అనుమాటలు నవనవగా, విని నేనేమో ప్రమోహవిధమని చేరం
జని యదియేమని యడుగం, గనుఁగొని యమ్మగువ ముఖవికాస మెసంగన్. 11

గీ. హత్తుకోవమ్మ నీవంటి యుంప గాని, కున్న దొకచోట నొకమంచి యొజ్జప్రలాఁడి
దానికిలికించితంబునఁ దవిలినట్టి, వాఁడు దేవేంద్రునకుఁ జేటివాఁ డియఁగలఁడు. 12

మ. అను నమ్మాటలతోడ నేరతిపతిజ్యావల్లికాటంకృతుల్
వినితామంచిది పోదునాయనుచు నన్వీక్షించి యయ్యంబుజా
నన నేభాసు బలార జాణవపు నన్నా యింత తెంపొందకుం
డినవాఁ డేమగవాఁడు నీతపముపండెన్నిండె సౌఖ్యస్థితుల్. 13

గీ. సట్టనియోగి యశోగుణభద్రుఁ డనెడు, భూసురుం డొక్కఁ డయ్యూర వాసి గనియె
వానిబంటునకున్న యైశ్వర్యగరిమఁ, బడసినఁ గుబేరుఁడైనను బ్రిదికిపోవు. 14

మ. అలరుందూపుల మన్నెవాని మగవాఁ డన్వించుఁ దత్కాంతయ
య్యలివేణీమణి జారసంగమసుఖైకాకాంక్షచే దీనిని
చ్చలు నాయింటికిఁ బంపు నొక్కనిమహాచాతుర్యధైర్యాప్తి మె
చ్చులొసంగం దగువానిఁ గాఁ బనుపుమంచుం దైన్యపూర్వంబుగన్. 15

క. ఏనును మాలిమిగల మగ, వానికి నిది యెఱుకసేయ వడవడవడఁకన్
గాని చన వెఱచువాఁడ, మ్మానినితోఁ బ్రొద్దుకొంచెమా యొనఁగూడున్. 16

గీ. అట్టిచో నెట్లుపోవుదు నంటివేని, దద్గృహము చెంత నొక వటతరువుగలదు
దానిపైనెక్కి చీఁకటిగాననిపుడె, యూడవెంటనె దిగుమొనఁగూడుపనులు. 17

గీ. కాంతిమతిదాని పేరు తత్కాంతుఁ డధిపు, డనుపఁగా దూరభూమికి నరిగినాఁడు
వడచి యిచ్చటికతఁడు రాఁదడవుపట్టు, వేగఁజను మిందులకుఁ గాను వెఱవవలదు. 18

క. అని నన్నుఁ బలికి దానిం, గనుఁగొని యమ్మగువకింత కార్యంబోజ
ప్పని నేతెల్పుము పొమ్మని, యనుపఁగ నది వెడలి చనియె నంకట నేనన్. 19

మ. తరలంబైన మనోంబుజంబు ఘననంత్రాసంబుతోఁ బోరి శం
బరవిధ్వంసి మహాపరితాపము జయింపం గాంతిమత్యాలయాం
తరముం జేరఁగ నిశ్చయింప నటముద్యత్త్వాధిమల్లిఁ బనె
క్కరహీనాంఖలవెంట నే యరిగి తద్గేహంబునం డిగ్గితిన్. 20

ఉ. అంతకుమున్నె యచ్చటికి కొయ్యారమునీరుఁగ వచ్చియున్న త
త్కాంతిమతీవధూటి నను గన్గొని మోమరవాంచి నిల్చినం
జెంతకుఁ జేరి దాసి యిది సిగ్గుపడన్సమయంబె యేగృహా
భ్యంతరసీమఁ జేర్పుదమటంచు ననుంగొనిపోయి రిద్దఱున్. 21

చ. బటువులు తాపితాపఱుపు పట్టుతలాడము మీఁదఁ జల్వదు
ప్పటిపయిఁ జప్పరంపుజిగి బంగరువ్రాఁతనురాశిమంగరం
గటఁ బడిగంబుఁ గంచువిపగంబము గల్గినపట్టెమంచము
త్కటరుచి నించ మించు రతిధామముఁ జేరితి నిర్భయంబునన్. 22

గీ. అంతట భుజించి నను వినయంబునోఁప, మంచమున నున్చి యక్కాంతిమతిని దాఁచి
యొనసెఁ గదవమ్మ నీమనోభీష్టమితని, యలరఁ బ్రాయంబు కొల్లాడుమనుచుఁ బలికె. 23

శా. నన్నీక్షించి సమస్తదేశతరుణీనానారహఃక్రీడలం
గన్నావంచపుజాణ విక్రాలికి బొంకన్లేదు సుమ్మీ మెయిం
జిన్నెల్నించకుమా బయల్పడిన నాచేఁగాదు సుమ్మీ ప్రజం
గన్నుల్మూయఁగ నీకుఁ దెల్పవలెనా కార్యంబు కర్తవ్యమున్. 24

క. అని తెలుపుమూసి కొంచుం, జనియెం దద్దాసి గడియ చక్కఁగఁ బొంకిం
చి నెలంత యంత తల్పం, బున కొయ్యనవచ్చె నగవు మొగమునఁ దోఁపన్. 25

గీ. ప్రథమసంగమకేళి యప్పటికి నంత, ముగ్ధ యనుపించి పిదప నమ్మోహనాంగి
జాతివారాంబుజేక్షణల్ సైఁతమింత, నేరరనిపించెఁ గలయిక యారజముల. 26

మ. సభలో నన్వివరింపరాదె గద తచ్చాతుర్యమెంతంచు నే
నభివర్ణించెద నంశుమత్కరదురాపాంతఃపురావాసయా
యిభయానామణి యెందు నేర్చినది హా యీకౌశలంబంచు నే
నభయాశ్చర్యతఁ జెందితి న్మహిమ నానాతర్జనీయోగమున్. 27

ఉ. ఎంతకు నేర రంత తెగియించినవారది యున్న దేక బా
యంతట తెల్లవాఱిన లతాంగిననుం బడుకింటి మిద్దెపై.

దంతపు మేలుమంచము సుధాకర కాంత గృహాంతరంబులో
నెంతయుఁ జింతలేక వసియింపఁగఁ జేసెను సాహసంబునన్. 28

గీ. రాత్రులెల్లను గేళ్యగారమున నుంచుఁ, బగలు మేల్మిద్దెపై నుంచుఁ బ్రతిదినంబు
జేర్మి రెట్టింప వడ్రిపోషితములుగఁ, బ్రొద్దుప్రొద్దున భోజనస్ఫురణలొనఁగు. 29

గీ. దానినడకల వగలెన్నియైనఁ గలవు, చెప్పఁ జిత్రంబులటు మీఁదఁ జిత్తగింపు
మంతనయ్యింతి గర్భచిహ్నములు దాల్చె, వేడుకలు దొంగిచినామది వెఱ్ఱవొడమ. 30

గీ. అంత నొకనాఁటి రేయి యేకాంతసదన, సీమ నున్నంచికొని మున్ను చెప్పియున్న
గంటమాకులుఁ గొని దివ్యగంబమింత, యెనఁగూర్చుండి యాపూర్ణిమేందువదన. 31

సీ. శ్రీమన్మహాగుణస్థిర గుణభద్ర పాదములకు దేవర దాసియైన
కాంతిమతీదేవి ఘనభక్తి నతులు గావించి చేయంగల విన్నపములు
మిమ్ము నా పాలిస్వామిఁగాఁ దలంపుదు మీ మహిమంబులు మీకె తెలియుఁ
గలలోన మీరు సాక్షాత్కరించుటఁ జేసి గర్భంబు నిలిచె నిక్కంబుగాఁగ
నింటివారెల్ల నామీఁదఁ గంటగించు, చెప్పుడు చెలుఁగుదురేకద యింక మీఁద
నేమికల్పింపఁజూతురో యెఱుఁగ రాదు, కరుణనిల్పుమటంచొక కమ్మ వ్రాసి. 32

క. తనదాసిఁ బనుపనదియుం, ఘనజవమున నేగి చేరికమ్మ యొసంగన్
గనుఁగొని గుణభద్రుఁడు చది, వినవాఁడై విస్మయంబవేలముగాఁగన్. 33

క. చింతాక్రాంతుండై యుసు, మంతయు మాటాడకున్న నాతని కుపిత
స్వాంతత్వమెఱిఁగి దాసి య, నంతత్వరమరలివచ్చి యంతయుఁ దెలిపెన్. 34

సీ. ఆఁడుదియైనచో నడుగఁ గులస్థాన పౌరుషములతోఁ బ్రబలువాఁడఁ
గొడుకైనఁ గలదు తే గుణభద్రునకు మున్న మున్న గానె పితౄణమోచనంబు
జతగూడ మనపురోహితునిరప్పింపరే పాటించి లగ్నమేర్పఱచుఁగాని
బొడ్డుగోయరె యేమి పురిటింటిలోఁ జొచ్చి మనపతివ్రతబిడ్డఁ గనియెనిప్పు
డనుచుఁ గేరడముల నింటి యమ్మలక్క, లాడికొనఁ జేటికానీత యైనవస్తు
కోటి చేరంత యేమియుఁ గొదవలేక, కాంతిమతి యంతమగవానిఁ గనియెనధిప. 35

క. కని పెనిచెందదనంతర, మున భూనాథుండు పనుపఁ బోయిన కార్యం
బౌనగూడుక తనఁ గ్రమ్మఱి, చనుదెంచెం దద్విభుండు సదనంబునకున్. 36

గీ. నిజసమాగమ సంభ్రమోన్నిద్రులగుచు, నింటివారలెదుర్కొన వేగుదెంచి
యాత్మభార్యాచరిత్రంబు లడుగఁ బొక్కి, ఖిన్నుఁడై యున్నవాని వీక్షించియప్పుడు. 37

సీ. జెడఁగుఁజూపెడు నూనెముడిలోనుగా నంటఁగట్టినవాసెనకట్టుతోడఁ
గస్తూరిపసుపు చొక్కటపుఁ జల్లనితావి వెదచల్లు పుక్కిటి విడెముతోడ
నిసువుపై పసుపునూనియ జిడ్డులంటిన చిటికమిక్కుటుమాపుచీరతోడ
నొసటవందంబుఁ జెందు విభూతిరేఖపైఁ బొంకఁబుగను చుక్కబొట్టుతోడఁ
గాన్పుసంతసమందు మొగంబుతోడ, నడరు మురిపంబుగులుకు నెన్నడలతోడఁ
గాంతిమతిపెఁడె నీముద్దుగాఱుతనయుఁ, డనుచుఁ జేతికినీయఁగా నవ్విభుండు. 38
గీ. కన్నులెఱ్ఱగానెగాదిగఁగన్గొని, యొడుగఱచి దీనినాఁటదానిఁ
జంపరాదుగా విసర్జించితి నటంచుఁ, బార్శ్వచరులఁ జూచి పలుకుటయును. 39
చ. కలకలనవ్వి యోసెద కావనవచ్చునె నన్నునంటితో
య్యలివిడనాడ నీయెడ నయారె సెబాసురె యింటివారిమం
దులమహిమంబుగాకనిను దూఱఁగఁ బల్కఁ బనేమిబాపురే
కలియుగమాయటంచు నని కాంతిమతీలలితాంగి వెండియున్. 40
మ. కలనిక్కంబగు నేయటన్న నిఁకనాఁ గాదంచుమారాడఁగాఁ
గలనా యింతకు వచ్చినప్పుడును బల్కన్నేరనా కాన్పుర
చ్చలకెక్కంగద యింక నూనుదురె యీసాధ్వుల్నమ్మందూఱఁగా
వెలయుం దైవమెఱుంగుఁ గల్లనిజము ల్వీరాడఁగానేమగున్. 41
సీ. నలుగురుండినచోట నిలువఁగాఁబెట్టి మాటాడఁగాఁగంటిరా యమ్మలార
ననువంటియాఁడుబిడ్డను గన్నవారింతె పలుకరేయేమియుఁ దెలియలేని
నబ్బిణుల్మీరు మీచాటుమాటుబుగదా నానాథు మేలిగుణంబుఁ జెఱచె
దయయింతలేక యెంతకునెత్తుకొంటి రక్కటమిమ్ముఁ గన్నదిగాకతల్లి
నూఱ్యుఁడా మామమన్నావె చోద్యపడక, యందఱును జేయుపాపపుణ్యంబులెవరి
నడిగితివిధర్మదేవతాయమ్మచెల్ల, వింతినావంటి దానికాయింతమాట. 42
గీ. అనిగయాళించుకొనుచు హస్తాంబుజముల, నలుపుపాపనిదురదుర నరిగితోట్ల
లోఁబడవైచి మొగమునఁ బూనుగందు, తోడబొమ్మడినిగుడ నత్తోయజాక్షి. 43
క. మునురాయునిమాటలకై, యనలమువెచఁ జొచ్చి వెడలియలరినసీతాం
గనకంటె నేనుసక్కవె, చవికాళిక చెంతబాన సలిపిగెలిచెదన్. 44
మ. అనుచుంగ్రిక్కనగేహము న్వెడలదాయాదుల్మహాసాధ్వివి
ట్టురిమంబోకనమింక నీసడియెచాయింజాలురమ్మంచువెం
టనెరాఁగా నిది యేమొకోయనుచు నానామానవుల్గుంపులై
కనుఁగొనం జనుదేఱఁగా నది చేఁపతాళీమహాస్థానికిన్. 45

సీ. తనవారుపిలువఁగా వినకపోనయొనర్పఁ జనుచేటికో యని యనెడువారు
నాఁడుపుట్టువు చెడ్డదవుఁగదా యిటువంటియపకీర్తి వచ్చెనే యనెడువారు
నపకీర్తి వచ్చిన నడఁపకయింటివా రగడుచేయుటదోస మనెడువారు
నగ నేమిచేసి రియ్యతివతానె వారి కారడి గల్పించె ననెడువారుఁ
జూడవచ్చిన నచ్చెరువుచోద్యమెుంగ, కాడ రాదేల యీపాప మనెడువారు
బయలుదేజిన యపుడెయీపడఁతిజంత, యగుఁజుమా యనువారు నైరప్పుడు జనులు. 46

వ. వెండియుం దండోపతండంబులుగా మెండుకొని యాలోకించు పురజనంబుల కోలా
హలంబు విచారించి సంభ్రమాశ్చర్యంబుగా నరిగియాఁడిగంపుఁ బడతులు విన్నవిం
చిన నన్నగరాధినాథుం డగు నరపాలుండు విస్మయంబున నగరు వెడలి తత్కాల 47
సన్నిహితు లగు పరిచారకులు గొలువం జనుదెంచి.

క. తలతల మని కొండలు పె, ద్దల వారెడఁగలుగ జడియ ధరణీధవుఁడ
క్కలకంఠిఁ జేరి యనునయ, ములమరలమి సమ్మతించి ముందుగ నడిచెన్. 48

గీ. అంతఁ దొలునాఁటి రాత్రి రహస్యభంగిఁ, గాంతిమతి తీర్చి నను బందుకట్టియునికి
నేను నొకజోగి వాల్కాంబుఁ బూని భద్ర, కాళి సన్నిధి నుంటి గింకరునిరీతి. 49

గీ. అచ్చటికి వల్లభుండు ధరాధినాథుఁ, డాదిగా మూఁక వెంటరా నరుగుదెంచి
కాంతిమతి చేరి తత్కాళికాపదాబ్జ, ములకుఁ బెన మ్రొక్కి లేచి నిశ్చలతనిలిచి. 50

గీ. కదిసి ప్రజలార కంటిమి కానమనక, చూడుఁడనిపల్కి ధైర్యవిస్ఫురణ మెఱయ
జనవరునిఁ జూచి రాజ నానత్య మిపుడు, విశదమగును పరాకని విన్నవించి. 51

క. నినునంటి భద్రకాళీ, యనయము విభునంటి యీమహాయోగివరే
ణ్యునినంటినఁ గాక మఱె, వ్వని నంటిన శాస్తి చేయ వలయు న్నాకున్. 52

మ. అని యక్కాంతిమతీవధూటి పలుకం బ్రావిర్భవద్విస్మయం
బున సారెం దలయూఁపసాగి గిరిశాంభోజాక్షి తన్మూర్ధకం
పనము న్మెచ్చి యొనర్చెనంచు నెదల న్భావించి పశ్యత్పురీ
జను లౌరౌర పతివ్రతా యనుచు మెచ్చన్నింగి ముట్టె న్రొదల్. 53

ఉ. అంత నృపాలుఁ బాలలన యంఘ్రులకుం బ్రణమిల్లి యామినీ
కాంతముఖీ యరుంధతివి కాక నీపయిఁ గాని పోని యీ
వింతఘటించినట్టి యలివేణుల నోరికి శాస్తి సేసి య
త్యంతయశంబు నిల్పితి కదా యిఁక నింటికి నేగఁగాఁ దగున్. 54

చ. అని విని రాణి సిగ్గున బటాంచల మించుక వంచినట్టి మో
ముకు మఱుంగుఁ జేయు కరము న్మృదుపాద పయోరుహద్వయం
బున నెలకొన్న చూపు లొకపొంకము చూపఁగఁ గొంకుమాటల
త్యనుపమముగ్ధతా గతి వెలార్ప నడంకువచంద మేర్పడన్. 55
మ. అపవాదంబు పరిత్యజించుటకునై ప్రాణంబులే నివ్వితి
న్నృప యీభూప్రజకెల్లఁ దండ్రివి గదా నీయుందఱుం బోన చే
సిపరఖ్యాతి వహింపఁ గంటేఁ గద నీచిత్తంబు వచ్చెం గదా
యిప్పుడీ పోఁడిమి చాలు కాఁపురము పొందేలా విసర్జించెదన్. 56
క. అని వెండియుఁ బలుతెఱఁగు, ల్గనఁబడఁగాఁ బల్కు ధరణికాంతుని వచనం
బునకలికి మీఱఁజాలని, యనువున మేకొనియె నది గృహంబున కరుగన్. 57
మ. అపు డత్యుజ్జ్వలభూషణాంబరవిశేషాదు ల్సమర్పించి యా
తపనీయాంగిని బల్లకి న్నిలిపి యుద్యత్పంచవాద్యధ్వను
ల్విపులాభ్రాంతర మెల్ల నిండ వినయావిర్భూతిఁ దోడ్తెచ్చి యా
నృపలోకేశ్వరుఁ డింట నిల్పి చనియెం బ్రీతాంతరంగంబుతోన్. 58
క. అంతటఁ గాంతిమతీసతి, యింతంతనరాని ప్రేమ నిటు సనఁగా దే
శాంతర నానామనుజుల్, సంతసమున నెంచ మిగుల సన్నుతి కెక్కెన్. 59
క. అని యిట్లు పుష్పహాసుఁడు, ననుపమవైఖరుల విక్రమార్కున కెఱిఁగిం
చెనటంచుఁ జిలుకపలుక, న్వనజాప్తుం డెక్కెఁ బూర్వవసుధాధరమున్. 60
వ. అప్పుడు ప్రభావతి మనోజరథవిఫలీకృతమనోరథయై యవరోధంబున కరిగి నిశాసమ
యంబగుటయు నవ్వసుంధరాపురందరసంగమానందంబు డెందంబునం గల్పించుకొని
యనుభవించుచుండ నుదంచు నచ్చంచలాక్షితో ననంతర కథావిధానంబు వినుమని
శుకాగ్రగణ్యుం డిట్లనియె. 61
క. అలవిక్రమార్కభూవరు, డలఘుతరాద్భుతయుతాంతరంగుండై య
వ్వలికథ యడుగంగఁ గుతూ, హలమున నాతనికిఁ బుష్పహాసుండనియెన్. 62
గీ. ఇందులకు నింత విస్మయం బేల విక్రమార్క, యిఁకమీఁదఁ గలకథ యవధరింపు
మేను బూర్వక్రమంబున దానియిల్లు, జేరి నిల్చితిఁ దద్రీతి స్థితులఁ జెలఁగి. 63
గీ. బలియొసంగినఁ బూజలు సలిపి వేఁడు, కొనినఁ దత్కాంతిమతిమాఱు మనమునందు
హత్తుకొనియున్కిచే మానదయ్యె నధిప, కాళికాదేవి నిజశిరఃకంపనంబు. 64
చ. అదిగని పౌరులెల్లను భయంబునఁ దత్పురనాథుఁ జేరి యా
యదన మహాపతివ్రత గుణాంచితకాంతిమతీలతాంగి నే

స్థాపింపఁగనిల్పినన్నిలుపనోపు మఱెవ్వరిచేతఁగానియ
ఖ్యాదితశివాశిరశ్చలన మొప్పఁబయుంచును విన్నవించినన్. 65

మ. ఇదియౌనంచు నరేంద్రుఁ డందఱును దోనేతేరఁగా నర్వసా
ధ్యదమాకాంతిమతీ గృహంబు దరియంగా వచ్చి ఫాలంబుఁ ద
త్పదముల్సోఁకఁగ మ్రొక్కి యెట్లయిన సంబామూర్ధకంపంబు మా
న్పిదయం బ్రోవుమటంచు దైన్యగతి గాన్పింపంగఁ బ్రార్థించినన్. 66

ఉ. ఆలలితాంగి కేళినిలయంబు కవాటము మూటుఁ జెంది భూ
పాలక యింటివారిడిన బాముల రచ్చలకెక్కనంత యే
చాలదె యింకమీఁదను నిజంబుగ రట్టున కోర్చునంతకున్
దాళనె యీశరీరము విశావిత యొక్కడిజోలి యక్కటా. 67

గీ. అరయఁ దోఁబుట్టుపైఁ గల్గు కరుణనిందు, వచ్చి యీరీతి దేవరవారె యింత
ప్రార్థన మొనర్చుపట్లఁ గాదనఁగఁ దగునె, యైననొకచిన్న విన్నప మవధరింపు. 68

క. భామాజనసామాన్యము, గా మది నన్నెంచు జనులు గనలేఁదు మొదల్
గామహిలోపలఁ గానని, నామహిమ మెఱుంగవలయు నరనాథమణీ. 69

గీ. ఇలఁ బతివ్రతలగువారు గలిగిరేని, కాళియొనరించు నిజశిరఃకంపనంబు
మాన్పు మని చాటఁ బనుపుము మానవేంద్ర, యప్పుడందఱి వగ తెలియంగవచ్చు. 70

క. అని యవ్వధూటి పలుక, న్మనుజకులేంద్రుండు మాఱుమాటాడఁగఁ గొం
కినవాఁడైభువిఁజాటం, బనిచెందద్వచనరీతిఁ బ్రకటముగాఁగన్. 71

గీ. అంతరాజాజ్ఞ మీఱరాదంచుధరణిఁ, గలుగుసతులెల్లవచ్చి నిక్కముగుభక్తి
నెంతమ్రొక్కినఁనంతంత కెచ్చుసాగె, ధూర్జటివెలందిమూర్ధవిధూననంబు. 72

గీ. శాంతిమతిదక్క మనుజలోకమున నిఁకఁబ, తివ్రతలులేరటంచు నుదీర్ణవచన
ముఖరులై జనులాడ నమ్ముదితలెల్ల, సిగ్గుపడియేగిరప్పుడచ్చెరువుఁజెంది. 73

ఉ. అంతటరాజమౌళి పునరాగతుఁడై ధరణీవధూటికా
సంతతిలోఁజూడ నొకసాధ్వియు లేదనియాత్మలోననీ
ద్ధాంత మొనర్చితిన్నమ్ముఁ గృతార్థులఁజేయు మటంచు మ్రొక్కన
శ్శాంతిమతీవధూటి యవుఁగాకని శాళిగృహప్రవేశయై. 74

గీ. రాజు మొదలయినవారిదూరమున నునిచి, గర్భగృహమునకరిగివేగమకవాట
బంధన మొనర్చిగ్రక్కున భద్రకాళి, డాసినిలుచుండి ధీరతాడంబరమున. 75

క. నామనసువచ్చుకైవడి, నేమెలఁగినఁ జూడలేక యెవ్వతెవేయా
బూమెలుపన్నఁగవలదిఁక, యీమేరన్నిలువకున్న నిట్టటుఁ జేతున్. 76
గీ. అనినఁ దత్కాళియెంతకైనను దెగించి, నట్టిదీజంత యేమిసేయంగఁ బూను
నోయనెడుభీతిఁ దలయూఁచుటుడిగినిలువఁ, దరుణివాకిలి తెఱచియందఱినిబిలిచె. 77
క. పిలిచిననరపతి మొదలుగఁ, గలవారలువచ్చి భద్రకాళీదేవిన్
దిలకించి శిరఃకంపము, నిలుచుటకున్విస్మయాదినిబిడాశయులై. 78
గీ. కాంతిమతి భూతలమున సాక్షాత్కరించి, నట్టియయ్యాదిలక్ష్మిగా కరసిచూడ
మనుజకామిని గాదుసుమ్మనియుమఱియు, మఱియుమ్రొక్కిరివినయసంభ్రమము లెనయ. 79
ఉ. ఆసమయంబునన్నరవరాగ్రణి భృత్యులు తెచ్చినట్టి సిం
హాసనమందు నవ్వికసితాంబుజలోచన నుంచివైభవ
శ్రీసముదీర్ణవృత్తి నభిషేకము చేసి విశేషభూషణో
ద్భాసితచిత్రచేలము లపారముగాఁ గయికాన్క చేసి నా
నాసతు లెల్ల మ్రొక్కఁగ నొనర్చి యనేక కృతప్రణాముఁడై. 80
గీ. నతులొనర్చి మహాపతివ్రత యటంచుఁ, బేరుపెట్టి యలంకృతవారణంబు
పైసమాసీనఁ గావించి పటహముఖ్య, భద్రవాద్యరవంబు లంబరమునిండ. 81
వ ఇవ్విధంబున నక్కాంతిమతి నూరేగించి నిజగృహబహిర్భాగంబున గజావరోహణంబు గావించిన యక్కాంతిమతిచేత సాష్టాంగప్రణామపూర్వకంబుగా ననుజ్ఞాతుండై యానృపాలపురుహూతుం డరుగం దక్కినవారలను బాదపరాగంబు ప్రసాదించి వీడ్కొలుపుచు నమ్మందగమన మందిరాంతరంబునకుం బోయి. 82
గీ. వరము లిచ్చు మహాపతివ్రత యటంచు, సేతుకాశీపురాంతరక్షితిజనంబు
లచ్చమగు భక్తిఁ గానుకల్దెచ్చిచూడ, వేళగానక యుండఁగా వెలసెనధిప. 83
క. అంతయుఁ గనుఁగొని యిఁకనీ, జంతన్నమ్మదురె యెపుడుచంపునొయనుచుం
జింతించి యకుకుఁ బాయక, యంతం ద్వర వెడలి కాశి కరిగితి నధిపా. 84
శా. గంగాభంగముల న్మునింగి నిగమగ్రామేశ్వరు న్విశ్వనా
థుం గీర్తించుచు మ్రొక్కి డుంఠిగజవక్త్రుం గొల్చి యంతం ద్రివే
ణిం గాత్రంబుఁ దొలంచి పూర్వకృతనిర్నిద్రాఘము ల్వాసి నీ
రంగత్పూర్వకృపారసంబునకుఁ బాత్రం బైతి ధాత్రీశ్వరా! 85
క. ఆయద్భుతంబు మదిలోఁ, బాయమనఁగ లేకయుంటఁ బదపడి సభలో
నీయాశ్చర్యముఁ గని భూ, నాయక తద్విగుణమగుట నవ్వుదయించెన్. 86

క. అని తెలుప విక్రమార్కుం, డనుపమ విస్మయతఁ బుష్పహాసునిమన్నిం
చి నితాంతవిభవసౌఖ్యం, బునసుండె న్వింటె వైశ్యభుజగద్వేషీ. 87

క. అని యిట్లు చిలుకపలుకన్, విని మిక్కిలి వెఱఁగుచెంది వెనవంతటిలోఁ
దనచేతి గరలు కనఁబడఁ, జనియెఁ బ్రభావతి రహస్యసదనంబునకున్. 88

గీ. కోమటిమెఱుంగుబిడ్డప్రుగుబ్బలాఁడి, యంతిపురమున కరిగి సాయంసమయము
గాంచి కై చేసికొని మహీకాంతసంగ, మాభిలాషంబుతోఁ జేర నరుగుదేర. 89

క. కనుఁగొని గుణసాగరుఁడో, వనితా చనియెదవె ధరణీవల్లభు కడకుం
జనుమిఁక నొకకథ వినుమని, యనుచుం బలుకం దొడంగె నతివేడుకతోన్. 90

## —ఇరువదియవ కథ.—

ఉ. అంగవసుంధరాభరణమై యొకపట్టన మంద మొందు మా
తంగతురంగసచ్ఛటకదంబశతాంగతతు ల్చెలంగఁగా
మాంగళికాభిధాన మనమానముగా వహియించి యప్పురం
బంగదనామధేయవసుధాధిపుఁడేలు నవేలసంపదన్. 91

ఉ. ఆనరపాలమౌళి కపరాంగము కైవడి నొక్కమంత్రి మే
ధానిధినాముఁ డైతగునతండు నిజాంగన జాయమానశో
భానుతకాంత కాంత యనుబాలికఁ గాంచి దివంబు కేగ నం
తానముఁ గోరి లోలయను తన్వివరించి రమించె నంతటన్. 92

ఉ. ఆలలితాంగి కంటికిఁ బ్రియంబగుసొమ్ము ధరించి సేవక
శ్రీలమరించి జిహ్వాకురుచించు పదార్థము లాహరించి యే
వేళఁ బ్రసూనతల్పముల వేడుకమైఁ బవళింపఁ గల్గుటన్
జాలమదించి జారజనసంగతికై తివురుస్మనంబునన్. 93

గీ. ఇవ్విధంబున నప్పూర్ణిమేందువదన, యన్యసంభోగసుఖలేశ మచ్చెసేని
యాకసంబైన భేదించి యవలవోవు, నంతఁ దెగించియున్న యయ్యవసరమున. 94

క. వారింట దేవపూజా, కారిత్వముఁ బూనివేదఖనియై వినుతా
చారుఁడై సద్గుణనిధి, చారణుఁడనునొక్క బ్రహ్మచారి చెలంగున్. 95

క. ఈరీతినుండువానిం జారణులోపఱచి యొకనిశావేళతమః
పూరితమగు నొకయింటం, జేరిచికొనియిష్టకామ్య సిద్ధింగనియెన్. 96

క. కనియది మొదలుగఁ దద్రీతి, ననుపమ సౌఖ్యాబ్ధి నోలలాడుచు మరునిం
దనబంటు గాఁగఁ దలఁపుచు, ఘనతరగర్వమునఁ గన్నుఁగానక మెలఁగెన్. 97

క. అంతఁ దనసవతి సుతయగు, కాంతం బోషింపమఱచి చారణనిఘ్న
స్వాంతత్వముఁ జెందినత, త్కాంతామణి నడకలెల్లఁ గాంచిన యదియై. 98

గీ. కాంతకాంతలయయ్యును జతురయగుట, దీనికి భయంబు చూపినఁ గాని తనకుఁ
బోషణములేదనుచు డెందమునఁ దలంచి, యోర్చికొనియుండి యంతట నొక్కనాఁడు. 99

చ. జనకునిఁ జేరి యాతనికి సంతసమయ్యెడు మాటలాడి సాం
పెనయఁగ నీవుగాక మఱి యింకొకతండ్రి గలండు నాకుఁ బొ
మ్మనిపలుకన్ వినిశ్చలతరాద్భుతుఁడై మదిఁ జెందు సందియం
బునఁ దలపోసి యాసచివపుంగవుఁ డెంతయు నాదరంబునన్. 100

గీ. ఇంక నొకతండ్రి గలఁడంటి విందువదన, యతనిఁ జూపెదవే యన్న నవ్వధూటి
మంచిదని రేయి చూపెదనంచుఁ బలికి, యవలికరిగిన నమ్మాటలాలకించి. 101

క. ఆలోలాంగన తనదు, శ్శీలంబిది యెఱిఁగి పతికిఁ జెప్పఁగఁ బూవం
బోలునని తలఁచి మిక్కిలి, జాలింబడి కాంతఁ బిలిచి సప్రియగీతిన్. 102

గీ. అనునయించిన నబ్బాల యైననేమి, నన్నుఁ బోషించెదేని యెంతయును దప్ప
దాల్తునని పల్కె నింక నత్తరుణి జనక, భావసంశయమెట్లు పాపంగవలయు. 103

క. అని పలికి యూరకుండినఁ, గనుఁగొని యూరుజసరోజగంధి విచారం
బొనరించి తెలియఁజాలక, వినిపింపుమటన్నఁ గీరవిభుఁ డిట్లనియెన్. 104

వ. అంత నిశాసమయం బగుటయు నమ్మేధానిధి విభావరీరత తమఃపుంజంబగు కేళిమంది
రంబున లోలానమేతుండై యుండి యబ్బాలికం బిలిచి ద్వితీయజనకుం జూపుమనిన
కాంత యత్యంతమౌగ్ధ్యంబుఁ దాల్చి తదీయచ్ఛాయం జూపిన నతండు నవ్వి లోలఁ జూ
చి యోతద్బాలికాలాపంబులకు నీయందు సందియంబుఁ జెందితినని తద్వృత్తాంతంబం
తయుఁ దెలిపి పతివ్రతాశిరోమణివగు నీ కీర్తిగుణంబులు పుట్టునే యని పలుకరించెం
గావున నయ్యమాత్యకుమారికకుం గల నైపుణంబు గలిగినం గాక ధరణీభుజంగపుంగవుని
సంగతికిం జనఁగూడునే యనునంతలోన నరుణోదయం బైనం బ్రభావతీలలితాంగి శు
ద్ధాంతంబున కరిగి క్రమంబున దివావసానం బగుటయు. 105

శా. పన్నీటం జలకంబులాడి తొగబాబాపాదుశాకాయపుం
జిన్నెల్ వ్రాసిన చీరెగట్టి యపరంజింజిమ్ము నెమ్మేనిపై

మిన్నల్గ్రిమ్మెఱుఁగు సొమ్ముల దాల్చి మహీభృత్కిమాంక జన్యక్రియా
సన్నద్ధత్వముఁ జెంది యందము రహించం జేర నేతెంచినన్. 106

క. అమ్మపరిభావతి రాజగృహమ్మున కరిగానవె మంచి దరుగదువు వినో
దమ్మగు కథ వినియెద యని, కమ్మని చక్కెరలు గురలఁగా నిట్లనియెన్. 107

—ఇరువదియొకటవ కథ.—

మ. అవనీమండలమండనం బయిన యార్యావర్త దేశంబునం
దు విరాటుం డను రాజు ప్రోవఁ జెలువందుం భద్రకాఖ్యంబుర
పరివరం బొక్కటి యందు విప్రకులపారావారవాలాహలం
బవు నీతం డన దేవలాంకుఁ డొకఁ డర్థాపేక్షమై వర్తిలున్. 108

సీ. సంతలోఁ బ్రత్తి బిచ్చము లెత్తి నూఱాలు పగల జన్నిదములు వడికి వడికి
వికట కానన భూములకు నేగి మఱ్ఱియాకులు దెచ్చి విస్తరల్ గూర్చిగూర్చి
శాకపుబీజము ల్చల్లి బావులనీరు చేఁది పోయుచు పైరు చేసిచేసి
వేకువనంగళ్ల విక్రయ వేళల జాజీవ మిరియంబు లేఱియేఱి
యన్నియును విక్రయించి భార్యాకుమార, ముఖ్యులాఁకట ప్రేగ్గిన మొగముఁజాడఁ
డానపడి యేమికోరిన నాగ్రహించు, జందెములు ద్రెంచుకొని దద్విజన్ముఖలుఁడు. 109

గీ. ఇట్లు గడియించి ధనమెల్ల నింట నునిచి, యతఁడు పరలోకమెనయఁ దదాత్మజుండు
గర్గుఁడను వాఁడు కౌమారకలితుఁడగుచుఁ, దరుణ గాణిక్యవిహారణాదరణుఁడగుచు. 110

సీ. జోగి జంగబు లెచ్చ్యగఁ బల్కులకువాఁడు చెలరేఁగి లంజమందులకుఁ జల్లి
తముకు వేసిన వెక్కఁ దాఁజరించిన బట్టి యనుపకుండఁ దలార్ల కొసఁగియొసఁగి
కొండెము జెప్పక యుండ విగాటభూవరుని వాకిటి చనవుల కిచ్చి
దర్పకాకార దాతలరాయ యని వెంటఁ బడు బట్టువారికిఁ బాఱవైచి
తగులుగా నిచ్చు పేరమద విటచేట, కులకును విదూషకులకు మేకోలు నడపి
తండ్రిగడియించినట్టి విత్తంబువోవ, లొల్లగాఁ డయ్యె నవ్విప్రవల్లభుండు. 111

గీ. ఇవ్విధంబున లేమివహించి గర్గుఁ, డప్పురము రోసి పరభూమి కరుగుచోటఁ
బరిబలమగు నొక్క యగ్రహారమున నిలిచి, యతి పిపాసాబుభుక్షాతురాత్ముఁడగుచు. 112

చ. సకలపురాణముల్నిగమ చర్చలెఱింగిన వైదికాఖ్యుఁడొ
కొకగృహమేధి పిల్వఁగఁ దదుజ్జ్వలమందిరసీమఁ జేరి యుం

చుళతలవంచుచుం బెళుకుఁ జూపులతో వెసఁ బాద్యమిచ్చుత
న్ముకురకపోలఁ గన్గొని కచుంగవకుం బ్రమదంబువొందఁగన్. 113

గీ. పతికిఁజాటుగనిల్చి తప్పక మెఱుంగు, సోలపుఁజూపుల బెళికిపోఁ జూచుదారిఁ
దివ్యవిలుకానిఁదెచ్చిప్రతిష్ఠసేయఁ, గర్దుఁడిష్టాన్నభుక్తిసోత్కంఠుఁడయ్యె. 114

గీ. అపుడు వైదికుఁ డాగర్దు నాదరించి, వానతజేయయ్యె రవి గ్రుంకవచ్చె నింక
నెందుఁజనలేవు శయనింపుమిందె యనుచుఁ, దాను నాతఁడు సమయకృత్యములు దీర్చి. 115

గీ. పవ్వళించిరంతఁ బనిదీర్చి దీపంబు, మలఁపియద్దగోడమఱుఁగుగాఁగ
వైదికునిసుధాంశువదనయు శయనించె, పచ్చవింటిరాయఁ డెచ్చరింప. 116

మ. గొనబుం బ్రాయము రూపసంపదయుఁ బేర్కొంగల్గుటల్ మాటికిన్
దనువీక్షించుట గర్దభూసురుని మోఁదం గొరుకుల్మల్లడు
ల్గావఁగా నేఁడొక నాఁటిమాత్రమునకీలోలత్వ మేలంచుఁ దెం
దినధైర్యంబునఁ గొంత సేపునను నిద్రించెన్వరాకాంక్షియై. 117

ఉ. గర్దుఁడు దాని మేని యధికవ్యతిరూపములున్విలాసమై
రర్గళముల్విలోకనపరంపరలుం దలపోసి చిత్తభూ
మార్గణభూమినొంపననమంబగు తామసముంకురింపఁగా
నిర్గతభీతి వైదికుఁడు నిద్రవహించుటఁ జూచి గ్రక్కునన్. 118

క. చని దానిపేఁపుపైఁగర, మునుపన్మెల్లాంచి యాతలోవరి నాథుం
డనియొగ్గనతఁడుతద్రితి, దనిసి వెసన్నయనభూమిదండకునరిగెన్. 119

క. అంతట నిశసమయమునకు, నంతమ్మగలుగుటయును గర్దుఁ డరుగంగనియ
కాంతనిజాగ్నిపుఁగనుగొని, సంతసమున సిగ్గుసాధ్వసం బొనఁగూడన్. 120

చ. వదరితి రేమి రాత్రినగుబాటని యెంచక వచ్చియంత నే
యదురెగృహంబులో నితఁడున్కి యెఱుంగరె సిగ్గుదాఁకదో
మదిమగవారలైనను సమస్త మెఱింగిన యట్టివారికే
దుదినొకవేళ నేమియును దోఁచదు బోగద యెంచిచూచినన్. 121

క. అనిన విని నేను నిశమే, లన్న నే లేవనుచు దానికాంతుండేదిగ
ర్దునికృత్యమె కావలెనని, ఘనమైన జుగుప్సవొడమఁగాఁ గుత్సించెన్. 122

గీ. అప్పుడన్నాతి యేరీతి నాత్మమాన, భంగమాచ్ఛాదితంబు చేయంగవలయు
ననఁ బ్రభావతి నన్నెమి యడిగెదవని, కథయొఱింగింపుమనిన శుకంబుఁబలికె. 12

మ. అపుడమ్మానిని యధ్వనీన కృతధార్త్యప్రక్రియల్గాఁగలం
చి పతిస్వాంతము మెఱింగి మోహముజనించెం జూచితే యింక పా
న్నిపుణత్వంబునఁ గాని యీవిభుని సందేహంబు పోదంచు నెం
దపుఁ దమ్మిందలపోసి యద్భుతరసానందంబుఁ గల్పించుచున్. 124

ఉ. కంటిరె యెంతవింత కలగన్నపుడెల్లను మీరువచ్చిన
న్నంటిన యట్టులుండు నదియాఁగద రాతిరిమిమ్ముఁ జూసి నే
నొంటిగఁ బవ్వళించుటకు నోపక చింతవహింప నంతలోఁ
గంటికి నిద్రవచ్చెఁ గలగంటి భవద్రతిగల్గినట్టుగాన్. 125

గీ. వామహస్తమునురముపై వైచినిదురఁ, జెందుతఱిఁ గానికల గందు రందురెందు
నవ్విధంబునఁ బవళించి యైనకలయు, గంటిభవదీయ కారుణ్యగరిమవలన. 126

క. అని పలుకు దానిమాటలు, విని నిశ్చయమనితలంచె విభుఁడో పద్మా
నన యంత నేర్పుగలిగిన, జనవచ్చునటంచుఁ గిరచంద్రిఁడు లెక్కన్. 127.

ఇది షష్ఠమభాగము.

